# విమర్శిని

పరిశోధన పత్రిక

౨

జనవరి 1977

తెలుగు విభాగము

కాకతీయ విశ్వవిద్యాలయము

విద్యారణ్యపురి :: వరంగల్లు.

# VIMARSINI

## ANNUAL RESEARCH JOURNAL

NUMBER TWO **JANUARY** **1977**

*EDITOR*

**Dr. K. V. RAMAKOTI SASTRY**

HEAD DEPARTMENT OF TELUGU
KAKATIYA UNIVERSITY
Vidyaranyapuri, WARANGAL-506 009 INDIA.

*ASSOCIATE EDITOR:*

**Dr. K. SUPRASANNA CHARYA**

READER IN TELUGU,
KAKATIYA UNIVERSITY.

PRICE:

Paper back Rs. 15
Hard Bound Rs. 25

This has been published with the aid of the Research grant and Special grant sanctioned to the Telugu Department, K. U., for the year 1976-77.

*Printed at Balaji Printing Press, J. P. N. Road, Warangal-506002.*

# VIMARSINI

## ANNUAL RESEARCH JOURNAL

NUMBER TWO JANUARY 1977

*EDITOR*

**Dr. K. V. RAMAKOTI SASTRY**
HEAD DEPARTMENT OF TELUGU
KAKATIYA UNIVERSITY
Vidyaranyapuri, WARANGAL-506 009 INDIA.

*ASSOCIATE EDITOR:*
**Dr. K. SUPRASANNA CHARYA**
READER IN TELUGU,
KAKATIYA UNIVERSITY.

PRICE:

Paper back Rs. 15
Hard Bound Rs. 25

This has been published with the aid of the Research grant and Special grant sanctioned to the Telugu Department, K. U., for the year 1976-77.

# విషయ సూచిక

## I ఆత్మ చిత్రం


నా తొలి రచన 2

నా గొప్ప రచన 5

నేను - నా రచన 15

వేయిపడగలలోని అంతరార్థము 27

ఆత్మకథలో ప్రథమాధ్యాయం 35

నేను - నా రచనా స్వరూపం 44

పల్లెల శోభ తెలియనివారికి
నా కావ్యసంపద అర్థంకాదు 49

My Self - My work 59

Speach of Dr. Viswanatha
Satyanarayana 98

Viswanatha
Patrician Among Telugu Poets 112

## II వాఙ్మయ చిత్రం


ఉత్తరాలు - డైరీలు 125

అముద్రిత రచనలు

నా రాముడు 244

శ్రీ శారదా చంద్రమౌళీశ్వర సుప్రభాతమ్ 247

మంగళాద్రిస్వామి మేలుకొలుపు 249

రామనాటకము 250

యక్షుడి అప్పు 251

ఇంద్రధనుస్సు 252

పిల్లల రామాయణము 255

విశ్వనాథ మధ్యాక్కరలు 261

శివసహస్రమ్ 263

అమృత శర్మిష్ఠమ్ 265

గుప్తపాశుపతమ్ (ఒకటి) 265

గుప్తపాశుపతమ్ (రెండు) 266

దేవీ త్రిశతి 267

నందిగామ రాజ్యము 269

రామాయణ కల్పవృక్షము - శిల్పదృష్టి 272

గుప్తపాశుపతము 275

## III జీవిత చిత్రం

నేనూ మా అన్నగారు - విశ్వనాథ వేంకటేశ్వర్లు 281

నేనూ విశ్వనాథ - కొడాలి ఆంజనేయులు 349

మా సత్యనారాయణ - కాటూరి వేంకటేశ్వరరావు 358

విశ్వనాథ కవిత్వము - అడవి బాపిరాజు 361

అఖండ ప్రతిభాసంపన్నులు శ్రీ విశ్వనాథ
సత్యనారాయణగారు - జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి 377

శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు-మల్లాది రామకృష్ణశాస్త్రి 388

మహా ప్రతిభుడు - గిడుగు సీతాపతి 393

గ్రంథం చదవడమెట్లా - చింతా దీక్షితులు 399

నాకాప్తుడు విశ్వనాథ - కోలవెన్ను రామకోటీశ్వరరావు 403

విశ్వనాథను గూర్చి - నోరి నరసింహశాస్త్రి 407

విశ్వనాథను గురించి - రాయప్రోలు సుబ్బారావు 410

దుర్నిరీక్ష్యుడు - కురుగంటి సీతారామ భట్టాచార్యులు 413

కవ్యధ్య విశ్వనాథ - శ్రీరంగం శ్రీనివాసరావు 418

మహత్తర సాహిత్యశిల్పి - జడ్. పెత్రునిచేవా 421

నేటి కవులలో విశ్వనాథ మొదటివాడు-దేవులపల్లి కృష్ణశాస్త్రి 425

విశ్వనాథ మహాకవి - పింగళి లక్ష్మీకాంతం 426

చిరంజీవి విశ్వనాథ సత్యనారాయణ-చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి 427

# విమర్శిని

విరచించు శక్తి పుట్టని పురుషుని చదువులు ప్రకాశములు కావు.

రెండవ సంచిక : జనవరి 1977

ఈ విమర్శిని రెండవ సంపుటమును విశ్వనాథ వాఙ్మయ జీవిత విశేష సంచికగా తీసికొని రావలయునని ఆయన పోయిన తరువాత అనుకొని చేసిన ప్రయత్నమింతగా కలసి వచ్చినందుకు సంతోషముగా నున్నది. ఇది ఎంతగాననగా జీవితచిత్ర మన్న మూడవ భాగంలో విశ్వనాథ వాఙ్మయ జీవిత లక్షణ వివేచనగా మా తెలుగు విభాగం అధ్యాపకులు సిద్ధము చేసిన కల్పవృక్షము, వేయి పడగలు, ఏకవీర, భ్రమరవాసిని, పురాణ వైర గ్రంథమాల నవలలు ఈ మొదలయిన శీర్షికల తోడి కీలక పత్రాల ప్రచురణ కవకాశము లేనంతగా నన్నమాట. ఇప్పటికే ఇంత గ్రంథమైనది.

తన కావించిన సాహిత్య సృష్టిని గురించి తన ఆత్మ చిత్ర ప్రతీతిగా విశ్వనాథ చెప్పికొన్న విషయాలు, ఆయనను ఆయన సృజనాశక్తిని గురించి ఇతరులు చెప్పిన విషయాలు ఆయన సాహిత్య పరమార్థ తత్వముతో సమన్వయించినప్పుడు ఆయన సాహితీ

వ్యక్తిత్వము పరిస్ఫుటము కాగలదన్న విశ్వాసముతో ఈ సంచికకు రచనలు సంపాదింపబడినవి. "ఇప్పుడిక సమర్థులయిన సహృదయ పాఠకులు తత్సమన్వయాధ్వ గమనాధ్వ సీనులుగా ముందుకు రాగలందులకిది ప్రేరణార్థము కావలయునని మా అభిలాష.

విశ్వనాథ తన వాఙ్మయమును వ్రాసినది వ్రాసినట్లు ప్రచు రించినను ఆయన పోయిన తరువాత ప్రచురింపబడనిది కొంత గ్రంథము కనిపించినది. అది మరుగున పడి పోకుండా దాని స్వరూప స్వభావాల గురించి పరిచయము చేసే అవకాశమును వినియోగపరచుకొనుటకు వీలు కల్పించిన శ్రీ విశ్వనాథ పావనిశాస్త్రి విజానికెంతో సహాయము చేసినట్లు. ఇందులోని వాఙ్మయ చిత్రి విభాగమంతా ఆ సహాయము వల్ల అయినదే.

ఈ విధముగా ఈ విశేష సంచిక ఒక త్రిపథగా, ఇది ఇట్లయి వచ్చుటకు చేదోడు వాదోడుగా నుండి సహోపాధ్యాయులు మాదిరాజు రంగారావు, కాశీనాధుని నాగేశ్వర్ రావుగారలందించిన సహకారము గొప్పది.

వీలయినంత మంచిగా చేయవలయునని చేసిన ముద్రి ణాలయాధిపతి శ్రీమాన్ ఎం. ఎస్. ఆచార్యగారి శ్రద్ధను ప్రశంసింప వలయును.

ఈమొత్తము నిర్మాణమునకు పునాదిబలము మా ఉపాధ్యక్షులు ఆచార్య శ్రీ కె. వెంకటామయ్యగారు అడుగగానే అందించిన అయిదు వేల అధిక ఆర్థిక సహాయము.

ఈ అందరికి కృతజ్ఞతాభివందనములు. విశ్వనాథ శారదా హృదయ దర్శన వివేచన శీలురయిన సహృదయులు లోనారసి చూడగలరు.

II

విమర్శిని

# విశ్వనాథ సత్యనారాయణ

విశ్వనాథ సత్యనారాయణగారు కవియా, అంతకంటే మంచి కవులున్నారు, నవలా రచయితయా అంతకంటే మంచి నవలా రచయితలున్నారు- అని ఈ విధంగా ఆయనను ఎన్ని విధాల త్రోసి రాజనవలయునని ఎవరెంత చేసిననూ ఆయన మాత్రము ఒకటి చేసికొని పోయినాడు. తనకనుకూలురు, ప్రతికూలురు ఇద్దరూ ఉన్నారని తెలిసి అందరూ కలిసికట్టుగా ఒప్పుకోక తప్పనట్లుగా జాతీయ స్థాయిలో రచయితగా ఆయన తన స్థానాన్ని భద్రం చేసికొన్నాడు. ఆయనను గురించి అందరూ అంగీకరించేది మరొకటి గూడా ఉన్నది, ఆంధ్ర భాషా సాహిత్య రంగమున ఆయనంత ప్రముఖుడూ, ప్రసిద్ధుడూ, వివాదాస్పదుడూ ఈ శతాబ్దంలో మరొకడు లేడు అని.

ఆంధ్ర పౌరుషంతో ఆయన కవిగా ఆవిర్భవించాడు. అంతరాత్మను పట్టుకొని అంతర్విశ్లేషణలతో నవలాకారుడై ప్రశస్తి కెక్కినాడు. నాటకకర్తగా పరివర్తనం చెందినాడు. భావ కవితా ప్రస్థాన గ్రంథ నిర్మాతయై ఆత్మలాభ ప్రాప్తికి దాంపత్యమును మార్గమునుగా ప్రబోధించినాడు. శ్రీమద్రామాయణ భాష్యకారుడుగా ఆంధ్రావళిని కల్పవృక్ష చ్ఛాయలలో నిల్పి తెలుగు సాహిత్య సరస్వతిని తన విద్యావైదుష్యం చేత, తన బుద్ధి వైభవం చేత భారతీయ జ్ఞానపీఠ పురస్కారానికి యోగ్యంగా తీర్చిదిద్దినాడు. అప్రతిహతంగా ఈ బహుళాంధ్రోక్తిమయ ప్రపంచకమును అరవై సంవత్సరాలు ఏలిన మరొక కవికుల గురువు. ఆయన అంత స్వతంత్రుడు. అంతటి విద్వత్కవి.

సర్వ సాహిత్య ప్రపంచ మర్యాదల గురించీ సర్వభారత భారతీహృదయ సముద్రము లోతుపాతుల గురించీ నిర్ద్వంద్వముగా అభిప్రాయాలను ప్రకటించగలిగిన అంతటి స్వస్థాన వేషభాషాభిమానము కలిగిన రస ప్రలబ్ధ ధీకుశలుడు, ఇతరుల ప్రసక్తి ఇక్కడ రాదు గనుక ఈ నేటి కాలాన ఆయన తప్ప మరొకడు లేడని చెప్పవలయును. సమకాలికులయిన కవి సోదరుల యందే ఒక్కరి యందును కనిపించని ప్రతిభావ్యుత్పత్తుల సమష్టి స్వరూప మాయన. ఆయన తన సర్వ కవిత్వ మర్మవేత్తృతా లక్షణం చేత ఆధునికాంధ్ర సాహిత్య ప్రపంచమును ప్రక్రియా వైవిధ్యంచేత కండబలిసిన దాని గుండె సొగసులను ప్రదర్శించి తెలుగు పాఠకులను ఆశ్చర్య చకితులనుగా చేసినాడు.

ఆయన ఋషి. ఆయన శిల్పి. ఆయన కవి. ఋషియై తన ఋషిత్వమును తెలుగులందుకొనుటకు శిల్పియై తన శిల్పిత్వమును గుర్తుపట్టుటకు వీలుగా కవియై తన కవిత్వము యొక్క సుభద్రస్ఫూర్తికి విమర్శకుడై నవలా రచయితయై నాటకకర్తయై కథానికా రచయితయై గేయకవియై ఉపన్యాసకుడై ఊరక అదే పనిగా అరవమము అరవై సంవత్సరాలు ఆంధ్ర భాషా భాషీయుల వెంటబడి చెవిలో ఇల్లు కట్టుకొని అంతగా చెప్పిపోయిన ఆంధ్ర మహాకవి మరియొక్కడు కన్పించుట లేదు.

వ్యక్తులు చేసిన సమాజానికి వ్యక్తి ధర్మమును పరిపాలించు వ్యవస్థా ధర్మము లక్షణము. వ్యక్తి ధర్మము నందు స్వార్థమునకు చోటున్నది. అందువల్ల వ్యవస్థా ధర్మమే ధర్మము. వ్యక్తులు ధర్మము నుల్లంఘింప జూచెదరు, కవులు క్రాంత దర్శనులనగా విశ్వజగత్సమాజము యొక్క సుష్ఠు వ్యవస్థా ధర్మ దర్శనము కలవారని యర్థము. వ్యవస్థా ధర్మ లక్షణ లక్షితమైన సాహిత్యముతో స్వార్థము తోడి వ్యక్తిత్వ ధర్మమును గొప్పగా పాటించు

వారికిపడదు. వ్యష్టి దృష్టి కల సాధారణులే జనములో ఎక్కువ. సమష్టి దృష్టి కల వ్యవస్థా ధర్మ నిబద్ధ బుద్ధియైన రచయితతో సాధారణులకు పడదు. వ్యవస్థా ధర్మ పరులకు సమాజముతో పడకపోవుట లేదు. విశ్వనాథతో పడని వారి కంటే శ్రీశ్రీతో పడని వారి సంఖ్య తక్కువ కాదు. వ్యవస్థా ధర్మబుద్ధులకాయ వస్థలు తప్పవు. తాదృశులు మహాకవులు. అనన్యసామాన్యమైన సామాజిక దృక్పథముకలిగి తద్ధర్మ ప్రతిపాదనార్థము కావ్యరచన చేసిన మహనీయ శిల్పవేత్తలు మహాకవులు. ఇది ప్రపంచ భాషా మహాకవులందరి లక్షణము. విశ్వనాథ ఆ అందరితోటి పాటి వాడే కాని అతీతుడేమీ కాడు. ఆ విధముగా వ్యవస్థా ధర్మ రక్షణ బుద్ధి యైఆధునిక కాలమున ఆంధ్ర సాహిత్యమును మాంస లముచేసి పెట్టిన మహామనీషి ఆయన.

ఒక కవి యొక్క గానీ, ఒక సాహిత్యము యొక్క గానీ, ఒక జాతి యొక్క గానీ, మహనీయత అంతకు పూర్వమున్న కవులతో, కావ్యములతో, సంస్కృతీ సంప్రదాయములతో ముడివడి యున్న అవినాభావము లోతుపాతుల మీద ఆధారపడి యున్నది. సాహిత్యమునందెప్పుడును, తద్భాషా భాషీయుల జాతీయమైన ఆలోచనా విధానము యొక్క వైలక్షణ్యము కొట్టవచ్చినట్లుండును. భారతీయ భాషా సాహిత్యములకింకొక వైలక్షణ్యమున్నది. వీటన్నింటికినీ ప్రాంతీయమైన భాషా సహజత్వముతోపాటు భారత జాతీయ తత్త్వము అవినాభావముగా ఉండును. తెనుగు సాహిత్య మునకు తెనుగుదనమొక లక్షణము. భారతీయత మరొక లక్షణము. ఈ రెండింటి యొక్క అవినాభావ లక్షణంతోనే ఆంధ్రసాహిత్యము ఇంటా బయటా గూడా గెల్చుకొని రాగలుగుచున్నది. మన తెలుగు సాహిత్య శైలి భారతీయమైన ఆలోచనా ధారతోనూ అందుకనువుగా ప్రాంతీయమైన తెలుగుదనము తోడి అభివ్యక్తి తోనూ రూపుగట్టుకొనుచున్నది. ఆంధ్ర భాషా మహాకవుల శైలీ

విశేషములన్నియును ఈ విధముగా సూక్ష్మసూక్ష్మ భేదములతో రూపుగట్టుకొన్నవియే. భారతీయమైన ఆలోచనా విధానమనగా నదియొక తాత్త్వికదృక్పథము. నన్నయగారి భాషాసాహిత్యముల కొక తాత్త్వికదృక్పథమును విశ్వశ్రేయః కావ్యమ్మని ప్రవచింపగా అది అట్లే కొనసాగివచ్చుచున్నది. దానిని తెనుగు దనముతో కొనసాగించుకొని వచ్చుచున్న మహాపురుషుల వల్లనే ఈ సాహిత్యమింత వరకు వచ్చినది. అట్టి మహాపురుషులలో విశ్వనాథ సత్యనారాయణగారొకరు. మనము మన తెనుగు సాహిత్యమును అనుభవమునకు తెనుగు దనమును చూచుకొనుచు ఆలోచనలకు జాతీయతను అవలంబించుచు అధ్యయనము చేసికొన వలయును. ఈ అవసరమును మిక్కిలిగా చేయుచు సాహిత్యమును కల్పించిన మహారచయిత విశ్వనాథ. ఈ కీలకమును పట్టుకొని పూర్వాంధ్రి మహాకవులను తిరిగి చదివినచో వారింకను లోతులలో అర్థమగుదురు. విశ్వనాథ తన సాహిత్య వ్యవసాయము ద్వారా ప్రాచీనాంధ్ర కవుల కావ్య జీవితములను వికసింప జేసెను. ఇప్పుడు ఆంధ్ర సాహిత్యమనగా తెలుగు భాషా భాషీయుల ఒడుపుదనము చేత సంస్కృతమైన మర్యాదల కొదిగిన విశ్వశ్రేయోదాయకములయిన జాతీయతాభావ ధారాధోరణిగల వాఙ్మయ ప్రపంచమని యర్థము. ఈ యర్థమును పుష్కలముగా పండించి పెట్టి పోయినది. విశ్వనాథ వారి ప్రథిత వాక్కలాపము.

## II

విశ్వనాథ సత్యనారాయణగారొక సంధి కాలంలో పుట్టినారు. పందొమ్మిదవ శతాబ్దము చివరి దశాబ్దానికే సాంఘికార్థిక రాజకీయాది జీవిత రంగముల యందు విపరీతములయిన మార్పులు ప్రపంచ దేశములందు రామొదలు పెట్టినవి. ప్రపంచమంతా బ్రిటిషు సామ్రాజ్యమే గనుక ఇంగ్లాండులో వచ్చిన అన్ని మార్పుల ప్రభావం దాని వలస రాజ్యాల మీద అనివార్యముగా పడింది. ఒక విధముగా

గ్రామీణ జీవితమునకు, నాగరకతకు, సంస్కృతీ సంప్రదాయములకు, సౌందర్య వాతావరణమునకు ఆ కాలము చరమ గీతం పాడింది. బస్తీ పారిశ్రామిక నాగరకత తోసికొని రావటం మొదలయింది. విశ్వనాధ పుట్టి పెరిగి కాస్త ఊహ వచ్చేటప్పటికి గ్రామీణ వాతావరణమును త్రోసి రాజని బస్తీ పారిశ్రామిక నాగరకత విజృంభించుచున్నది. దాని ఫలితమే శోభనాద్రిగారు బందరులో కాపురం పెట్టి విశ్వనాధకు ఇంగ్లీషు చదువు చెప్పించుట. ఆ విధంగా విశ్వనాధ తన చిన్నతనంలో తన కన్నులముందు తాను తన స్వస్థానవేష భాషల నుండి వేరు చేయబడుచున్న దాని తీవ్రతననుకోకుండనే అనుభవించినాడు. అజ్ఞాత చైతన్యమునందు అననుకూలమైన అనుభవ తీవ్రత ఉన్నందువల్లనే ఆయన ఇంగ్లీషు విద్యను అభ్యసించిన కొద్దీ వచ్చిన విజ్ఞానము స్వస్థాన వేషభాషల యందలి పరమార్థమును ప్రదీప్తము చేయుటకును, ఆధునిక నాగరకత యొక్క వ్యాప్తి వలని దుష్ఫలితాలను చూడగలుగుటకును ఆయనను ప్రోత్సహించినది. ఈ పరిస్థితికి దోహదము చేసినది భారత జాతీయోద్యమము. ఆయనకు పది సంవత్సరాలు వచ్చేటప్పటికే వందేమాతరమన్న పిలుపు ప్రభావం ఆయన అజ్ఞాత చైతన్యమును తన్మయము కావించింది. సంపూర్ణ స్వాతంత్ర్యమే లక్ష్యమన్న జాతీయ నాయకుల వినాద మంత్రములాయన మనస్సు మీద పని చేసినవి. ఆయన బందరులోని ఇంగ్లీషు చదువంతా ఈ వాతావరణ ప్రభావమునకు లోబడిజరిగినదే. బందరు వాతావరణము స్థాపించిన జాతీయ కళాశాలలో విశ్వనాధ అధ్యాపకుడుగా చేరి పని చేసినాడనగా ఆంధ్ర పౌరుషముతో కవిగా అవతరించినాడనగా చిన్నప్పటి నుండి ఉన్న అజ్ఞాత చైతన్యములోని కదలికలను భావించవలెను.

తానంతవరకు ఏది ప్రత్యక్షంగా అనుభవించినాడో, దేనిని గురించి జాతీయ స్థాయిలో ప్రబోధం జరుగుచున్నదో, దేని పునరుజ్జీవనము పరమార్థముగా స్వాతంత్ర్యోద్యమం సాగుచున్నదో

దానిని భారత జాతీయ వ్యావసాయిక నాగరకతా సంప్రదాయము యొక్క మాయమగుటను ప్రధానముగా చేసి ఆయన 1934లో వేయి పడగలు వ్రాసి ఆంధ్ర విశ్వవిద్యాలయం వారి బహుమతిని గెలుచు కొన్నాడు. వేయిపడగల సంగతి మరి కొంత అర్థము కావలయు నన్నప్పుడు ఆంగ్ల వాఙ్మయ రచయితలను హార్డీని, లారెన్సును జాగ్రత్తగా చదవటం మంచిది. పారిశ్రామిక నాగరికత వలన సత్ఫలితాలు లేవని చెప్పటకు కాదు వేయి పడగలు పుట్టినది. దాని దుష్ఫలితా లిలాంటివి - దాని నాపుటకు వీలు కాదు గనుక చేత నైనంతలో జాగ్రత్తయన్న ప్రబోధమే దాని ప్రయోజనము. సూర్యాస్తమయమును చంద్రోదయమును ఏక కాలమున జరుగుచున్న వాటిని వర్ణించుట వంటిది వేయి పడగల రచన.

గ్రామీణ నాగరకతను కూకటి వ్రేళ్ళతో పెళ్ళగించి బస్తీ పారిశ్రామిక నాగరకతను బ్రిటీషు సామ్రాజ్య నిర్వాహకులు వ్యాపింప జేయుచుండగా, వర్గ పోరాటముగా ముందుకు వచ్చి గతి తార్కిక చారిత్రిక భౌతికవాద సిద్ధాంతమును పట్టుకొని సర్వమానవ సమాజము యొక్క పూర్వోత్తర పరిస్థితులను, వాఙ్మయమును, కళలను, మతములను, వేదాంతములను సమస్తమును పునర్విచారణకు పెట్టి తీర్పులు ప్రకటించుటకు పూనుకొన్నది మార్క్సిజము. ఇందు వల్ల మరొక క్రొత్త సమాజముయొక్క ఆవిర్భావమును మార్క్సిజం చూపగలిగింది. ఇరువదియవ శతాబ్దం తృతీయ దశాబ్దం వచ్చేటప్పటికి మనదేశంలో కూడా మార్క్సిస్టు సోషలిజము ఒక పరమార్థ భూతమైన ఆదర్శంగా యువకులను ఆకర్షించింది.

అయితే మరొక్క విషయమున్నది. ఆయన వ్యక్తిగా మార్క్సిస్టు మాత్రమేగాని కమ్యూనిస్టు కాదు. అంటే కామందులు కాని కార్మిక కర్షక మహాజన సమాజము చేసెడు తిరుగుబాట్లతో ప్రత్యక్ష సంబంధ మేమాత్రమును పెట్టుకొన్న వాడుకాదు.

మార్క్సిజమును చేసిన తత్వశాస్త్రము - ఆర్థిక శాస్త్రము - సాంఘిక శాస్త్రము - ఈ మూడు కేంద్రముల నుండి అనుభవమునకు తెచ్చు కొన్న విజ్ఞానం యొక్క పరిభావము ఆయన సాహిత్యము నందు పుష్కలంగా ఉన్నది. అదొక విశ్వశ్రేయోదాయకమైన తాత్విక దృక్పథమన్న అభిప్రాయము, అదొక విశ్వజనీనమైన శాస్త్రీయ సామాజిక స్వరూప స్వభావాభివృద్ధి లక్షణ పరిశీలన దృక్పథమన్న అభిప్రాయం ఆయనకులేవనటానికి వీలులేదు. ఆవిధముగా విశ్వనాథ ఆలోచనా విధానము మీద మార్క్సిజమున కంటె ముందు గాంధీ ఇజము యొక్క ముద్ర యున్నది. మరియు ముందు వెనుకల బాహ్యాభ్యంతర సంకుచిత విశాల భౌతిక ఆధ్యాత్మిక సౌందర్య సంభావనా దృష్టి భేదముల చేత రెండైన పాశ్చాత్య భారతీయ సంస్కృతీ సంప్రదాయ భూములయిన పురాణ విజ్ఞానముల యొక్క విచారణ చేసెడు బుద్ధిబలము పరిభావమున్నది. మార్క్సిజమునకు వెనుకనున్న గతితార్కిక చారిత్రిక భౌతిక ఆధ్యాత్మిక దృక్పథ సమన్వయముమీద సామరస్యముమీద ఆయన చూపున్నది. ఆర్థిక రాజకీయ సాంఘిక సమ సమాజమునభిలషించి అది లేనప్పటి విషమ పరిస్థితుల నాయన తన సాహిత్యమున వ్యంగ్యమర్యాదయా ప్రదర్శించినాడు. ఆయన భారతీయుడు గనుక ప్రపంచ శాస్త్రీయ విజ్ఞానమును తన జాతీయ సంప్రదాయమునకనుకూలముగా కలసి వచ్చిన దానిని వచ్చినంతగా గ్రహించినాడు. అదే ఆయన పండించి పెట్టిపోయిన అర్థమంతయును.

## III

దేశము స్వాతంత్ర్యమును కోరుచున్నదనగా ఆత్మవిశ్వాస మొకటి కొనలుసాగుచున్నదని యర్థము. స్వసామర్థ్యము మీద అచంచలమైన నిశ్చయ బుద్ధియె ఆత్మవిశ్వాసము. ఎదిరి సామర్థ్య మునది తృణముగా చూచు లక్షణమును కలిగి యుండును. కలిగి

యుండనిచో భారతీయుడు ఆంగ్ల ప్రభుత్వము నెదుర్కొని కూల ద్రోయగలిగి యుండెడివారు కారు. విశ్వనాథ సత్యనారాయణగారి వ్యక్తిత్వము రూపుగట్టుకొను వయస్సంతయు స్వాతంత్ర్యోద్యమ భావ తీవ్రతల చేత చుట్టుకొనబడి ఒత్తిడులకు లోనైనది. ఆ ఒత్తిడుల ఫలితమే ఆ తరువాత విశ్వనాథ సత్యనారాయణ తనకు సంబంధించిన సర్వవిషయములందును స్వయం నిర్ణయాధి కారము తనకు కలదన్న ఒక తెలివితోడి ప్రవృత్తిని స్వాతంత్ర్యో ద్యమము వ్యక్తికి ప్రసాదించును. అందువలన వ్యక్తికి తాను తన తనముచేత ఇతరుల కంటె విలక్షణుడనన్న భావము కలుగును. ఈ వైలక్షణ్యము రాజకీయ ఆర్థిక సాంఘిక సాంస్కృతిక మత తాత్త్విక వైజ్ఞానికాది సమస్త జీవిత రంగముల యందును. ప్రస్ఫుటముగా కన్పించును. సాహిత్య రంగము దానికపవాదము కాదు. ఆధునికాంధ్ర వాఙ్మయమున స్వాతంత్ర్యోద్యమము యొక్క లక్షణ ప్రభావమునకు అన్ని విధములను లోనై మరియు తానై ప్రవర్తించినదొక్క విశ్వనాథ సత్యనారాయణగారని చెప్పిన చాలును. భారత జాతీయ స్వాతంత్ర్యోద్యమ ప్రారంభమునకు ప్రేరణ కల్పించిన మహాశక్తి ఏది కలదో అది విశ్వనాథ వాఙ్మ యమునకు జీవ శక్తియై కూర్చున్నది. స్వరాజ్యము వచ్చిన తరువాత ఆయన సాహిత్య లక్షణమునందు మార్పు రాలేదు. ఆయనకున్న స్వస్థాన వేషభాషాభిమాన ప్రబోధ ప్రచార లక్షణము స్వరాజ్యము రాకమునుపెంతగా అభినందింపబడినదో వచ్చిన తరువాత అంతగా అభినందింపబడలేదు. దానికనేక కారణములున్నవి. గాంధీగారి పద్ధతులే కొన్ని ఆమోదయోగ్యములు కాకపోయినవి. జాతీయతా దృక్పథమునకు భంగము కలిగించని అంతర్జాతీయతా భావమునందు విశ్వనాథకంగీకారము కలదు. తెనుగుదనము తోడి భారత జాతీయత, భారత జాతీయతా భావము తోడి అంతర్జాతీయ మానవాభ్యుదయము వెరసి విశ్వశ్రేయః

కావ్యమన్న సిద్ధాంతమే ఆయన సిద్ధాంతము. భారత జాతీయతకు సంకేతములయిన సర్వ సంస్కృతీ సంప్రదాయ విజ్ఞానమును ఆయన తన వాఙ్మయము ద్వారా తెలుగులకు వ్యాఖ్యానించి పెట్టి జాతీయ స్థాయికి తన వారినుద్ధరింపవలయునని ఆయన ధర్మనిబద్ధ బుద్ధియై అచంచల విశ్వాసముతో పని చేసెను. అంత గట్టి విశ్వాసాలుండి అంత అభినివేశంతో రచనలు సాగించిన ఆధు నికాంధ్ర రచయితలు ముగ్గురిలో విశ్వనాథ ఒక్కడూ ఒకడు. మిగిలిన ఇద్దరూ ఇద్దరు. అందులో ఒకరు గుడిపాటి వెంకటాచలం. మరొకరు శ్రీరంగం శ్రీనివాసరావు బలమైన విశ్వాసాలుండడం, నిర్భయంగా వాటిని వెల్లడించగల్గడం, ఈ మాత్రం చాలును ఒక రచయితను గౌరవించడానికి అన్నా ఒక్క విశ్వనాథ సత్య నారాయణగారే అందుకు ప్రథమతః యోగ్యుడు కొన్ని విలువలు, కొన్ని విశ్వాసాలు, కొన్ని లక్ష్యాలు, కలిగి వాటి కొరకు జీవితాంతం రచనలు చేసిన మహామనీషి విశ్వనాథ. సంఘం బాగుపడటానికి విశ్వనాథ కపటం లేని కవిగా, నమ్మినదాన్ని దాచుకోక చెప్పే నిజాయితీ పరుడుగా సమకాలికులంతా కలసి చేసిన దాని కంటే ఎక్కువే చేశాడు.

విశ్వనాథ సత్యనారాయణగారి సాహిత్య ఆంతర్యం అంతా కూడా సత్యాన్ని అసత్యాన్ని వేరు చేసి నకిలీ నాగరికతల వల్ల అసలయిన జాతీయ సంస్కృతీ సంప్రదాయము పొందిన ఆపదను ప్రదర్శించి తన ప్రజలు సత్యమార్గం తప్పకుండా విజ్ఞానమును పొందవలయునని. విశ్వనాథవాఙ్మయమునకాత్మ విజ్ఞానము ఆనందము కాదని చెప్పినను మించుకొని పోయినదిలేదు. జీవిత సమస్యలను విశ్లేషణ చేసి మంచి చెడ్డలను బేరీజు వేసి పరిష్కారములను సూచించుటలో ఆయన అనుసరించెడు హేతువాద దృక్పథము చాల గొప్పది. విశ్వాసాలకు కూడా ఆయన హేతువుల నన్వేషించును. ఒక జాతి జాతీయతకు సంప్రదాయం పునాది. మనము భారతీయుల

మనగా మనదైన భారతీయత ఏదో ఉండవలయును. అది లేకుండా మనం భారతీయులమనుట మూఢ విశ్వాసము. అది ఉన్నదని, అది ఫలానా అని తన సాహిత్యం నిండా ప్రదర్శించిన భారత జాతీయ విజ్ఞాన ఖని ఆయన. ఆయన సంప్రదాయ విశ్వాసం శూన్యం నుండి వస్తూత్పత్తి కాదన్న శాస్త్రీయ దృక్పథం మీద ఆధారపడినది. ముఖ్యంగా సాహిత్యం యొక్క ఉత్పత్తికి మూలం తద్భాషా భాషీయుల సంస్కృతీ సంప్రదాయం. అది యొక మహాశక్తి. ప్రతిభావ్యుత్పత్తులకు సార్థక్యం కవి శక్తిమంతుడైనప్పుడే కలుగును. ఆధునికాంధ్ర కవి పరంపరా వాహినీ సంసారమునందిద్దరు ముగ్గురు కవి రచయితలను చెప్పవలసి వచ్చిననూ విశ్వనాథ సత్యనారాయణ గారితోనే మొదలు పెట్టవలయును. కవిశక్తిమంతుడనగా నది. అట్టి వాడు తన సమకాలీన సమాజమును పట్టి పీడించుచున్న మన తెలివికి మించినదుండుటకు వీలులేదు. మనం తెలుసుకొనవలసినది లేదు. అను ఈ మొదలయిన మూఢ విశ్వాసాలను, అజ్ఞానాంధ కారాలను నిర్మూలించి ఆత్మవిశ్వాసం మీద సంప్రదాయ విజ్ఞాన జ్యోతిని పట్టుకొని జాతీయాభ్యుదయ మార్గాన శాస్త్రీయంగా పురోగ మించడానికి ప్రేరణ కలిగించే సాహిత్యాన్ని సృష్టించి, ఈ సంసార మిదెన్ని జన్మలకు నేనీ విశ్వనాథీయ భాషా సంక్రాంత ఋణంబు తీర్పగలదా అని తెలుగులు తలపోసి కొనుచుండునట్లు చేసిపోయి నాడు. ఆయన తన సాహిత్యం నిండా అంతఃకరణ చతుష్టయం అన బడే అంతరాత్మ పొరల్లో ఉన్న జీవ స్వభావాన్ని ఆశ్రయించుకొని ఉన్న మానవ సమస్యలకు రూపకల్పన చేసి వీటి స్వరూప స్వభావములివ్వి వీటికిది దోహదం, వీటికిది విరుగుడు అని వ్యాఖ్యా నించినాడు. చలంగారుకూడా రూపకల్పన వరకూ విశ్వనాథ లాగానే చేశారు. అభ్యంతర ప్రేరణలకు మనిషి కొట్టుకొని పోకుండా ధర్మాధర్మ విచక్షణ మనిషిని నిలబెట్టుట సామాజికమైన సుస్థ వ్యవస్థకు అవసరమని విశ్వనాథ సహేతుకంగా ప్రబోధించినాడు.

వ్యక్తి సమాజమునకు లోబడి యుండుట వ్యక్తికి క్షేమమన్న శాస్త్రీయ దృక్పథమును అవలంబించి విశ్వనాథ రచనలు చేసినాడు. ఇదే శాశ్వతమైన సత్యపథము. ఇష్టము వైయ్యక్తికము. ధర్మము సమిష్ఠి. సమిష్ఠియైన వ్యవస్థా ధర్మమును నిలబెట్టుటకు వ్యక్తి త్యాగం చేయవలయునన్నది విశ్వనాథ సాహిత్య సందేశము. ఈ సందేశమును ఆయన తన సాహిత్యం నిండా సృష్టించిన ఆశ్చర్య కరములయిన పాత్రల ద్వారా వినిపించినాడు. భారత జాతీయ సంస్కృతీ సంప్రదాయ విజ్ఞానాల మీద హేతువాద బలంతో ఆయా పాత్రలను అంత అద్భుతావహంగా ఆయన తీర్చిదిద్దినాడు.

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు చెప్పినట్లు "వారి రచనలన్నీ లోకానికి సందేశాలే" నార్ల వేంకటేశ్వరరావుగారన్నట్లాయన నిస్సందేహముగా గొప్ప జీనియస్. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారన్నట్లు "వారితో సమకాలిత్వం నా మహాభాగ్యాలలో ఒకటిగా భావించుకొంటున్నాను".

## V

ఇంతగా జాతీయ స్థాయి రచనలు చేసిన విశ్వనాథ సత్య నారాయణగారి సాహిత్య మనస్తత్వ లక్షణం గురించి ఆలోచించు టకు మానవ జాతి మొత్తానికి సంబంధించి అంటి పెట్టుకొని యున్న అజ్ఞాత చైతన్యము వద్దకు పోవలెను. దాని ఆదిమ రూపాలలో పురాణ విజ్ఞాన లక్షణమొకటి. ఈ పురాణ విజ్ఞాన మంతో ఇంతో ప్రతి మనిషిలోనూ ఉన్నప్పటికినీ ఉన్నట్లు అందరకూ తెలియదు. తెలిసికొనుట అంత సులభము కాదు. తమను వదలి ఇతరులను చూచు సాధారణ జనులకు అది అసాధ్యమనియే చెప్పవలయును. మహామనీషులయిన రచయితలు తపస్సులు చేయువారు కనుక వారు తమను తాము విశ్లేషించి చూచుకోగలరు. అలాగా చేసినప్పుడు విశ్వనాథకు తనలోని

తన ఆదిమ పురాణ విజ్ఞాన రూపము కల్పించినది. సాధారణ జన విషయం కాని ఈ దర్శన స్థాయి అసాధారణమైనదగుటకు దీని సంకేతాత్మకత కూడా తోడ్పడినది. మరియు ఈ దర్శన స్థాయి మనస్తత్వము శ్రీ అరవిందులు చెప్పినట్లు అంధ విశ్వాసాలకూ సంకుచిత మతాచరణలకు అతీతమై మహోన్నత ఆధ్యాత్మిక శిఖరాలనధిష్ఠించి ఉంటుంది. మరియు "ఇట్టి మనః ప్రవృత్తి కల వారికి హైందవ పురాణగాధల పట్ల ఆదరాభిమానాలధికంగా ఉంటాయి. ఇట్టి మనస్తత్వం గల వారికి హైందవ గాధలు శక్తిమంతంగాను ప్రబోధాత్మకంగానూ ఉంటాయి. ఒక్కొక్కప్పుడివి ఇతిహాస సాహస భావనకు కూడా దారి తీస్తాయి. ఇవి ఔచితీవిలసితమైన సత్యాన్వేషణోత్సుకతను, సౌందర్య కౌతూహలాన్నీ సమకూర్చుతాయి. ఈ హైందవ పురాణ గాధల్లో అభివ్యాప్తమైన వినూత్నతే వాని జీవగఱ్ఱ."[1] ఈ విధమైన పురాణ విజ్ఞాన మనస్తత్వం ఇంతగా వికసించిన మరియు దాని వికసనము యొక్క అసవరమును ఇంతగా భావించిన ఆంధ్ర భాషా సాహిత్యకారులలో కాలక్రమమును బట్టి చెప్పినచో నన్నయగారి తరువాత శ్రీనాథుని తరువాత పెద్దన్నగారి తరువాత విశ్వనాధ సత్యనారాయణగారినే చెప్పవలయును. బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతుడు- బ్రహ్మాండాది మహా పురాణచయ తాత్పర్యార్థ

---

(1) శ్రీ అరవిందులు పాశ్చాత్య నాగరకతా వ్యామోహమున పడి భారత జాతీయ సాహిత్య సంప్రదాయమైన పురాణేతిహాస విజ్ఞానమును తృణముగా తీసివేయుచు తమ పెద్దన్నగారు తమకు వ్రాసిన లేఖకు బదులు వ్రాసిన లేఖాంశమును. చూ: భారతీయత దాని నిజతత్త్వము. పుట: 13, 14.

విర్ధారిత బ్రహ్మజ్ఞాన కళానిధి- అతుల పురాణాగమేతిహాసకథార్థ స్మృతియుతుడు- అని ఈ విధముగా తమను గురించి తాము చెప్పు కొన్న పూర్వాంధ్ర మహాకవులు హైందవ పురాణ గాథలలో వినూత్నతను దర్శించి దాని ప్రాణశక్తిని తెనుగున కావ్యములుగా అచ్చులు పోసినవారు. నవీన కావ్యరచనకు ముడి సరుకైన కథకొరకు వారు తమ పురాణ విజ్ఞానములోని ఆదిమ రూపాల దాకా గావించి గానీ పూనుకొనినవారు కాదు. విశ్వనాథ యొక్క బ్రహ్మమయమూర్తి లక్షణము తాదృశమైన పురాణ విజ్ఞానమయత్వము నందున్నది. సమష్టి అజ్ఞాత చైతన్యమునందలి ఈ పురాణ విజ్ఞానమునందు మానవజాతియొక్క మహనీయతా బీజములన్నియు సుప్తావస్థలోనున్నవాటిని దార్శనికులయిన కవులు, రచయితలు మేల్కొలిపి వాటిని తమ రచనల ద్వారా వికసింపజేయుదురు. ఆధునికాంధ్ర వాఙ్మయ నిర్మాతలలో ఈ పని విశ్వనాథ చేసినట్లు మరొకరు చేయలేదు. ఆయన ఒక్కడే ఈ ఇంత భారతమునకు ననంతుడన్నను ఫరవాలేదు. తాదృశమైన మానవమహనీయతా బీజ సంపుటి అద్వితీయ పరబ్రహ్మ వస్తువునకు చిహ్నము. భారతీయ వేదాంతులు దానినే ఆత్మవస్తువులుగా దర్శించిరి. విశ్వనాథ సత్యనారాయణ ఆధునిక మనో విజ్ఞానము నుండి భారతీయ వేదాంతమునకు పోయినాడా కాక అక్కడ మునిగి ఇక్కడ తేలినాడా అన్నదింకను పరిశోధించి తేల్చుకొనవలసిన విషయము. అనగా ఇప్పుడేమైనది? పురాణ విజ్ఞానమంతా అనాది సాంఘిక రాజకీయ మతతాత్త్వికాది సర్వ సాంస్కృతిక విషయ వాసనా వాసితమన్న మాట. ఈ యంతటికిని అడుగు పొరలలో జగదుత్పత్తి హేతువయిన స్త్రీపుంసయోగ భావమున్నది. అక్కడి సమష్టి మీద సమస్తమును విశ్వజనీన భావభావనా పరమేశ్వరముగా ఉంటుంది. మహాకవులు రచయితలు అక్కడ జాగ్రద్దశను పొంది వేచి వాఙ్మయ రథమును విశ్వశ్రేయోదాయకముగా నడిపించెదరు. శ్రేయోదాయక

ముగా నున్నందువల్ల సమష్టి అజ్ఞాత చైతన్యమునందలి పురాణ విజ్ఞానమున మంచి చెడ్డలు పెనవేసికొని సంఘర్షణలో ఉంటవని అర్థము. దానినే సాంకేతికముగా దేవదానవ యుద్ధములుగా పురాణ గ్రంథములు కల్పించినవి. తాదృశమైన పురాణ విజ్ఞానముతోడి పరిచయాధిక్యము అనుభవమును తీవ్రతరము చేయగలదు. తీవ్రా నుభవము నభిలషించిన మనస్సు తన యాదర్శమునకు అనువుగా పరమ విస్తరములయిన నైతిక ధర్మముల నవలంబించును. విశ్వనాథ వారి వాఙ్మయమునందంతటను నైతిక ధర్మనిష్ఠ ప్రభుత్వము చేయు చున్నట్లుండుననగా దాని తత్వమది. పురాణ విజ్ఞానానుభవమెంత తీవ్రముకానిదే ఆయన తాత తాతల నాటి కథలు త్రవ్విపోస్తానో యని బయలుదేరుతాడు? ఆయన కావ్యాలు, ఆయన నాటకాలు ఆయన నవలలు, ఆయన చిన్న కథలు - ఆయన సమస్త రచనలు తదనుభవ తీవ్రత నుండి సముద్భవించినవే. మానవజాతి చరిత్ర ఎట్టిదని తెలిసికొనుట కాయన వాఙ్మయమును తెలుగువారు తొలి మెట్టుగా చదువుకొనవలయును. నరజాతి చరిత్రలో గర్వగారణ ములు లేకపోలేదన్న సత్యమును వాఖ్యానించిన సాహిత్య స్రష్ట విశ్వనాథ. గతి తార్కికమైన చారిత్రకావగాహనవల్లనే మానవ జాతి పురోగమించగలదన్న విశ్వసత్యము నాయన తన సాహిత్యము ద్వారా బహువిధముల ప్రదర్శించినాడు.

## VI

విశ్వనాథ సత్యనారాయణ తన బహిరంతర్ముఖాలను ఏ విధముగా దాచుకొనుటకు వీలుకానంత విస్తృతమైన వాఙ్మయమును సృష్టించుకొనినాడు. అదీకాక అరవై సంవత్సరాలపాటు నూరు నూట పాతిక పుస్తకాలు రచించుటయేకాక వందల సంఖ్యలో ఉప న్యాసాలు చేయుచూ దేశము నాలుగు మూలలు సంచారముచేసి ప్రజా సమూహములో పడి, వారితో క్రిందుమీదై తిట్టే తిట్లు దిని, ప్రేమించి ప్రేమింపబడి, మన్నించి మన్నింపబడి దూషణ

భూషణలను సమానముగా స్వీకరించిన ఒక మహా రచయితను అర్థము చేసికొనుటకున్నంత వసతి మరొక ఒకటి రెండు పుస్తకాలు రచించి పోయిన రచయిత విషయమున ఉండదు. ఆ యున్న అవకాశమునొక విధముగా తెలుగు ప్రజలు జారవిడవక విశ్వనాథను సరిగానే అర్థము చేసికొన్నారు. అర్థము కానప్పుడు కాలేదని తిట్టినారు తప్ప ఆయననెప్పుడును ప్రజలు తిరస్కరించ లేదు. తిరస్కరించినచో ఆయన పుస్తకాలవల్ల అంత డబ్బు సంపాదింపగలిగి యుండెడి వాడు కాడు. దూషణభూషణలకు ఇంతగా గురియగుచున్న ఈయన సాహితీ వ్యక్తిత్వముయొక్క ఆస్తిత్వము ఆరెండింటికినీ అందక రెండింటినీ స్వాహా చేయగలిగిన వసిష్ఠుని బ్రహ్మ దండము లాగా ఎక్కడో ఉండి ఉంటుంది.

విశ్వనాథ సామాజిక దృక్పథముగానీ, మానవతా దృక్పథము కానీ, చారిత్రిక దృక్పథముకానీ, సాంప్రదాయిక దృక్పథము కానీ ఏదీ సమగ్రముకాదని ఋజువుచేయుట సులభము కావచ్చు. ఆయన అన్నీ అర్థసత్యాలే చెప్పినాడన్నది నిజమే కావచ్చును. ఏ శాస్త్రమూ సర్వ సమగ్రముకాదు. ఇది ఇంతే అనటానికి వీలలేదు. ఆధునికాంధ్ర భాషాసాహిత్య నిర్మాతలలో ఆయన మొదటి రకము పనితనము కలవారిలో మొదలు పెట్టబడవలసినవాడు కానీ సామాన్యుడు కాదుకదా! ఈ మాట అన్నచో ఇక సృష్టి ఆగిపోవుచున్నదని యర్థమా? విపరీతార్థములు పుట్టించుట మంచిదికాదు.

మరొక విషయముకూడా ఉన్నది అన్ని శాస్త్రాలకు, అన్ని కవిత్వాలకూ, కళలకూ విద్యలకూ ప్రత్యక్ష ప్రయోజనమున్నప్పుడే విలువ అని అనటానికి వీలలేదు. ప్రతి కార్యమూ సమాజానికి ప్రకృష్టోపకారకముగా ఉండితీరాలని అనుట శాస్త్రీయము కాదు. మనిషిని చంద్రమండలానికి పంపటానికి

టెక్నలాజికల్ సైన్సు ఎంత డబ్బు మ్రింగినదో లెక్క తెలియునా? దానివల్ల మానవ సమాజమునకు వెంటనే కలిగెడు ప్రయోజన మేమున్నది?

అది వృథా అన్నవచ్చునా? ఎందుకనరాదు? మనిషి చంద్రమండలమునకు పోయి తిరిగి రాగలిగాడన్న భావము మానవ జాతి సమిష్టి అజ్ఞాత చైతన్యములోనికి వెళ్ళిపోయినది. దాని యునికి యొక్క స్మృతి లక్షణముచేత మరి కొన్ని వేల యేండ్లు మానవజాతి తన మనుగడను కొనసాగించుకొనగలదు. అది వృద్ధ విజ్ఞానము. దానినే భారతీయులమైన మనము సంప్రదాయ ముగా కలగాపులగము చేసి చెప్పుకొనిపోవుచున్నాము.

మనిషి బాహ్యాభ్యంతర లక్షణము చేత భౌతిక ఆధ్యాత్మిక జీవితములను రెండింటిని జీవించుచున్నాడు. భౌతిక జీవితమున కంటె ఆధ్యాత్మిక జీవితము సమిష్టి లక్షణము కలది. మహా కవులు రచయితలు తమ పాత్రల ఆధ్యాత్మిక జీవితమును చిత్రించుట చేత తమ సాహిత్యమును విశ్వవ్యాప్తము చేసికొన గలుగు చున్నారు. దానియందు సమిష్టి లక్షణముండుటచేత అన్ని దేశ కాలములయందలి వారును ఆ సాహిత్యమును ఆస్వాదింపగలుగు చున్నారు.

విశ్వనాథ శారదా హృదయమునందేమున్నదనగా నిదంత యునూ ఉన్నది.

ఆధ్యాత్మిక జీవన భావము సమష్టి లక్షణంచేత విశ్వసత్య ముగా నిలబడగలుగుచున్నది. విశ్వసత్యనారాయణ అనగా యూనివర్సల్ ట్రూత్సును గురించి అధికారికంగా చెప్పగలిగిన వాడని యర్థము. ఆ స్థాయిలో ఆయా విషయాలను గురించి చెప్పటానికి ఒక విలక్షణమైన ప్రత్యభిజ్ఞ కావలయును. ఆ చెప్ప

బడిన దాని లోతుపాతుల అవగాహనకును అంతే ప్రత్యభిజ్ఞ కావలయును.

---

For it is the combination of intution and eognition that makes for evasive thrust from the unconscious and evasive mastery by the conscious.... The true evasive man. to use Friend's phrase, **has more at his disposal,** special gifts, which enable him to adventure beyand the borders of the corridor of transformation - in to the mysteries and mechanics of the process which impinges upon him the inner time-space world of his unconscious **and** from the outer time-space world of reality. He lives nearer to his dreams and at the same time he encompasses routine and penetrates beyand routine in to the practical magic of ever changing, ever subtle reality.........Intution and eognition, evasive thrust and evasive mastery - this is the quality and quantity - the sum and substance - of true genious and, to the degree that one possesses these, one is a greater or a lesser evasive worker — DANIEL SCHNEIDER, THE PSYCHO ANALYST AND THE ARTIST. Pages 79, 80, 81.

# ఆత్మ చిత్రం

['ఆత్మచిత్రం' అన్న ఈభాగంలో విశ్వనాథసత్యనారాయణ తన్ను గూర్చి తాను చెప్పుకొన్న అంశాలు-వ్యాసాలు, రేడియో ప్రసంగాలు, ఉపన్యాస వార్తలు, ఇంటర్వ్యూలు చాలా వరకు ఒకచోట చేర్చే ప్రయత్నం జరిగింది.

విశ్వనాథ ఆత్మకథను వ్రాసే ప్రయత్నం జరిగిందని ఒక అధ్యాయం మాత్రమే సాగిందనీ తెలుస్తున్నది. శ్రీ పన్నాల సుబ్రహ్మణ్యభట్టు చెప్పించుకొని రికార్డు చేసిన ఆ మొదటి భాగం ఇందులో చేర్చబడ్డది.

'నా రాముడు-రామాయణము' అనే పేర 'జాగృతి' లో వరుసగా 1971లో ప్రచురితాలైన పదిహేను వ్యాసాలలో ఆయన బాల్య జీవనం-రామాయణ రచనకు ప్రేరణకల్గే దాకా-చాలావరకు వివరంగానే ఆయన చెప్పారు. ఈ వ్యాసపరంపర విస్తృతమైంది కావడంవల్ల వేరే గ్రంథంగా ప్రచురించడానికి వీలైంది కావడంవల్లా దీనిలో చేర్చలేదు.

యువభారతి హైదరాబాదువారు ప్రకటించిన మహతి (1972)లో 'నేను-పాతికేళ్ల సాహిత్యము' అన్న వ్యాసం విపులమైందే. దీనిలో 1957 నుంచి విశ్వనాథ తన సాహిత్య కృషిని గురించి చెప్పారు. ఈ వ్యాసమూ పెద్దదే కావడంవల్ల ఇందులో చేర్చలేదు.

1951-52లలో హైదరాబాదు రేడియోకేంద్రం ప్రసారం చేసిన రేడియో ప్రసంగం 'స్వీయకవిత' అని ఒకటి ఉంది. దానిలో తన కవితా స్వరూపాన్ని గూర్చి ఆయన చెప్పారు. ఈ ప్రసంగం మాకు లభించలేదు. -సంపాదకుడు]

# నా తొలి రచన

నీవు మొదట ఎక్కడ పుట్టావని ఒక మహానదిని అడిగితే ఎంత అందంగా ఉంటుందో నీ మొదటి రచన ఏదో చెప్పు అని ఒక మహాకవిని అడిగినా ఒకటే అందంగా ఉంటుంది. కాని కోకిల ఏదో ఒక వయస్సు వచ్చేటప్పటికి ఒక వసంతము హటాత్తుగా దాని గొంతులో ఉన్న పంచమాన్ని విరియిస్తుంది. అల్లా కవి కూడానా? ఏమో! నండూరు సుబ్బారావుగారైతే కావచ్చు. ఎందు కంటే ఉండుండి హటాత్తుగా ఒక రోజున ఆయన గుండె గొంతుక లోన కొట్లాడింది. మరి ఈ పద్ధతిలోవాడు – మా తమ్ముడు నాయని సుబ్బారావు– అతనికీ ఇట్లాగే ఒక లోకోత్తరమైన అనుభూతి విశేషం వచ్చేటప్పటికీ అతని గీతాశక్తి పండిన దానిమ్మకాయవలె పగిలింది. ఇలాంటి వాళ్ళు చెదురుగా అక్కడక్కడ ఉంటే ఉండవచ్చు. కాని ఛందోవృత్త మార్గాలలో వ్రాసేవాళ్ళకు ఇట్టి (భవభూతి చెప్పినట్టుగా)– ఆకస్మిక ప్రత్యవభాసం– కలుగుతుందా అని ప్రశ్న. ఈ ఆకస్మిక ప్రత్యవభాసం 'మా నిషాద ప్రతిష్ఠాంత్వం' అని వాల్మీకి కంఠం వికసించిందని బ్రహ్మదేవు డన్నాడు. ఆ నూత్నసరస్వత్యవతారము పండిన భావార్థాలు ఒక్క సారి అభినయిస్తూ చిత్రభంగిమలతో రంగపూర్వ ప్రదేశమునుండి రంగము ముందుకు నడుస్తూ వచ్చిన నాట్యకత్తెవలె వచ్చింది. ఇలా యెంత మందికి వస్తుంది? అలా పండి వచ్చేదాకా ఆగే ఓపిక మనకి ఉందాలేదా అనిపిస్తోంది. వ్యుత్పత్తి పరిణతమయి ప్రతిభ ఒత్తిడికి ఆగలేక రెక్కలుసాచి సమప్రసారంగా పై గాలితెరలలో నుంచీ వాలుగా క్రిందికి వచ్చే రాజహంసల్లే తన సరస్వతిని రానిచ్చుకునే ఓపిక, విలుకడ కవులకు పోయినట్లు ఉన్నది. దీనినే

కొందరిట్లా అంటున్నారు. కవులు రెండు రకాలని– తాను బాగా చదువుకుని అప్పుడు వ్రాసేవాడు, ధోరణిగా మొదలెట్టి క్రమ క్రమంగా చదువుకుంటూ వచ్చేవాడు. వీళ్ళిద్దరికీ ఎదురు బదుళ్ళుగా ఇంకో యిద్దరున్నారన్నమాట నిజమే. చదువుకుని మాట పెగలనివాడు వాడు కవే కాదంటాము – కాని మిణుకుతాడు. గిలుకుతాడు. రెండవ వాడు ధోరణి సాగటంతోటే కష్టపడడమెందుకని యిదే పరమావధి అని అక్కడే గుడారం వేసుకు కూచునేవాడు. ఏతావతా ఆయా కవులకు ఎలా వున్నా ఛందోమయ సరస్వతీ మార్గాన్ని శతశః హృద యంతో విశ్వసించే నావంటి వాడిని నీ తొలి రచన ఏదీ అంటే నా పదకొండవయేట మొదలు పెట్టి ఇరవయ్యోయేడు వచ్చేవరకు యెన్ని యెన్నో ముక్కూ మొహం లేని పద్యాలు వ్రాస్తూ చింపివేస్తూ వచ్చి వచ్చి నిజంగా ఇది బాగానే వుందిరా అని అనుకున్న పద్యం నిజంగా యెప్పుడున్నదో తెలుసుకోలేనివాడిని గురించి అడిగితే చెప్పడం చాలాకష్టం. చిన్ని చిన్ని చెదురు పద్యాలు నేను, మా కొడాలి ఆంజనేయులు కలిసి యెన్నెన్నో వ్రాశాము. వాటిల్లో ఒక పద్యం చదవరాదా అంటే నేను వ్రాసిన పద్యం అసలు జ్ఞాపకం వుండే మోస్తరు పద్యం కాదు. నా కవిత్వంలో తీర్చి పద్యం పద్యం కోసం రమ్యత యెంతమట్టుకు వుంటుంది? ప్రసన్న కథా కవిత అలవాటైనా, శ్రీనాధుడు, పోతన, పెద్దన మొదలయిన, వాళ్ళమార్గాన పోయేవాళ్ళకయినా ఇట్లాంటి పద్యాలు వుంటాయి. తిక్కనగారిని 'మీరు వ్రాసిన భారతభాగంలో ఉత్తమమైన పద్యం చదవమంటే 'సింగం బాకటితో' అన్న పద్యం చదివాడు తిక్కనగారి కవిత్వంలో ఆ పద్యానికి నిజంగా అటువంటి దశ వుందని నేను అనుకోను. తిక్కనగారి కవితాపద్ధతి అట్లాంటిది. భావాన్ని ఎక్కువగా సంగ్రి హిస్తూ మార్దవము, హాయి, శబ్దానికే సమకూరుద్దామనే ప్రయత్న మేమీ ఉండదు. తాను చెప్పబోయే అధిక మయిన భావాన్ని – సర్వభాషా తనలో జితిస్తే, తన విద్యా సంస్కారాలన్నీ ఒక్క

మొగిని ఆ భావమును చెప్పుటకు అభిముఖంగా ఉండగా, తనకున్న అనంత భాషా సామర్థ్యంలో ఈ ప్రత్యేకమయిన విశిష్ట భావం తన యిష్టం వచ్చిన - అది అదిగా తెలుసుకొన్న యే శబ్దజాలము ఆ కాలాన్ని ఆ భావాన్ని అణచుకుని వస్తుయో అదే చెపుతాడు కవి. ఇంగ్లీషులో సాంగ్ అన్నట్లుగా తెలుగులో పాట అంటున్నాము. ఈ పాటతనము ఆ మాటకు యెంత వుంది? ఇది ఒక వసంతంవలె మావిరెమ్మ చివర ఎర్రెర్రగా కనిపిస్తోన్న చివరల్లే తొంగి చూడదు. పండిన నేలపనసల్లె గుప్పుమని మెరిగెలో నుండి పరిణత రూపంగా కనిపిస్తుంది.

నిజానికి 'ధన్య కైలాసమో', 'దుర్యోధనుడు' అను ఏకాంక నాటకమో 'ఆంధ్ర పౌరుషమో' ఈ మూడింటిలో నా తొలి రచన ఏదో నాకు జ్ఞాపకంలేదు. 'దుర్యోధనుడు', 'ధన్య కైలాసము' నాటకాలు. కొందరు ఈయన నాటకాలు చదివేవి కాని ఆడేవి కావంటున్నారు. ఎట్లాగయితేనేమి 'ధన్యకైలాసము' నా మొదటి రచన అని నా ఉద్దేశ్యము. అందుచేత ప్రధానంగా నేను నాటక కవినల్లె ఉంది. అందులోది ఒక పద్యం-

'తరుణి చెక్కుటంటి కనక పత్రములలోన
వ్రాయబడె స్వర్గ సౌఖ్యాక్షరముల పంక్తి
చదివి చదివి నాగుండెయ పిచ్చిదులు కాని
ఇంచుకర్థమ్ము మది గోచరించలేదు'

[ప్రతిభ: అక్టోబరు 1941]

# నా గొప్ప రచన

రచన రెండు విధాలైనది. మొదటిది కావ్యకథా నిర్వహణ సంబంధి. రెండవది రసభావానుకూల గద్యపద్య రచనా సంబంధి. వృత్త సమూహములతో గూడిన ఏ భాషా సారస్వతములలోనైన మొదటిదాని కెంత ప్రాముఖ్య ముండునో రెండవదాని కంత ప్రాముఖ్య ముండును. అందుచేత సంస్కృత భాషయందు, దాని వలె వృత్తబాహుళ్యము గలిగిన కొన్ని దేశభాషలయందు ఈ రెండు విధములైన రచనా శక్తులు కవి యందు మహోత్కృష్ట దశను పొందినగాని అసలు కావ్యమునకు నిజమైన గొప్పదనము గలుగదు.

వస్తు నిర్వహణమునకు బూర్వము వస్తు వెన్నుకొనుట యొకటి యున్నది. ఒక కథ రసభరితమై యుండును. మఱియొక కథ రససమృద్ధి లేక యుండును. ఈ కథా విషయములో నాది యీ మతము, నాది యీ ఆదర్శము అని చెప్పవచ్చును. వేయి మతములు, వేయి ఆదర్శములు. కవికాని వానికి కూడ మతములు, ఆదర్శములు ఉండును. ఆ మతమో, ఆ ఆదర్శమో తాను వ్రాసిన కావ్యమునందు ఎట్లు ప్రతిబింబింపజేయుట అనునది రచనా విశేషము. కథను మొదట గ్రహించిన తరువాత కథయొక్క మొదలి చివళ్ళు జపమాలవలె మేరుపూసయందు లగింపబడి యుండవలయును. "పొసగ ముత్తెపుసరుల్ పోహళించిన లీల"- అనగా మేరుపూస దగ్గర సన్నని ముత్యాలు, క్రమ క్రమముగా హారమధ్య భాగమునందు పెద్ద ముత్యాలు. ఈ చిన్న ముత్యమునకు ఆ పెద్ద ముత్యము రెట్టింపై యుండవచ్చును. ఈ ముత్తెము నుండి యాముత్తెము వరకు సమకూర్చిన ముత్తెముల వరుసలో వాని

ప్రమాణము నిశితమైన దృష్టికి మాత్రమే తెలిసిన క్రమవృద్ధి కలిగి యుండును. అంత యందముగా నా ముత్తెములు కూర్చుటయే పోహళింపు. ఇట్లు కూర్చవలెనని నూరన్న యుద్దేశ్యము. అతని ప్రభావతీ ప్రద్యుమ్న మట్లున్నది. ఈ పోహళింపు పూర్వ ఆధునిక ఆంధ్ర కావ్యములందు వేయింట రెంటమూటకన్న ఎక్కువలేదు. ప్రభావతీ ప్రద్యుమ్న మందులో నొకటి. ఈ కావ్యమునందు రెండు విధములైన రచనలును కొంత వరకు చక్కగా కుదిరినవి.

ఈ మొదటి విధమైన రచన కవికుల గురువైన కాళిదాసునకు, అతనికన్న నధికుడేమో యనిపించుచున్న భవభూతికి వ్యాసునకు తెలిసినంత చక్కగా తెలియును. వ్యాసుని భారతము ఇతిహాస మగుటవలన శాకుంత లోత్తరరామచరితలయందువలె గాక యన్య విషయ పరామర్శలచేత రస ఘట్టములు దూర దూరతః క్లప్తము లైనవి. "గ్రీవాభంగాభిరామం" అన్న శ్లోకము వట్టి లేడివర్ణన కాదు. దుష్యంతుని శకుంతలా దర్శన పర్యంతము కావ్య వస్తువును కాళిదాసు సూచించుచునే యున్నాడు. కాళిదాసు ఈ భాగమునందు కావ్యవస్తు సూచనయే గాక తన రచనా సామర్థ్యమును గూడ వ్యంగ్యభూతముగా జెప్పుచున్నాడు. సూచ్యార్థ సూచన మిది చూడుడు. "యదాలోకే సూక్ష్మం వ్రజతి సహసా తద్విపులతాం యదర్ధే విచ్ఛిన్నం భవతి కృతసంధాన మివ తత్, ప్రకృత్యా య ద్వక్రం తదపి సమరేఖం నయనయోః" అన్న శ్లోకమునందు రథవేగము వ్యంగ్యమగుచున్నది. వర్ణితమైన విషయము, చూడబడిన వస్తువులయొక్క మార్పులు. ఇంతకంటె దీనియందు శాకుంతల కథ సూచ్యమగుచున్నది. మొదట సూక్ష్మముగా నున్న కథ ఉంగరము పోవుటచేత విపులమైనది. ఉంగరము పోవుటచేత విచ్ఛిన్నమైన కథ మరల దొరకుటచేత కృతసంధానమైనది. స్థూల దృష్టితో చూచినచో దుష్యంతుని శిలవక్రిత సూక్ష్మదృష్టితో జూచినచో చక్కగానే యున్నది. ఇట్టి సూచ్యార్థ సూచన కొద్ది మందియైన

మహాకవులయందు కనిపించుచున్నది. ఇట్లే "గీర్వాభంగాభి రామం" అన్న శ్లోకమునందు గూడ తన కథ యొక్క పోహాళింపును కాళిదాసు చెప్పినాడు. భవభూతి తన రచనా పద్ధతిని వదలిపెట్టి కావ్యవస్తువునే స్ఫురింపజేసినాడు. కాళిదాసు లౌకికుడు. భవభూతి వైదికుడు. శిల్ప విషయమున భవభూతి తన్ను తాను మరచి పోవును. కాళిదాసు మరచిపోడు. "కింత్వనుష్ఠాన నిత్యత్వం స్వాతంత్ర్య మపకర్షతి, సంకటా హ్యాహితాగ్నీనాం ప్రత్యవాయై ర్గృహస్థతా." ఇందు శ్రీ రామచంద్రుని రాజ్యాశ్రమము నిత్యమూ, రాజ్యమే అగ్ని, రాజయిన శ్రీరాముడు అగ్న్యాహితుడు. అందుచే నతనికి స్వాతంత్ర్యము లేదు. సీతా పరిత్యాగ రూపమైన ప్రత్యవాయశాంతి చేయవలసి వచ్చెను. ఇది సూచ్యమైనది. భవభూతి ప్రథమాంక మంతయు నిట్లే. ఉత్తర రామచరిత్ర యందలి చివరి యంకములోని పోహాళింపు యొక్క సౌందర్య మంతయు నున్నది. మంత్రశాస్త్ర మర్యాద ననుసరించి భవభూతి తన కావ్య వస్తువును ఆద్యంతములను సంధానము చేసి యక్షమాల వలె నిర్మించెను.

నాటకాంగములయిన గండము, అంకావతారము మొదలయినవియే కాక ప్రస్తావనయు నీశిల్పదృష్టితోడనే యాలంకారికులు భరతుని మొదలు నిబంధించిరి. కావ్యములోనే భాగమును ప్రధాన కథను వదలి చెదరి పోరాదు. చెదరి పోయినచో రసము చెదరి పోవును. కథా నిర్మాణ వైఖరియందు మత్కృత సర్వ కావ్యమీ దృష్టితో చేయబడినది. 'వేనరాజు' ప్రధానముగా నిట్లు విరచింపబడిన గ్రంథము. ఇవి కావ్యము యొక్క ఆద్యంతములు: కావ్య ప్రధాన శరీర నిర్మాణమందు గూడ నీ చూపు కొరవడరాదు. కవి యొకవేళ వీనియందు శ్రద్ధాళువై కూడ కొన్ని చిన్న విషయముల యందు ప్రమత్తుడైనచో గావ్యము దుష్టమైపోవును. ప్రయోజన రహితమైన కల్పన దోషము. కొన్ని వర్ణన లనవసరముగా

జెంచుట పెద్ద దోషము. శబ్దార్థముల దోష మెంతదోషము. ఈ దోషములు రసమును విరిచి వేయును. రసము సామాజిక నిష్ఠము. సామాజికుల పామరత్వ అనభిజ్ఞతలను బట్టి యాథార్థమైన రస స్వరూపము మారదు. కావ్య వస్తువు సర్వాక్షరమందు నిండియున్న కావ్యమునందు రసజనకత్వశక్తి పోదు. మన యిష్టానిష్టములను బట్టి యిక్కడ నీ దీర్ఘోపన్యాసము కూడదు. ఇచ్చట పద్యము క్లిష్టముగా నున్నది మొదలైన విమర్శనము చేసినచో గపికి నష్టముగా వచ్చును. పాఠకున కానందం తక్కువ. అందందు నవియని కావ్యప్రధాన వస్తూన్ముఖములై యున్నవా, లేవా యని ప్రశ్న.

మఱియు తత్తత్కాలములందు ప్రచారములో నున్న భావము లకు వెల యెక్కువయు, పురాణ భావములకు వెల తక్కువయు మన ముఖ్యదృష్టిభేదముగాదు. ఆయా భావములయొక్క తరిక్కత యాథార్థ్యమును విచారించవలయును. అదియుగాక కావ్యమునందు ఈ భావములనుబట్టి కావ్యత్వము రాదు. రచననుబట్టి వచ్చును. బౌద్ధసిద్ధాంతప్రతిపాదియైన 'నాగానందం' సత్కావ్యమే-రచనా వైదుష్యమునుబట్టి.

వస్తునిర్వహణము ఈ చెప్పిన కాళిదాసభవభూతుల ఒకే మార్గమును బట్టి పోదు. ఇది పరమోత్తమమైన మార్గము, కించ దూనములు, ఉత్తమములు నగు వేరుమార్గములు గలవు. 'కుంద మాల', మృచ్ఛకటికము మొదలైనవి. నా 'నర్తనశాల' యీ మార్గమునకు జెందినది. నవలలో 'ఏకవీర' యిట్టిది. 'ఏకవీర' యొక్క కథచేత ఆకర్షింపబడినవారిని పలుమందిని నేనెఱుగుదును 'ఏకవీర' యాధిక్యము దాని రచనయం దున్నది. లోకమునందలి యెల్ల కథలను ఒకటే మార్గమున పోవును. సంవిధానములయొక్క సంఘట్టనలయొక్క భేదములచేత దృష్టికి లౌకిక భిన్నములుగా

గన్పించునుగాని కథానిర్వహణసామర్థ్యముచేత నన్నియు నొకటియే. ఒక రతిభావమో, ఒక యుత్సాహభావమో అన్నిటికియందును ప్రధానమైన విషయము. దాని నిర్వహణము కవియొక్క శక్తి కొలది. కథయొక తోవ బోయి, ఆ తోవ పోక యడ్డు వచ్చుట ప్రయత్నముచేత నది సాధింపబడి మరల సాధింపబడుట. ఇది కథయొక్క స్వరూపము. ఆ తగిలిన యడ్డులు, దానిని తొలగించిన ప్రయత్నములు, వీనియొక్క సమకూర్పుటలోని చాకచక్యము కవిశక్తి. ఈశక్తి 'ఏకవీర' యందు సమృద్ధిగా నున్నది.

కవియొక్క శక్తి మరియొక విధముగా మహాకావ్యముల యందు కన్పించుచున్నది. వర్ణనాదులు కావ్యమున కందమిచ్చును. కాని యావర్ణన అచ్చట వర్ణ్యముతోనో, వస్తువులోనో కలసిపోవు నట్లు చేయుట మహాకవుల ప్రతిభ. ఈ లక్షణము 'ముద్రారాక్షసము' నందు రాక్షసుడు జీర్ణోద్యానము ప్రవేశించి చేసిన వర్ణనమునందు చక్కగా నున్నది. ఇచ్చటి ప్రధానమైన విషయము ప్రకృతికి, వస్తువునకు నభేదాధ్యవసాయము కల్పించుటయే. ఈరీతిగా కావ్య వస్తువునకు, బహిఃప్రకృతికి తాదాత్మ్యము నాకావ్యములందు సర్వత్ర యుండును. "వేయిపడగల"లో నిది యెందు వడన నందే కలదు. ఇది యుత్తమకవిత. కొన్ని యసద్భావములు పెంచుకొని, యొక పాండిత్య విషయముననో, యొక ప్రచారములో నున్న భావము వలని యుద్వేగమువలననో కొందఱు కొన్ని కావ్యములందు వైముఖ్య మవలంబింతురు. 'మురారి' నాటకమునకు ఈదశనే పట్టించిరి. ఆ నాటకమునందున్న నాటకకళ మిక్కిలి యుత్తమ మైనది. ఈయుత్తమత్వ మెట్టిది? కల్పించిన ప్రతికల్పనయు ఔచిత్యసహితమై అర్థవంతమగుటయే. రాముడు తాటకాసంహారము చేసినప్పుడు దూష్యస్త్రీవధజనితక్లేశము రాము డనుభవించి దానిని పోగొట్టుకొనుటకు అయిదారుశ్లోకములతో చంద్రవర్ణనము చేసెను. ఈశ్లోకములు ఆప్రయోజనము గలవి. చంద్రవర్ణనము చేయుటలో

చాల అర్థమున్నది. ఇది కళ. రంగముమీద నిలుచుండి యిన్ని పద్యములు చదువుట ప్రదర్శనశక్తి నాటకమునకు లేకపోవుట అని యొక వాదన యున్నది. ఈవాదన స్థిరమైనది కాదు. ఈవాదనకు గారణ మేమనగా ప్రాచ్యప్రతీచీ నాటక సంప్రదాయములకు గలిగిన సంఘర్షణ. పాశ్చాత్య నాటకములలో ఏక్షన్ ప్రధానము. ప్రాచ్యనాటకములలో రసము ప్రధానము. ఈ రెంటి వివరణము లిచట తావులేదు. వాడు సంగీతము బాగుగా పాడును-వీడు సంగీతము బాగుగా పాడును అని యెగబడి నాటకములు చూచు ఈ రోజులలో అస లీప్రస్తావనయే లేదు. ఈనాటకములు నాటకకళకు సంబంధించినవి కావు. ఇష్టానిష్టములకు సంబంధించినవి.

ఈకథానిర్వహణరచనావిషయము కవియొక్క యుపజ్ఞకొలదిని. దానినిగురించి ఇంకను విస్తరించి విశేషవిషయములు చెప్పుటకు తావులేదు,

రెండవది పద్యరచనావిషయము. ఏతత్పూర్వము భాషా విషయము కొంత చెప్పవలయును. కొన్ని శబ్దములు వాడవచ్చును కొన్ని వాడరాదు అన్నట్లుగా గొందఱు చెప్పుదురు. తిక్కన్న తన నిర్వచనోత్తర రామాయణములో "ప్రాతవడ్డశబ్దములు" అని చెప్పెను. ఈప్రాతవడ్డ శబ్దము లేవి? శబ్ద మెట్లు ప్రాతవడును? వాడుక లేక పోవుటచేతనేనా? అయినచో నా తిక్కన్నయే వాడిన శబ్దము లీనాటి కెన్ని ప్రాతవడినవి? అర్థములు ప్రాతవడిన మాటలా? అయినచో సంప్రదాయములు చచ్చిపోవును. విపరిణామము పొందిన శబ్దములా? అర్థవిపరిణామము పొందిన శబ్దములు తత్పూర్వార్థమందు వాడినచో సద్యస్స్ఫూర్తి యుండదు. ఈవిషయమును తిక్కన్న యుద్దేశించి యుండును. కొన్ని శబ్దములు నిఘంటువులలోనే యుండునని, మరి కొన్ని ప్రాతకావ్యములలోనే యుండునన్న వాదన యానిఘంటువులయు, నాకావ్యములయు స్థితినే వివరించుచున్నవి. ఆ నిఘంట్వాదులు

లుప్తములైనను ఆపత్తిలేదన్నమాట. షేక్స్పియరు విషయములో వలె దిక్కన్న విషయములోగూడ నతడు బహుశబ్దములు వాడుట యొక గుణముగా జెప్పుదుము. అనేక నూతన శబ్దములు వాడిన కవికి భాషాశరీరవిస్తారత తెలియును. ఈశబ్దవిషయవిచారణ యింక నెంతో యున్నదికాని పద్యరచనావిషయము చూతము.

పద్యమునందు ధారాశుద్ధి ప్రధానమని యొక ప్రతీతి నేడు వ్యాపించినది. ఈధారాశుద్ధి యే యాలంకారికులును చెప్పినది కాదు 'నరసభూపాలీయ' గ్రంథకర్తమాత్రము "శ్రీనాథుని పదప్రసిద్ధ ధారాశుద్ధి" యన్నాడు. ఈధారాశుద్ధి యన్నది కావ్యగుణములయందిమిడియేయుండును. దీనికి ప్రత్యేకస్థితి లేదు. దీనికి ప్రత్యేకస్థితి గడించుట కావ్యనీరసమార్గము. కావ్యగుణములు శబ్దాశ్రయములు. అర్థాశ్రయములు. శబ్దాశ్రయములకు నగ్రతాంబూల మిచ్చి అర్థాశ్రయములను త్రోసిరాజనుటకూడ నీరసమార్గమే. శబ్దార్థగుణముల సమవేతత్వము ప్రయత్నింపదగినది. శబ్దములు వాడుటలో గుణాతిశాయి యయిన యొక ధ్వనిమార్గము కలదు.

"రణే దీనాన్ దేవాన్ దశవదనవిద్రావ్యవహతి
ప్రభావప్రాగల్భ్యం త్వయితు. మమ కోయం పరికరః,
లలాటోద్యజ్జ్వాలాకవళితజగజ్జాలవిభవో
భవో మే కోదండచ్యుతదిశభవేగంకలయతు."

శ్రీరామచంద్రుడు రావణునితో నన్నమాట. పూర్వభాగమందలి విడివిడియయిన కూర్పు, ఉత్తరార్థ మందలి సమాసఘటనయు నర్థమునందలి భేదముచేత సమకూర్పబడినది. దీనిని 'రసగంగాధర' కర్తయు, ధ్వన్యాచార్యులును రసధ్వని కలిగిన రచనగా చెప్పుదురు. ఇట్టిదిమాత్రమేకాక యీరసధ్వని పలువిధములుగా నుండును.

పై ౖవడిపోయెఁగాక.... .... .... ....

.... .... .... .... పతుల్ విజృంభిత

శ్రీవిలసిల్లు కామినులు చేద్వడి రి ట్లపతిత్వదీనతన్.

ఇది తిక్కన్నపద్యము. ఇందు రసధ్వని సమాసగతమై ఛందోవిశేషగతమైకూడ నున్నది.

భావములేలఁ జంపుటకుఁ

బాల్పడెద బ్రతి చంపు వెంట హ

త్యావధి చేరుచున్నది గ

దా, మఱి మీరలు మౌనులై యహిం

సావిధియాతురిలుంగద ప్రశ

శస్తులు వర్ణి త్వదీయ మౌ తప

స్సేవధిలో లయాంత శిఖి

చెట్టెము కట్టెడు లోకముల్ మునీ.

ఇది నాపద్యము. 'శుకరంభాసంవాద' శీర్షికలోనిది. "అహింసా విధి యాతురిలుంగద ప్రశస్తులువర్ణి"లో రసధ్వని యన్వయగతమై యున్నది. 'అహింసావిధియాతురిలు' అన్న సమాసముకూడ ధ్వనిమంతము. రసము, రసాభాసము, భావాదులు కావ్యమునం దుపాధేయములే కనుక భావధ్వనికిగూడ రసధ్వనివలె శబ్దాదులయందలి నివిష్టత యంగీకార్యము. ఈపద్ధతిని కవి యవలంబించినప్పుడు కావ్యమునందు ధారాశుద్ధి, మాధుర్యము, సౌకుమార్యము మొదలయిన సామాన్య శబ్దగుణములు తక్కువగును. అధికగుణాధానము జరుగునప్పు డీయల్పవిషయముల ప్రసక్తి యేమి? అందుకనియే తిక్కన్న యెఱ్ఱన్న సోమన్నవంటి మహా కవులలో శబ్దగతమాధుర్యసౌకుమార్యాదులు భంగింపబడుట. సమిష్టిమీద శ్రీనాథప్రభృతులు తిక్కనాదులకు లొంగిపోవుటకు నిది యొక కారణము.

మరియొకటి. పద్యమంతయు భావప్రధానముగా రచించు

టయు, భావశబలత తెచ్చుటయు నీరెంటిచేత రచనయందు భేదము కనిపించును. వితర్కనిర్వేద స్మృత్యాది బహుభావములేక పద్య మగుట భావశబలత. "పైఁబడిపోయెగాక" యన్న తిక్కన్నగారి పద్యమాభావశబలత కుదాహరణము. తిక్కన్నరచన బహుధా భావశబలతాశ్రయి. భారవికవిత్వ మిట్టిది. మొదటి రెండుమూడా శ్వాసములు మాత్రమే. కాళిదాసాదులయిన మధురమార్గములయం దిది తక్కువ. గడుసరులయిన కవు లీశబలాధ్వము పట్టుదురు. ఇది ప్రౌఢిగల త్రోవ.

ఒకయెదియేని భార్యల న
హో యిక భర్తలనంగరాదొ వా
లిక మఱి నేను నన్నదియు
లేదు సరాసరి కోపమెత్తి చూ
శిక యిది నాటకమ్ము మెద
లించెను నాయనినట్టిమాట యెం
చకుమని యొక్క వంద యుప
సంహృతు లైనవి యేమి సేయుదున్?

ఇది నా 'శశిదూతము'లోని పద్యము. ఇందు భావశబలత యున్నది. అందుచేత పద్యము నీటివలె ప్రవహించదు.

ఇదికాక నింకొక్క విషయము. ఒకటి విరళ విరళ రచన. మఱొకటి కుదింపు గల రచన. కుదింపు గల రచన ప్రౌఢమైనది. ఇవి రెండును, ఈరెంటిలో ననేకములయిన భేదములును రసాను గుణముగా, భావానుగుణముగా రచింపబడి కావ్యార్థపోషణ చేయును. ఒకటే పోకడతో గావ్యమంతయు తీర్చువాడు సుకుమార శిల్పి. మధురశిల్పి శిల్పము యొక్క లోతు లన్నియు నెరిగినవాడు కాడు. 'శృంగారవీధి'లో మొదటి కావ్యము, 'శ్రీకృష్ణదేవుని నిర్వేద' మన్న కావ్యము ఈరెంటికి నుదాహరణములు.

ఏ భాషలో గావ్యము వ్రాయబడినదో ఆ భాష యొక్క నానుడి పలుకుబడి సమృద్ధిగా సమకూర్చుట యొక మహాగుణముకదా. సంస్కృతశబ్ద బాహుళ్య మున్నంత మాత్రాన నందులో దెలుగు లేదనరాదు నన్నయ్యగారిలో నున్నంతటి తెలుగు పలుకుబడి యితర కవులలో గానరాదు. కాని లోకము నన్నయ్య తెలుగు తక్కువ వాడునని యనుకొందురు. తెలుగనగా వేయి తెలుగు మాటలను కూర్చుట కాదు. వాక్యవిన్యాసము అన్వయము దేశీయోక్తి పలుకుబడి తెలుగుగా నుండుట.

అవు నినువంటి రాజునకు
నంజలిపట్టిన పట్టినందమౌ
నవు నినువంటి సత్ప్రథ వి
హారిని కోరినఁ గోరినంద మిం
తవు నొకమాట నేనడిగి
నంతటిలోనె దుషారసారసా
ధువులగు గ్రొత్తవెన్నెలలు
త్రోవలు తీసితివయ్య చంద్రమా।

ఇది శశిదూతము. ఇట్టి తెలుగుపలుకుబడి గల పద్యాలు నాకావ్యాలనిండ నున్నవి. నావచనగ్రంథములలో దెలుగుదేశపు బలుకుబడి యింతయు గలదు. 'పాత్రిస్తవము' అచ్చముగా తెలుగే. రసభావాదిధ్వని కోరి చేసిన క్లిష్టసమాసములు చూచి అంతయునిట్లే యనుకొని చాలమంది యేదో యనుట యెఱుగుదును.

ఈ పైని చెప్పిన గుణాలు నాకావ్యాలలో ఉన్నవి. లేవు. పోనిండు. నాసర్వకావ్యము జాతీయరచన. విజాతీయభావములు, విజాతీయసంప్రదాయములు, విజాతీయ కథావస్తువులు ఒక్కఅన్నార్థ లీలోతక్క నాకావ్యములందులేవు. నాది తెలుగు. నేను తెలుగు

వాడను. మరియు భారతీయుడను. 'కిన్నెరసానిపాటలు' మొదలు నా 'రామాయణము' వరకు నేను తెలుగువాడను. తెలుగుకవిని.

చివరిమాట. ఈపద్యభాగము నారామాయణములోనిది. హనుమ రావణునితో నన్నాడి:

ఎవరికి వారుగాఁ బొగడు
టింతయు మెచ్చరు పెద్దలైనఁగా
ర్యవిధిఁ బొనర్పఁగా వలసి
నప్పుడు చేయక తప్పదున్.

[భారతి: సెప్టెంబర్ 1943]

# నేను - నా రచన

కొందరకు నేను కవినేకాను. పండితుడనట. ఆ లెక్కలో నేను రెండునూ కాను. నేను పండితుడనుకానని నాకు తెలియును. కవిని కానని వారికి తెలియును. వెరసి సున్నకు సున్న హళ్ళికి హళ్ళి. కాని వ్రాసిన కొన్ని పుస్తకములు కనబడుచుండగా కవిత్వమిదియను నిశ్చితాభిప్రాయము లేని కొందరు నేను కవిననుకొనవచ్చును. కవిననుకోనివారు కూడ నొక నిశ్చితాభిప్రాయము మీదనే యట్లనుకొనుచు నుండవచ్చును ఇందేమియు నిశ్చితముగా చెప్పుటకు వీలు లేకున్నది. నన్నయాదుల మార్గము కవితామార్గమైనచో నేనును కవిని గావచ్చును. వీరిది కానిచో నాదియు కాదు

కాని వారు చనిపోయిన కవులు. వారిప్పుడు మారరు. నేను బ్రతికి యుంటిని. మారవచ్చును కదా! మారలేదు. ఈ నేను వ్రాసినది ఆ చనిపోయిన కవుల కవితారాసిలో చేర్చి దాని కిచ్చినంత గౌరవము ఆ గౌరవములో కొంత భాగమో కనీస మీ కవిత్వమటువంటిది, అని ముఖావముగా నూరకొంటయో చేయవచ్చును కదా! ఇదియును కాక దేశములో నెవరో కొందరు క్రొత్తమార్గమున పోవుచున్నారు. కాని వేలాది మంది కవులు ఈ పద్యములు గణములు యతులు ప్రాసలు వ్యాకృత శబ్ద స్వరూపములు సమాసములు-ఈ దారినే పోవుచున్నారు. వారందరకు లేని యీ పట్టింపు నా విషయములోనే యెందుకు?

ఉత్సర్గమున కెప్పుడు నపవాద ముండును. అటువంటి కొద్ది యపవాద విషయములు తీసి వైచినచో పూర్వ కావ్యములను చదివి కవిత్వము వ్రాయు వారిలో నూటికి తొంబది తొమ్మండుగురా మార్గముననే పోవుచున్నారు. పూర్వ కావ్యములు చదివిన పాండిత్యము పలురకములుగా నుండును. కొందరు కథాబుద్ధితోడనే చదువుదురు. కొందరు భావములను గ్రహించు బుద్ధితోడనే చదువుదురు. మరి కొందరు భాషాబుద్ధితో చదువుదురు. ఆ కావ్యముల యందు కథాభాగములున్నప్పటికి నవి భాషా ప్రధానములైన కావ్యములు. భాషా ప్రాధాన్య బుద్ధితో చదివిన వానికే వాని యదార్థ స్వరూపము తెలియును. కొందరు కవులకు భాషాజ్ఞానము తక్కువ. భావములు తెలిసికొందురు. ఏ భాష కాభాషా లక్షణము విశేషము. దాని భావములు సర్వభాషల యందుండును. భావములు మానవ నిష్ఠములు. భాష జాతినిష్ఠము. ఈ జాతి నిష్ఠమైన భాష భావముల యందు కూడ విలక్షణత్వము సంపాదించును. కనుక భాషా నిష్ఠమైన సంప్రదాయముతో కూడిన భావ సంపత్తి వేరు. కలగూర గంపయైన భావముల పద్ధతి వేరు. అందుకనియే తన దేశభాషయందు సందిగ్ధమైన కవితాశక్తి కలవాడు వాని నింగ్లీషు

భాషలోనికి తర్జుమా చేసి గొప్ప కవిగా నగుచున్నాడు. అగుటకు ప్రయత్నించుచున్నాడు. వాని భావములకు జాతీయతాముద్ర తక్కువ. వానికి దేశభాషా పాండిత్యము కంటె నింగ్లీషు భాషా పాండిత్యము ఎక్కువ.

ఇట్టి తిరుగుడులు వందలు వేలు కలిగిన యాధునిక కవితా ప్రపంచమున నేటి స్థితి యిదమిత్థమని తేల్చరాకున్నది. నమిలిన వానికన్న మ్రింగినవాడు దొడ్డవాడు. దేశభాషలో నీ వెంతవాడ వైనను నీ ప్రతిష్ఠ యానాల్గుకోట్ల మేరయే. ఇందులో విద్యావదంశము నూటికి రెండు. అందులో నూటికి తొంబది వంతులు పర భాషా పర భావాశ్రయము. కనుక దేశ భాషానిష్ఠుడు లెక్కలోనికి వచ్చుట లేదు. పరభాషానిష్ఠుడు అగ్రేసరుడుగా నున్నాడు.

ఈ దేశభాష పూర్వ సంఘము, పూర్వ మతము, పూర్వ భావ మార్గములు వాని నాశ్రయించి యున్నది. అందుచేత నదియు నొక లోపమైనది. ఇట్టి స్థితిలో దేశ భాషయందు కవిత్వము వ్రాయనే యక్కరలేదు. వ్రాసినను తర్జుమాకు యోగ్యముగా వ్రాసికోవలెను. తద్భాష యందున్న జాతీయతా లక్షణములు వదలిపెట్టి పరభాష యందున్న భావములను సంప్రదాయములను తీసికొని వ్రాసినచో నధిక కీర్తివచ్చును. ఆ కీర్తి వచ్చినను రాక పోయినను నా ప్రయత్నము పుష్కలముగా చేయవచ్చును. ఐనచో నీ దేశభాషా పండితుడు మాత్రము ఆ ప్రయత్నమేల చేయరాదు? దేశభాషా పండితుడు ప్రధానముగా దేశభాష చదివి తానన్నైనవాడు. ప్రధానముగా పరభాషా పరభావ పరసంప్రదాయము లెరిగి తానా దేశమున పుట్టిన హేతువుచేత ఆ దేశ భాషలో వ్రాయుచున్నవానికి గల నేటి వెసులుబాటు ఆ ప్రథమునికి లేదు.

నీవు నన్నయగారి వలె మధురముగా నేల వ్రాయవు? నన్నయగారివలె తిక్కన యెందుకు వ్రాయలేదు? నన్నయగారి

యందు తిక్కనకు మరియాద లేదా? నన్నయ ఆంధ్ర కవిత్వ విశారదుడని విద్యాదయితుడని తిక్కన్నగారి యభిప్రాయముకదా! తొమ్మిదివందల యేండ్లలో నన్నయగారివలె వ్రాసినవాడు మరి యొకడులేడుకదా! నాకు మాత్రమది యెట్లు చేతనగును! తిక్కన్నయే వ్రాయలేదు కదా! తిక్కన్నతో నీకుపోటీయా అందురా? నాకెవ్వరి తోడను పోటీలేదు. నా మార్గము నాది. ఎవరి మార్గము వారిది. అది నీకు స్వీకార్యమగుచో గ్రహించుము. లేదేని త్రోసివేయుము. కొంతభాగము స్వీకార్యము. తక్కినది కూడ మాకిష్టము వచ్చిన ట్లుండుట మా యభిమతము. అందుచేత నిన్నడుగుచున్నాము అన్నచో "నేను వ్రాసిన దానిలో నీకే భాగ మభిమతము? ఆ భాగము నేను నీ కభిమతముగా నుండవలెనని వ్రాయలేదు కదా! ఎంతవరకు నీ కభిమతమైనదో అంతవరకే మన యుభయుల యదృష్టము" మరికొంత వివరింతును. మనుజులలో నొకరిని పోలిన వారొక రుండరు. సామ్యమైన లక్షణములు మిక్కిలిగా నుండవచ్చును. అన్నదమ్ములు ముగ్వురు నొక్క తీరుగా నున్నను విభేద లక్షణములు చాల నుండును. బాగుగా పరిచితుడు కాని వాడు వారిలో నొకనిని చూచి మరియొకడని భ్రమపడును. కాని పరిచితులు భ్రమపడరు. పరిచితునకు వివేచనా దృష్టి యేర్పడినది. అపరిచితునకు స్థూల దృష్టి. ఈ భేదము సర్వభావములను, సర్వ విషయములను సర్వ దేశములందు నున్నది. మరి కొన్ని సామ్యములు కలచోట్ల కూడ ప్రత్యేకతలు కలవుకదా! ఆ ప్రత్యేకత వానిది.

నన్నయగారివలె వ్రాయుటకు రెండు ప్రయత్నములు చేయ వలయును. మొదటిది ఆయన పద్యములు ఆయన నుడికారములు ఆయన శబ్దములు ఆయన సమాసములు సర్వమును నీవి చేసుకొని నీవేది వ్రాసినను అధికముగా వానిని చొప్పించుచు పద్యరచన కూడ నాయన యెచ్చట విరుచునో యచ్చటనే విరుచుట గూడ నలవాటు చేసికొనినచో నాయనవలెనే వ్రాయవచ్చును. కనీసము

యందు తిక్కనకు మరియాద లేదా? నన్నయ ఆంధ్రి కవిత్వ విశారదుడని విద్యాదయుతుడని తిక్కన్నగారి యభిప్రాయము కదా! తొమ్మిదివందల యేండ్లలో నన్నయగారివలె వ్రాసినవాడు మరి యొకడులేడుకదా! నాకు మాత్రిమది యెట్లు చేతనగును! తిక్కన్నయే వ్రాయలేదు కదా! తిక్కన్నతో నీకుపోటీయా అందురా? నాకెవ్వరి తోడను పోటీలేదు. నా మార్గము నాది. ఎవరి మార్గము వారిది. అది నీకు స్వీకార్యమగుచో గ్రిహించుము. లేదేని త్రోసివేయుము. కొంతభాగము స్వీకార్యము. తక్కినది కూడ మాకిష్టము వచ్చిన ట్లుండుట మా యభిమతము. అందుచేత నిన్నడుగుచున్నాము అన్నచో "నేను వ్రాసిన దానిలో నీకే భాగ మభిమతము? ఆ భాగము నేను నీ కభిమతముగా నుండవలెనని వ్రాయలేదు కదా! ఎంతవరకు నీ కభిమతమైనదో అంతవరకే మన యుభయుల యదృష్టము" మరికొంత వివరింతును. మనుజులలో నొకరిని పోలిన వారొక రుండరు. సామ్యమైన లక్షణములు మిక్కిలిగా నుండవచ్చును. అన్నదమ్ములు మువ్వురు నొక్క తీరుగా నున్నను విభేద లక్షణములు చాల నుండును. బాగుగా పరిచితుడు కాని వాడు వారిలో నొకనిని చూచి మరియొకడని భ్రిమపడును. కాని పరిచితులు భ్రిమపడరు. పరిచితునకు వివేచనా దృష్టి యేర్పడినది. అపరిచితునకు స్థూల దృష్టి. ఈ భేదము సర్వభావములను, సర్వ విషయములను సర్వ దేశములందు నున్నది. మరి కొన్ని సామ్యములు కలచోట్ల కూడ ప్రిత్యేకతలు కలవుకదా! ఆ ప్రిత్యేకత వానిది.

నన్నయగారివలె వ్రాయుటకు రెండు ప్రియత్నములు చేయ వలయును. మొదటిది ఆయన పద్యములు ఆయన నుడికారములు ఆయన శబ్దములు ఆయన సమాసములు సర్వమును నీవి చేసుకొని నీవేది వ్రాసినను అధికముగా వానిని చొప్పించుచు పద్యరచన కూడ నాయన యెచ్చట విరుచునో యచ్చటనే విరుచుట గూడ నలవాటు చేసికొనినచో నాయనవలెనే వ్రాయవచ్చును. కనీసము

తనకంటె మహాకవిలేడని యనుకొనని కవి సృష్టిలో నుండడు. ఒక కొంచెమున్నత స్థాయిలో చేరిన తర్వాత వానికదే విశ్వాసము. తక్కిన యెవ్వరు కారని తానొకడనేనని ఇది మిత్రులతో చెప్పుదురు. పరులతో చెప్పరు. సభలలో చెప్పరు. అట్లు చెప్పిన కవిని లోకము హర్షించదు. ప్రతి మానవుని యందు వ్యక్తి లక్షణము, సంఘ లక్షణము రెండు నుండును. వ్యక్తిగా మంచివాడై సంఘైకదేశముగా చాలమంది దుష్టముగా నూహింతురు. వ్యక్తిగత భావన వేరు. సంఘైకదేశముగా తన భావన వేరు. జవ్హార్‌లాల్ పండితుడు, రాధాకృష్ణ పండితుడు వారే కాదు, గాంధీజీయైనను నేనింతవాడనని చెప్పినచో సంఘము నవ్వును. అంతవాడని యీ సంఘమునకు తెలియును. కాని యతడట్లు చెప్పుటను ఈ సంఘమోర్వలేదు. ఈ లక్షణమేమని విచారించినచో నిట్లు తెలియనగును. సర్వ మానవుల యందు పరమేశ్వర భావమున్నది. ఆ భావ మొకచోట నుద్దీప్తమై ప్రకాశించును. ఆ ప్రకాశించుటకు దేశకాలాదులు సమకూడి వచ్చును. కొంత ప్రకృతి యందుగూడ నిక్షిప్తమై యుండవచ్చును. ఒక దేశమునందు అదృష్టమున ననుకూల విషయముల సన్నికర్ష జరుగుటచేత దాని కాదీప్తి కలిగినది. ఈ సామగ్రి యంతయు మరియొక చోట కలిగినను నట్టి దీప్తియే కలుగును అందుచేత నా అహం ప్రత్యయము నందలి లోకము యొక్క నిరాదరణము. అహంప్రత్యయము అంతర్ముఖమగుట కాక బహిర్ముఖ మగుట పరిహాసభాజనము. ఈ హేతువేమో యను కొందును. లేనిచో జమ్మిచెట్టు జమ్మిచెట్టయి దానికి మనము ప్రదక్షిణించుచు దాని దళమును తీసి చెవిలో ధరించుచు విజయదశమి నాడు దానినారాధించుచు ఆ జమ్మి చెట్టొకవేళ నేను జమ్మిచెట్టని తక్కిన సర్వ వృక్షముల కంటె గొప్ప దాననని చెప్పినచో లోకము దానిని వెక్కిరించుట యెందులకు? ఎంత గొప్ప ప్రదేశమైనను అది

తనకంటె మహాకవిలేడని యనుకొనని కవి సృష్టిలో నుండడు. ఒక కొంచెమున్నత స్థాయిలో చేరిన తర్వాత వానికదే విశ్వాసము. తక్కిన యెవ్వరు కారని తానొకడనేనని ఇది మిత్రులతో చెప్పుదురు. పరులతో చెప్పరు. సభలలో చెప్పరు. అట్లు చెప్పిన కవిని లోకము హర్షించదు. ప్రతి మానవుని యందు వ్యక్తి లక్షణము, సంఘ లక్షణము రెండు నుండును. వ్యక్తిగా మంచివాడై సంఘైకదేశముగా చాలమంది దుష్టముగా నూహింతురు. వ్యక్తిగత భావన వేరు. సంఘైకదేశముగా తన భావన వేరు. జవ్హార్‌లాల్ పండితుడు, రాధాకృష్ణ పండితుడు వారే కాదు, గాంధీజీయైనను నేనింతవాడనని చెప్పినచో సంఘము నవ్వును. అంతవాడని యీ సంఘమునకు తెలియును. కాని యతడట్లు చెప్పుటను ఈ సంఘమోర్వలేదు. ఈ లక్షణమేమని విచారించినచో నిట్లు తెలియనగును. సర్వ మానవుల యందు పరమేశ్వర భావమున్నది. ఆ భావ మొకచోట నుద్దీప్తమై ప్రకాశించును. ఆ ప్రకాశించుటకు దేశకాలాదులు సమకూడి వచ్చును. కొంత ప్రకృతి యందుగూడ నిక్షిప్తమై యుండవచ్చును. ఒక దేశమునందు అదృష్టమున ననుకూల విషయముల సన్నికర్ష జరుగుటచేత దాని కాదీప్తి కలిగినది. ఈ సామగ్రి యంతయు మరియొక చోట కలిగినను నట్టి దీప్తియే కలుగును అందుచేత నా అహం ప్రత్యయము నందలి లోకము యొక్క నిరాదరణము. అహంప్రత్యయము అంతర్ముఖమగుట కాక బహిర్ముఖ మగుట పరిహాసభాజనము. ఈ హేతువేమో యను కొందును. లేనిచో జమ్మిచెట్టు జమ్మిచెట్టయి దానికి మనము ప్రదక్షిణించుచు దాని దళమును తీసి చెవిలో ధరించుచు విజయదశమి నాడు దానినారాధించుచు ఆ జమ్మి చెట్టొకవేళ నేను జమ్మిచెట్టని తక్కిన సర్వ వృక్షముల కంటె గొప్ప దాననని చెప్పినచో లోకము దానిని వెక్కిరించుట యెందులకు? ఎంత గొప్ప ప్రదేశమైనను అది

శబ్దగత సౌకుమార్యము దానియంతట నదియుండునా? విప్లవవాది కవిత్వము శబ్దగత సౌకుమార్యము నాశ్రయించదే! చంపుము కొట్టుము నెత్తురు వారింపుము. వారి పాటల ఫణితులు కూడ రౌద్రరస వ్యంజకముగా నుండును. అంతవరకు వారు నిజమైన కవులు. ఏలననగా వారి భావమున కనుకూలమైన శబ్దమును దాని కనుకూలమైన ఫణితిని వారు స్వీకరించుచున్నారు. ఈ అచ్చ సౌకుమార్యవాదులకది తెలియదా? కనుక శబ్దగతమైన సౌకుమార్యము మాధుర్యము ఓజస్సు ప్రౌఢి - ఇవి భావాశ్రయములై యుండునన్న విషయములు విప్లవవాదియై నిజమైన కవికి తెలియును. అతనికి తెలియకుండ తెలిసినను నష్టము లేదు. కనుక శబ్దగుణము భావము నాశ్రయించి యుండునన్న విషయము విప్లవవాదియైన కవియే నిరూపించుచున్నాడు. ఇది స్థూలముగా కనిపించునది. భావములలో జిలుగులున్నవి. ఈ భావములలోని జిలుగులు కూడ తదనుకూల శబ్ద చయములో క్రొత్త జిలుగులుగా రావా? వచ్చుననుట యూహా ప్రసక్తమే. దానినేఉక్తి వైచిత్ర్యమందుము. లోకము సుష్ఠుగా విచారితమైనచో నాలంకారికుల మార్గమే సువ్యక్తమగుచున్నది. అవిచారిత రమణీయములైన మార్గముల గురించి నేను చెప్పలేను.

మనము రోజును మాటాడుకొనుచున్నట్లే కవిత్వమును కూడ చెప్పినచో వేరే కవిత్వమెందులకు? మన మాటలుచాలవా? ఈ మాటలే అట్లుకూడ చెప్పుదుము అన్నచో నభ్యంతరము లేదు. కాని అట్లనినచో నెట్లు? ఇంతకంటె విలక్షణముగాననియా? కాదు. ఇందులోనిదే కొంత భాగమును అప్పుడప్పుడు కవిత్వమందు మనియా? ఒకవేళ నట్లనినను ఆ కవిత్వమను దానియందు ఒక ప్రత్యేక ప్రయత్నము కనబడుచున్నది. కొన్ని పంక్తులు మాటాడుకొను భాషయందు కనిపించని ఒక నడక మాటిమాటికొక పల్లవి వంటిది. చెప్పుటలో ఒక విలక్షణత్వము అవి యచ్చట కనిపించు చున్నవి. ఒక విప్లవ భావమును

ప్రకటించు ద్విత్వసంయుక్త స్థిరాక్షరముల కూడిక కనిపించు చున్నది. ఆ భావము పాఠకుని హృదయమునందు ముద్రితము కావలయునన్న ప్రయత్నము దాని యందును కనిపించుచున్నది. విప్లవవాదులలో ప్రసిద్ధులైన కవులయందే యిది కనిపించుచున్నది. దానిచేతనే వారు ప్రసిద్ధులైనారు సరిగా కవిత్వము యొక్క రహస్యమే యిది. దానినే పూర్వాలంకారికులు బహుధా ప్రపంచించినారు. కవిత్వమునకు సిద్ధాంతములు ప్రధానములు కావు. కవియొక్క నేర్పు ప్రధానము. ఒక మహాకవి విప్లవవాది కాకపోవచ్చును. వాడు మహాకవియే. ఒక విప్లవవాది కూడ మహాకవి యైనచో మహాకవియే. మహాకవికి విప్లవవాదమునకు సంబంధములేదు. విప్లవవాది యొక్క రచన యందలి యీ గుణములే స్వీకార్యములు. తదితరుని యందు స్వీకార్యములు కావనినచో నది గుణగ్రహణ పారీణత లేమి. గుణమెందున్నను గుణమే. మరియు నది పాము పొట్టక్రింద నున్నట్టి మెత్తదనము వంటి మెత్తదనము కానిచో నది యుపయుక్తమే. కాని ఆ మెత్తదనము మెత్తదనమేకదా! సిద్ధాంతములకేమి, సర్వ కాలములయందు సర్వ సిద్ధాంతములు స్థిరములుగా లేవు. ఈ కాలమునందలి సిద్ధాంతములు మరియొక కాలమునం దపసిద్ధాంతములు కావచ్చును. ఇవి బహు కారణముల చేత మారు చుండును. ఎప్పుడే కారణము పుట్టెనో యెవ్వడెరుగును? తత్కాల మందలి సిద్ధాంతము పరమార్థమనుకొనుట. అనంత వైచిత్రికల యీ సృష్టిని దేశమున మరియు బహు విషయములను భావన చేయక పోవుట. కాని కవి మాత్రము నిత్యుడు. ఆనాటి సాంఘిక పరిస్థితులు రాజకీయ వ్యవస్థలు వ్రాసిన వాల్మీకి వ్యాస కాళిదాసులు మహా కవులే. ఈనాటి పాశ్చాత్యదేశములలోని వ్యవస్థాదికములను గూర్చి వ్రాసిన ఇబ్సెను, షాలుకవులే. ఆ మధ్యకాలపు మిల్టనుకూడ కవియే వీరందరు మహాకవు లనిపించుకొనుటకు వారి సిద్ధాంతములు కార

ణములు కావు. వారి భాషా ప్రభుత్వము వారి రచనావైశిష్ట్యము. కవులైనవారు భావుకులైనవారు ఈ వైశిష్ట్యమును గ్రహించవలయును. వానికిష్టము వచ్చిన భావములను వ్రాసినవాడు మాత్రమే కవి యనుకొనువాడు కవిత్వమునకు సంబంధము లేనివాడు. వాని వాదమును వానిది అంతే! కవితాభావన కలవాడు రసములెన్ని తీసికొన్న కథయెటువంటిది? ఏ కల్పన చేసినచో ఆ కథకు పొసగును? ఏది లోకోత్తరమైన ఊహ? ఒక విశిష్టమైన భావము చెప్పుటకు వాక్యమెట్లు చెప్పవలయును? ఏ యలంకారము చెప్ప వలయును? అచ్చట వ్యంజకత్వ లక్షణమెట్లు పుట్టును? ఏరసమునకు ఎట్టి శయ్య సంపాదించవలయును? ఇట్టి అనంతములయిన విష యముల యొక్క పర్యాలోచన చేయును. ఇట్టి బహు విషయముల యొక్క పర్యాలోచన స్వరూపము కవిత్వమైనచో కవిత్వమందర కర్థమగుట కష్టము. దాని యందు పరిశ్రమ చేసిన వానికే అది యర్థమగును. కాని సర్వవిద్యలయందు అందర కర్థమగునది, కొంత భాగము విశేషజ్ఞులకు మాత్రమే తెలియునది కొంతభాగము నుండును కదా! అందరికి నన్నియును తెలియవు. మనకది తెలియదులే మన కెందుకులే యని యూరకుండువాడుగాని, మనము తెలిసి కొందమని ప్రయత్నము చేయువాడు కాని, సృష్టిలో నల్ప సంఖ్యా కులు. ఆత్మయున్నదే. అది లేదన్న వానికి కూడ ఉన్నది కదా! ఆ ఆత్మలక్షణము ఏమనగా సర్వజ్ఞత్వము. ఆ సర్వజ్ఞత్వమును జీవాంశ చేత దేహగత సంస్కార భావనచేత కప్పబడియుండును. ఈ కప్పిన మాయ విషయమును ప్రకాశింపనీయదు కాని మూల భూతమైన సర్వజ్ఞత్వ లక్షణపు కాంతివి పైకి గ్రిద్ది వెన్నెలగా నైన చిమ్ముచునే యుండును. అంతయు నాకు తెలియవలయు ననుట ఈ మాయాపిహిత జీవలక్షణము.

[విశ్వశ్రీ: విశ్వనాథ సాహిత్య సంచిక, జనవరి 1954]

# వేయిపడగలలోని అంతరార్థము

వేయిపడగలలో అంతరార్థమేమిటి? ఒక గ్రంథ మేయుద్దేశ్యముతో వ్రాయబడుతుందో అదే దాని అంతరార్థం - ఆ ఉద్దేశం కనుక్కోవటము యెట్లాగ, అసలు మొదట కవి నేర్పుకలవాడైతే తన యుద్దేశాన్ని తన కావ్యంలో సువ్యక్తం చేస్తాడు. సువ్యక్తం చేయటమంటే వాచ్యంగా చెప్పటం కాదు. వాచ్యంగా చెబితే, యది యుత్తమ కావ్యమే కాదు. నేర్పుగల పాఠకుడు జాగ్రత్తగా ఊహిస్తే యది యతనికి తెలిసేట్లు వ్రాస్తాడు. పూర్వం నుంచి మన దేశంలో నేర్పుగల కవి తన ప్రధానోద్దేశాన్ని కావ్యంలో యేర్పరిచేందుకు కొన్ని మార్గాలు వున్నై. వాటిని పారిభాషికంగా లింగములన్నారు. కావ్యము దేనితో ఉపక్రమిస్తున్నాడు - అంటే మొదలు పెడుతున్నాడు. దేనితో ఉపసంహరిస్తున్నాడు - అంటే కావ్యం చివర దేనిని చెప్పాడు. సామాన్యంగా నేర్పరియైన రచయిత కావ్యానికి మొదటా చివరా కావ్యంలో తాను చెప్పదలచుకొన్న అంతరార్థాన్ని నిక్షేపిస్తాడు. దానిని బట్టే ప్రధానంగా ఆ కావ్యములో వున్న అర్థం తెలుస్తుంది. మరిన్నీ యీ విషయాన్నే తన కావ్యంలో బహుస్థలాల్లో చెబుతూ వుంటాడు. ఇవి మూడు ప్రధానంగా కావ్యము యొక్క అంతరార్థాన్ని తెలియజేస్తాయి. నేర్పులేని కవి యిల్లా చేసుకోలేడు. దేనితోనో మొదలు పెడతాడు. మరేదో చివరికి తేలుస్తాడు. మధ్య అతని యిష్టం వచ్చినట్లు వ్రాస్తాడు. దీనినే మృచ్ఛకటికంలో శూద్రకమహారాజు విదూషకుని చేత ఆక్షేపింపజేశాడు. యేమనంటే కుకవి కావ్యమువలె బీజంలో ఒకటి, నిర్వహణములో ఒకటి యని కావ్యప్రయోజనం సరే ఒక్కొక్కప్పుడీ ప్రయోజనం యింకొక దాని మీద ఆరోపితమై యుంటుంది. ఇందుమించుగా ఒక రూప

కాలంకారంమల్లే వుంటుంది. అచ్చంగా రూపకమైతే తెలుస్తుంది. ఏక దేశరూపకమైతే మరి కొంచెం కష్టమవుతుంది. ఇల్లా కాకుండా కొన్ని చోట్ల వ్యాజంగా ఉంటుంది. అప్పుడు సామాన్య పాఠకునికి మరీ అందదు. ఈ లక్షణాలన్నీ వేయిపడగలలో ఉండటం మూలంగా కొందరికి చప్పున అవగతం కాకపోవటంలో దోషమేమిన్నీ లేదు. తక్కినవన్నీ యెలావున్నా యిందులో పసిరిక అన్న పాత్ర కొంత మందికి అర్థంకావటం కష్టం కలిగించింది. కవి యెప్పుడూ ఆలోచిస్తే అర్థమయ్యేట్టే వ్రాస్తాడు. ఇందులో రామేశ్వరశాస్త్రి నాలుగు వివాహాలు చేసుకొన్నాడు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర కన్యలను. ఇది సాంకేతికమైన విషయము. యదార్థ విషయము కాదు. శాస్త్ర మంగీకరించిన విషయమైనా కవి దానిని ఉద్దేశించ లేదు. ఈ గ్రంథంలో ప్రతిచోటా ధర్మమును గురించే చెప్పబడుతూవచ్చింది. పుస్తకము పేరే వేయిపడగలు. సుబ్రహ్మణ్యేశ్వరిస్వామియాదేవత. ఈ తెలుగు దేశంలో సుబ్రహ్మణ్యేశ్వరస్వామిని పాముగా ఆరాధిస్తారు. ఆయన ఆదిశేషువు. ఆదిశేషువునకు వేయిపడగలున్నై. ఆ వేయిపడగలమీద భూమిని వహిస్తున్నాడని మన పురాణములు చెబుతున్నై. భూమిని సుబ్రహ్మణ్యేశ్వరుడు మోస్తున్నాడన్నమాట పౌరాణికమైన మాటగాని భగోళ విషయం కాదు. అనగా సహస్రముఖంగా ధర్మం ఉంటుంది. ఆ ధర్మముచేత భూమి పాలించబడుతుంది అన్న యర్థమే. సర్వత్రా ధర్మమేవుంటే అది సహస్ర ముఖంగా వున్నదని చెబుతాం. అది వేయిపడగలు. సుబ్బన్నపేట యొక్క గ్రామాధికారి నాల్గుపడగల పామును చూస్తాడు. ఇది చాతుర్వర్ణ్యధర్మము. అరుంధతికి రెండు పడగలు కనిపిస్తయి. అది దాంపత్యధర్మము. చివరికి ఒక పడగే కనిపిస్తుంది. అది అంతా కలిసి యేకరూపమైన ధర్మము. యీ విషయం జాగ్రత్తగా చదివే పాఠకుడికి కావ్యం మొత్తం మీద తెలుస్తుంది. రామేశ్వరశాస్త్రి నాలుగు వర్ణములలో నుండి వివాహం

చేసుకొన్నారంటే యిదంతా వట్టి సాంకేతికము. ఈ దేశంలో ప్రధాన మతము వేదమతము. వేదాలు నాలుగు. వర్ణాలు నాలుగు. నాలుగు వర్ణాలు వేదధర్మాన్ని అనుసరించేవే కదా! అనాదిలో సంఘాన్ని పూర్వ ఋషులు నిర్మించినప్పుడు వేదమును రక్షించేందుకు బ్రాహ్మణుని నియమించారు. అన్ని వర్ణాలవారును అతడు వేద ధర్మాన్ని రక్షించాలి. అనగా అన్నివర్ణాలవారు తమ తమ వర్ణానుకూలంగా తమ ఆచారాల ప్రకారం తమ విధులననుసరించి వేదధర్మాన్ని పాలిస్తే, సంఘం సువ్యవస్థితంగా వుంటుంది- ధర్మం సహస్రముఖంగా వర్ధిల్లు తుంది. వేయిపడగలు ఉదగ్రంగా ఉంటాయి. ఇందులోవున్న సుబ్బన్న పేరు ఒక్కడియాదకాదు; దేశానికంతటికీ అది చిహ్నము. జమీం దారు జమీందారు కాదు. చాలామంది ఇందులోవున్న జమీందారీ జమీందారీ యని, అది జమీందారీవిధానాన్ని సముద్ధరిస్తున్న పుస్తక మనీ అనుకోవటం జరిగింది. ఇక్కడ జమీందారు రాజస్థానీయుడు రాజనగా ఒక్కవ్యక్తే రాజుకాదు దేశాన్ని పాలించేవాళ్ళందరూ కలిసి ఒకరాజు. ఒకరాజే రాజ్యం చేసినప్పుడుకూడా ఆరాజు ఒక్కడే చేయలేడు. దేశం మొత్తంమీద కొన్ని వేలమంది రాజు ననుసరించేవాళ్ళు ఉంటే, వాళ్ళద్వారా రాజు పాలించాడు. వేయి వ్యవహారాల్లో మరీ ఇతరులచేత తెగతెంపులుకాని ఒక వ్యవ హారం వుంటే దానిని రాజు తీర్చేవాడేమోకాని తక్కినవన్నీ రాజాధికారులే చేసేవారు. ఒకనియందనుగ్రహముంటే ఆరాజు వానిని శిక్షించటం మానివేయవచ్చు, ప్రజాస్వామికంలోకూడ రాష్ట్రాధ్యక్షుడు నూటికికోటికి అట్టి క్షమాపణ చేయటం వున్నది, ఒకరాజు పాలించటమని, కొందరు పాలించటమని, ప్రజలే పాలించుకోవటమనీ యిన్ని పేర్లేకాని యథార్థానికి అన్ని దేశాలూ ఎప్పుడూ చాలా కొంచెం భేదాలతో ఒకటే మోస్తరుగా పాలించ బడుతూ వుంటవి. కనుక యిక్కడ జమీందారంటే పాలకవర్గము

అని యర్థము. విజాతీయమైన భావాలకి లొంగిపోయి సంప్రదాయము స్వజాతిలక్షణము మరచిపోయిన పాలకవర్గము యిక్కడ జమీందారు చేత ఉద్దేశింపబడినది. జమీందారు రంగారావు కొడుకు హరప్ప జమీందారేకాని అతనియందు ధర్మం సురక్షితమైందని చెప్పబడినది. ఎందుచేతనంటే, అతడు దైవభక్తుడు. విద్యలను రక్షిస్తామనేవాడు దేశంయొక్క సంప్రదాయములం దభిమానం కలవాడు. సాధువు, నియమవంతుడు. తనడబ్బు తీసికెళ్ళి గుర్రపుపందాలమీద బెట్టడు. పోయి మద్రాసులో మకాము వేయడు. గుర్రపు పంగాలంటే గుర్రాలు పందాలు కావు. విజాతీయ సంస్కృతివ్యామోహాని కది చిహ్నం. మదరాసంటే మదరాసుకాదు. అనాదినుంచీ యీదేశం గ్రామనాగరికత కలది. మదరాసు పట్టణం నాగరికతకు చిహ్నం. లక్షలాది పల్లెటూళ్ల ప్రధానవృత్తి వ్యవసాయము కల యీ దేశము ప్రధానంగా పరిశ్రమలు కల దేశాలయొక్క నాగరకతనవలంబించి చెడిపోతున్నదని తాత్పర్యము. అధికారులకు, ప్రజలకు సంబంధంలేదు. ధనవంతులూ, అధికారులూ రాజ్యం చేస్తున్నారు. ఈ విషయం యీ కావ్యములో నిందింపబడింది. ధర్మారావు పేదవాడు. చదువు కొన్నవాడు. సాధువు. పూర్వసంప్రదాయములం దిష్టము కలవాడు. అనగా ఆ భావములకు ప్రతినిధి. కావ్యము నందున్న వ్యక్తి సామాన్యంగా ఆవ్యక్తి కాడు. అత డేభావాలకి ఆధారభూతు డవుతాడో ఆ భావాలకు లక్ష్యభూతుడుగా అనుకోవాలి.

కావ్యాలు సామాన్యంగా రెండువిధాలు. మొదటిది రసప్రధానమైన కావ్యము. రెండవది భావప్రధానమైన కావ్యము. రసప్రధానమైన కావ్యములో అక్కడక్కడ భావప్రధానమైన భాగాలుండవచ్చు భావప్రధానమైన కావ్యంలో కూడా చాలచోట్ల రససాక్షాత్కారం కావచ్చు. ఇక్కడ భావమంటే ఒక ధర్మమని అర్థం. కావ్యంలో చెప్పబడే భావంకాదు. ఒక ధర్మాన్ని ప్రధానంగా బోధించేందుకు ఒక కావ్యం వ్రాయబడుతుంది. ఆ కావ్యంలో వున్న పాత్రలు

ఒకానొక ధర్మానికి సాంకేతిక పురుషులుగా ఉంటారు. ఈ పేద వాడైన ధర్మారావు సంప్రదాయసిద్ధమైన విద్యాసంస్కృతులయందు అభిమానం కలిగిన ధర్మారావు జమీందారుచేత, తక్కువ సంఘం చేత యెల్లా నిరాదరింపబడ్డాడో యీ కావ్యంలో ప్రధానంగా కని పిస్తూ వుంటుంది. అనగా పాలకవర్గం ధనికులు సంప్రదాయాన్ని, దేశీయపాండిత్యాన్ని, దేశీయమైన సంస్కారాన్ని నిరాదరిస్తున్నారని దీనితాత్పర్యము.

సుబ్బన్నపేట యీ దేశానికంతకీ లక్ష్యభూతమైన గ్రామంగా చెప్పబడింది. అందుకనే ఆ వూరుపేరు సుబ్బన్నపేట. సుబ్రహ్మణ్య శబ్దానికి సుబ్బన్న వికృతి. సుబ్రహ్మణ్యేశ్వరుడు వేయిపడగల స్వామి. వేయి ముఖాలయిన ధర్మానికి చిహ్నం. వేయిముఖాలుగా ధర్మం పరిపాలింపబడ్డ యీదేశమే సుబ్బన్నపేటగా చెప్పబడింది అంతేగాని, యిది ఒక ఊరు కాదు. ఇది ఒక జమీంవారీకాదు ఈసుబ్బన్నపేట మొదలుపెట్టడానికి ఒక ఆవూ ఒక పాము ఆ ఆవుపాలు త్రాగుతూండటం మొదలైన కథఉంది. ఇలాంటి కథలు యీదేశంలో అనేక చోట్ల ఉన్నై. కొంచెం మార్పులతో వుంటవి. అందుచేత దేశంయొక్క స్వరూపం చెప్పటం. ఏమిటయ్యా యీ దేశముయొక్క స్వరూపం అంటే యీ దేశముయొక్క సంస్కారం యొక్క పునాది అది. ఆధిదైవికము అన్న విషయము. అంతేగాని, యిది నిజంగా పామూకాదు, పాము పడగలూ కాదు. ఒకానొక పండితుడు యీ పుస్తకంలో పడగలూలేవు, పామూలేదు అన్నాడట. చమత్కారంగాఅన్నాడు, నిజమే. ఉన్నది ధర్మము, సంప్రదాయము భారతజాతియొక్క సంస్కారము, ఇందులో రంగాజమ్మ క్షత్రియ స్త్రీ. ఆమె రామేశ్వరశాస్త్రియొక్క భార్య. మహా పతివ్రత. రసజ్ఞురాలు జీవితము ననుభవించు వైభవము నెరిగిన మనిషి. ఆమె పేద ధర్మము ననుష్ఠించుచు లోకము ననుభవించిన క్షత్రియులకు చిహ్నము ఆమె చనిపోవుచు రామేశ్వరశాస్త్రినే భావించెను. ఈ దేశమునందు

క్షత్రియులు అనగా రాజ్యమును పాలించెడివారు. వారు కులముచేత క్షత్రియులు కానక్కరలేదు. ఈదేశముయొక్క సంప్రదాయము వేదధర్మమును పాలించుచూ. భావించుచూ పూర్వముండిరని దీని యర్థము. ఊరికే యొక పతివ్రత జీవితకథవలె కన్పించును. ఈ కావ్యమునందు ప్రధానముగా సహస్రముఖమైన వేదధర్మము ప్రతి పాదింపబడెనని తెలిసికోవటం జరిగితే, యీ గ్రంథంలోవున్న తక్కిన సర్వవిషయాలూ యిల్లా సువ్యక్తమౌతవి. ప్రధానంగా పసిరిక ఒకడు కనిపిస్తున్నాడు. ఇతడు మంగమ్మ బిడ్డ. చూస్తే పాముల్లేవుంటాడు. ఈలలువేస్తాడు. గాలిలో తేలిపోతాడు. రామేశ్వర శాస్త్రి చాతుర్వర్ణ్యానికి చిహ్నం. అయితే, పసిరిక వ్యవసాయానికి చిహ్నంకదా. ఐతే, కావ్యంలో యిలాంటి మనిషి వుంటాడాయని ప్రశ్న. కొందరు స్త్రీలకు పాములు కడుపున పుట్టినవని, యిద్దరు తలలపిల్లలు పుట్టారని యిలాంటి విషయాలు ఇంత అధునాతన నాగరకతా కాలంలో కూడా పత్రికలలో పడుతూనేవున్నవి, జరుగు తూనే యున్నవి. అందులో ఆశ్చర్యంలేదుకాని, ప్రధానంగా పసిరిక కృషికిచిహ్నం. అదిఅచ్చమైన పంచభూతముల బహిఃప్రకృతి మీద ఆధారపడి వున్నది. వాన కురవాలి, గాలి వీచాలి, ఎండలు కాయాలి, పంటలుపండాలి, పాములూ, పిట్టలూ యధేచ్ఛగా సంచ రించాలి. ఇది వ్యవసాయం యొక్క స్వరూపం. ఇదంతా ఒక మనుష్యుని ఆకారంగాచేసి, వాణ్ణి పసిరిక అన్నాము. ఇంతేభేదము. ఈ వ్యవసాయము రెండు రకాలు. పండించేపొలం వాన ఆధారంతో పండితే దాన్ని దేవమాతృకలంటారు. అనకట్టుకట్టి కాల్వలు త్రవ్వి పండిస్తే వాటిని అదేవమాతృకలంటారు. భారవి తన కిరాతార్జునీయంలో దుర్యోధనుడు అదేవమాతృకల క్రింద పంటలు పండించి ప్రజలను తన వశం చేసికొన్నాడని వ్రాయబడింది. ఇతరుల రాజ్యం కాజేసిన రాజు ప్రజలను వశం చేసుకొనేందుకు అదేవమాతృకలను వృద్ధి చేస్తాడు. బాహుళ్యం మీద అదే చేస్తాడు.

జనులందరు వానికి వశులవుతారు. ఈశబ్దాలలో దేవుడన్నమాటకు మేఘుడని అర్థం. పల్లవుటూళ్ళ పంటల వారు బోలెడంత విశ్రాంతి కలవాళ్లు. తేలికగా పండుతూవుంటే బోలెడంత విశ్రాంతి వుంటే ధర్మాన్ని పాడుచేస్తారు. మూడు వందల అరవై రోజులు పొలంలో పాటుపడవలసినవాడు రాజకీయ, మత, సాంఘికాశి ప్రాయముల మీదకు దండెత్తేందుకు వాడికి విశ్రాంతియేది? అటు వంటప్పుడు ధర్మం అజ్ఞులచేత పాలింపబడవలసి వస్తుంది. అందుకనే పసిరిక గ్రామాధికారిచేతినవున్న గడియారం, ఫౌంటెను పెన్, చొక్కా మొదలయినవి పెట్టుకొని వెళ్ళేటప్పటికి పాము లతణ్ణి కరచినవి. ఈ రెండు నాగరకతలు అంత భిన్నములు. రెండూ రెండూగా రక్షింపబడితేనే ధర్మం రక్షింపబడుతుంది అని యర్థము. ఒక వృత్తిని మనుష్యుల యొక్క కామక్రోధాలు యెలా పాడుచేస్తాయో దేవదాసిచేత సూచితమైనది. అన్నిసిద్ధాంతాలు మొట్టమొదట మంచివే. మనుష్యుల కామక్రోధాదులచేత కాలము మీద వాటి లక్ష్యాలు చెడతవి. దానికి ప్రథమోదాహరణ దేవదాసి వృత్తి. ఈ అర్థాన్ని చెప్పేందుకు గిరిక సృష్టింపబడ్డది. ఎంత క్రొత్త సిద్ధాంతమైనా అంతే. ప్రజాస్వామికము మంచిదే. ఆచరణలో యెంత దోషభూయిష్టంగా వున్నది. అట్లాగే హిందూ ధర్మమున్నూ, అనాదిలో సర్వజగత్తు యొక్క క్షేమంతో సంప్రతిష్ఠింపబడ్డ ధర్మం. మానవునకు అధికార వాంఛ, స్వార్థము పుట్టుకతో వున్నవి. వాడు సర్వధర్మాన్ని నాశనంచేస్తాడు. స్వార్థ పరులచేత యీ రీతిగా నాశనం చేయబడ్డ ధర్మాన్ని మరికొందరు స్వార్థపరులు అసలా ధర్మం యొక్క మూలస్వరూపమే చెడ్డదియని చెప్పి, తమ స్వార్థానిక ఉపయోగపడే అధర్మాన్ని ధర్మంగా ప్రతిష్ఠిస్తారు. ఇది లోక వృత్తము. ఈ విషయం దేవదాసి కథలోని వ్యంగ్యము.

ఈ రీతిగా యీ కావ్యంలోవున్న బహువిషయాలు స్వజాతికి సంబంధించిన, భారతీయ సంస్కృతికి సంబంధించిన, వేదధర్మము

నకు సంబంధించిన బహువిషయాలల్లో ఉండే గుణాలను చూపించి యెల్లా దుర్వ్యాఖ్యానం చేయబడ్డవో నిరూపించటానికి వ్రాయబడ్డది. అందుకనే కావ్యంచివర "ఆహా! ఏమికాలము ఏమిమార్పు" అని 865వ పేజీలో ప్రారంభింపబడి రుక్మిణమ్మా రావుగారు, కేశవరావుగారు, దేవదాసి, పసిరిక, గణాచారి అందరు పోయినారని వ్రాయబడివున్నది. వారెవరెవ్వరు దేనికి దేనికి చిహ్నములో అక్కడే వ్రాయబడివున్నది. ఆ చివరి రెండుపుటలు చదివినచో వేయిపడగల యంతరార్థము తెలియును. అంతయు సూచనగా విచ్చటనేయున్నది. ఈరీతిగా సహస్రముఖధర్మము నాశనమైనదని ఆహా యింకనేమి మిగిలినది, యేమి మిగిలినది అన్న యావేదన చేత చెప్పబడి చివరకు ధర్మారావు వరుంధతిని చూచి యిట్లన్నాడు: "ఔను, నీవు మిగిలితివి. ఇది నా జాతిశక్తి - నాయదృష్టము" అని. అనగా యీ దేశమునందు సర్వధర్మములు నశించవచ్చునుకాని, దాంపత్యధర్మము పాతివ్రత్యము యెన్ని బిల్లులుపెట్టినను పోదని తాత్పర్యము. వట్టి లౌకికమైనది వట్టి వికారమైనదియైన బుద్ధిగల యొకాయన యీ కావ్యము చదివి యన్నాడుగదా ధర్మారావునకు రెండవ యరుంధతిని పెండ్లి చేయించుటను గూర్చి చివరకు సంకర వివాహము చేయించితివేమి యన్నాడు. కొందరి బుద్ధిలో అది. పెండ్లికానిచో స్త్రీ పురుషులమధ్య వయస్తారతమ్యము ప్రేమక్రింద గొప్పచేయబడి వివాహమన్నచో తప్పుగా పరిగణింపబడుచున్నది. ఇది యాధునికుల నాగరికతా సంపత్తి. ధర్మముయొక్క స్వరూపము తెలియకపోయినచో, నీకావ్యమర్మ మర్థముకాదు.

> యదభిముఖముగఁ జెప్పెరో యల్లదాని
> తదభిముఖముగఁ జూచిన ధర్మమొప్పు
> నపముఖమ్ముగ జూచిన నఖిల దోష
> కలితముగదోచు ధర్మ సంఘాతమెల్ల.

రామా. కల్ప. అయోధ్య. 4-431
[ఆకాశవాణి [మద్రాస్] 7-4-1955]

# విశ్వనాథ ఆత్మకథలో ప్రథమాధ్యాయం

సామాన్యంగా ఆధునికులు ఒక వ్యక్తి యొక్క జీవిత పరిణామం మూడింటిమీద ఆధారపడి ఉంటుందని చెప్తారు. ఒకటి- జన్మ. రెండు- పెంపకం మూడు- పరిస్థితులు. కొందరు యీ మూడు కూడా మనుష్య నిర్మితములని, మనుష్యులు ఇష్టం వచ్చినట్లుగా మార్చుకో వచ్చునని నమ్మకంతో ఉంటారు. పరిస్థితులు ఏ విధంగా మనుష్య నిర్మితములు ఆ విధము మనుష్యుడు చేసినట్లు కనిపిస్తుంది. ఈలోక వ్యవహారం స్థూలంగా చూస్తే మనుష్యుడు చేసినట్లే కనిపిస్తుంది. అది అలాగే ఎందుకు జరగాలి-అని ప్రశ్న వేస్తే మాత్రం దానికి భగవంతుడు, ప్రారబ్ధము, కర్మ-మొదలైన వాటిని విశ్వసించనివాళ్ళ విశ్వసించటం ఎప్పుడూ జరగదు. అలాంటి విశ్వాసం అనేటటువంటి గుణం వాళ్ల రక్తనిష్ఠమై భగవంతుడు వాళ్లని పుట్టించలేదు గనుక. పరిస్థితులు, జన్మ పెంపకము—అన్నీ అన్నీ పరమేశ్వరోద్దిష్టములయ్యే జరుగుతయ్యి. ఇక్కడ నమ్మకము, నమ్మకము లేకపోవటమే ఈ రెండే నాకు కనిపిస్తున్నాయి. అంతకన్నా యింకేమి కనిపించటం లేదు. ఎందుకు చెపుతున్నానంటే అవునో కాదో నేనిప్పుడు ఒక కవి నయ్యాను. జ్ఞాన పీఠం బహుమతి వచ్చింది. మహా పండితులు, మహా భావుకులు, మహా విమర్శకులు, మహా కవితా రహస్యవేత్తలు, అనుకొనేవాళ్ళు, వాళ్ళ ఉద్దేశంలో ఎట్లావున్నా నేనొక గొప్ప కవిగా సామాన్య జన మనుకొంటున్నారు గనుక—ఈ కవిత్వమునకు మూల హేతువేమిటి అని ప్రశ్న సామాన్యంగా అందరిక

పుట్టినా చిన్నప్పుడు, నేను పెంపకము ఇట్లానే దానిలో నేను పొందిన వృద్ధి వీటిని గురించి తెలిసికోవలయునని నేటి వారి ఊహ. దాని వలన ప్రయోజనం నాకు తెలియదు. ఎందుకంటె కావ్యా నందం వేరు. ఈ కావ్యమును గురించిన నాకబు, వ్రాసిన వానిని గురించిన వాకబు, ఆ పరిస్థితులు ఇదంతా కూడా కావ్యానందము నకు సంబంధము లేనివి. బహు విషయములు తెలియుట వలన తెలిసిన వాడవుతాడు తప్ప అనందానుభూతి పొందలేడు. ఆనం దానుభూతి పొందేందుకు వాడి హృదయము, వాని భావుకత పండి ఆ ఆనందము పొందించి అటువంటి వానియొక్క గ్రంథ రచ నాదులను చదవటంచేత, చదివిన వాని యొక్క హృదయము యొక్క పరిపాకము కూడా దానితో సమానమైతే వాడు పొందుతాడు ఆనందము. ఈ వాకబు అంతా పాశ్చాత్య విమర్శతో పుట్టినదని నా ఊహ. కాళిదాసు శకుంతలం మనము మెచ్చుకొనేందుకు కాళి దాసు పుట్టు పూర్వోత్తరాలతో మనకు ఏం అవసరం లేదు. కాని ఈ కాలంలో ఈ పుట్టు పూర్వోత్తరాలు, ఇదే రంధి ప్రధానంగా కనిపిస్తోంది. నా దగ్గరకు వచ్చి ఎవళ్ళయినా, అయ్యా! మీ పూర్వపు కథా మీరు ఎట్లా పెరిగారు—అని అడుగుతారు. నాకు వారి మాటయందు విశ్వాసం లేకపోయినా మొహ మాటానికి చెప్పక తప్పదు.

అసలు ఏమిటయ్యా ఎందుకు మొదలు పెట్టావంటే—

నేను ఇంత మహా ప్రపంచం ఉంటే, ఇంత మహాకాలం ఉంటే, ఇంత కాలంలో ఈ కలియుగంలో 5 వేల సంవత్సరాలు వెళ్ళిపోయిన తరువాత మొన్నటి మన్మథ నామ సంవత్సరంలో అంటే (మొన్నటిది అంటే దాని వెనుకటిది అన్నమాట) ఇప్పుడు నాకు 79 ఏళ్ళు గనుక నేను పుట్టిన సంవత్సరం వెళ్లిపోయిన తరువాత మళ్ళీ. 19 ఏళ్ళు గడిచాయి నాకు. ఆ వెనుకటి మన్మథ

నామ సంవత్సరంలో అందరికి బాగా తెలిసేందుకోసం క్రీ. శ. 1895లో భాద్రపద బహుళ షష్ఠి మంగళవారం నాడు పుట్టాను. పుట్టాను అని నేను అంటున్నానంటే నేను అనే ఒకానొక అభిజ్ఞ అక్కడ ఉన్నదన్న మాట. ఆ పుట్టినప్పటి నుంచి పరమేశ్వరు డెంత ఆయుర్దాయం యిచ్చాడో అంతవరకు ఈ "నేను" అనేటటు వంటి ఈ విశ్వనాథ సత్యనారాయణ వాడుతూ ఉంటాడు. అలాగా అందరూ వాడుతూ ఉంటారు. ఇది ఒక అభిజ్ఞ. ఈ అభిజ్ఞ కలిగిన ఈ విశ్వనాథ సత్యనారాయణ అని తల్లిదండ్రుల చేత పేరు పెట్టించుకోబడిన వీడు ఆ 1895కు సరిపోయేటటువంటి ఆ వెను కటి మన్మథ నామ సంవత్సరం భాద్రపద బహుళషష్ఠి మంగళ వారంనాడు ఎందుకు పుట్టాడు? అనే ప్రశ్న ఉన్నది. ఇది కాలం విషయం చెపుతున్నాను. దేశం చూస్తే యిన్ని దేశములు ఉంటే తెలుగు దేశములోనే, కృష్ణా జిల్లాలోనే, గన్నవరం తాలూకాలోనే ఆ విశ్వనాధ పార్వతి శోభనాద్రులనే వాళ్ళ కడుపునే ఎందుకు పుట్టాడు? ఈ "ఎందుకు" ప్రశ్న ఎవ్వరునూ చెప్పలేరు. దానికి ఒక్కటే సమాధానం. ఎన్ని కృత్రిమములైన వాదములు చేసినా ఎంత పండితులము అనుకొన్నా- నిజంగా ఎంతో వివేకులే వాళ్ళు కూడాను- వాళ్ల వివేకానికి ఈ విశ్వాసానికి సంబంధం ఉండటం లేదు తప్పక. కనుక కాలముచేత దేశముచేత ఈ విశ్వనాథ సత్య నారాయణ అని ఇప్పుడు అనిపించుకొంటున్న జీవునియొక్క జన్మ నియమిత మయినది. భూతకాలం కాదు భవిష్యత్కాలం కాదు. వర్త మాన కాలం. ఆ వర్తమానం నాకు సంబంధించినది. కనుక 80 ఏళ్ల క్రిందటి దేశమే మొ తెలుగు దేశం. ఊరనేది నందమూరు. ఆఊరు కృష్ణ ఒడ్డున లేదు. కృష్ణ నీరు ప్రవహించే కాలువ దగ్గరగా ఉన్న ఊరు. కొన్ని తరముల నుండి ఈ విశ్వనాథవారు అనేవారు ఆ నందమూరులో నివాస ముండి ఆ గ్రామాన్ని వారే నిర్మించారనీ చెపుతారు. ఇతరులని పిలిచి వాళ్లందరికి గ్రామం కట్టేందుకై కొంత

మందిని తీసుకువచ్చి అక్కడ వాళ్లని ఏర్పరచి వాళ్లు ఆ వూరికి పెత్తందారీతనం వహిస్తూ చేస్తూ ఉంటే వీళ్లకి కొంత బాగా పొలం ఉన్నదన్నమాట. ఆపొలం మా నాయనగారి నాటికి కూడా ఉంది. అంతే కాకుండా మా నాయనగారు తెలుగులో భారత, భాగవత, రామాయణాదులు చక్కగా చదువుకొన్నారు. అంతేకాకుండా ఆ వూరికి పెత్తందారవటం మూలంగా వ్యావహారికంగానే కాకుండా, ఆ వూళ్లో ఉన్న జనానికి ఉన్నత సంస్కారానికి హేతువులయిన ఈ భారత, భాగవత, రామాయణాలతో ఉన్న విషయాలు జనసామాన్యానికి తెలియ చేయడమనేది తన బాధ్యత అనుకొనేవాడు. అనుకొని రోజు పురాణం చెపుతూ ఉండేవాడు. ఆయన చెపుతుంటే నేను కుర్రవాడిని కదా! కనుక నాకు 5 ఏళ్లప్పటి నుంచో ఆరేళ్లప్పటి నుంచో పోయి మా నాయనగారు ఈ భారత భాగవత రామాయణాలు పురాణాలు చెపుతుంటే ప్రక్కన కూర్చుని వినటం జరిగింది. విని యింటికి వచ్చి మా అమ్మతో వాళ్లతో ఆ కథలు చెపుతూ ఉండేవాడ్నట. అనగా 5, 6 ఏండ్లప్పటికే ఒకానొక "తెలివి" అనేది (ఇది తెలివయితే) ఉందన్నమాట— ఈ విశ్వనాథ సత్యనారాయణనే వాడికి. ఈ తెలివి విశ్వనాథ సత్యనారాయణ ఎక్కడి నుంచి తెచ్చుకున్నాడు. ఆలోచించండి. ఆ వూళ్లో పుట్టినటువంటి అందరు పిల్లలకి ఎందుకు లేదు. ఆలోచించండి. ఈ మోస్తరయిన తెలివితో పెరిగాడు ఈ విశ్వనాథ సత్యనారాయణ. కనుక ఈ విశ్వనాథ సత్యనారాయణ - అనేవాడిని ఈయన తల్లిదండ్రులు బాగా సంపన్నులు కనుక ఆస్తిపరులు గనుక ఇతనికి వేరే ఇంగ్లీషు చదువులో పెడదామని వారికి "వూహ" లేదు కనుక ఉన్న పొలం చేసుకొంటే బ్రతుకుతాడులే అనేటటువంటి తాత్పర్యమే వాళ్లకి ఉంది కనుక 5వ ఏటనే నన్ను స్కూలులో ప్రవేశపెడితే నాకు యించుమించుగా 10 ఏండ్లు వచ్చేటప్పటికి భారత, భాగవత రామాయణాల్లో నాకు తెలియని కథ ఉండేది కాదు. పైగా మా వూళ్లో

తీసుకొచ్చి వీధి నాటకాలు, పగటివేషాలు, హరికథలు, పురాణాలు ఉండేవి కనుక వాటిల్లో ఉన్న సర్వ కథలు నాకు ఇంచుమించుగా కథలే అయినవి. నాకు పది ఏండ్లు రాకమునుపే, ఇంకొక లక్షణం ఉంది. నేను చిన్నప్పుడే పద్యంచదివేవాడ్ని. రాగచ్ఛాయతో చదివే వాడ్ని. ఈరాగచ్ఛాయ ఎందుకు వచ్చింది? గొంతుకతో కొందరు నోరు విప్పితే బాగుండేదే, కనుక ఈ రాగచ్ఛాయ గొంతుకలో ఉండ డానికి కూడా వెనక ఏదో హేతువుండాలి తప్ప. విశ్వనాధ సత్య నారాయణ తనంతట తాను తీసుకొన్నది కాదే. (వదిలి పెడదాం) ఆ రాగచ్ఛాయతో పద్యం చదవడం మూలంగా పది ఏళ్ళ లోపు గానే, నేను — భారత, భాగవత రామాయణాలు చూచి చదవ గలిగిన లక్షణం ఒకటి నాకు ఏర్పడటం మూలంగా బంధువుల్లో పెద్దవారు నాచేత పుస్తకాలు చదివింపుకొంటూ ఉండేవాళ్ళు. మా నాయనగారికి నేను ఏదో పండితుడ్ని కావాలని ఉండేది — ఏముండేదో తెలియదు, మా వూళ్ళో, ఉండేటువంటి ఆయన ఏదో సంవత్సరానికి ఓ పుట్టిన్నరో — రెండు పుట్లో యిచ్చి మా బంధువు అయిన వారిని తీసుకువచ్చి నాకు అక్షరాభ్యాసం చేసి అక్కడ వీధి బడి పెట్టించి ఆ వీధి బడిలో నన్ను ప్రవేశ పెట్టించాడు మా నాయనగారు. నా చదువు ఆ వీధిబడిలో అయిపోతే ఇంక ఇతర వూళ్ళు పంపిస్తూ వచ్చాడు, చివరికి "వెన్నూతల" అనే ఒక గ్రామం ఉంది. ఆ వూళ్లో ఉన్న మునసబుగారి కొడుక్కి మా అక్కగారినిచ్చాం. ఆ వూళ్లో ఆ వూరి ప్రక్కన "నాగవరప్పాడ" ని గ్రామం ఉన్నది. ఆ వూళ్లో ఒక బంధువు ఉన్నాడు, ఆయన వెన్నూతలలో వీధిబడే పెడుతూ ఉండేవాడు. ఆ వూళ్లో నన్ను రెండేళ్ళుంచి నాకు ఇంగ్లీషు, తెలుగు చెప్పటం కోసం ప్రవేశ పెట్టారు మా నాయనగారు. నేను మాఅక్కగారింట్లో భోంచేస్తూ ఉండేవాడిని. నాకు పదకొండేళ్ళు కూడా రాలేదు. అప్పుడు ఆయన ఏంచేశాడంటే — ఆయన పేరు గుడిపూడి వీరభద్రయ్యగారని

మేష్టరు — ఆయనేం చేశాడంటే నాకు మనుచరిత్రం పాఠం చెప్పాడు, అవతారిక అంతా చెప్పాడు, ఇంతేకాకుండా ఏంచేశాడంటే గణములు, యతులు, ప్రాసలు, ఛందస్సు వీటిని గురించి చెప్పాడు. కనుక నాకు బాగా 11 ఏళ్ళు రాకముందే ఈ ఛందస్సు, ఈగణాలు యివ్వీ మనుచరిత్రలో ఉన్న పద్యాలు కొన్ని కంఠస్థం రావటం అదివరకే చదువుకున్నటువంటి శతకము లన్నిటిలో ఉన్న పద్యాలు చాలా కంఠతః రావటం, భారత, భాగవత, రామాయణాలలో ఉన్న ఆపద్యాలు చదవటం, నాటకములు చూచి ఒకానొక ఆనందం పొందటం ఒకానొక పద్ధతిగా నా చిన్నతనంలోనే నా బుద్ధి ఒకానొక పాకంలో పడ్డదన్నమాట. అప్పుడేం జరిగిందంటే—మా నాయన గారు చాలా గొప్ప దాత. అదంతా అప్రస్తుతం. నాకు ఇంకొక ఏడాది జరిగేటప్పటికి మన ఆస్తి నిలవదు. ఈ పిల్లవాడు ఏమయిపోతాడు అనే భయం పుట్టి ఆయనకి ఇతన్ని ఇంగ్లీషులో ప్రవేశపెడితే ఆ ఇంగ్లీషు ఏదో మెట్రిక్యులేషను అదీ ఉంటాయి ప్యాసయి ఏదన్నా ఉద్యోగం చేసుకుని బతుకుతాడనే వూహ పుట్టింది ఆయనకి. అప్పుడు నన్ను బందరు అనే వూరు తీసుకు వెళ్ళాడు. ఆ పట్టణంలో ఎవరో బంధువుంటే వాళ్ళ యింట్లో నన్ను ప్రవేశపెట్టి నాకు 11, 12 ఏళ్ళు — 12 ఏడు కూడా వచ్చిందేమో జ్ఞాపకం లేదు. నన్ను 1 ఫారంలో ప్రవేశపెట్టాడు జరిగిన దేమిటంటే ఆ బందరు హిందూ హైస్కూలులో నేను 1 ఫారంలో ఉండగా ఆ హైస్కూలులోనే తిరుపతి వెంకటేశ్వర కవులల్లో శ్రీ చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు ఉన్నారు. జగత్ప్రసిద్ధులైన మద్గురువులు. వారు తెలుగు మాష్టరుగా ఉండేవారు. వారు 4 ఫారం 5 ఫారం స్కూలు ఫైనలుకు చెప్పేవారు తప్ప 1 ఫారం 2 ఫారం 3 ఫారంకు తెలుగు చెప్పేవారు కాదు. కాని వారు ఆ స్కూలులో ఉన్నారన్న విషయం వారు మహా కవులన్న విషయం నాకు బందరు వెళ్లకముందు మా వూళ్లో

ఉన్నప్పుడు తెలుసు. ఎందుచేతనంటే కొరివి వెంకయ్యగారని ఒక కమ్మవారు, ఆయన మా వూళ్లో వీధిబడి చెపుతూ ఉండేవారు. ఆయనకి సాహిత్యంలో కొంత పరిచయం ఉన్నది. ఆయన నాకు ఈ తిరుపతి వేంకటేశ్వర కవులను గురించి ఇది వరకే చెప్పాడు. అందుచేత ఆ స్కూలులో తిరుపతి వేంకటేశ్వర కవులలో చెళ్లపిళ్ళ వేంకటశాస్త్రిగారు ఉన్నారు అనే విషయం నాకు తెలుసు. వారిని చూద్దామనేటటువంటి అభిలాష ఉన్నది. సామాన్యంగా కొందరికి చిన్నప్పుడే పన్నెండు పదమూడేళ్లు వచ్చేటప్పటికి బాగా లౌకిక విషయములు తెలుస్తాయి. కాని నాకు-అదేమిటో 18 - 20 ఏళ్లు వచ్చే వరకు తెలిసేవికావు. చదువు-ఈ గోల అందులో ఏమయినా తెలివితేటలుగా ఉండటం- ఇవే తెలుసు తప్ప లోకం తెలిసేదికాదు. కనక నేను 1 ఫారం 2 ఫారం 3 ఫారం- మూడు ఫారాలు కూడా ఆ హిందూ హైస్కూలులో చదువుతోంటే అక్కడే శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు ఉంటే వారెవరో తెలుసుకోలేనంత తెలివిగల వాణ్ణన్నమాట. నేను లౌకికంగా 4 ఫారంలోకి వచ్చినప్పుడు వారు మా తెలుగు క్లాసు తీసుకొన్నప్పుడు వీరు చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రులు గారనే గుర్తు కలిగింది. అంతకు పూర్వం ఒక చమత్కారం కూడా జరిగింది. అది చెప్పి ఈ ప్రథమోపన్యాసం మానేస్తా.

## గురువుగారి తీర్పు

ఏమిటంటే — మా నాయనగారు నన్ను పన్నెండో ఏడో ఎప్పుడో తీసుకెళ్లి ఫస్టు ఫారంలో ప్రవేశపెట్టారు కదా। ఫస్టు ఫారంలో ప్రవేశపెట్టడం అంటే నాకు వచ్చింది తెలుగు, ఏదో కొంత ఇంగ్లీషే తప్ప, హిస్టరీ, జాగ్రఫీ, లెక్కలు ఇవ్వన్నీ వచ్చునో రాదో నాకు తెలియదు. మా నాయనగారికి తెలియదు. మరింకోటి జరిగింది. ఇప్పుడు సామాన్యంగా జూన్,

జూలై లలో కాలేజీలు, స్కూళ్లు, మొదలెడుతారు. మార్చి ఏప్రియల్‌తో అయిపోతాయి. ఆ రోజుల్లో డిసెంబరులో మొదలెట్టి స్కూళ్లు మళ్లీ డిసెంబరులో పరీక్షలుండేవి. అందుచేత ఏమయిందంటే — నన్ను తీసుకెళ్లి అక్టోబరులోనో ఎప్పుడో ప్రవేశ పెట్టారు మానాయనగారు. అంటే ఫస్టుఫారంలో ప్రవేశపెడితే-ఇహను పెద్ద పరీక్షలు ఎప్పుడూ- నెలా నెలన్నరలో ఉన్నాయి- నెలన్నరలో ఈ ఫస్టుఫారం కోర్సంతా చదవాలి గదా నేను. అంచేత ఒక ట్యూటర్ని పెట్టారు. ఈ నెలన్నరలో నన్ను ప్యాస్ చేయించాలన్న మాట ఆయన. ప్యాస్ అయినాను. ఎట్లాగూ ట్యూటరుగదా అని 2వ ఫారంలో ఆయన చెపుతూ ఉండేవాడు. నాకు చెప్పక్కరలేదు తెలుగు. కాని చెపుతూ ఉండేవాడు. టెక్స్టు బుక్కులున్నాయిగా. ఇలా ఉండగా నాకు, ఈ గణములు, ఈ ఛందస్సు కొంత తెలుసునని, ఈ భారత, భాగవతాది కథలన్నీ బాగా తెలుసుననీ, మను చరిత్రలో ఇంచుమించుగా 40, 50 పద్యాలు కంఠతా వచ్చుననీ అర్థ తాత్పర్యములతో నేను చెప్పగలుగుతానని ఆ ట్యూటరుకు తెలిసి నా దగ్గర మనుచరిత్ర మనే టటువంటి గ్రంథముందని తెలిసి అది ఆయన తీసికొన్నాడు. తీసుకొని రెండు మూడేళ్ళు ఇవ్వలేదు. నేను 4 ఫారంలోకి వచ్చినాక ఆయన ట్యూషన్ మానేశాను ఇంకా 4 ఫారంలోకి రాలా. 3వ ఫారంలోనో, 2వ ఫారంలోనో ఉంటుండగానే ట్యూషను మానేశాం. అపుస్తకం యిమ్మని అడిగితే ఆయన యివ్వలా. ఆయన ఏం చెప్పాడంటే—ఆయన ట్యూషను ఫీజు ఇంకా ఇవ్వాలి ఈ అబ్బాయి. అందుకు బిగపట్టానన్నాడు. అంటే అప్పుడు నేను వెళ్ళి హెడ్ మాస్టరుతో రిపోర్టు చేశా. అయ్యా నా పుస్తకం తీసి కొన్నారు వారు. అంటే ఆయన వచ్చి ట్యూషన్ ఫీజు యివ్వాలండి దానికింద బిగపట్టానన్నాడు. నేను చెప్పాగదా - అది నిజం కాదండి అన్నా. సరే — ఎట్లాగయితేనే ఈ కేసుని తీర్మానించమని యిద్దరు ముగ్గురు మాస్టర్లను వేశారు మా హెడ్ మాస్టారుగారు.

అందులో ఒకరు మా గురువుగారయిన శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారు. ఆయన నన్ను—నేను 2వ ఫారం చదువుకున్న వాడివిగదా? నీకు మనుచరిత్ర ఎందుకురా అన్నాడు. అంటే 1, 2 పారంలు చదువుకున్న వాడికి మనుచరిత్ర ముక్కు ముఖం తెలియదుగా ఈ స్కూళ్లల్లో. అందుకని అంటే నాకు వచ్చునన్నా. అప్పచెప్ప మన్నారు. నాకు బాగాజ్ఞాపకం. అందులో ఒక ప్రగ్గరావృత్తం వుంది. "ఎకరాలన్ మండువా సాహిణము"లని అనుకుంటాను మొదలది. అది నేను చదివి అర్థం చెప్పాను. అయితే ఆయన తీర్మానం చెప్పాడు. వాడు ఆ పద్యం చదివి పద్యానికి అర్థం తాత్పర్యములు చెప్పాడు- గనుక వాడి మను చరిత్ర వాడికి యిచ్చేసెయ్యమన్నాడు, ఎందుకంటె ఆయన కూడా—ఈట్యూటరు కూడా—ఆ హైస్కూల్ లోనే మెట్రిక్యులేషన్ చదువుతూ ఉండేవాడు. అప్పటికి యింకా యస్. యస్. యల్. సి. రాలా. మెట్రిక్యులేషన్ చదవటమంటే పదిసార్లు గూడా పరీక్షకు వెళ్ళినా ప్యాసయ్యే వారు కారు. పిల్లల తండ్రిలు మెట్రిక్యులేషన్ చదువుతూ ఉండేవారు ఆరోజుల్లో. అన్ని సబ్జక్టు ఒక్కసారి ప్యాస్ కావాలి. అందుకనే పూర్వం మెట్రిక్యులేషన్ ప్యాస్ అయిన వాళ్ళు పెద్ద పెద్ద పండితులుగా ఉండేవారు. ఇప్పుడు సరే ఎం. ఏ. ప్యాసయినా అట్లా ఉంచండి. ఆయనా నాకు నా మనుచరిత్ర యివ్వలా. అదికాదు ప్రధానం. నా తెలివి ఎటువంటిదంటె—ఈ తీర్మానం చేసినటువంటి ఆయన నాకు గురువులైన శ్రీ చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారనే గుర్తు గూడా

---

విజయవాడ ఆకాశవాణిలో పని చేస్తూవున్న శ్రీ పన్నాల సుబ్రహ్మణ్యభట్టు పట్టుబట్టి విశ్వనాథతో ఆత్మకథ చెప్పించే ప్రయత్నం రెండు మూడు సంవత్సరాలకు పూర్వం చేశారు. ఆయనతో మొదటి అధ్యాయం చెప్పించి ఉప్‌రికార్డు చేశారు. కాని అంతవరకే ప్రయత్నం జరిగింది.

నాకులేదు. నేను 4వ ఫారంలోకి వచ్చిన తర్వాత గురువుగారిని చూచిన తర్వాత అప్పుడు వారు చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారని నాకు తెలిసింది. కాని అప్పటివరకు ఏదో గిలుకుతూనే ఉండేవాణ్ణి ఇది ప్రథమాధ్యాయం.

[ ఆంధ్రప్రభ జనవరి 14, 1977 ]

# నేను - నా రచనా స్వరూపం

పూర్వకవులు ఎన్నిపోకడలుపోయారో నేనూ అన్నిపోకడలు పోయాను. ఏదైనా అంతర్దృష్టిఉంటేనేగాని అర్థంకాదు. వ్రాసేవాడు ఎవరికీ అర్థం కాకూడదని వ్రాయడు. పూర్వకావ్యాలలో కొన్ని ఘట్టాలు మాత్రమే అందరికీ అందుబాటులో ఉన్నాయి. ఈ కావ్యంలో అలాకాదు. ఒక విశిష్టమైన శిల్పమార్గంలో రచన చేస్తున్నాను. మన మనోవృత్తులను బట్టి మన అభిరుచులుంటవి. పూర్వ కావ్య సాహితీ పరిచయాన్ని బట్టి నాగరికతా ప్రభావాన్ని బట్టి, సంస్కృతీ సంప్రదాయాన్ని బట్టి, తమకుగల సంస్కారాన్ని బట్టి కావ్యగతశోభ వారి వారి కవగత మౌతుంది. నేను వాల్మీకి రామాయణానికి భాష్యం వ్రాశాను నా రామాయణం అనువాదంకాదు.

నా తరువాత మళ్ళీ కొన్ని వందల ఎండ్లకుగాని ఇట్లా వ్రాసే వాడు పుట్టడు. బహుప్రయత్నం చేసి, నా జీవితానుభవాలను, సర్వ స్వాన్ని పిండి రమ్యమైన కల్పనలు చేశాను. అనంతమైన పోకడలు పోయాను. శ్రీ రామచంద్రుని చరణాలపై సర్వస్వమూ అర్పించాను అయినా ఇలా నేనువ్రాశానా? పరమేశ్వరుడల్లా నా చేత వ్రాయించాడు

వ్రాయరా అంటే వ్రాశాను. మానేయరా అంటే మానేశాను. విశ్వసిస్తే విశ్వసించండి. లేకపోతే లేదు. ఇది అనువాదం కాదని చెప్పాను. వాల్మీకి రెండు చోట్ల శరద్వసంత వర్ణనలు చేశాడు. అవి చాల లోకోత్తరములైనవి. వానిని కూడ వదలి వేశాను. వాల్మీకి కాళిదాసుల భావాలు అక్కడ కూడ కన్పిస్తవి. పూర్వ సంస్కృత సాహితిలో నాకంత ప్రగాఢ పరిచయముంది కాబట్టి- ఆ లోతు పాతులు నాకు తెలుసు. రామకథ అందరికీ తెలుసు- ఎవరూ వ్రాయనక్కరలేదు. ఒకవేళ వ్రాస్తే ఏదో ఒక వైలక్షణ్యాన్ని చూపగలిగితేనే వ్రాయాలి. అందుకే నేను వ్రాశాను.

"పదియు బిగించిన మొగముల" అన్న పద్యం ఉన్నది. ఈ పద్యంలో "అది నిశ్చయమ్ముగ చేసితి" అన్న రావణుని మాటలు వినగానే మారీచునికి కలిగిన ఊహ భావిలో రావణ కంఠదళనాన్ని సూచిస్తున్నది. ఈ విధంగా ప్రతి పద్యంలో ఏదో ఒక రచనా వైశిష్ట్యాన్ని చూపిస్తూ వ్రాశాను. తెలుగు సాహిత్యంలోని బిగి తెలిస్తే నాకావ్యశోభ తెలుస్తుంది. కొన్నిచోట్ల సమాస రచనచేస్తాను. పొడిపొడిగా వ్రాస్తాను. మృదులంగా వ్రాస్తాను. సందర్భౌచిత్యాన్ని బట్టి పాత్రగతౌచిత్యాన్నిబట్టి, అక్కడి కథాగతమైన మనః ప్రవృత్తులను బట్టి రచన ఉంటుంది. కావ్యశిల్ప రహస్యమే యిది. రచనాశిల్ప మెరుగని కవి కవికాడు. మన మహా కవులంతా ఇలాగే చేశారు.

"ఒక్కొంబొక్కడు లేవి" అన్న పద్యంలో "దిక్కుంభీంద్ర కపోల పాటన కళా దీర్ఘోరు బాహుండ" అనే సమాసం రావణుడు తను చెప్పుకొనే గొప్పను స్ఫురింపజేస్తున్నది. ఇలా పద్యం వ్రాయడం చాల కష్టం. కన్నులకు కట్టినట్లు భావచిత్రణ ఇవ్వాలి.

"తానై చూచిన ఏది కల్గునో హృదంతః ప్రీతి" అన్న పద్యంలో అలంకారశాస్త్ర మంతా చెప్పాను.

నేను కొన్ని పుస్తకాలు వ్రాశాను. వ్రాస్తున్నాను. ఈ రోజులలో సాహిత్య విమర్శ చేయనివాడున్నట్లు లేదు. వారికి తగ్గట్లు కొన్ని పత్రికలు కూడా ఉన్నవి. పేజీలు నింపడం, ప్రధానంగా ఎట్లా అమ్ముడు పోతాయా? అన్న దృష్టి తప్ప కొన్ని సిద్ధాంతాలు ఉన్నట్లు కన్పించడం లేదు. ఇతర దేశాలలో ఈ స్థితి ఉన్నట్లు కన్పించదు. పత్రిక పెడితే వారికి కొన్ని సిద్ధాంతాలు, కట్టుబాట్లు ఉంటవి. నేను 40,45 సంవత్సరాల నుండి చూస్తున్నాను. ఈ పత్రికలలో మనదేశంలో గొప్ప నాటకం లేదనీ, గొప్ప నవల లేదనీ, గొప్ప కవే లేడనీ ప్రతి తలకు మాసినవాడూ అదే పనిగా వ్రాస్తున్నాడు. ఇది సరియైన విమర్శకాదు. దీనిని 'ప్రొఫెషనల్ క్రిటిసిజం' అంటారు. వీరికి విమర్శ ఒక వ్యాపారం.

అసలు నవల అంటే ఏమిటి? దీనిని నిర్వచించడం కష్టం. గొప్ప నవలలెప్పుడూ ఒక దానిని పోలి ఇంకొకటి ఉండవు. ఒక విలక్షణమైన శక్తి కలవాడు వ్రాసిన నవల, అంతకు ముందున్న నవల ఉన్నట్లు ఉండదు. అన్ని గొప్ప నవలలూ ఒక్కలాగు ఎప్పుడూ ఉండవు. పుస్తకంలో అచ్చంగా మనం చూసే వాస్తవికత వుండదు. నేను ఎన్నో రకరకాల శిల్ప మార్గాలలో వ్రాశాను. ఒకటి వ్రాసినట్లు ఇంకొకటి వ్రాయిలేదు. విమర్శ రెండు విధాలుగా ఉంటుంది. 'రేషనల్ క్రిటిసిజం'అనీ, 'సైంటిఫిక్ క్రిటిసిజం'అనీ. మన దేశంలో రెండవ రకమైన విమర్శకు ఎక్కువ ప్రాధాన్యం ఉన్నది.

కాని ప్రస్తుతం సైంటిఫిక్ క్రిటిసిజం లోపించింది.

"ఈయన రచనలు చదివితే కోపం వస్తుంది" అని అంటాడు ఒకడు. ఇది విమర్శకాదు. తన అనుభవాన్ని తన అభిప్రాయాలకు అనుగుణంగా మలచుకొని లోకంపై రుద్దడం.

సాహిత్యం గాఢమైన శీలం కలది, అర్థం చేసికోడానికి తగినంత సంస్కారబలం ఉండాలి. ఫ్రాన్సులో విప్లవం వచ్చింది. కొంత మంది కవుల రచనలు దానికి దోహదమైనవి. ఆ భ్రాంతియే ఇప్పుడు మనదేశంలో ఉన్నది. మనదేశంలో వచ్చినా విప్లవంరాదు. ఏది వ్రాసినా దానిని స్వరూప జ్ఞానం తెలిసికొని వ్రాయాలి. వేయిపడగలలో ప్లాటులేదని కొందరు అంటారు. అసలు ప్లాటు ఏమిటి? ఏ రెండు మూడు ఇంగ్లీషు పుస్తకాలు చదువుకొని అలా తక్కిన గ్రంథాలన్నీ ఉండాలనుకోవడం పరిణతమైన సాహిత్యజ్ఞానం లేనివాడు చేసేపని"

"నేను మానవ ప్రవృత్తి నామూలాగ్రమూ పరిశీలించి తెలిసికొని స్టడీచేసి వ్రాశాను. మీరు నమ్మండి నమ్మకపోండి. నేను కనీసం ఇరువదేండ్లు వ్రాసిన ఎన్నో రచనలు తగులబెట్టాను. రోజూ పది పద్యాలు వ్రాయంది తోచేదికాదు. అలా ఎందుకు చేశానంటే రామాయణం వ్రాయాలి కాబట్టి. పద్యరచనా శిల్పంపై ప్రభుత్వం సంపాదించాలి కాబట్టి. భావనలో విస్పష్టతరావాలి కాబట్టి. నాకు గ్రంథ రచన అంటే ఏమిటో తెలుసు. సగం విద్రలో లేపి ఒక నవల డిక్టేటు చేయమంటే చేయగలను. నేనేది వ్రాసినా తెలిసి వ్రాస్తా నేను "Conscious artist"ను కాబట్టి.

నేను Inspired Fool ను కాదు. నేను Inspired wise-Man ను. లోకాతీతమైన విషయాలను ప్రవేశపెడతాను. అవి లోకంలో జరుగకపోవు. జరుగుతూనే ఉంటవి. వార్తలు చదివితే తెలుస్తుంది.

నా కవిత్వంలో సమాసాలు ఉంటవని కొందరి విమర్శ-ఒక్క సమాసం లేకుండా శశిదూతం వ్రాశాను. అది ఎంతమందికీ తెలిసినది? పద్యం అర్థం కావడానికి మంచి ఊహాశక్తి కావాలి. శబ్దం తెలియక

పోతే డిక్షనరీ చూచుకోవచ్చు. పరమసుకుమారమైన రచన "శ్రీ కుమారాభ్యుదయం" మృదువుగా వ్రాయాలనే వ్రాశాను. "ఋతు సంహారం" వ్రాశాను. అచ్చంగా తెలుగు ఋతువులను వర్ణించాను. "ఈ గ్రంథాన్ని ఉమర్ ఖయాంకి మల్లెనే బొమ్మలువేసి పెట్టుకో తగినదని" అన్నారు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. ఝాన్సీలక్ష్మీబాయి వ్రాశాను. ప్రతి ఆశ్వాసానికి ఆద్యంతముల యందు కాలవర్ణన చేశాను. కొంద రిదిఎందుకని అన్నారు. ఇది ఆలోచించి చేశాను. ఝాన్సీలక్ష్మీబాయి దేశస్వాతంత్ర్యానికై పోరాడిన వీరవనిత. ఆమె మరణించింది. అసలు కథ ఇది. ఇది కావ్యంగా వ్రాయకూడదు. అలంకారశాస్త్రం ఒప్పుకోదు – దుఃఖాంతం గనుక – మరి కావ్యం వ్రాయాలి. దేశభక్తిగలవాణ్ణి గనుక. ఆమె చేసిన మహాప్రయత్నం విఫలమైనది. దీనికి కారణం కాలము. కాలము పరమేశ్వర స్వరూపము. పరమేశ్వరుణ్ణి నిందించాలి. ఇలా జరిగినందుకు – అంతకు తప్ప చేసేదేమీలేదు. అందువలన ఆకథ కనుగుణంగా కాలవర్ణన చేశాను.

నేను రామాయణం వ్రాయకుండానే నా యితర రచనలతో బ్రతికినంతకాలము రాజ్యం చేయవచ్చు.

[ వార్తాంశం—ఆంధ్రపత్రిక—బుధవారం నవంబరు 2, 1960 ]

---

# "పల్లెల శోభ తెలియని వారికి నా కావ్య సంపద అర్థం కాదు"

నాకు తెలిసినంత వరకూ తెలుగు పలుకుబడిని ఎరిగివున్న రచయితలు డజనుమంది కంటె లేరు. నా నవలలను ప్రజలు విరగ పడి చదవడం నా తెలుగు భాష కోసమూ, పలుకుబడి కోసమే. పల్లెటూరి జీవితంలో శోభ తెలియని వానికి నా కావ్య సంపద తెలియదు.

పది రోజుల క్రిందట వరంగల్‌లో, 20 రోజుల క్రిందట హైదాబాద్‌లోనూ నా రామాయణ కల్పవృక్ష సభలే జరిగాయి. ఇప్పుడు ఇక్కడ కూడా అల్లాటి సభే ఏర్పాటు చేశారు. దీనికి కారణం అక్కడక్కడ కొందరునాగ్రంథములోవిపరీతార్థాలుతీయడానికి చేసే ప్రయత్నం కావచ్చు. కాని ఆ ప్రయత్నాలు బుద్ధి పూర్వకంగా జరుగుతున్నాయి. విషయాన్ని తెలుసుకోవాలని వారికి లేదు. అలా ఉంటే, వారికి తెలియచెప్పే పండితులెప్పుడూ సన్నిహితంగానే ఉంటారు. అందరికీ కవిత్వం తెలియాలనే వాళ్ళు నా కవిత్వం చదవక్కర్లేదు. పూర్వ కవులను ఏ అనురాగ విశేషంతో అర్థం చేసుకుంటున్నారో, ఆ మార్గాన అర్థం చేసుకొనగలిగిన వారికి నా కవిత్వం ఎప్పుడూ అందుబాటులోనే ఉంటుంది. నా యీ గ్రంథానికి ఏ విశ్వనాథ రామాయణమనో పేరు పెట్టక "కల్పవృక్షము" అనడానికి మొదటి కారణం పూర్వ కవుల ఏ మార్గాన్నయినా సరే, ఇందులో అంది పుచ్చుకోవచ్చునన్నదే. పుస్తకం మూసి వేసి నాగ్రంథంలో ఏ పద్యమైనా ఇది విశ్వనాథది అని చెప్పకుండా

చదివితే, ఒక నన్నయ, తిక్కన, శ్రీనాధుడు, రామకృష్ణుడు – ఇలా ప్రాచీనులవా అని అనిపించేటట్టు ఉండడం వైశిష్ట్యం. అయితే నాకు ప్రత్యేకమైన శైలి లేదని అర్థం కాదు. నా ముద్ర ప్రతి అక్షరంలోనూ అనుస్యూతంగా ఉంటూనే ఉంటుంది.

తెనాలిరామకృష్ణుడు వ్రాసిన పద్యం ఆ కాలంలో కొత్తదే. కాని కాలం గడచిన కొద్దీ అది గొప్పదే అయింది. అలాగే ఒక ప్రత్యేకతను, ఒక వ్యక్తిత్వాన్ని పట్టుకోవడం అందరికీ సాధ్యం అయ్యే పని కాదు. ఒకప్పుడు కొంతకాలంకూడా గడవవలసి ఉంటుంది. సంస్కృత కావ్యంవలె ఆంధ్ర కావ్యంకూడా ప్రధానంగా పద్యాశ్రయమైనది. అట్లాగని పాశ్చాత్యులవలె ఒకే పోతపద్ధతి కాదు. ఆ పోత మనకు 'ద్విపద' ఛందస్సులో మాత్రమే ఉన్నది. దానిని కొద్ది మందే ఆశ్రయించారు. ఎక్కువ మంది ఆశ్రయించక పోవడానికి కారణం పరిణాహ లక్షణం లేకపోవడమే. మొదలు, మధ్య ముగింపులకు బలమైన వూత యిచ్చే లక్షణం ఆ ఛందస్సులో మృగ్యం. అన్వయంలో చూపింపదగిన ధ్వని విశేషాలు కాని, శబ్ద గ్రథన కౌశలం కాని, భావపుష్టి కాని, యతి అదుకుటలోని విచ్ఛిత్తి విశేషం కాని అందులో చూపడం సాధ్యం కాదు. మానవులందరూ భిన్నభిన్నంగా ఉన్నా కొన్ని సామాన్య ప్రమాణాలతో విభాగం ఎల్లా చేసుకుంటామో, మనోవికారాలు ఎన్నిఉన్నా కొన్నిగుణాలనే ఆశ్రయించి ఎల్లా పేర్కొంటామో, చందస్సులనేక విధాలుగాఉన్నా కొన్ని ఛందస్సులనే ఆశ్రయించి కావ్య నిర్మాణం చేయాలి. ఈ రహస్యం పూర్వ కవులందరకూ తెలుసు. "పాంచాలీకబరీ వికర్షణ మహాపాపక్షయాయుష్కులన్" అనే పద్యంలో దీర్ఘాక్షరాలూ, తాలవ్యాలూ, కొన్ని పరుషాలూ వీటి సంయోజనంవల్ల ఒక విశేషాన్ని కవి దానిలో గుంఫితం చేశాడు. మేఘ గంభీర నాదం కలవాడు స్పష్టమైన తాలవ్యదంత్యోచ్చారణతో పద్యం చదివితే అర్థం దానంతట అదే సాక్షాత్కరిస్తుంది. ఈ విధంగా అనేక పద్ధతులతో

న్న పూర్వమహాకవుల రచనా విశేషాలను తీసికొని వర్ణముల సంయోజనంలో ఉండే శక్తిని గమనించి నేను కావ్య రచన చేశాను. పూర్వ కవులలో ఒక్కొక్కరిదొక విశిష్టమైన మార్గం. వసుచరిత్ర వంటిది మనుచరిత్ర కాదు. దాని వంటిది సరస భూపాలీయం కాదు. అల్లాగే మిగిలినవీ - ప్రతి మహాకవి తన జీవితము నందు ప్రతిబింబించిన మాతృభాషావాఙ్మయ స్వరూపాన్ని అవగతం చేసుకొని తన జీవసంపుటి కనుకూలించిన అక్షర సంయోజనం చేత ఆ పద్ధతిలో తన వాగ్వైఖరిని వెల్లడిస్తాడు.... "తెలుంగా! నీకు దీర్ఘాయువౌ" అను పాదంలో యతి స్థానంలో ఒక విచ్ఛిత్తి ఉంది. ఈ విధంగా దరిమిలా సర్వ కవులు వ్రాసుకుంటూ ఉన్నా ఆ సొమ్ము నిజంగా శ్రీనాధుడిది. "ఈ సురచాప దీప్తులకు నీడుసుమీ" "ఉత్తాల ఫణిభుక్" "గగన కల్లోలినీ కల్లోల మాలికా" "కాలకంఠ కఠోరకంఠ హుంకారమ్ము" "హుంకారములు లేవె" "ఏమిర పసులని యార్వవు" "హంతవ్యుడ రక్షింపను" ఈ విధంగా మన పూర్వ కవుల పద్య రచనా విశేషాలు ఆధారింగా అనేక విచ్ఛిత్తి విశేషాలు కల్పించి నా కావ్యంలో గుప్పించాను. నేనీ గ్రంథం ప్రతిజ్ఞచేసి వ్రాశాను. పూర్వాంధ్ర కవులవలె వ్రాశాను. అన్న మాటకు అర్థం ఆ మార్గాన్ననుసరించి చారితార్థ్యం పొందాననే "మాకంద తరు శాఖ" అనే నా రామాయణ పద్యంలో శ్రీనాధుడి సొగసు చూపించాను. అసలు నేను వెళ్ళని మార్గమేమున్నది? ఒక పద్యం వంటిది మరొకటి కాదు. "సింహమహోక్ష సంసేవ్య మానోభయ పార్శ్వహిమాలయ ప్రభు కుమారి" "కామధేను విషాణకమ్ర పాలస్థలీ మధ్యస్థ మందమౌ మచ్చ విరిసి" "అంబో ధరంబుల యందున్న నలుపులో కోమలత్వంబెల్ల గుస్తరించి" "ఈ వారి శ్రీ మహాదేవజూటాటవి చిగురు చీల్చుకవచ్చు మొగలిరేకు" "ఒక పేట హారమీ యుజ్జ్వల వారి నాయకమణి యమృతాంశుమౌళి" "శరదృతు స్వామి యే సంయమికడ నేర్చె నదులకై తెలిచీర నాగర

కత" ఏవం విధంగా సీస పద్యాలు నడిపాను. అలాగే మిగిలిన వృత్తాలూ.

కొందరు అన్ని రకాలకూ ఒకే పోత పోస్తారు. ఆత్మప్రమాణంగా ఆభావమునకు, ఆ రసమునకు అనుకూలమగు శైలి నేనే సంపాదిస్తాను. సమాసం వాడిన వానిని చూస్తే కొంతమందికి పై ప్రాణాలు పైన పోతాయి. మహాకవి సమాసం ఎక్కడ వాడాలో అక్కడ వాడతాడు. అలా వాడకపోతే ఆ లోపం లోపంగా ఉండిపోయి కావ్యానికి అవసరమైన రసపుష్టి కలుగదు. వర్ణనలో సాధారణంగా ప్రతికవీ దీర్ఘసమాసాలే వాడతాడు. సమాసాలకు దూరంగా ఉండేవాడు నాల్గవరకం కవే. వర్ణనలో గడుసుగా భావమే చెప్పవలె కాని రసానికి స్థానంలేదు. లోకంలో, పెద్దన చాల మెత్తగా సమాసాలు వాడకుండా వ్రాశాడని మురుస్తారు. అతడే చతుర్థాశ్వాసంలో వేటను వర్ణించేటప్పుడు "చకితైణాహూతి దానమాకలిత పుచ్ఛస్వల్ప గచ్ఛత్తరక్షుక మదిగ్రహయాళు భల్లుకము వక్షోభాగ సంక్షిప్త డింభకవల్గత్ప్లవగీకదంబము" అని సమాసం వాడాడేం? ఎప్పుడు సమాసం వాడాలో ఎప్పుడక్కరలేదో మహాకవులకు తెలుస్తుంది. పెద్దన ఆ కోవలో వాడు కనుక వాడాడు. కఠినపదాలు, దీర్ఘ సమాసాలు పూర్వకవుల కావ్యాల్లోనూ ఉన్నై. నా కావ్యంలోను ఉన్నై. అలా అని మెత్తని పద్యాలు నా కావ్యంలో లేకపోలేదు చదవ గలిగిన వారికి వేనకు వేలున్నవి.

విశ్వామిత్రుని తపోభంగానికి మేనకను వెళ్లమని ఇంద్రుడు చెప్పాడు. గాధిసూతి పేరు చెబితే తన ప్రాణాలు పోతవనే తన భయాన్ని మేనక వెల్లడిస్తుంది. "అన నింద్రుడును సీసీ, నిను నొక్కతెగాని పనుప" అంటూ అక్కడకు మన్మధుడు కూడా వస్తాడని చెప్పేటప్పుడు "మధురభావపేషణి" అని పద్యంలో సమాసం వాడాను. దానికి కారణం "నీ కెందుకు భయం? వాడొస్తాడుగా"

కత" ఏవం విధంగా సీస పద్యాలు నడిపాను. అలాగే మిగిలిన వృత్తాలూ.

కొందరు అన్ని రకాలకూ ఒకే పోత పోస్తారు. ఆత్మప్రమాణంగా ఆభావమునకు, ఆ రసమునకు అనుకూలమగు శైలి నేనే సంపాదిస్తాను. సమాసం వాడిన వానిని చూస్తే కొంతమందికి పై ప్రాణాలు పైన పోతాయి. మహాకవి సమాసం ఎక్కడ వాడాలో అక్కడ వాడతాడు. అలా వాడకపోతే ఆ లోపం లోపంగా ఉండిపోయి కావ్యానికి అవసరమైన రసపుష్టి కలుగదు. వర్ణనలో సాధారణంగా ప్రతికవీ దీర్ఘసమాసాలే వాడతాడు. సమాసాలకు దూరంగా ఉండేవాడు నాల్గవరకం కవే. వర్ణనలో గడుసుగా భావమే చెప్పవలె కాని రసానికి స్థానంలేదు. లోకంలో, పెద్దన చాల మెత్తగా సమాసాలు వాడకుండా వ్రాశాడని మురుస్తారు. అతడే చతుర్థాశ్వాసంలో వేటను వర్ణించేటప్పుడు "చకితైణాహతి దానమాకళిత పుచ్ఛస్వల్ప గచ్ఛత్తరక్షుక మద్రి గ్రహయాణ భల్లుకము వక్షోభాగ సంక్షిప్త డింభకవల్గత్ప్లవగీకదంబము" అని సమాసం వాడాడేం? ఎప్పుడు సమాసం వాడాలో ఎప్పుడక్కరలేదో మహాకవులకు తెలుస్తుంది. పెద్దన ఆ కోవలో వాడు కనుక వాడాడు. కఠినపదాలు, దీర్ఘ సమాసాలు పూర్వకవుల కావ్యాల్లోనూ ఉన్నై. నా కావ్యంలోను ఉన్నై. అలా అని మెత్తని పద్యాలు నా కావ్యంలో లేకపోలేదు చదవగలిగిన వారికి వేనకు వేలున్నవి.

విశ్వామిత్రుని తపోభంగానికి మేనకను వెళ్లమని ఇంద్రుడు చెప్పాడు. గాధిసూతి పేరు చెబితే తన ప్రాణాలు పోతవనే తన భయాన్ని మేనక వెల్లడిస్తుంది. "అన నింద్రుడును సీసీ, నిను నొక్కతెగాని పనుప" అంటూ అక్కడకు మన్మధుడు కూడా వస్తాడని చెప్పేటప్పుడు "మధురభావపేషణి" అని పద్యంలో సమాసం వాడాను. దానికి కారణం "నీ కెందుకు భయం? వాడొస్తాడుగా"



అనే విశేషభావాన్ని తెలియచేసేటప్పుడు సమాసం కావాలి. ఈ అందాలు తెలియాలంటే కావ్యం కావ్యంగా చదువగలిగిన శక్తి కావాలి. నా సిద్ధాంతంకోసం నా పుస్తకం వ్రాశాను. సహృదయులకది గోచరిస్తుంది. ఇతరులు వారి సిద్ధాంతాలతో దీనిని కొలుస్తూ చదవడం కన్న చదవక పోవడమే మంచిది. షేక్స్పియర్ తన కాలంలో తగినంత మెప్పు పొందలేదు. 150 సంవత్సరాల అనంతరం కాల్రిడ్జ్ వచ్చి 'ఇదిరా' అని చెబితే 'ఓహో' అనుకున్నారు.

కాళిదాసు కథా కథనవైఖరి వేరు. భవభూతిది మరియొక పద్ధతి. మృచ్ఛకటికము మరొకతీరు. నన్నయది ఒక్కొక్క కథకు ఒక్కొక్క తీరు. అతనిని గురించి ప్రత్యేకం పుస్తకమే వ్రాశాను. నాచన సోమనది మరొకవిశిష్టమైన మార్గము. "డ్రాల్సుపోరసు"లో ప్రపంచ కథా సారస్వతంలో సంపూర్ణమైన కథా కథన విధానం తెలిసినవారు నలుగురైదుగురు కంటె లేరని వ్రాశాడు. దాని కాశ్చర్యపడవలసిన అవసరంలేదు.

ఈ విధానాలన్నీ అవగతం చేసుకొని వాటికంటె భిన్నంగా నేను చేసినవీ ఉన్నై. కథాకథనం అన్నా, పద్యరచనం అన్నా ఒక నూతన రాగప్రస్తారం వంటిది. ఒకే స్వర పద్ధతిగల రాగం ప్రతిభాసంపత్తివల్ల నూత్న ప్రస్తారాన్ని పొందినట్లు, ఒకే ఛందః పద్ధతి ప్రతిభవల్ల బహుధా ప్రపంచింపబడుతుంది. 'నీ వలమూపునందు మునునేలవహింపగ" ఇందులో ఒక అక్షరం విరిగింది. 'నిండు మనంబు నవ్య నవనీత సమానము' రెండక్షరాలు విరిగినై. "చూచినయంతనన్" ఇక్కడ మూడక్షరాలు భగణంలో విరుపుల వల్ల పుట్టే విచ్ఛిత్తి అల్లాంటిది. పద్యంలో ఎన్ని అక్షరాలున్నవో అన్నీ ఒక క్రమంలో విరిగితే ఆ ప్రస్తారంలో సొగసు అనంతం. పద్యరచనం అంటే అమ్మమ్మ కూర్చుని కునికిపాట్లు పడుతూ రాట్నంలో దారం తీయటం కాదు. పద్యంలో మజా చూపించడం సిద్ధహస్తుడికే

5 10-0-0 శ్రీ యదవల్లి ఆదినారాయణగారు ఖమ్మం మెట్టున కిచ్చిన T.A.

7 Went to Khammam to attend the dedication ceremony of యదవల్లి ఆది నారాయణ.

8 returned to Vijayawada. Went to Vizainagaram along with Sri మల్లాది లక్ష్మీనారాయణ.

9 ఫిబ్రివరి విజయనగరం - ఉపన్యాసం.

10 Came to Vizag సాయంత్రం యూనివర్సిటీ Telugu Association ఉపన్యాసం. 116-0-0 సన్మానం.

14 నేను హైదరాబాదు 8 A.M.కి బయలుదేరాను.

15 Hyderabad central Akademi advisary Board.

16-17 Hyderabad

18 45 D.A. from A.P. Academi

19 యాదగిరి నృసింహస్వామివారి దర్శనము. 116-0-0 సన్మానము.

25 అమలాపురం వెళ్లితిని. లక్ష్మీనారాయణగారితో సహా.

26 అమలాపురం 200-0-0 సన్మానం.

29 శ్రీ ధూ॥ శ్రీరామమూర్తిగారి కుమారుడు చి॥ హరి శ్చంద్రుని పెండ్లికి ఉయ్యూరు.

116-0-0 శ్రీరామమూర్తిగారు చేసిన సన్మానం.

1 మార్చి కొణత మాత్మకూరు శ్రీ పోలూరి సత్యనారాయణగారి హైమవతీ పరిణయ గ్రంధావిష్కరణకు వెళ్లినాను.

3 గుంటూరు సంస్కృత కళాశాల వార్షికోత్సవమునకు.

8 శ్రీ P. Narayana Rao of Karimnagar came in the night to go to Ongole for music.

10 Went to Ongole.

20 Hyderabad సామెతలపని.

31 విజయనగరం.

1-4 ఏప్రిల్

Vizainagaram - Vizag.

5 Reached Vijayawada by 8-30. Went to Chirala by 10-30 A. M. 116-0-0. సన్మానం at చీరాల.

7 విజయవాడ పురపాలక సంఘ వజ్రోత్సవోపన్యాసం.

16 Hyderabad.

17 Hyderabad to Vemulawada శ్రీనారాయణ రావుగారి సన్మానం.

18-23 Hyderabad.

5 మే Went to Masulipatam to attend the opening of Zilla Parishad Building.

6 Went to అకునీడు for భువన విజయం.
136-0-0 సన్మానం.

26 20-0-0 from వరంగల్ నరసింహా రెడ్డి పెళ్ళికి.
జమదగ్నికి అప్పు ఇచ్చినవి 300-0-0.
వీర్నెడు ప్రసన్నకు Rs. 10-0-0.

6 జూన్ 100 from ఉమా Publishers for script writters

12 జమదగ్నికి అప్పు 700-0-0.

7-13 ఆగస్టు Hyderabad

14 Warangal

24 సెప్టెంబరు going to Delhi by G. T.

27 Delhi. Akademi General Body meeting. Dr. Gopala Reddy నా జన్మ దినానికి క్రొత్త బట్టలు పెట్టినాడు.

13 అక్టోబరు శ్రీ పోలూరి సత్యనారాయణ Scribe కి 32-0-0.

14 Started to Hyderabad.

15 meeting of Sri P. Madhava sarma's Thesis. Doctorate awarded.

17 (2000 from Krishna Patrika for జాణావతి)

25 శ్రీ పోలూరి సత్యనారాయణ 30-0-0.

27 Hyderabad Akademi meeting కాళిదాస భవభూతుల ఉపన్యాసం. 300-0-0. ఆంధ్ర సారస్వత పరిషత్తువారి సన్మానం.

28 Hyderabad Akademi constitution Amendment meeting సాయంత్రం 6 గం. కు కరుణ శాంత రసముల ఉపన్యాసం.

29 Hyderabad Akademi Executive Body meeting సాయంత్రం 6 గంటలు రామాయణ మహాభారతముల ఉపన్యాసం.

బ్ర॥శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారి యింటి భోజనం.

30 శ్రీ మాధవశర్మగారింట భోజనం. by 8 A. M. శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు శ్రీ గోపాలరెడ్డిగారికిచ్చిన Tea Partyకి.

15 శ్రీ పోలూరి సత్యనారాయణ 33-0-0.

21 నవంబరు Hyderabad. meeting of the Advisory Board of the central Academy.

28 కిన్నెర సాని Printingకి 136-0-0.

6 డిసెంబరు పోలూరి సత్యనారాయణ 50-0-0

10 నర్తనశాల Printing 100-0-0

12 Reached Waltair by 4 P.M సాయంత్రం కళాప్రపూర్ణ బిరుద స్వీకారం విశ్వవిద్యాలయంవారిచే.

13 Started to Rajahmandry along with Sri Sampat Principal Govt. Arts College Rajahmandry in his car.

14 నా డీవానితో కలసి కొన్నాము.

15 నా డీవానికి 20-0-0

24 Collegeలో మిత్రుల సన్మానం.

29 తణుకు వెళ్లాను. 116-0-0 సన్మానం.

31 పోలూరి సత్యనారాయణగారిచ్చి 15-0-0.

## 1965

2 జనవరి 2000 Cheque from A. P. Book Publishers for పునర్జన్మ

3 సికింద్రాబాదు తాడుబందు ఆంజనేయస్వామి వారి సన్మానం. (116)

6 శ్రీ వేంకటేశ్వర సప్తాహమునకు ఏలూరు వెళ్లినాను. 20-0-0 వాళ్లిచ్చినది.

10 116-0-0 శ్రీ G. S. Raju గారి సన్మానం.

14 Guntur రామాయణ పఠనము

15 Guntur పండితుల సభ

17 Went to E'ore సన్మాన సభ
58-0-0 వాళ్ల సన్మానము

27 కిష్కింధ అచ్చు 100-0-0

4 ఫిబ్రవరి గృహ ప్రవేశానికి *

10 Went to నరసరావుపేట Rs. 116-0-0
కళాశాల సన్మానము.

11 కిష్కింధ కాండ Printing కి Rs. 100-0-0.

12 Went to Guntur శ్రీ మాధవరామశర్మగారి
కూతురు పెండ్లి. Taxi 26-0-0

13 ఢిల్లీ ప్రయాణం జ్వరం మూలాన మానివేశాను.

28 సుందరకాండ Printing 100-0-0

8 ఏప్రిల్ విశాఖ శ్రీ తెన్నేటి విశ్వనాథంగారి యింట్లో రామాయ
ణోపన్యాసం.

9 58-0-0 విశాఖ Century Culb వారి సన్మానం.

2 మే Went to Guntur మంగళగిరిలో కొండూరి
వీరరాఘవాచారిగారి సన్మానం.

12 5-0-0 సదస్యం భావన శ్రీ పిశుపాటి విశ్వేశ్వరశాస్త్రి
కూతురు పెండ్లి.

---

* హైదరాబాదు, ఖైరతాబాదు ఆనంద నగర్ కాలనీలోగల కమలానివాస్ విశ్వనాథ సత్యనారాయణగారి ఇల్లు.

30 మే Reached Tirupati by 10 A.M.
సభలకు ప్రారంభోపన్యాసము by 7 P.M.

31 శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామి వారి దర్శనము.
by 11 A.M. కొండమీద. సాయంత్రం సన్మానము

22 జూన్ Rs. 220 మిహిరకులుని Dec. remuneration

26 శ్రీ గోపాలరెడ్డిగారి సన్మానానికి Printing 50-0-0.
Rs. 230 మిహిరకులుని April, May

28 శ్రీ గోపాలరెడ్డిగారికి సాహిత్య బంధు బిరద ప్రదానము చేసినాము.

29 శ్రీ పోలూరి సత్యనారాయణగార్కి—భాగవత పీఠిక*
వ్రాయు Rs. 100-0-0.

30 విస్సాకోడూరువెళ్లి అచట మహిళా సభలో దంపతులము సన్మానితులము.

6 జులై వేయిపడగలు Printingకి 260-0-0.

16 90-0-0 from Kota Padmanabham
(అవునమ్మి)

23 100-0-0 for మిహిరకులుడు for June 65

25 శ్రీ ముష్టి సుబ్రహ్మణ్యంగారి యింటికి భోజనానికి
శ్రీకల్లూరు సుబ్బారావుగారు గాయకుడు సన్మానం 5-0-0.

---

* రాయల్ అండ్ కో., కడప వాళ్లకు వాళ్లు ప్రచురించ దలచిన ఆంధ్ర మహాభాగవతానికి పీఠిక వ్రాశారు.

14 పేయిపడగలు Printing Rs. 300-0-0.

9 నవంబరు Rs. 1001-0-0 మురళీకృష్ణ యిచ్చింది.

10 Reached Warangal by 0-30 p. m.

11 వరంగల్లు భద్రకాళి గుడి ఖర్చు 10-0-0.
శ్రీ గొట్టుముక్కల రామకృష్ణారావుగారి మనుమని అక్షరాభ్యాసము.

13 Went to Mahaboob nagar Rs. 100-0-0
సన్మానం.

14 జడ్చర్లలో ఉపన్యాసం.

18 Rs. 116-0-0 శ్రీ చుండూరు రెడ్డిగారి సన్మానము.

19 అయోధ్య Printing 50-0-0.

23 చి॥ శరభయ్యకు గద్యకు Rs. 300-0-0.

25 వేయిపడగలు 300 ప్రతులు Bindingకూలి162-0-0.

2 డిసెంబరు Hyderabad వెళ్లాను.

6 అయోధ్య Print Rs. 150-0-0.
పూర్ణచంద్రోదయం వ్యవసప్రాస 34-0-0.
పౌడుం Rs. 4-0-0.

11 అయోధ్యకాండ Print 200-0-0.

13 120-0-0. మిహిరకుల Remu. for oct. 65

16 Vizag Lecture in Mrs. A.V.V. College

17 డిసెంబరు Vizag Rs. 101-00 College సన్మానం.

27 Went to Guntur

28 నాగార్జునసాగర్.

## 1966

12 జనవరి అయోధ్య Printing కి Rs. 40-0-0.

23 పెద్దక్కయ్య దశాహం నందమూరు వెళ్ళాము అందరమున్నూ.

29 Hyderabad A. P. S. E. B. & G. B. Meeting.

13 ఫిబ్రవరి Went to Guntur to Speak at the anniversary of కొలచలమ Sanskrit College.

19 హైదరాబాదు. శ్రీ కృష్ణపాండవీయానికి వెళ్ళాము.

27 రాత్రికి నందమూరు School Anniversary కి వెళ్ళి 1-30 కి తిరిగి వచ్చాము.

24 ఏప్రిల్ చి॥ మల్లాది కుటుంబరావు శ్రీమద్రామాయణ కల్పవృక్ష కనకాభిషేకము విజయేశ్వరాలయమున జరిపించెను. భోజనానికి వారింటికి.

13 మే 2000 - for సంజీవకరణి from గాయత్రి Publications.

భరతశర్మ సందానఃరణి వ్రాసినందుకు 100-00.

18 జూన్ Went to Kankipadu to register the deed of land sold to Panchayati of Nandamur 2 cents of God Visweswara swamy 9 A. M. to 12 A. M.

20 Rs. 136-0-0 శ్రీ విశ్వేశ్వరస్వామివారికి.
2 సెంట్లు పంచాయతికి అమ్మినవి.

11 జులై Hyd. Akademi meeting. Went to Nakkarkal by 10 P. M. meeting 116-00 సన్మానం. తిరిగి రాత్రికి Hyderabad.

13 Came to Suryapet Rs. 88-00 సన్మానం from High School. Rs. 116-00 సన్మానం from local literary club.

14 జులై Rs. 2000-00 from కప్పగంతుల మురళీకృష్ణ

30 మునగాలకు బయలుదేరాను. మునగాలలో రాత్రి 10కి సన్మానాలు. 116 - మునగాల High School 125 నడిగూడెం H. S. వారు

31 సూర్యాపేటకు ప్రయాణం. 116-00 సూర్యాపేట సన్మానం.
జమదగ్నికి 50-00. శలాకరఘుకు 16-00.

15 ఆగస్టు Went to Nuzivid to deliver a lecture in the Victoria Hall.

30 1200-00 from Gayatri Publications

for భగ్గిమరవాసిని.

21 సెప్టెంబరు శ్రీ దిగవల్లి శివరావుగారి సన్మానానికి దోవతులు 14-00.

22 ఏకవీర బైండింగు 10-00.

24 went to Agiripalli to Speak in the Sanskrit College.

6 అక్టోబరు

స్వ॥ విచ్చేనం printing 700-00.

19 ఏలూరు సంస్కృత కళాశాల దేవీ నవరాత్రోత్సవాలకు వెళ్ళి వచ్చినాను.

25 went to Challapalli to attend Raja's 60th birthday functions. 116-00 సన్మానం.

6 నవంబరు

గద్య చంద్రిక printing 800-00.

14 ధర్మచక్రం printing 30-00.

21 చెలియలికట్ట printing 400-00.
స్వ॥ విచ్చేనలు — 300-00.

30 went to Masula to attend శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామిగారి సన్మానం.

6 డిసెంబరు జేబుదొంగలు printing 100-00.

## 1967

1 జనవరి went to Guntur to speak in the Club.

7 Fellowship of the Academi with 14 others

10 Exhibition Club లో కవితాగానం.
శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారికి బ్రహ్మాండమైన కోపము. నేనే కవిని ఆయన కాదన్నానని. నేనన లేదు. ఆలంకారిక మార్గం నిరూపించాను అంతే.

3 ఫిబ్రవరి రు. 40. M. O. from Warangal.
went to Masula to preside over at A. J. K.

4 went to Guntur.

14 Reached Warangal by 12 p. m.
ఉపన్యాసాలు. కాలేజి. Night College B. Ed. College.

26 వియ్యంకుడు అప్పారావుగారి కూతురు చి॥ సౌ॥ కాశీ పెండ్లికి హైదరాబాదు వెళ్లాము.

1 మార్చి చి॥ రాయలు వాళ్ళ అమ్మ ఆబ్దికానికి వచ్చినాడు.

2 చి॥ రాయలు ఆబ్దికము పెట్టినాడు.

7 జగిత్యాల 116-00. సన్మానం.

8 కరీంనగరం. Culture ఉపన్యాసం.

4 ఏప్రిల్ paid to పీర్నీడు ప్రసన్న Rs. 100-00

6 Hyderabad. A. P. Sahitya Academi meeting.

7 Hyd. APS Academi executive Board.

16 went to మెట్రిపాలెం. జమలాపురం శ్రీ వెంకటేశ్వరస్వామి దర్శనం చేసినాము.

19 విస్సాకోడేరు. రామాయణ పఠనం.

20-22 విస్సాకోడేరు రామాయణ పఠనం. 400-00 సన్మానం. Returned to Bezwada.

23 went to మిరియాలగూడా. 58-00 సన్మానము.

30 శ్రీ కామకోటి పీఠాధిపతుల దివ్యదర్శనము చేసితిని.

4 మే

భరతశర్మకు అతని గృహ ప్రవేశములకు 100-00

14 శంకరజయంతి. కంచి కామకోటివారి దగ్గర పండిత సన్మానం.

31 went to తిరుపతి క్షేత్రం చి. పావని ఉపనయనం కొఱకు. శ్రీచతుర్వేదుల ఆంజనేయులుగారి కుమారుడు, చి. రామమూర్తి కుమారుడు చి. శోభనాద్రి ఉపనయనాలకు. Bus మీద.

1 జూన్ మధ్యాహ్నం 2 గంటలకు ఎగువ తిరుపతి చేరినాము.

2-4 తిరుపతి కొండలు.

5 ఎగువ తిరుపతి. ఉపనయనాలు పూర్తి చేసికొని సాయంత్రం 4 గంటలకు దిగువ తిరుపతి చేరినాము.

8 విజయవాడలో సత్యనారాయణ వ్రతం. శ్రీ వెంకటేశ్వర దీపారాధన.

8 జులై నాటకానికి చిత్రసీయం by మల్లాది సూర్య 3-00.
16 అత్తగారు ఏలూరులో చనిపోయినది.

26 ఆగస్టు పృథ్వీ భాగవత కృతి స్వీకరణము* ఓకేన్డి ప్రసన్నకు బహుమానము (1200).

12 సెప్టెంబరు went to Vijayanagar గణపతి నవరాత్రులు సంస్కృత కళాశాలలో.

17 బ్రహ్మశ్రీ లక్ష్మావధానులుగారికి బంగారు పూలు ఇచ్చి దక్షిణ 10-00,

27 గుంటూరు కమలను చూడడానికి వెళ్ళాను.
She passed away

29 వేయిపడగల అచ్చు 200-00

8 అక్టోబరు శ్రీ దేవకొండ చిన్నికృష్ణశర్మగారికి 50-00

30 went to Proddutur on Taxi

1 నవంబరు Rs. 116-00 ప్రొద్దుటూరు రాయలసీమ సాహితీ పరిషత్తు సన్మానం.

2 Rs. 116-00 ప్రొద్దుటూరు కాలేజీవారి సన్మానం.

---

* ఈ సభ హైదరాబాదులో జరిగినది.

14 నవంబరు విస్సాకోడేరు చెరుకువాడ సుబ్బారావుగారి కూతురు
మాణిక్యాంబకు పంపిన పెండ్లి కానుక Rs 25-00

25 ఎవరో పేదరాలికి 10-00

10 డిసెంబరు వేయిపడగలు print 100-00

27 చి. భరతశర్మకు నవలలు వ్రాసిన దానికి॥ 100-00

## 1968

31 జనవరి Going to Nalgonda.
Reached Nalgonda by 12-30
సభ సన్మానము.

1 ఫిబ్రవరి నల్లగొండ సన్మానము.
Reached Hyderabad A.P. సాహిత్య అకాడమీ meeting.

2 రాత్రికి వివేక వర్ధనీ కళాశాలో పన్యాసం.

3 Kurnool by Taxi by 2 P.M.
Rs. 116-00 సన్మానం.

4 went to పాలెము Rs 116-00 సన్మానము.
Reached Vijayawada by 10 P.M.
Taxi వాలాకు 275-00

ప్రయాణము 4 రోజులు ఖర్చు petrol & Bata
128-00.

9 తాడేపల్లిగూడెం శ్రీ పసల సూర్యచంద్రరావుగారి
Culture Clubకి వెళ్ళి రాత్రికి by 2 p. m.

తిరిగి వచ్చాము. Rs. 116-00 సన్మానము. పట్టు బట్టలు.

17 Rs. 116-00. శ్రీ వల్లూరి కేశవరావుగారి కుమార్తె (పడమట లంక) శ్రీ నర్రా గోపాలకృష్ణయ్యగారి సిఫార్సు పెండ్లి పద్యాలు. సన్మానం.

22 శ్రీ పోలూరు సత్యనారాయణగారి కూతురు పెండ్లికి 40-00.

23 Rs. 116-00 శ్రీ గొడవర్తి జంద్యాల వెంకటేశ్వర్లు గారి కుమారుడు పెండ్లికి సన్మానము.

27 Going to Hyderabad and from there to Gadwala.

28 went to Gadwala by Taxi Rs. 116-00 కాలేజి సన్మానం. 58-00. Lecturers సన్మానం.

1 మార్చి ఇల్లిందు వెళ్ళినాను. Rs 116-00. School సన్మానం. 58-00. శ్రీ చీమకుర్తి శేషగిరిరావుగారి సన్మానము.

2 Going to Bhimavaram.
భీమవరం శ్రీ జనార్దన సోమేశ్వరస్వామివారి ఆలయములో వారం దినములు రామాయణ పఠనం.

3 Bhimavaram Taxi 70-00
సప్తాహం ప్రారంభం - రామాయణ పఠనం

9 Rs. 1116-00 శ్రీ జనార్దన సోమేశ్వరస్వామివారి

Temple Endowments Board వారిచ్చి నది. రాత్రి 1-30 A M.కి తిరిగి యింటికి చేరినాను. Taxi 75-00.

12 భీమవరం. శ్రీ భీమేశ్వరస్వామివారి ఆలయంలో రామాయణ పఠనం కోసం 3 P.M.కి బయలుదేరి వెళ్లాను.

14 భీమవరం. Rs. 558-00. దేవాలయసన్మానం రాత్రి 2 P.M.కి తిరిగి బెజవాడ చేరాను.

20-24 తణుకు

25 తణుకులో—సన్మానం.

26 తణుకు Rs. 116-00 సన్మానం. శ్రీ కేశవస్వామి వారి శ్రీ లక్ష్మీదేవి మకర తోరణానికి.

29 గుంటూరు ఉపన్యాసానికి వెళ్లి వచ్చితిని.

శ్రీ నర్రా గోపాలకృష్ణయ్యగారు సన్మానం. సన్మానం-సంవత్సరాది శ్రీ మాధవశర్మగారికి నాకు సేలవ fountain pen Ream white paper penciles ets.,

శ్రీ M.R. Appa Raoగార్కి- విజయనగరం శ్రీ P V. రాజుగార్కి- శ్రీ పసల సూర్యచంద్రరావు గారికి కూడా సన్మానము.

3 ఏప్రిల్ went to Guntur and spoke in the P. G. Centre and returned home by 8-30.

5 went to కొత్తగూడెం. Rs. 116 అక్కడ Secondary school వారి సన్మానం.

6 Rs. 116. వేదపరిషత్తువారి సన్మానం.

11 Going to Pippara with family 58-00. పిప్పరలో సన్మానం.

27 Rs 10-00 M. O. from శిష్టరామకృష్ణశాస్త్రి గారు Madras.

13 మే Rs. 600-00. శ్రీ గొడవర్తి జంధ్యాల వేంకటేశ్వర్లు గారు గోపికాగీతంల అచ్చుకు ఇచ్చినది. పల్నాటికవి కన్నెకంటె వీరభద్రాచారిగారి కూతురు పెండ్లికి 10-00

21 Rs. 100 from Warangal for జిల్లా రచయితల సభ.

23 Night కి వరంగల్లు Taxi మీద వెళ్లినాను.

24 from వరంగల్లు రాత్రి 3-30 గం॥కి తిరిగి వచ్చినాము. Taxi 180-00

30 జూలై Rs. 50/- from భీమవరం రామరాజ భూషణ సంచిక బహుమతి.

16 ఆగస్టు నూజవీడు వెళ్లితిని. శ్రీ సూరి కృష్ణమూర్తిగారి షష్టిపూర్తికి. రాత్రి పది గంటలకు తిరిగి వచ్చితిని.

21 గుంటూరు సన్మానం.

27 భాద్రపద శు॥ ౪ వినాయక చతుర్థి అధికం. మా నాయన గారిది.

22 సెప్టెంబరు Kakinada బులుసు వేంకటేశ్వర్లుగారి ఉత్సవము.
Rs. 116-00 సాహిత్య లహరివారి సన్మానము.
Rs. 58-00 శ్రీ పైడా నారాయణగారి సన్మానం.
Rs. 10-00 శ్రీమల్లాది రామకృష్ణయ్యగారు Rs.50-00 బులుసువారిచ్చినది.

24 Rs. 501-00 from శ్రీ వేటూరి సుందరరామశర్మ advance for చందవోలురాణి అన్న నవల వ్రాసి పెట్టుటకు.

5 అక్టోబరు Went to Tenali for రామాయణ lecture

6 Rs. 116 తెనాలి సన్మానం.

24 నవంబరు బాపట్ల సభకు Rs. 116-00 సన్మానం.

13 డిసెంబరు Paid to వేటూరి సుందరరామశర్మ the money he gave me to advance for చందవోలురాణి Rs. 100-00.

## 1969

10 జనవరి నల్లగొండ వచ్చినాను. Rs. 110-00 సభ సన్మానం.

11 Rs. 2500 From వేటూరి సుందరరామ శర్మ for చందవోలురాణి.

19 చి॥ పావని వివాహానికి తాంబూలాలు పుచ్చుకొనుటకు గుంటూరు వెళ్లి వచ్చితిమి.

22 పత్రసన్న కథ Printing Bill 310-00.

9 ఫిబ్రవరి నేను గోదవర్తి వెళ్లితిని. పత్రిద్యుమ్నోదయము అంకితము. Rs. 116-00 శ్రీ జంధ్యాల వేంకటేశ్వర్లు గారి సన్మానము.

14 శ్రీశైలానికి వెళ్ళినాను. సకుటుంబముగా Taxi మీద

15 శ్రీశైలం శివరాత్రి.

2 మార్చి Rs. 1116 - శ్రీ విశ్వనాథరావు, auditor and other auditors and some others.
3 రోజులు ఉపన్యాసాలు చేయించి చేసిన సన్మానం. *

6 చి॥ పావనిశాస్త్రి వివాహమునకు గుంటూరు వెళ్లుచున్నాము.

7 గుంటూరు marriage.

8 గుంటూరు పెండ్లిరాత్రికి 3 A. M. కి తిరిగివచ్చినాము.

16 ఆగ్రాకి బయలుదేరినాము. రాత్రి 10 కి.

18 Reached Agra.

19 Agra. రాత్రికి అలహాబాదు బయలుదేరాము.

20 Reached Allahabad.

21 అల్లహాబాదు.

---

* ఇది విజయవాడలోనే జరిగినది.

22 కాశీ శివలింగం 5-00 దర్భాసనాలు 4-00 గంగాస్నానం శ్రీ విశ్వేశ్వర దర్శనం. కాశీ మహారాజా దర్శనం. గంగా సర్వఘట్టాల దర్శనం.

23 కాశీ మహాక్షేత్రం.

24, 25 లక్నో.

26 మార్చి ఢిల్లీ.

25 ఏప్రిల్ To Tirupati by Taxi petrol 60-00. ఇతర ఖర్చు 10-00. Started by 8 A. M. Stayed at Ongole with M.V.S. Sharma and by 3-30 reached Tirupati by 10 P. M.

26 తిరుపతి స్నాతకం.

27 తిరుపతి చి॥ ప్రసాదు వివాహం.

7 జూన్ Rs. 100-00 from చీలంకుర్తి * Dr.

8 going to Ongole to attend the marriage of the daugther of Dr. చీమకుర్తి by Taxi. Ongole by 9 P. M. రాత్రి పెండ్లి by 10-40 ఇద్దఱు పెండ్లికూతుండ్రకు Rs. 100-00 కన్యాదాతకు Rs. 50-00.

21 సెప్టెంబరు కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ పాఠశాలలో ఉపన్యాసము. రాత్రికి తిరిగి వచ్చినాము.

---

* చీమకుర్తి.

12 అక్టోబరు Rs. 2052–00 from బాపట్ల శ్రీ నరసింహారావు గారు Asst. కమీషనర్ ఎండోమెంట్స్ 30 Sets కి.

31 Went to Hyderabad Information Department కవితా గోష్ఠి.

3 డిసెంబరు To భరతశర్మ for writing కావ్యపరిమళం etc., Rs. 100–00.

6 Rs.2000-00 from Mr. D. L. Narayana[2]

## 1970

25 జనవరి going to Nellore with అచ్యుత రామయ్య Rs. 116–00 సన్మానము.

26 "పద్మభూషణ" announcement.

30 Starting to Hyderabad to attend the meeting of A P S Akademi & Board.

2 ఫిబ్రవరి Rotary Club లో ఉపన్యాసము. వాళ్ళు క్రొత్త బట్టలు పెట్టినారు.

6 500–00 for writing a book on Leterary criticism.

7 నా చిత్రము వ్రాసిన శ్రీ C. Koteswara Rao గారికి సన్మానము. Rs. 116–00.

---

(2) ఈయనే ఏకవీర సినిమా ప్రొడ్యూసరు.

| | |
|---|---|
| 8 | వేయి పడగలు printing కి. కనకయ్యకు Rs. 600-00. గుంటూరు సంస్కృత కళాశాల వార్షికోత్సవానికి వెళ్ళితిని by 4 P.M. Rs 58-00 సన్మానము. |
| 18 | Rs. 58-00 బెజవాడ Oriental College సన్మానం. |
| 21 | Bombay - Andhra Educational Society లో సన్మానం. |
| 22 | Bombay A. E. Society వాళ్లు చేసినది సన్మానము. |
| 5 మార్చి | విజయవాడ సన్మానము. |
| 8 | Went to Palakollu. పాలకొల్లు సభ. Rs. 116-00 సన్మానం. |
| 9 | నరసాపూరు Rs. 116-00 సన్మానం, Rs 60-00 సన్మానము. |
| 7 ఏప్రిల్ | Went to Guntur to Preside over Chy. Bharata Sarma అవధానం. Rs. 116-00 సన్మానం. |
| 17 | Going to Delhi to receive Padma Bhushan. |
| 20 | New Delhi<br>Rehearsal for Investitur ceremony for Padma Bhushan. |

| | |
|---|---|
| 21 | New Delhi<br>Investiture ceremony for Padma Bhushan. |
| 5 మే | Went to Hyderabad to attend the meeting of Fellowship award stated by 10 A. M: Reached Hyd by 3-40 P. M. |
| 19 | Rs 25-00 for ఆనందవాణి కాళిదాసుగారు. |
| 1 జులై | Rs. 1100-00 for సాహిత్య మీమాంసాఖండము. |
| 29 | Payed to పార్థసారధి press for అనార్కలి Rs. 290-00. |
| 2 ఆగస్టు | Ellore శ్రీ మల్లాది సూర్యనారాయణగారి హరిశ్చంద్ర నాటకానికి వెళ్లాను. |
| 6 సెప్టెంబరు | Went to Nuzvid Rs. 200 సన్మానము. |
| 11 | విడవలూరు Principal ఆర్.యస్. సుదర్శనంగారి "విశాంతం" అచ్చుకి. Printing charges Rs. 90-00. |
| 24 అక్టోబర్ | Went to Rajahmundry రాజమండ్రి సభలు. |
| 26 | Rajahmundry. 21 Tobacco Institute వారు 116 – 1116 సాహిత్య గౌతమివారు. |
| 2 నవంబరు | Went to Warangal. |

3* Went to Karimnagar & Jagityal.

13 Started to Madras to address the stud.nts at త్యాగరాజ College.

14 Rs. 200 త్యాగరాజ College సన్మానం.

15 Rs. 116-00 వాళ్లవారి సన్మానం. Started to విజయవాడ by Howrah Mail.

25 బందరు ఉపన్యాసానికి వెళ్లి రాత్రి 12-30కి వచ్చినాను.

16 డిసెంబరు Went to భీమవరం. Rs. 200-00 సన్మానం. Taxiకి రు. 60-00 Petrol 46-00. ఇతరము 10-00.

19 చి॥ దుర్గ పెండ్లికి తాంబూలములు.

31 Went to Tenali 130 సన్మానం. To the Taxi 50-00.

## 1971

15 జనవరి బందరు ఉపన్యాసానికి వెళ్లినాను. Rs. 100-00 సన్మానము.

6 ఫిబ్రవరి దిగువ తిరుపతిలో పద్మావతి బాలికా పాఠశాలలో ఉపన్యాసం. Rs 116-00 సన్మానం.

---

* ఆనాడు జగిత్యాల కళాశాలలో విశ్వనాథ తమ భ్రష్టయోగి ఖండకావ్యమును శ్రీ జువ్వాడి గౌతమరావు గారికి అంకితము చేసినారు.

7 సాయంకాలము S. V. Sanskrit Collegeలో ఉపన్యాసం. 170 T.A.

8 వేంకటేశ్వర యూనివర్సిటీవారు Doctorate ఇచ్చిరి.

14 చి॥ దుర్గమ్మ పెండ్లి తెల్లవారుజామున 4 - 6 A. M.

27 బందరు హరిశ్చంద్ర నాటకానికి వెళ్లాము. అక్కడ వీరనాయకుని వేషానికి ఇచ్చిన బహుమానం 20-00.

22 మార్చి Rs. 50-00 గాంధీ సావనీర్‌కి పంపిన పద్యాలకు remuneration.

9 జూన్ నెలనాళ్లగా చేయించిన జపాలు చివరిరోజు రుద్రాభిషేకం. దానాలు జపం బ్రాహ్మణునకు ఖర్చు రు.110-00,

17 జులై జ్ఞానపీఠ బహుమతి. Announcement..

28 ఆగస్టు Went to Guntur. దన్ College సన్మానం.

29 గుంటూరు సంస్కృత కళాశాల సన్మానం.

16 సెప్టెంబరు వైశ్యుల సన్మానం నేడే వేయిపడగలు 28 హాహా హూహూ.

23 Rs. 116-00 శ్రీ కనకదుర్గాదేవి వారి ఆలయములో సన్మానం.

2 అక్టోబరు Rs. 116-00 actress Bhanumati ఇంటికి వచ్చి చేసిన సన్మానము.

24. Rs. 30-00 from ఉప్పులూరి కాళిదాసుగారు,

7 నవంబరు Rs. 1116, బహుమతి from నటరాజ కళాసమితి*
Rs. 1101, ఇంకొక సమితి
Rs. 116 from ఇందిరా ధనరాజ్

13 Went to Delhi

16 జ్ఞానపీఠము లక్షరూపాయల బహుమతి

17 లక్షరూపాయల చెక్కు ఏలూరు Central Bank agent కటకం అచ్యుతరామయ్య బంధువు శాస్త్రిగారి చేత Delhi Central Bankలో వేయించి ఏలూరు Central Bankకి Transfer చేయించినాను.

## 1972

1 జనవరి Went to చిలకలూరిపేట Rs. 558-00 సన్మానము.

23 అనకాపల్లి Rs. 1116-00 సన్మానం

10 ఫిబ్రవరి రాష్ట్ర Culture etc. సన్మానము.

27 Masula A. J. కళాశాల ఉపన్యాసం, Rs. 400 సన్మానం, Rs. 135 వాళ్ళిచ్చిన T. A.

11 మార్చి Paid to గంధం నాగేశ్వరరావు Rs. 200 for writing.

22 ఏప్రిల్ Went to Warangal.

23 వరంగల్లు సాయంత్రం మీటింగు

---

* నటరాజ కళాసమితి హైదరాబాదువారు చేసిన సన్మానము.

24 వరంగల్లు సాయంత్రం మీటింగు
Rs 1116-00 సన్మానం.

6 మే Invited the Chief Minister Sri P. V. Narasimha Rao for Tea. He came by 6-30 P. M. and left by 7 P. M Dr. Gurunath చాలా ఖర్చుపెట్టినాడు.

11 శ్రీ జువ్వాడి గౌతమరావుగారి కూతురు చి॥ అరుంధతి పెండ్లికి కానుక Rs. 200-00.

22 Rs. 100 from Warangal Sales P. G. Centre.

5 జూన్ Rs. 116-00 from యువభారతి Hyderabad.

8 అక్టోబరు శ్రీ జటావల్లభుల పురుషోత్తంగారి సన్మానానికి కాకినాడ Taxi మీద వెళ్లినాను.

## 1973

2 జనవరి శివపంచాక్షరీ కోటి ప్రారంభం.

26 మార్చి త్రిపురాంతకం వెళ్ళినాను Rs. 116-00 సన్మానం.

ఆగస్టు 15 Went to Guntur to give రామాయణ reading.

16 - 27 గుంటూరు.

29 గుంటూరు Rs. 116-00 from P. G. Centre Rs 1116-00 from శ్రీ ఊటుకూరు భానుమూర్తిగారు సన్మానం ధర్మపురి రామమూర్తిగారిచ్చిన 116-00.

1[illegible] అక్టోబరు A. University కి Ph. D. Thesis

8 నవంబరు Bombay ఆంధ్రసభ ఉపన్యాసం.

9 ఆంధ్రసభ ఉపన్యాసం.

10 ఆంధ్రసభ Rs. 2500 సన్మానం.

12 Bombay Reserve Bank Telugu Samiti ఉపన్యాసం.

13 Bombay బొంబాయి భారతీయ జ్ఞానపీఠ Bhawan's Journal ఉపన్యాసం.

25 Starting to Mahaboobabad Rs. 116 - సన్మానం.

26 Went to Hyderabad Heavy electricals రామచంద్రాపురం ఉపన్యాసం.

27 రామచంద్రాపురం ఉపన్యాసం.

28 రామచంద్రాపురం సన్మానం.

29 Music College ఉపన్యాసం.

## 1974

5 జనవరి Went to Madras to attend Kala Bharati meeting by Mail 8-30 P. M. along with Chy. Pavani.

6 Madras Kala Bharati meeting

Rs. 116 - సన్మానం.
పావని & Dr. Gurunath New woodlands Hotel లో Room No. 223

26 రాత్రికి అనకాపల్లి బయలుదేరితివి.

27 అనకాపల్లి.

28 అనకాపల్లి నుంచి విజయనగరం వెళ్లినాను.
Rs. 200-00 సన్మానం.

29 విజయనగరం Rs. 200 సన్మానం.

30 శ్రీకాకుళం సన్మానము.

16 మార్చి Bangalore Rs. 116-00 Indian Institute of Science సన్మానము.

17 Bangalore Rs. 116-00 సన్మానం.

1 ఏప్రిల్ Rs. 66. సన్మానం శాతవాహన కాలేజి.

4 Went to Hyderabad

13 Rs. 32-00 from జ్ఞానపీఠ సహస్రఫణ

7 జులై గుడివాడ కేతవరపు రామకోటిశాస్త్రి సన్మానమునకు వెళ్లి రాత్రి 12కి వచ్చాను.

14 Rs. 200 from శ్రీ కుందుర్తి సత్యనారాయణమూర్తి సన్మానం,

1 సెప్టెంబరు కడప Rs. 840 సన్మానం.
Rs. 275 College సన్మానం.

3 Return Journey from కడప
భరతశర్మ భార్యకు చీర etc., 100-00.
got down at కాళహస్తి Rs.116-00 College సన్మానము.

10 Rs. 1116-00 from వేణుమాధవ్ for శివార్పణం.

26 చి॥ గీతామృత శ్రీవల్లి గుంటూరు నుండి వచ్చినది.

2 అక్టోబర్ Went to తాడేపల్లి గూడెం to attend శ్రీ కరుటూరు సత్యనారాయణ తిష్యరక్షిత సభకు. Rs. 500 సన్మానము.

7 నా పుట్టిన రోజు పండుగ పిల్లలు చేసినారు.
ఖర్చు 35-00*

1 డిసెంబరు కోరుకొండ ఉపన్యాసానికి వెళ్లినాము. నేను, వసుంధర ఆమె తండ్రి. Petrol 80-00.

2 Rs. 575-00 కోరుకొండ సన్మానము.
Returned to Rajahmundry.

3 రాజమండ్రి సదనం School ఉపన్యాసం.
Rs. 116-00 సన్మానం. మరల 2 P.M. కి కోరుకొండ, 7 P.M. కి రాజమండ్రి.

ఒక సభలో ఉపన్యాసం. Rs. 116-00 సన్మానం.
Went to కొవ్వూరు by 9 P. M. కొవ్వూరు

---

* ఆనంద నిజ భాద్రపద బ॥ షష్ఠి సోమవారం.

సంస్కృత కళాశాల ఉపన్యాసం. Rs. 116-00
సన్మానం.

Returned to Rajahmundry by 11-30 P. M.

22 Went to Nuzvid to attend సంతాపసభ of ఉయ్యూరు పెద్ద రాజాగారు ఖర్చు 800.

23 చి॥ పేరాల భరతశర్మ ఇక్కడి నుండి నేడు కడపకు వెళ్లినాడు.

28 Went to Amalapuram
Rs. 416. అమలాపురం సన్మానం.

## 1975

2 జనవరి Rs. 116 పెండ్లి సన్మానము.

3 Rs. 500 from విశ్వహిందీ.

29 ఆస్థానకవి చెక్కు Dr. Gurunath Hyd నుండి తెచ్చినాడు.

8 ఫిబ్రవరి Recahed Warangal by 1 P. M.
సాయంత్రం వైష్ణవోత్సవోపన్యాసము.
Rs. 116 - సన్మానం.

9 from వరంగల్ to కరీంనగరం.
K. Kesava Rao గారికి కేదారగౌళ అంకితం.

10 కరీంనగరం College లో ఉపన్యాసం.

11 వరంగల్ P. G. Centre లో ఉపన్యాసం.

Rs. 100-00 సన్మానము.

శివకుమార్ వరంగల్లులో శివాలయంలో చేయించిన Rs. 116-00 సన్మానం. 9 ఆదివారంనాడు.

24 తెనాలి ఉపన్యాసానికి వెళ్ళి రాత్రి 11గం.లకు వచ్చినాను.

26 స్వామివారి కళ్యాణానికి నందమూరు వెళ్ళినాము.

8 మార్చి M. Sivaprasad Hyd. పంపిన 200 draft.

17 శ్రీ T.V.S. చలపతిగారి కుమార్డు Dr. శ్రీ శర్మ నాకు over-hall checkup చేసినాడు.

11 ఏప్రిల్ Went to Hyderabad to attend World Telugu Conference.

18 Rs. 1116-00 సన్మానము. 120 T. A.

9 మే సంస్కృత నాటకాల Opening Ceremony ఖర్చు 200-00.

16 అమ్మవారి - శృంగేరివారు పంపిన సేల్వ సన్మానము.

4 ఆగస్టు మంత్రి కృష్ణారావుగారి 50వ జన్మదినోత్సవం ఆశీః

5 సెప్టెంబరు Rs. 150 Sent by మానాపత్రిగడ శేషశాయి.

12 Reached విజయనగరం by 7 A. M.

Rs. 232 సన్మానము. Oriental College లో

Rs. 116 వెంకటరావుగారు Vakil.

13 సెప్టెంబరు చోడవరం - సన్మానం.

19 అక్టోబరు ఉషశ్రీకి సన్మానాధ్యక్షతకు 116 - వైశ్యులు ఇచ్చినది

26 Chief Minister & Education Minister came.

21 నవంబరు Went to Hyderabad

22 Hyderabad. Saw the C. M.

25 Hyderabad Television Programme 333 Cheque.

27 నరమేధం Selected. దుర్గ Passed Metric

29 డిసెంబరు Hyderabad పాటిబండ మాధవశర్మగారిసన్మానం.

## 1976

13 జనవరి వసుంధర తల్లిగారి ఆబ్దికం. బ్రాహ్మణులకు 10-00 మ॥ లక్ష్మీనారాయణగారికి 30-00.

19 గుంటూరు నుండి గీతామృత శ్రీవల్లి వచ్చినది. రామచంద్రుడి స్మారక దినం. లాగూ చొక్కా- కూలి 7-50.

6 ఫిబ్రవరి Rs. 500 హరనాధ చేసిన సన్మానం అతనిపెండ్లికి

11 శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి దత్తత చేసికొని- ఆ కుర్రవానికి ఉపనయన భిక్ష 50-0-0.

20 కొండాలి ఆంజనేయులు భార్య పోయి 10వ రోజు

23 చి॥ అచ్యుతదేవరాయలు వచ్చినాడు. from New Delhi.

25 చి॥ పావని రుద్రాభిషేకానికి నందమూరు వెళ్ళినాడు.

6 మార్చి భీమవరం కాలేజిలో ఉపన్యాసము.
Rs. 116 భీమవరం వాళ్ళ సన్మానం.

22 చి॥ మల్లంపల్లి శరభయ్య సపరివారంగా వస్తే అతని పసివానికి 5-00.

14 ఏప్రిల్ బాలాజీస్వామి ఉపన్యాసం. సన్మానం.

18 Went to Ellore to participate in poets conference.

8 మే గన్నవరం వెళ్ళి High School Golden Jubilee.

15 జులై ఇవ్వేళ చి. గీతామృత శ్రీవల్లి పుట్టిన రోజు పండుగ పిల్లకు మూడవ ఏడు వచ్చినది.

6 ఆగస్టు Went to ఈమని - మైథిలి చి.సౌ. బాలపెండ్లికి Rs. 50-00 from చి. కోటేశ్వరరావు.

14 మైథిలి పెండ్లి పద్యాల అచ్చుకు 25-00.

17 ఉయ్యూరు ఉపన్యాసం Rs. సన్మానం.

27 రేపు నాన్నగారి ఆబ్దికం వస్తువులు 100-00

28 నాన్నగారి ఆబ్దికం ఖర్చు 13-00.

13 సెప్టెంబరు రేపు, ఎల్లుండి సహస్ర చంద్రదర్శన మహోత్సవం బంధువులు బ్రాహ్మణులు జమదగ్ని తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారి రాక.

14 సహస్రచంద్ర దర్శనోత్సవము. Rs. 100-00 from జంధ్యాల వేంకటేశ్వర్లు 100 from ఆడిటర్ విశ్వనాథరావు,

15 Rs. 60 from జగద. 900 from ధూళిపాళ శ్రీరామమూర్తిగారు. ఖర్చు మంగళహారతి 220-00.

16 ఉత్సవముల పూర్తి.

24† చి॥సౌ॥ రాజమ్మ మందులకు 30-00.
Rs. 58-00 M. O. from ర్యాలి చిల్లర - పాలు. 5-00.

శివపంచాక్షరి 10,000. రామం 5000 ఆంజనేయం5000.

---

(†) విశ్వనాథవారి డైరీలలో ఇది చిట్టచివరిపుట. ఇంతకు ముందు మూడు రోజులుకూడా ఆయన డైరీవ్రాయలేదు. మంత్రజపముల లెక్కమాత్రము వ్రాసిపెట్టుకొన్నారు. ఈ డైరీ చివరి అట్ట కాగితం లోపల A.S.Raman, కొడాలి ఆంజనేయులు, Dr. D. Sridhara babu, G. V Haranath, P. V. Satyanarayana Sastry గార్ల అడ్రసులు వ్రాసిపెట్టుకొన్నారు. తరువాత అక్టోబరు 7వ తేదీన గుండె జబ్బుతో గుంటూరు హాస్పిటలులో చేరారు. 18 అక్టోబరు 77న ఉదయం గం॥ 10 లకు ఆయన పరమపదించారు.

# విశ్వనాథ చేసిన జపముల వివరములు

విశ్వనాథ సత్యనారాయణగారు నిత్యము శివరామ మంత్రములు జపము చేసేవారనీ, అనేక కోట్ల జపం పూర్తి చేశారనీ, ఆయన సన్నిహితులు చెప్తున్నారు. ఆయన డైరీలలో అక్కడక్కడా ఈ జపతపముల వివరాలు వ్రాసినవి లభిస్తున్నవి. ఈ వివరాలు 1973 నుండి వరుసగా 1976 జూన్ వరకూ లభిస్తున్నవి.

1973 డైరీ చివర 377 పుటలో ఈ క్రింది జపాల లెక్కలు ఉన్నవి. శివరామ మంత్రాలే కాక ఆంజనేయ మంత్రజపం వివరాలూ తెలుస్తున్నవి.

### 1973

| | శివ పంచాక్షరి | రామం | ఆంజ (నేయం) |
|---|---|---|---|
| | ల – వే | ల – వే | ల – వే |
| జనవరి | 6 | 20 } 60 | } 1 – 15 |
| ఫిబ్రివరి | 6 | 20 | |
| మార్చి | 6 | 20 | |
| ఏప్రిల్ | 4 – 50 | 1 – 45 | 1 – 40 |
| మే | 4 – 65 | 1 – 55 | 1 – 55 |
| జూన్ | 4 – 50 | 1 – 50 | 1 – 50 |
| జులై | 4 – 75 | 1 – 55 | 1 – 55 |
| ఆగస్టు | 4 – 29 | 1 – 25 | – – 95 |
| సెప్టెంబరు | 4 – 40 | 1 – 26 | 1 – 40 |
| అక్టోబరు | 4 – 55 | 1 – 45 | 1 – 46 |
| నవంబరు | 1 – 85 | – – 42 | – – 37 |
| డిశంబరు | 4 – 50 | 1 – 47 | 1 – 44 |
| | 55 – 99 | 12 – 60 | 12 – 77 |

ఈ మొత్తాన్ని 1974 లో చేరుస్తూ ఆ సంవత్సరం జప తపాల లెక్కలు.

1974

| | శివ పంచాక్షరి | రామం | ఆంజనేయం |
|---|---|---|---|
| | ల - వే | ల - వే | ల - వే |
| (1973 మొత్తం) | 55 - 99 | 12 - 50 | 12 - 77 |
| జనవరి | 3 - 62 | 1 - 17 | 1 - 17 |
| ఫిబ్రవరి | 3 - 46 | 1 - 15 | 1 - 15 |
| మార్చి | 4 - 45 | 1 - 35 | 1 - 33 |
| ఏప్రిల్ | 4 - 50 | 1 - 50 | 1 - 50 |
| మే | 4 - 66 | 1 - 55 | 1 - 55 |
| జూన్ | 4 - 50 | 1 - 45 | 1 - 43 |
| జులై | 4 - 65 | 1 - 55 | 1 - 55 |
| ఆగస్టు | 4 - 55 | 1 - 50 | 1 - 50 |
| సెప్టెంబరు | 4 - 50 | 1 - 35 | 1 - 20 |
| అక్టోబరు | 4 - 65 | 1 - 55 | 1 - 55 |
| 10th Nov. | 1 - 50 | — | — |
| | 101 - 07 | 26 - 62 | 26 - 70 |

[100 లక్షలు — కోటి.]

| | | | |
|---|---|---|---|
| from 11th Nov. | 1 - 70 | 1 - 65 | 1 - 07 |
| Dec. | 2 - 55 | 1 - 66 | 0 - 59 |
| | 105ల-32వే | 29ల-93వే | 28ల-36వే |

1975లో జప తపాల వివరాలు ఇవి.

## 1975

| | శి. పం. | రామం | ఆంజనేయం |
|---|---|---|---|
| | ల – పే | ల – పే | ల – పే |
| జనవరి | 2 – 66 | 1 – 72 | 0 – 46 |
| ఫిబ్రవరి | 1 – 80 | 1 – 03 | 0 – 31 |
| మార్చి | 2 – 67 | 1 – 90 | 1 – 14 |
| ఏప్రిల్ | 2 – 03 | 1 – 60 | 1 – 29 |
| మే | 2 – 76 | 2 – 39 | 2 – 57 |
| జూన్ | 3 – 00 | 2 – 93 | 2 – 85 |
| జులై | 2 – 80 | 2 – 76 | 2 – 71 |
| ఆగస్టు | 3 – 05 | 2 – 85 | 2 – 82 |
| సెప్టెంబరు | 2 – 95 | 2 – 75 | 2 – 31 |
| అక్టోబరు | 3 – 00 | 2 – 53 | 1 – 90 |
| నవంబరు | 1 – 53 | 1 – 03 | 0 – 77 |
| డిసెంబరు | 2 – 71 | 2 – 47 | 2 – 04 |

1976 లో వివరాలు ఇవి.

## 1976

| | శి. పం. | రామం | ఆంజనేయం |
|---|---|---|---|
| | 36 – 78 | 55 – 87 | 49 – 93 |
| Feb. Jan. | 2 – 85 | 2 – 41 | 2 – 01 |
| March | 3 – 6 | 2 – 98 | 2 – 00 |
| April | 2 – 85 | 2 – 86 | 2 – 72 |
| మే | 3 – 03 | 3 – 11 | 2 – 84 |
| జూన్ | 3 – 00 | 2 – 77 | 2 – 99 |

[1974 వ సంవత్సరం డైరీ మొదట "Cash Account" అన్న కాగితంమీద మంత్రజపము లెక్క లున్నవి. ఇందాక్షి అని కూడ పైనవ్రాసి యున్నవి. 1976 డైరీ చివరి అట్ట వెనుక వైపు కూడా మంత్ర జపముల లెక్కలున్నవి.)

మాకు లభించిన మరికొన్ని లేఖలు వగైరా.

పాటిబండ మాధవశర్మ హైదరాబాదు నుండి 12-2-65న వ్రాసిన లేఖ.

సూరినారాయణమూర్తిగారు జర్మనీ నుండి 14-11-65న వ్రాసిన లేఖ.

అద్దేపల్లి లక్ష్మణస్వామి మచిలీపట్నం నుండి 8-8-76న వ్రాసిన లేఖ.

దావులూరు వేంకటసుబ్బారావు (తెనాలి) నర్తనశాల నాటకమును ప్రదర్శించుటకును ప్రచురించుటకును పది సంవత్సరాల పాటు హక్కును తీసికొనుచు వ్రాసి యిచ్చిన చేవ్రాలుత్తరము. వ్రాసినతేదీ 4-1-1927.

# అముద్రిత రచనలు

(విశ్వనాథవారు తరువాతి కాలంలో వ్రాయడమూ అచ్చు వేయడమూ వెంటవెంట జరుగుతూ వుండేది. కాని ఇంట్లో వెదికితే కొన్ని అసంపూర్ణ రచనలు (ముఖ్యంగా కవితా రచనలు) కొన్ని సంపూర్ణ రచనలుకూడా అముద్రితాలుగా కనిపించినవి. ఇవికాక శ్రీ కృష్ణ సంగీతము కావ్యం ముద్రితమైందే. దాని వ్రాతప్రతి కూడా లభించింది. అట్లానే సంస్కృత నాటకాలు గుప్తపాశుపతము, అమృత శర్మిష్ఠము వ్రాతప్రతులూ లభించాయి.

విశ్వనాథ తెలుగులో వ్రాసిన గుప్తపాశుపత నాటకం ఇంకా అచ్చు కాలేదు – అదీ నందిగామ రాజ్యమనే నవలా లభించాయి.

ఈ అముద్రిత రచనల – వ్రాత ప్రతుల వివరాలు క్రింద ఇవ్వబడుతూ వున్నవి.)

## 1. నా రాముడు

ఆనందమయుడు – ఆనందమూర్తి – అవతారమూర్తి – బాలరాముడు – కోదండరాముడు – అయోధ్యరాముడు – దశరథరాముడు – జానకీరాముడు – రఘురాముడు – ఆత్మారాముడు అను ఈ పది శీర్షికల క్రింద వరుసగా పది పది చొప్పున మొత్తము నూరు పద్యాలుగానున్న కృతి ఇది.

మొదటి శీర్షిక స్వామి లక్షణము అని మొదట యుండి అది కొట్టి వేయబడి ఆనందమయుడు అని వ్రాయబడి యున్నది. ఇందలి మొదటి రెండు పద్యాల మీద కొటివేతల వలె రెండు

మూడు నిలువు గీతలున్నవి. కానీ అందువల్ల అవి లేనట్లుకాదు. అవి లేకపోతే ఆ శీర్షిక క్రింద ఎనిమిది పద్యాలే కాగలవు. అది పద్ధతి కాదు. అవి ఎవరో చిన్నపిల్లలు గీచిన గీతలు కావచ్చును. ఇంతకంటె ఎక్కువగా తొమ్మిదవ శీర్షిక క్రింది వాటిలో ఉపధా పద్యము మీద కొట్టివేత గీతలున్నవి. అది కాకుండగనే పది పద్యాలున్నవి గనుక ఆ పద్యమును రచయితయే కొట్టివేసినట్లు భావింపవచ్చును.

ఈ వ్రాత ప్రతి అంతయు విశ్వనాథవారి హస్తాక్షరియే.

చివరి ఆత్మారాముడు శీర్షిక క్రింద పద్యాలు పదీ అయి పోయిన తరువాత వెంటనే ఆకాగితము మీదనే మొదలైనాలుగు పద్యాలున్నవి. మూడవది పద్యము కాదు.

ఆ ప్రక్క కాగితముమీద ఆనందమయుడు అన్న శీర్షిక క్రింద నాలుగు పద్యాలున్నవి. ఇవి మొదటి శీర్షికతో సంబంధ మున్నవి కావు. ఈ చివరి పుట చూడగా రచన అక్కడ సమాప్తమైనట్లుగా కాక మధ్యలో ఆగిపోయినట్లుగా నున్నది.

ఈ నూరు పద్యాల కృతిలో విశ్వనాథ సత్యనారాయణగారు శ్రీరాముని పరబ్రహ్మ లక్షణమును- ఆయన అవతార గాథను తాము భావించిన తీరును, నిత్య ధ్యాన లక్షణముచేత రామాయణ మును రచించుటచేత నాతడు తనను వదలక ఆత్మారాముడయి కూర్చున్న స్వానుభవ విషయమును వ్యక్తీకరించుటకు ప్రయ త్నించినారు. సర్వ సంపత్కరమైన ఆత్మారాముని సదమల రూపము కల్పవృక్షముగా ప్రతిపాదించినారు.

మరియు చివరకున్న నాలుగు పద్యాలలో ఆత్మారాముని ఆనందమయ లక్షణము తమ అనుభూతికైన సన్నివేశములున్నవి

కాని.. "నాకు జ్ఞాపకమున్నవైనను నవెట్టి వన్ని విట్టివటంచునే
నాడలేను, భాషలో వానిఁజెప్పు శబ్దాలులేవు" అని విశ్వనాథ
శారద ఆగినది.

ఈ కావ్యమున మొదటి పద్యము.

నన్నున్ నన్నుగఁజూడలేద యెపుడున్ నాలో శివాఽభిన్నుడై
యున్నాడన్నది యూహచేసెదన నాయూహల్ నిజంబైనచో
నున్నాడంచనవచ్చు సంఘటనలందున్నట్లుగాఁ జేయు లే
డన్నన్ లేడనవచ్చు నుండెనని నష్టానందమే పొరెడున్.

చివర పద్యము

ఆ రామాయణ మిట్లు వ్రాసితిని నిత్యధ్యానముంజేసెదన్
శ్రీరాముండనుమాట విన్నయెడలన్ హృత్సీమ నిండారగా
ఆ రామాయణ పూర్తియయ్యె వదలం డారాముడున్నన్ను నా
త్మారాముండయి యుండెనో తెలియరాదాయెన్ భయంబయ్యెడిన్.

ఇట్లీ చివరి శీర్షిక ముగిసిన తరువాత వ్రాయబడిన నాలుగు
పద్యాలు— శ్రీరామాయనమః

ఉండెన్ నాకుఁ బ్రివాహ భూత ప్రతిభా వ్యుత్పత్తు లభ్యాసమున్
నిండెన్ ముప్పది యేండ్లు వ్రాయుటకు గానీ కల్పవృక్షంబు నే
రెండేండ్లైనను చాలు నెప్డెపుడు తాహృత్సీమలో రాముడై
యుండెన్ వ్రాయుటగల్గె లేదు మరిలేదు త్రిశదబ్దంబుగా

మరియొక చిత్రమైనదగు మాట ఒకప్పుడురాదు పద్యపుం
చరణము నెంత గింజుకొన సాగదయెప్పుడో వ్రాసియున్నటుల్
స్ఫురణము కాగితంబుపయి పూన్చుట నాపని వ్రాసినట్టి దె
వ్వరు రఘురామ చంద్రుడయి వ్రాసెను స్వామికి తెల్గువచ్చునా

యదన్నాః మానవాః
తదన్నా వై దేవతాః
యద్భాషా మానవాః
తద్భాషా వై దేవతాః

ఇది యాత్మారాముని దౌ
సదమల రూపంబు సర్వసంపత్కరంబై
మదినమ్మము కడు మంచిది
మదినమ్మవు నంతకంటె మంచిది పోనీ.

శ్రీరామ

## శ్రీ శారదా చంద్రమౌళీశ్వర సుప్రభాతమ్

ఇది సంస్కృత రచన. 102 శ్లోకాలు. పది ఖండాలు. ఖండమునకు 10 శ్లోకాలు. చివరకున్న రెండును ఖండ సంఖ్యా సూచనయేమీ లేకుండా ఉన్నవి. ఈ వ్రాత ప్రతి విశ్వనాధవారి హస్తాక్షరి కాదు. ఎవరో కాపీ వ్రాసినది ఇదంతయును విశ్వనాథ మధ్యాకర్లు వారణాసీ ప్రథమ శతకము వ్రాత ప్రతి పుస్తకములో మూడవ పుట నుండి ఉన్నది.

ఇందులో ఒక్కొక్క దశకమునకు ఒక్కొక్క ఛందస్సు నుపయోగించుటను పెట్టుకొన్నట్లున్నది. ఇందు కపవాద మొక్క-పదియవ దశకము. అందు 1. ఉపచిత్రం, 2. అపర వక్త్రం, 3. పుష్పితాగ్ర, 4 మాలభరణీ, 5. వియోగిని, 6. వేగవతి, 7. హరిణప్లుతా, 8, ఉద్గతా, 9. ఆర్యా, 10. వైతాళీయం- అను

ఈ ఈ విధముగా పది ఛందస్సులు వాడబడినవి. వ్రాత ప్రతి యందు ఈ ఛందో విశేషములు సూచింపబడి యున్నవి. ఇట్టి సూచన ప్రథమ దశకమున "శైల శిఖా వృత్తమ్" అని ముందున్నది. ఆఖండమంతయు నా ఛందస్సులోనున్నది. ఛందో విషయ సూచనలేని 2-3-4-5-6-7-8-9 ఖండములు వరుసగా ఇంద్ర వంశ-శిఖరిణీ-వసంత తిలక-పృధ్వీ-మాలిని-స్రగ్ధర-శార్దూల విక్రీడితము-ప్రహర్షిణీ-ఛందస్సులలో ఉన్నవి.

చివరకున్న రెండు శ్లోకములు మందాక్రాంతములు. ఇవి ఇంకొక ఆరు వ్రాసి మొత్తమష్టోత్తర శతముగాచేసి చేసెడు ఆలోచన విశ్వనాధవారి కుండియుండ వచ్చును. అన్ని సుప్రభాతములవలెకాక ఇది ఇట్లుండుట విశేషము. తెలుగునందు వలె సంస్కృతమున శతకమునకు మకుట లక్షణము లేకపోయినను అక్కడక్కడ మకుట భ్రాంతిని కల్పించు పదబంధములు జాగృహివిభో- శ్రీ చంద్రమౌళీ పరమేశ్వర జాగృహీహ- ప్రభో జాగృహి- సుమగిరిపతే శారదాచంద్రమౌళే అను నిట్టివి కలవు.

శ్రీ శారదా చంద్రమౌళీశ్వర సుప్రభాతమున మొదటి శైల శిఖావృత్తము-

జాగృహి శారదా సహిత చంద్రకిరీట! విభో!
నిద్రిత మామకీన హృదయే సభయే సరయే
కిం శివ! నిత్యజాగ్రదుదితోజ్జ్వల సంవిద పాం
రాశిరహో! భవాభినయ త్యధసుప్తిమిహ!!

చిట్టచివరి మందా క్రాంతము –
ఆర్త్యాకజ్వలన నయనప్రోన్నమ ద్వహ్ని మాలా
జ్వాలాలీఢ త్రిభువన మహాకామగాథా తపస్విన్!
అంతస్తేజో గత విలయభాగేశకాల స్వరూప!
అర్చేతః! సుమగిరి పతే! శారదా చంద్రమౌళే!

# మంగళాద్రి స్వామి మేల్కొలుపు

శ్రీ మంగళగిరి నృసింహస్వామి వారి మేల్కొలుపులుగా సత్యనారాయణగారెన్ని పద్యాలు వ్రాయసంకల్పించినారో తెలియదు. వారి హస్తాక్షరిగానున్న ఈ వ్రాతప్రతిలో పందొమ్మిది పద్యాలు మాత్రమున్నవి. మకుటమొకటి పాటింపబడుటచేత శతకప్రక్రియగా ప్రారంభింపబడిన కృతియనవచ్చును.

## మొదటి పద్యము

ఈ వైయావె సుషుప్తి వీడవలెఁగానీ వేరు మేల్కొల్ప స్తం
భావిర్భావముగాంచి తల్లియాయి స్తంభంబిట్లుగా వచ్చి లే
రాః వాల్లభ్య పయోధియంచుఁ దమి తీరన్ లేపునా విన్ను లె
మ్మా విశ్వంభరః మంగళాద్రి నరసింహః మేలుకోవే ప్రభూ

## చివరి పద్యము

తమ రాజున్ వధియించినావనుచు దైత్యశ్రేణికొ్రవ్వాడి బ
ల్లెములం గైకొని నీదు వేటకును రాలేదో పితా పుత్ర వా
దము నేకాంతమునందునన్ జరిగి సౌధాంతఃబునందున్ రహ
స్యముగాఁజంపితో మంగళాద్రి నరసింహః మేలుకోవేప్రభూ,

ఈ పందొమ్మిది పద్యాలు కాగానే ప్రక్కపుటలో "శివాః 17-5-72" అని వ్రాసి రెండు పద్యాలున్నవి.

శివాః 17-5-72

నన్నున్ నీదరిఁజేర్చుకోవె యభవాః నా జన్మసార్థక్యమా
చున్నట్లున్నది నీ కృపంబడి జనాంహోవాహినీ పాద సం
పన్నాః సౌరజగద్రిమా విభవ భాస్వద్వాహినీ మౌళి సం
పన్నాః పన్నగహస్త భూషణకుణుక్వాణ ప్రమోదాకృతీః

తక్కిన వట్టి పెట్టి యరు దారగ దారగ నేలికొన్న యా
చిక్కని తల్లి పాద సరసీరుహ సీరకృతాభిమర్శనన్
దుక్కిగనైన వెండిమల తొల్తటి దౌనిలు ముంగిటన్ గనున్
మ్రొక్కగనీవె తెల్లనగు ముగ్గుల నెట్టని లత్తుకన్ శివా!

ఈ పద్యాలూ విశ్వనాథవారి హస్తాక్షరియే.

## రామ నాటకము

దీనిపేరు అశోకవనము కావచ్చును. ముందువెనుకలు లేని వ్రాతప్రతి ఇది. ఎవరో కాపీ వ్రాసినది. ఆంజనేయునితోకకు నిప్పు అంటించి ఊరెల్ల త్రిప్పుటకు రావణుడాజ్ఞాపించుట వద్ద నుండి మొదలై లంకా దహనమైన తరువాత సీతనుచూచి ఆమె యనుజ్ఞ తీసికొని హనుమంతుడు తిరిగి పోవుట వద్ద ఆగిపోవు చున్నదీ ఆద్యంతములులేని నాటకము. ఇది రంగములుగా విభ జింపబడినది. లంకకు నిప్పు పెట్టిన ఆంజనేయుడు సీతాదేవిని చూచుటకు అశోకవనమును ప్రవేశించుట నుండి "చతుర్థ రంగము" అని యున్నది. ఈ రంగము చివర తెరబడినది కాని ఈ అంక మింతటితో సమాప్తమా కాదా అన్నది తెలియుటలేదు.

నిప్పంటించిన తోకతో ఆంజనేయుని ప్రవేశమును సూచిం చుటకు ముందు పంచమాంకము అని యున్నందున రావణుడు నిప్పంటించి ఊరెల్ల త్రిప్పుమనుట నాల్గవ యంకము చివరయగు చున్నది.

పంచమాంకము ప్రథమ రంగమున నాలుగుచోట్ల నాలుగు పద్యాలకు కావచ్చును జాగా వదలిపెట్టబడి యున్నది. ఇది దహన కాండను సూచించెడు రంగము. రెండవది మండోదరి ఇంద్రజిత్తు రావణుడు ముగ్గురును కలసి ఆంజనేయుని విషయములనుకొనుట. అనుకొనుటలో ఆంజనేయుని సౌందర్య ప్రసక్తి వచ్చి అది శ్రీరామ

చంద్రుని - పరమ శివుని సమాకర్షించుట ఆ తరువాత తృతీయ రంగము. రావణుడు విభీషణుడు ఇద్దరును శ్రీరాముని పరమాత్మ లక్షణమును పరమశివాభేదలక్షణమును ఉక్తి ప్రత్యుక్తుల మీద విచారించుకొనుటగా నున్నది. ఆంజనేయుడు సీతామ్మవారికి ఎచ్చి చెప్పి పోవుటయైన నాల్గవరంగము పోవుచున్న ఆంజనేయుని వెనుకకు పిలిచి పున్నాగ వృక్షములకు అశోకములని ఇంకొకపేరు. నీవు వచ్చి నా శోకమును ఇక్కడ తీసివేసితివి గనుక నేను కల్పించుచున్నాను - "నేటి నుండి నిఘంటుకారులు వ్రాసికొందురు గాక; ఇది అశోక వనము" అను సీతాదేవి మాటలతో ముగియు చున్నది.

ఇందుకే దీని పేరు అశోక వనము కావచ్చునేమో అని ఊహ. మొత్తము నాటకము లభించినప్పుడసలు పేరు బయట పడును.

## యక్షుండి అప్పు

ఇది విశ్వనాథవారి ఒక రేడియో నాటిక 26 పుటలు. ఎవరో వ్రాసిన కార్బను కాపీ ఇది. మొదటి పేజీ మీద మారుతి చిత్ర కళాపరిషత్తు సమర్పణ అని కలదు. రెండవ పేజీలో - కేశవ దాసు రామగిరి, కనకారావు, పూజారి. రామం - ఈ పాత్రల వయస్సు మొదలయిన సూచనలు గలవు.

ఇందులోని పాత్రలు ఆధునిక సామాజిక వ్యవస్థకు వారస త్వముగా సంక్రమించిన పరపీడన పరాయణత్వము - అతి సంచ యనేచ్ఛ - ధన దాహము కలిగిన, ఊళ్లను ఇళ్లనూ నేలమట్టము చేసే పాషాణ హృదయముగల పెట్టుబడిదారీ విధానము, సాధారణ మానవులను వారి కష్టనష్టాల సంగతి పట్టించుకోకుండా వారిని స్వలాభానికి వాడుకొని వారికి ప్రతిఫలంలేకుండా చేసే లక్షణం

ఏలా ఉంటుందో నిరూపించటానికి ప్రతీకలుగా పాత్రలు కల్పింప బడినవి. రామగిరి పర్వతం మీద ఒక సంవత్సరం ప్రియా వియోగ శాపాన్ని అనుభవిస్తూ ఒకానొక యక్షుడున్నాడన్న కాళిదాసు మాటను పట్టుకొని, ఆ యక్షునకు రామగిరి అప్పు పెట్టినట్లు - దానికి వడ్డీలు పెరుగుతున్నట్లు, వడ్డీల వసూలకు పైరవీలవసర మున్నట్లూ, భగవంతుణ్ణి ఐహిక లాభాలకు ఆశ్రయిస్తున్నట్లూ - దేశంలో సాధారణులు పూట గడవక నానా యాతనలు పడుతుంటే ధనవంతులు పట్టనట్లు కాలక్షేపం చేస్తున్నట్లూ - దిక్కులేని వారికి శివుడే దిక్కన్నట్లూ - దేశంలోని ఆర్థిక పరిస్థితులు కూడా సక్రమంగా లేవన్నట్లూ - బంగారం లేకుండా కాగితాల డబ్బును అదేపనిగా చెలామణి చెయ్యటం మంచిది కాదన్నట్లూ అనేక సామాజిక దైనందిన విషయాలను స్పృశిస్తూ రచింపబడిన వ్యంగ్య నాటిక ఇది.

ఈ నాటికను 27 జులై 1976న హైదరాబాదు ఆకాశవాణివారు ప్రసారం చేశారు.

## ఇంద్ర ధనుస్సు

ఇది అసంపూర్ణ రచన. 19 పద్యాలున్నవి. ఇవికాక ముందు పుటమీద విడిగా ఒక చంపకమాల యున్నది. దానితో కలిసి మొత్తము 20 పద్యాలు.

"అంకితము Dr. D.S. Reddy, Vice-chanceller Osmania University, Hyderabad." అని మొట్ట మొదటి పుటమీద వ్రాయబడియున్నది.

పై ఇరువది పద్యాలలో 12 పద్యాలు అక్కడక్కడ కొద్దిపాటి

పాఠభేదముతోను కేదారగౌళలో ఇంద్రధనుస్సు-1. అను శీర్షికను సంకలితములై యున్నవి. మరియు ఇంద్రధనుస్సు-2 అను శీర్షికను అందు సంకలితములయిన తొమ్మిది పద్యాలు ఈ వ్రాత ప్రతిలో లేవు.[1] ఎక్కడను ప్రకటితములుగాక ఇందున్న ఎనిమిది పద్యములు ఇవి.

క॥ అన్నోదకములఁగూర్చుము
మన్నీడా! బ్రదుకవిమ్ము మాకది చాలన్
మిన్నెండఁగట్టఁబోకుము
మన్నున నెత్తురులు పులుము మతిచేయకు మీ.

మ॥ నతపాపావనిదువ్వి సస్యకృతమున్ నాశెన్ ఛళా యేకవిం
శతి కృత్యంబుగఁ గల్పితిసె మరలన్ క్షత్రంబు రేకెత్తె నీ
గతి నావేశము తొల్త పాపమతులం గఁన్ బరధూతి సం
గతిగా సిగ్గును లేదు రాజులయి సంఘ క్లిష్టులే వారికిన్.

క॥ తన యధికార బలంబే
తన బుద్ధిబలంబటంచుఁ దనరారెడి స
జ్జనులారా! దైవమునా
దని యొప్పకుఁ దద్ది భంగమగు మీ పనికిన్.

ఉ॥ అన్నికులాలవారికడ నక్కట! నీవు వసూలు చేయుచుం
బన్నులు రాజ! నీ కులమువారికి మాత్రము పెద్ద జీతముల్
క్రిన్నన వచ్చునట్టి యధికారము లిచ్చుట యేమి ధర్మ సం
పన్నత యేమి న్యాయ పరిపాలన మందువొ యబ్జలోచనా!

---

1 ఇంద్రధనుస్సు ఒకటి సెప్టెంబరు 1963న వాణీ పత్రికలోనూ ఇంద్రధనుస్సు రెండు అక్టోబరు 1963న "పుస్తక ప్రపంచము" నందును ప్రచురింపబడినవి.

ఉ॥ చేరియొకింత శాంతముగ జీవితమంతయు వెళ్లబుచ్చగాఁ
గోరెదవేని దుర్లభము కూడును గుడ్డయు నుంత జీవనా
ధారము లేనివారు గతదర్పులు పాల్యముగాగ జీవనా
ధారము కల్గి లేక దృతదర్పులు పాలకులౌట చిత్రమై.

మ॥ అరులన్ దూరముగాగనుంచుము ముద్దొరా! అన్నోదకంబుల్
ధరలం బెంచక చూడు మన్నన సమర్థత్వంబు పాటించి వ
హ్వారె! పెండ్లిండ్లను నమ్మకంబులును మాయాచారముల్ పట్టిమా
ర్చుర! నీ వెర్రి సమస్తధాత్రి తలకుంజుట్టన్
బ్రియత్నించుచున్.

చ॥ తెనుగు ధరిత్రిలోఁ దెలివితేటలు బీటలువోవు నింట విం
టను నొక కాళిదాసయిన నాటికి నేటికిఁ జూడఁ జిత్రమై
కన నతి కాళిదాసొకఁడు కన్పడు నెట్టని జుత్తువాఁడు తు
త్తునియల బుద్ధివాడు నతిధూర్తుఁడు తోడేలునోటి కండయై.

గీ॥ సందియంబులు లేనిచో సందియములు
కలవటంచును వ్రాసెడు ఖరము వాఁడు
ఖరములున్నవటంచు వాఁడెలుఁగు నొండ్రి
పెట్టుచును బంటకాలువ గట్టువెంట.

# పిల్లల రామాయణము

'ముత్యాల సరం' ఛందస్సులో సత్యనారాయణగారు ఈ రామాయణం రచించారు. పదు నాల్గు మాత్రల పాదాలు మూడు తొమ్మిది మాత్రల పాదం ఒకటిగా అన్నీ నాలుగేసి పాదాలుగా ఉన్న పద్యాలు బాలకాండములో 168 అయోధ్యకాండములో 169 అరణ్య కాండములో 14 మొత్తం 351 ఉన్నవి. ఉన్నంతలో నిదానించి చూడగా ఒక్కొక్క కాండములోని కథను పన్నెండు ఖండములుగానూ, ఖండమును పదు నాల్గు పద్యాలుగానూ వ్రాయ సంకల్పించినట్లు కన్పించుచున్నది. ఈ నియమమున కపవాదుగా అయోధ్యకాండము నందలి పదునొకండవ ఖండము పదిహేను పద్యములతో నున్నది. అరణ్య కాండము ప్రథమ ఖండము వరకే వ్రాత ప్రతి యున్నది. తరువాతి పుటలో రెండవ ఖండ మునకు అంకె వేసి యున్నది.

బాలకాండములోని మొదటి రెండు ఖండములును ముద్రిత ములు. ఈ వ్రాత ప్రతిలో ఆ రెండు ఖండములును అచ్చు కాగితములే అంటింపబడినవి. మూడవ ఖండము నుండి వ్రాత అంతయు సత్యనారాయణగారి హస్తాక్షరియే.

ఈ గ్రంథమును 1951 ప్రాంతాలలో విజయవాడ నుండి ప్రచురింపబడిన "బాల ప్రభ" అను పిల్లల వార పత్రికలో ప్రచురణార్థము రచించారు. ఆ పత్రిక ఆగిపోవుట కారణముగా రచన మధ్యలోనే – అరణ్యకాండ ప్రథమ ఖండముతో– ఆగినట్లు న్నది. అయోధ్య కాండములోని ఆరవ ఖండము 23–10–1951 బాలప్రభ సంచికలో ప్రచురింపబడిన పేపరు కటింగు కలదు.

ఈ రచన బాలపత్రికలో జూన్ 1951 ప్రాంతంలో వరుసగా ప్రచురించుట ప్రారంభమై 1952 మొదట ఆగిపోయినట్లు భావించ వచ్చును.

ఈ రామాయణంలోని కాండలలోని ఖండములు వానిలో విషయము:

బాలకాండము:–

1. రాక్షసులూ రావణాసురుడూ వారి దుండగాలూ, 2. అయోధ్య అందులో దశరథుడు - ఆయనకు రాముడు మొదలయిన నలుగురు కొడుకులు పుట్టుట- అందుకాయన యజ్ఞము చేయుట. 3. రామలక్ష్మణుల భరత శత్రుఘ్నుల బాల్యమున చదువు సంధ్యలు, 4. విశ్వామిత్రుడు బ్రహర్షియైన కథ - ఆయన రాముని చూడ వచ్చుట. 5. దశరథుడు విశ్వామిత్రుడడిగిన దిచ్చుటకు సిద్ధపడి రాముని నాకిమ్మనగా వెనుకాడుట, వసిష్ఠుడు చెప్పిన మీదట రామలక్ష్మణులను వాని వెంట పంపుట, 6. విశ్వామిత్రుడు మంత్రములనుపదేశించుట - అస్త్రములిచ్చుట - తాటక వచ్చుట - దానిని రాముడు సంహరించుట, 7. విశ్వామిత్రుని యజ్ఞమును పాడు చేయవచ్చిన మారీచ సుబాహులను రాముడు సంహరించుట, రామలక్ష్మణులను విశ్వామిత్రుడు మిథిలానగరమునకు తీసికొని పోవుట, 8. అహల్యాశాప విమోచనము - మిథిలానగర ప్రవేశము, 9. జనకునకు సీత లభించుట - సీత పెండ్లిని గూర్చి జనకుడు విచారించి శివుని విల్లు విరచిన వానికియ్య నిశ్చయించుకొనుట - రాజులు వచ్చి అశక్తులై పోవుట - రాముడు వచ్చుట, 10. రాముడు శివుని విల్లును విశ్వామిత్రుని యాజ్ఞమీద విరచుట - జనకుడు తన కుమార్తెలను రామలక్ష్మణ భరత శత్రుఘ్నులకిచ్చుట, 11. కార్త వీర్యార్జునుడు జమదగ్ని ఆవును దోలికొని పోవుట - పరశురాముడు వానిని సంహరించుట, వాని కొడుకులు దొంగచాటుగా జమదగ్నిని

తలకోసి చంపుట - పరశురాముడు రాజులను ఇర్వదియొక్క మారు ఏరి ఏరి చంపుట, 12. పెండ్లివారు అయోధ్యకు పోవుచుండగా పరశురాముడు ఎదుర్కొనుట - రాముడు పరశురాముని చేతిలోని విష్ణువు ధనస్సును అతని ఆత్మశక్తిని కలిపి లాగకొనుట - ఈ మొదలయిన స్థూల విషయములను చుట్టకొని బాలకాండమన్నది.

## అయోధ్య కాండము:-

1. దశరధునకు వచ్చిన మునిశాప కథ, 2. శ్రీరామ పట్టాభి షేక ప్రయత్నము. 3. కైకవరములడుగుట, 4. శ్రీరాముని వన గమనము, 5. సీతారామలక్ష్మణులు గుహుని భరద్వాజుని మన్నన లంది చిత్రకూటము చేరుట, 6. భరతుడు వచ్చి దశరధుని మరణ విషయము రాముని వనగమనము తెలిసి తనకు రాజ్యమక్కరలేదని చెప్పుట, 7. భరతుడు చిత్రకూటమునకు ససైన్యముగా వచ్చుటను లక్ష్మణుడు చూచి చెప్పుట, 8. పితృవాక్య పరిపాలనము ధర్మమని రాముడు భరతునకు చెప్పుట, 9. చివరకు భరతుడు శ్రీరాముని పావకోళ్లను తీసికొని సింహాసనము నందుంచి అన్నగారికి బదులుగా రాజ్యపరిపాలన వ్యవహారము చూచుట కంగీకరించుట, 10. లక్ష్మణుడు విద్రాహారములు మాని సీతారాముల కంగరక్షకుడై వారిని సేవించుటయు వారి అడవి జీవితము సరదాగా గడచిపోవు చుండుటయును, 11. కాకాసుర వృత్తాంతము, 12. శ్రీరాముడు అత్రి ఆశ్రమమునకు చేరుట. అనసూయ సీతకు చీర పెట్టుట - సీతారామ లక్ష్మణులు దండ కారణ్యమునకు బయలుదేరుట - ఈ మొదలైన కథాంశములను వర్ణించి చెప్పుటగా అయోధ్యకాండము ముగియుచున్నది.

1. విరాధుడు సీతను పట్టుకొని రామలక్ష్మణులచేత చేతుల నరకబడి పూడ్చి పెట్టబడుట- అరణ్యకాండము మొదలు-

ఇంతవరకే ఈ వ్రాత ప్రతి యందున్నది.

పిల్లల రామాయణము బాలకాండము మొదలు

ప్రొద్దు పొడిచిన క్రొత్త లోపల
పెద్ద కాలపు మొదటి నాళ్లల
సుద్ది చెప్పెద మీరు విందురె
ముద్దు నాయనలూ!

వ్రాత ప్రతి మొదలు: (మూడవ ఖండము)

ఓరి నాయనలార! నేనును
మీరు పుట్టిన యందుకే మన
తల్లిదండ్రుల సంబరమది
పట్టరాదు గదా!

అట్టి కొడుకులు కలుగ దశరధు
డెట్టి సంబరమంది యుండునొ
మువురు తల్లులు నెంతగా గను
మురిసి పోవుదురో-

వ్రాత ప్రతి చివర (అరణ్య కాండమున మొదటి ఖండము) విరాధవధ.

అడుగులోనే హంస పాదన
అడవిలో నడుగిడిన యంతన
అసుర యొకడు విరాధు డను వా
డడ్డు పడినాడూ 1

అతడు తాడంత యెత్తున్నా
డతని భుజమున విసువశూలము

శూలమున సింహముల శవముల
గుచ్చి యున్నాడూ 2

సీత మాటకు మాట బదులను
చెప్పెనని కోపమున రాముడు
అడవిలోపల సీతకెదముగ
నడచు చుండగనూ 3

వెనుక నుండి విరాధుడును తా
వచ్చి సీతను పట్టుకొనియెను
సీత భయపడి కెవ్వుమంచును
కూత పెట్టినదీ 4

అన్నదమ్ములు తిరిగి చూడగ
ఆకాశమంతున్న రక్కసి
పకపకా నవ్వుచును సీతను
పట్టుకొని లాగెన్. 5

సీత నా పెండ్లామురా యిది
సీత బంగరు బొమ్మ యీయమ
నీకు జోగికి పెండ్లమేమిటి
నేను కొనిపోదున్ 6

సీత గడగడ వణకి పోవుచు
చేయివదలించుకొన జూచుచు
కాపుడంచును మగని మరదిని
బావురని యేడ్చెన్ 7

రామునకు కోపమ్ము వచ్చెను
రాక్షసునిపై వండ బాణము

లేయగా రాక్షసుడు నవ్వేను
చెక్కు చెదరకనూ 8

అంత సీతను వదలి రక్కసి
వింతగా రామునిన్ లక్ష్మణు
పట్టుకొని యిద్దఱను బుజముల
పెట్టుకొని పోవన్ 9

సీతయొక్కతె యడవిలోపల
చిక్కి యేడ్వగ జూచి రాముడు
దిగుటకైనను చేతగాకయ
దిగులు పడి పోయెన్ 10

అంత లక్ష్మణుడిట్లు చెప్పెను
అన్నః యింత యధైర్యమేటికి
అతని బుజములు నరకుదము మన
మిద్దరమునవియెన్ 11

తోడనే యిద్దఱును కత్తులు
దూసి చేతులు నరకివైచిరి
ఫెళ్ళుమని రాక్షసుడు నేలను
విరుచుకొని పడియెన్ 12

వాడు చావడు బ్రహ్మ వానికి
వరమొసంగెను చావకుండగ
అందుచే నొక గొయ్యి త్రవ్విరి
అందు పూడిచిరీ 13

రాళ్ళు అప్పలు పైన వేసిరి
రాక్షసుడులోపలే చచ్చెను
చిక్కు తీరగవారు వెళ్ళి
సీతతో గలిసీ 14

రామాయణమును పిల్లల కొరకు సరళ సుందరముగనూ, పెద్దల కొరకు ప్రౌఢ సుందరముగనూ తెలుగుల కందజేయుటకు చేసిన విశ్వనాథ సంకల్పము అగ్గింపదగినది. కల్పవృక్షమునకువలె ఇది సంపూర్ణముకాక పోవుట విచార్యము.

## విశ్వనాథ మధ్యాక్కులు:

వారణాసి ప్రథమ శతకము అని అయిదు పద్యాలున్న పుస్తక మొకటి యున్నది. వారణాసీ ప్రభూ విశ్వనాథ అని మకుటము. అయిదవ గణము మొదటి యక్షరముయతి. ప్రభూ లోని భూయతి స్థానమునందుండి ప్రతి పద్యము యొక్క నాల్గవ పాదము ప్రథమాక్షరమును పాలించుచున్నది.

కాశీవిశ్వేశ్వరుని గురించి ఎన్ని శతకములు వ్రాయుటకు సంకల్పించిరో తెలియదు. ఇది ప్రథమ శతకమనుట చేత అయన సంకల్ప లక్షణమును గూర్చి ఊహాలు కలుగుచున్నవి.

### ఆ అయిదు పద్యాలు ఇవ్వి:

శ్రీ కంధరాః దయామంథరాః మహాశ్రీ సుందరాః గు
హా కోణ వీధీనిగూఢః యమ నిధిధ్యాస నిరూఢః
ఏకాంత భావనాచరమ రేఖాంత హీరాకృతీః శ
మౌకస్స్థితి సనాథః వారణాసీ ప్రభూః విశ్వనాథః

మిగిలిన బ్రతుకెల్ల నెల్లఁదాక నీమీఁదనేపాడి
తిగకంటివేల్పుః నీభక్తియను కామధేనువు పాడి
తెగఁజేసికొని పాలు ఒలికి నునువెన్న తీయగా నీయ
మొగమాట పడఁగదే వారణాసీ ప్రభూః విశ్వనాథః

పరమశివా! నేను గంధకంబును బాదరసంబు
పరగంగఁబుశము పెట్టినను పూర్ణచంద్రోదయంబు
మరలింపు బంగరు కలిపిచేయకు మకరధ్వజంబు
పురుషార్థపరిణామ వారణాసీప్రభూ! విశ్వనాధ!

తేరగా సమకూడి దేశదేశాలు తిరిగితిఁగాని
తీరిక చేసుకవచ్చి నీపాద దేశంబుచూడ
వారయ్య నీచోటుచూచుటప్పటి కట్టిపెట్టితివా
పోరు పడన్‌లేక వారణాసీప్రభూ! విశ్వనాధ!

విడక మధ్యాక్కఱన్ వ్రాయుటయు నాకె వినుపుగానయ్యో
నెడపక రక్షింపు మంచుఁజెప్పినదే చెప్పుచుండి
గడఁగి యేమనవలె ధ్యానమగ్నత కదలకయుండు
నొడుపు నేర్వనివాని వారణాసీప్రభూ! విశ్వనాథ!

ఈ వారణాసి ప్రథమ శతక రచనా కాల సూచనలేమి యును ఉన్న వ్రాత ప్రతి యందులేవు. మధ్యాక్కఱను వ్రాయుటను గురించిన ప్రస్తావన చేయబడినందున బహుశః ఇది పది మధ్యాక్కఱ శతకములును వ్రాసిన తరువాత 1960కి దరిమిలా ఎప్పుడో ప్రారంభింపబడి యుండును. వినుపుగానయ్యోనను మాట చమత్కారముతో బాటు వేయి పద్యముల సల్లిన విషయమును స్ఫురింపజేయుచున్నది.

# శివసహస్రిమ్

ఈ సంస్కృత కృతిని పది శతకములుగా విశ్వనాథ వ్రాయ సంకల్పించినట్లున్నది. మొదటి శతకము పృథ్వీ వృత్తము. రెండవది శిఖరిణీ వృత్తము. మూడవది హరిణి. నాల్గవది మందాక్రాంత.

రెండవ శతకములో 36 శ్లోకములయిన తరువాత 15 పేజీలు ఖాళీగా ఉండి ఆ తరువాత పుటమీద నాలుగు శ్లోకములున్నవి. అంతటితో రెండవ శతకము పూర్తి అయినట్లు ప్రక్క పుటనుండి శివసహస్రిం–3 మొదలగుచున్నది. ఆ 15 పేజీలలో వ్రాయ వలసిన శ్లోకాలను మరొకచోట వ్రాసి యుండి వాటినీ పుస్తకము లోవి కెక్కించ లేదేమో ననిపించుచున్నది. ఎందుకనగా ఆ ఖాళీ పేజీలలో పట్టే శ్లోకాలు 60 మాత్రమే 40 శ్లోకాలిందుండనే యున్నవి. ఆ అరువది శిఖరిణీ వృత్తాలున్న విడికాగితాలు కూడా లభించినవి. అందు అధికముగా ఉన్న నాలుగు శ్లోకాలు కొట్టివేయ బయుడిన్నవి. ఆ కాగితాలు మొదటి చిత్తు వ్రాతప్రతి. ఇప్పుడా కాగితాలు ఈ వ్రాతప్రతికి జతచేసి భద్రపరచబడి యున్నవి. మూడవ శతకము సంపూర్ణముగా నున్నది. నాల్గవ శతకమున డెబ్బదియైదు వృత్తాలు మాత్రమే ఉన్నవి. మిగిలిన పాతిక వ్రాయబడి లభించకుండా ఉన్నవో అసలు వ్రాయనేబడలేదో ఇప్పుడే చెప్పుట కష్టము. మిగిలిన ఆరు శతకాలను గురించిగూడా ఇంతకంటె చెప్పుటకులేదు. ఉన్న నాలుగు శతకాల మొదటి శ్లోకాలు ఇక్కడ ఇయ్యబడుచున్నవి.

*సరద్హృదయ భావనా కుధర కన్యకానాయకా
చల ద్వరణ భావసుందర తనూకృతాంగోజ్జ్వలా
రహో నవ వివాహ నిస్వనిత తూర్యరావాకృతే
వధూపరిణతాకృతిం భజ చమాం ప్రభో ధూర్జటే.

భవంతం ప్రస్తోతుం హరహర సమారభ్య సహసా
మమేమం వృత్తాంతం కథయితు మహోస్యాం హతమతిః
క్షమస్వ శ్రీకంఠ ప్రగళితమతిం మాంశ్రిత తమం
భవాంశ్చేన్మయ్యార్ద్రః ప్రవిశతివితాఘోఽహమఃభవ

శివశివ మయా నిర్లజ్జేన ప్రభో ఖలు భూయతే
విముఖిత మతిః పౌనః పున్యం భవానధచార్ధ్యతే
అహరహమితో గచ్ఛేర్గచ్ఛేరితి ప్రవిదూరతో
వినిధత ఉమానాథం నాథం భవంత మహం శ్రితః

ధాత్రీవాయుజ్వలన గగనాన్యంబు మార్తాండ చంద్రౌ
జీవశ్చైషాం వ్యతికర ఇతి శ్రీగళం జక్షరాద్యాః
త చ్చేత్యోఽహం విగళితమతి భ్రాంతి సంతానమూలో
భూయాసం తచ్ఛివ కరుణయాజాతు సోఽహం భవేయం

నాల్గవ శతకమున చిట్టచివరి 75వ శ్లోకము

సంధ్యావేళా ప్రశమిత తనూ తాపరమ్యానుయాతా
ప్రాణేష్వేవం పునరపి సమాయాతమేవోరుదుఃఖః
జీవః కోఽయం కథమిహ సమాయాత ఉగ్రోరు సంసృ
త్యంభో రాశి ప్రవితత తరంగాహతి క్లిష్టవృత్తిః

---

* మొదటి రెండు పాదములుకూడా లఘ్వంతములుగా నున్నవి. గుర్వంతములు కావలయును కనుక చేయబడినవి.

ఇంతవరకు రెండు పుస్తకములో 37 పుటలు. ఇదంతయు విశ్వనాథవారి హస్తాక్షరియే కాని రచనాకాల మిత్యాదులేమియు సూచింపబడిలేవు.

## అమృత శర్మిష్ఠమ్

తొమ్మిది అంకాల ఈసంస్కృత నాటకము తెలుగు లిపిలో మొత్తము అరవై పేజీలున్నవి. ఎవరో కాపీ వ్రాసినది.

నాందీ శ్లోకము:

బిభ్రజ్జాటజూటీ కుటీర విలయే దత్తాం సురహ్రాదినీం
సారాంభః పరిపూత లోకవిచయాం దేవీం నిరాదృత్యతామ్
వన్యాసీమ్న్యభితాపితాంగలతికాం భూభృత్సుతాం తర్పయ
పాయాన్నిర్ఝర వాహినీ ప్రచలిత స్వస్కంద జన్మప్రభుః

చివర "వచో మహా కవీనాం"

జయంతు నితరాం భవంతు ఫలితార్థః
వాగర్థ మనోహృత్ స్పృక్
వివర్థతాం రసమయంచ మహః

ఇతి సమాప్త మమృత శర్మిష్ఠమ్

## గుప్త పాశుపతమ్ (ఒకటి)

ప్రథమోఽంకము 10, ద్వితీయోఽంకము 7, తృతీయోఽంకము 7, చతుర్థోఽంకము 7, పంచమోఽంకము 8, షష్ఠోఽంకము 3, సప్తమోఽంకము 7, అష్టమోఽంకము 9, నవమోఽంకము 7, దశమోఽంకము 6 మొత్తము 71 పుటలుగా ఈ వ్రాత ప్రతి యున్నది. ఈ వ్రాత ప్రతి చివరకు ఇతి నవమోఽంకః గుప్త పాశుపతం సంపూర్ణమ్ అని బ్రాకెట్లలో నున్నది. మొదట తొమ్మిది అంకములుగా వ్రాయబడిన నాటకము

ఆరవ అంకము రెండుగా చేయబడి పది యంకముల నాటకమైనది. ఇప్పటి ఆరవ యంకము అప్పుడందు శుద్ధ విష్కంభము మాత్రమే.

అక్కడక్కడ కొట్టివేతలతోనూ, చేర్పులతోనూ మార్పుల తోనూ మొత్తము మీద వ్రాత ప్రతి విశదముగానున్నది. ఇది విశ్వనాథవారి హస్తాక్షరి కాదు. కొట్టివేతల మీద వ్రాతలు కొన్ని ఆయనవిగా నున్నవి.

## గుప్త పాశుపతమ్ (రెండు)

ఇది మరొక ప్రతి. పదియంకాలూ పూర్తిగా లేవు. మొదట ఎనిమిది అంకములును తొమ్మిదవ అంకములో కొంతవరకును మాత్రమే కలవు. ఇదియు విశ్వనాథ వారి హస్తాక్షరి కాదు. మొదటి వ్రాత ప్రతికిని దీనికిని అక్కడక్కడ పాఠభేదములును అధిక పాఠములును కన్పించుచున్నవి.

## శ్రీకృష్ణ సంగీతము

ఇది నూట ఎనిమిది విడివిడి కాగితాల వ్రాత ప్రతి. ఒక్క మూడవ కాగితము తప్ప మిగిలిన దంతయును విశ్వనాథ వారి హస్తాక్షరియే. ఒక్కొక్క కాగితమును రెండు పేజీల మీద నొక ఖండముగా ఈ కృతిని నూట ఎనిమిది ఖండములు కలదిగా చేయు చున్నది.

ఆయా ఖండములకు పట్టిన పేర్లలో 31 కప్పిలు 32 దూర వేణువు 53 లక్ష్మి 71 సన్యాసి రూపు 73 వెన్నదొంగ 108 నూటి పెద్ద బాణము- ఇవి వరుసగా సంశయ విచ్ఛేదము, వేణు దూర, సముద్ర మథనము, సన్యాసి లక్షణము, కృష్ణార్పణము, తప్పి పోయిన బాణము అని ఈ వ్రాత ప్రతి యందు వ్రాసి కొట్టి వేయబడినవి.

# దేవీ త్రిశతి

ఇది దేవీ స్తోత్రము. వివిధ వృత్తాలలో రచింపబడినది. ఈ వ్రాతప్రతి శ్రీ జువ్వాడి గౌతమరావుగారు తమ కొరకై వ్రాసి కొన్నది. ఈ స్తోత్ర రచన మధ్యాక్కరలను రచించు నాటికే (1958) పూర్తియైనట్లున్నది.

ఆరంభ శ్లోకములివి :

చిత్రం హ్యేతత్ సకల దితిజారాధనే యస్య మే సా
బుద్ధిర్నో దేత్యవిరల పరబ్రహ్మ భావోల్బణస్య
దేవ్యాః నామ్ని శ్రుతి పథ మహో గచ్ఛతి ద్రాక్ హృదంతః
కంచిత్ స్పందం వహతి మధునా స్విన్న వాచో విధేయం.

శిశిరీ కురుతే విలోచనే
సశరీరా శివకామ వల్లరీ
జగ దంకుర కోరకాధరా
జగ దున్మీలన మోహనాననా.

ఈ సంస్కృత స్తోత్రములో లలిత మధురమైన శైలి ప్రయోగింపబడినది. దేవీ సౌందర్యం, అనుగ్రహ విశేషము, పరమేశ్వరునితో ఆమెకు ఉన్న అనుబంధము విచారింపబడినది.

మరికొన్ని శ్లోకాలు అక్కడక్కడివి :

అంగే రుద్రం నయన యుగళే మన్మథం మందహాసే
బ్రహ్మాణం తం గళపధి హరిం దేవతాః సర్వదేహే
బిభ్రాణాం తాం త్రిదశ వియదాభోగ భోగాం పురంధ్రీం
కోవా ద్రష్టుం ప్రభవతి పునః కోనజానాతి దేవీం.

జుహావ విశ్వం యజమాన ఈశః
మహేశ్వరీ నామక యజ్ఞకుండే
స్ఫులింగ రూపోగుహ ఉద్బభూవ
దదాహ య స్తారక రూప ఘాసం

నవ తమాల కిసాల తనూచ్ఛవి
ర్వ్యయతి యాతి హిమాచల కన్యకా
నయన కాంతి సుధాలవ నిర్మితా
తదను శారద నీరద మాలికా.

చివరి శ్లోకాలు యివి:
కస్మిన్ హిమగిరిసానుని
పరితస్పరితస్ప్రవంతి యత్ర సదా
యత్రచ కదంబ వాటీ
విశ్రామ్యతి మే మనస్తత్ర

మత్స్వాదు వాక్చయ చమత్కృత చిత్రవీధిః
ప్రాలేయ పర్వతసుతా వినతాస్మితైర్నః
అస్మద్గృహాజిర విరాజిత రంగవల్ల్యః
మల్లీప్రసూన సుషమా మనహం వహించి

ఇలా మూడు వందల శ్లోకాలు పూర్తి అయిన తరువాత మరో శ్లోకం తుదన వ్రాయబడింది.

కియాన్ ప్రియత్నః క్రియతే పరాన్సురాన్
ప్రసన్న భావోప హితాంశ్చ కర్తుం
తదం శతో౽ంగోల మిహాద్రి జాయాం
పునః ఫలం తస్య శతాధికంచ

# నందిగామ రాజ్యము

ఇది ఒక అధిక్షేపాత్మకమైన నవల శ్రీరాముడు అరణ్య వాసం పూర్తి చేసి రావణసంహారానంతరం నందిగ్రామానికి వస్తాడు. అక్కడ ఈ కథ ఆరంభం అవుతుంది. నందిగ్రామం ఈనవలలో నందిగామ అయింది.

నందిగామ రాజ్యము (చిన్న నవల) అను "రామ పట్టాభి షేకము" అని ముఖపత్రం మీద ఉన్నది. ఈ నవల రచనాకాలం జులై 1976. అరటావు సైజు కాగితాలు 54 పేజీలలో వ్రాయ బడ్డది. ఇది శ్రీ సత్యనారాయణగారు చెప్పగా ఎవరో వ్రాసిన ప్రతి. ఈ నవల ఒకటి రెండు మూడు ఇట్లా ఆరు అధ్యాయాల్లో విభక్తమయింది.

భరతుడు నందిగామలో దీక్షలో ఉండగా ఆయన మంత్రులూ అయోధ్యవదలి అక్కడికే వచ్చారు. సాకేత రాజ్యాన్ని అక్కడ కొందరు తమంత తామే రాజ్యం చేసే అధికారం గ్రహించి పరిపాలించసాగారు. అధికారంలో ఉన్న వారి ప్రవృత్తి, ఆఫీసు వ్యవహారాలు, రెడ్ టేప్ మొదలైన అంశాలన్ని - వర్తమాన రాజ్యపరిపాలనా వ్యవస్థలోని దుర్లక్షణాలన్నీ ఈ నవలలో పరా మర్శింపబడ్డవి.

విశ్వనాథవారు వ్రాసిన దమయంతీ స్వయంవరం ఈ విమర్శ లక్షణం కలదే. ఇంకా ఆయన వ్రాసిన అధిక్షేప రచనలు - హాహాహూహూ, విష్ణుశర్మ ఇంగ్లీషుచదువు మొదలైనవి.

రాముడు వచ్చాడు. రాముడితోపాటు అనేకమంది రాక్షసులూ

కోతులూ వచ్చారు. పట్టాభిషేకం మాట అటుంచినా రోజూ తిండి గడవాలిగదా. ఇంకా వీళ్లని చూట్టానికి వచ్చిన జనమూ అక్కడే తిండికి దిగబడ్డారు. పాత మంత్రులు సుమంత్రాదులు ఎంతకని చేస్తారు. ఈ మీమాంసతో నవల ఆరంభం. ఆ కొత్త రాజ్య వ్యవస్థలో ముఖ్యమంత్రి ఆర్థిక మంత్రి ఇత్యాదులందరూ ఉన్నారు. వాళ్లకు రాముడికి రాజ్యం యివ్వడం యిష్టంలేదు. రాముడు విచారించాడు. సుగ్రీవుణ్ణి పట్టాభిషేక మంత్రిని చేశాడు. పట్టాభిషేకానికి డబ్బు మంజూరీ చేయమని ఆ ప్రభుత్వాన్ని అడగటం - దాన్ని సాధించడం ఆయన పనిగా నిర్దేశించడం. ఇది మొదటి అధ్యాయం. పదకొండు పుటలు.

రెండు మూడు అధ్యాయాల నడుమ సంఖ్య వేసిలేదు. ఈ పెద్ద భాగంలో సుగ్రీవుడు ప్రభుత్వాన్ని కోటి బంగారు నాణాలు అడగటానికి బలంగా వానరులను ప్రచారకులుగా నియమించాడు. ప్రజల్లో రాముడి వనవాస వృత్తాంతం గూర్చి ఏవో స్థూలమైన వార్తలు తప్ప వివరంగా ఏమీ తెలియవు. ఈ ప్రచారకులు సభలు పెట్టి రాముని గూర్చి ప్రచారం చేస్తూ వచ్చారు. సభల్లో అనేక సందేహాలు అడిగేవాళ్ళు. వాటికి వీళ్ళు విచిత్రంగా సమాధానం చెప్పడం. కొందరు సభలను అల్లరిచేసే ప్రయత్నం చేయడం జరిగింది. అయినా మొత్తం మీద ప్రజల్లో రామ పరాక్రమం గూర్చిన విశ్వాసం నెలకొన్నది.

అప్పుడు సుగ్రీవుడు ముఖ్యమంత్రిని కలిసి కోటి బంగారు నాణాలు యిప్పించవలెనని అర్జీ పెట్టుకున్నాడు. ముఖ్యమంత్రి అది ఆర్థిక మంత్రికి పంపించడం దానిమీద చర్చలూ, చివరకు కోరిన దాంట్లో సగం మంజూరీ చేయడానికి నిశ్చయించటం, దానిలో సగం యివ్వడానికీ, అదీ ఒక సన్మాన సభ ద్వారా యివ్వవలెనని నిశ్చయించారు. ఈ రెండధ్యాయాల భాగము 23 పేజీలు.

నాల్గో అధ్యాయం సుగ్రీవుడి సన్మానం తంతు. లక్ష్మణుడు ఆధ్యక్షుడు. ఉపన్యాసాలు. సన్మాన పత్రాలు - తరువాత మిగిలిన పాతిక లక్షల కోసం ప్రయత్నం చేయటం. ఆ ఇబ్బందులు. ఇది పది పేజీలు.

ఐదో అధ్యాయం రాముడు రాజ్యానికి రాకుండా ఉండేందుకు నరసింహుడు అనే సేనాపతి రాముడి సైన్యంతో యుద్ధానికి సిద్ధపడటం, ఆంజనేయుడితో యుద్ధం చేస్తాననటం. ఇది ఐదు పేజీలు.

చివర అధ్యాయంలో ఆంజనేయుడు లీలామాత్రంగా సేనాపతు లందరినీ సరయువులోకి విసరివేయటం, సైన్యం అధీనం కావడం జరుగుతుంది. పాత ఉద్యోగస్థులు, మంత్రులు రాముడికి గుమ్మడి కాయంత బంగారం కానుక యివ్వాలని పెట్టి వాళ్ళు యింతకాలం అన్యాయంగా ఆర్జించిన ధనమంతా రాజ్యానికి స్వాధీనమైంది. రాముడు వాళ్ళకు సంవత్సరానికి సరిపడే గ్రాసం యిచ్చి పంపుతాడు. తరువాత పట్టాభిషేకం జరిగింది. ఇది చివరి అధ్యాయం. నాలుగు పేజీలు.

# రామాయణ కల్పవృక్షము-శిల్పదృష్టి

ఇట్లు పరిచయము చేయబడుచున్న వ్రాత ప్రతి మీద ఈ పేరు లేదు. ఇంతకు ముందు 1958వ సంవత్సరమున నవ భారతి పత్రికలో కొన్ని నెలల పాటు కొన్ని పద్య ఘట్టాలు సశిల్ప వ్యాఖ్యానముగా వచ్చినవి. వాటన్నిటికి శ్రీమద్రామాయణ కల్ప వృక్షము - శిల్పదృష్టి అన్నదే ప్రధాన శీర్షిక. దాని క్రింద సముద్ర మథన ఘట్టము, పరశరామ వృత్తాంతము, సీతారాముల శృంగారము, కావ్యాది శిల్పము, కొన్ని విశేషములు, విశ్వామిత్రుని వాత్సల్యము అనునవి సూత్రప్రాయముగా నాల్గు పద్యముల వ్యాఖ్యానముతో మొదలు పెట్టబడి జూన్ నుండి డిసెంబరు దాకా వ్యాఖ్యానింప బడినవి. ఆ పద్ధతిలోనే ఈ వ్రాత ప్రతియుండుట చేత దీనికి కూడా అదే పేరు పెట్టి పరిచయము చేయుచున్నాము. ఇది విశ్వనాథ వారి హస్తాక్షరి కాదు. ఎవరో వ్రాసినది. ఈ శిల్పదృష్టి విశదీకరణ కర్త మాత్రము సత్యనారాయణగారే. ఆయన తనను తాను వ్యాఖ్యానము చేసి చూపించుట కుపక్రమించిన లక్షణమిది. ఆయన తన రామాయణము మొత్తమున కేవిధముగా అక్కడక్కడ పద్యాలను కావ్యములోని కథా ఘట్టాలనూ ఎత్తి వ్యాఖ్యానము వ్రాసి ఈ మహా కావ్యమును చదువుకొనుట కొక మార్గమును సూచింప దలచినట్లుగా ఆ లక్షణము స్ఫురింప జేయుచున్నది.

ఇది మొత్తము నూటయేడు పుటల వ్రాత ప్రతి. బాల కాండము నూటతొంబది మూడవ పుటలోని రెండవ పద్య వ్యాఖ్యానము మొదలగు వరకు ఇష్టి ఖండము నుండి మొదలు పెట్టి మొత్తము మీద రెండు వందల పద్యాలకు పది అటు ఇటుగా

విశేషాలను సూచించుచున్నది. ఇందులో ఇష్టి ఖండము అవతార ఖండము పూర్తిగాను, అహల్యా ఖండము అసంపూర్ణముగాను ఉన్నవి.

కవి స్వయముగా తన కృతికి తాను వ్రాసిన వ్యాఖ్యాన మగుట వల్ల తాను భావించిన అనేక శిల్ప రహస్యములను అర్థ విశేషములను సూచించుటకు వీలయినది. అందువలన ఇది చాల విలువయినది.

వ్రాత ప్రతి పూర్తిగా లభించిన దన్న నమ్మకము కలుగుట లేదు. ఈ వ్రాత ప్రతి పుస్తకముగా కాక విడివిడి కాగితాలుగా ఉన్నందున మిగిలిన కాగితాలు ఎక్కడనైన పడిపోయి యుండ వచ్చుననిపించుచున్నది. లభించిన కాగితాలను జాగ్రత్తగా క్రమ పరచిన మీదట చివర కాగితమున వ్యాఖ్యానము హఠాత్తుగా మధ్యలో ఆగిపోయిన జాడ కన్పించుచున్నది.

ఇందులో పద్యాల మొదళ్ళు - పుటలు పద్య సంఖ్యలు కలగా పులగంగా ఇయ్యబడి ఉన్నవి. కొన్ని చోట్ల పద్యాలకు జాగాలు వదలిపెట్టబడి ఉన్నవి. కొన్ని చోట్ల వ్రాయబడిన వ్యాఖ్యానమును బట్టి పద్య సంఖ్యలను గుర్తించుకొన వలసి యున్నది.

1958 జూన్ నెల నవ భారతిలో వ్యాఖ్యానింపబడిన "క్రతు యత్న మెంత దూరము వచ్చెనో—" అన్న పద్య మీ వ్రాత ప్రతి 15వ పుటలో స్పృశింప బడినది. అట్లే అక్టోబరు నవ భారతిలో వ్యాఖ్యానింపబడిన "ఒనర బోర్కాడించి యయ్యోల తోటెలో-" అన్న పద్యము, "ఎఱ్ఱనౌ నేత్రమ్ము లిష్టి వేళా నల ధూమసంతానమ్ము దూరినట్లు"- అన్నది, మరియు "ప్రతి

రసాల కుజంబు పచ్చి పిందెల తోఁడ"- అన్న పద్యము "తిరిగి వసంత కాలమరుదెంచె"- నన్న పద్యాలు "ముది వృదాకువు సెజ్జ"- ఇత్యాది పద్యము, "అసురకన్యా కంఠహార మంగళసూత్రి-" "ప్రామిన్కు- గమిఁబాటఁ బట్టి నీళ్ళల ద్రవ్వుకొనిపోవు-" "క్షీరాబ్ది తరగలో శ్రీపయోధరములో-" అని మొదలయిన పద్యములు ఈ వ్రాత ప్రతి 15,24,33,34,53,54,55 పుటలలో స్పృశింప బడి యున్నవి. వ్యాఖ్యానము నందు వైవిధ్య విశేషమున్నది. మరియు నవ భారతి డిసెంబరు సంచికలో స్పృశింపబడిన "మీ ఆరోగ్యము చూచుకోవలెనయా-" "ఒగి ముల్లోకము త్రావనీరనుచు లేకున్నన్-" "అనినన్ రాముడు మీకిదిన్ శ్రమముగా నౌనేమొ-" అన్న పద్యాలు మూడునూ ఇందులో 102, 103, 104 పుటలలో గచ్ఛద్వ్యాఖ్యగా ప్రసక్తికి తేబడినవి. ఆయా పద్యాలకు అక్కడ చెప్పబడిన విశేషాలు కొన్ని ఇక్కడ చెప్పబడిన విశేషాలు మరికొన్ని.

ఇది విశ్వనాథ సత్యనారాయణగారి "రామాయణ కల్ప వృక్షము - శిల్పదృష్టి" వ్రాత ప్రతి విషయము.

# గుప్త పాశుపతము

ఇది విశ్వనాథ సత్యనారాయణగారి పది అంకాల తెలుగు నాటకం. ఈ పేరు మీదనే సంస్కృతంలోకూడా ఒక నాటకం వ్రాసినారాయన.

కానీ ఆ సంస్కృతమునకిది అనువాదము కాదు. నాటక వస్తువు అక్కడను ఇక్కడను ఒకటియే అగుటవల్ల అంక విభజనాదికము నందును, పాత్రల వాచకములు యందును అక్కడక్కడ సంవాదము స్పష్టముగా కన్పించుచున్నది. కానీ రెండును రెండు స్వతంత్ర రచనలుగానే ఉన్నవి. సంవిధాన కల్పనములట్లున్నవి.

స్కూలు నోటు పుస్తకం సైజులో మొత్తం 82 పుటల వ్రాత ప్రతి ఇది. ఇది అంతా విశ్వనాథవారి హస్తాక్షరికాదు. నాందీ ప్రస్తావన దాదాపు మరొకరి వ్రాత. ప్రస్తావనలోని మారిషుని చివరి వాచకము వచనము. పద్యము మొదలుకొని వరుసగా ప్రథమ ద్వితీయ, తృతీయ చతుర్థ పంచమాంకములును, షష్ఠాంకమున 47వ పుటలోని మొదటి అర్జునుని వాచకము వరకు విశ్వనాథ వారివి. ఆ తరువాత నుండి సప్తమాంక మంతయును మరొకరు వ్రాసినది. మరల అష్టమాంకము (56వ పుట) నుండి 60వ పుటలోని శ్రీకృష్ణుని చివర వాచకము వరకు విశ్వనాథవారిది. 60వ పుటలో చివరకున్న అర్జునుని వాచకము నుండి 65వ పుటలోని నవమాంకములోని విష్క-భము వరకు మరొకరి చేతివ్రాత. 65వ పుటలోని ఆ విష్కంభ నుండి 71వ పుటలోని శ్రీకృష్ణుని చివర వాచకము వరకు విశ్వనాథ వారిది. 71వ పుటలోని యుధిష్ఠిర వాచకము నుండి భీముని వాచక

ములో మూడు వంతుల వరకు ఇంకెవరో వ్రాసినది. ఇక్కడ 72వ పుట మొదటిలో ముందటి పుటయని చివరి వాక్యమును మధ్యలో అందుకొని విశ్వనాధవ్రాత మొదలగుచున్నది. అది 78వ పుటలోని బాలాకి పద్యాలు కొసదాకు చున్నది. ఆ తరువాత నుండి 82వ పుటలో దశమాంకము సమాప్తమగు వరకు మరల మరొకరి వ్రాత. "ఇది దశమాంకము-సమాప్తము - ఇది మరల విశ్వనాథవారి హస్తాక్షరి. ఈ విధముగా ఈ వ్రాత ప్రతి కొంత ఆయన చేతివ్రాతయై మరి కొంత కాకుండా ఉన్నది.

ఇందలి ఇతివృత్తము భారత యుద్ధము. ఒక విధముగా నాయకుడు అర్జునుడని సూత్రధారుడు సూచించిన వాక్యమున్నది. పాశుపతాస్త్రమును అర్జునుడు యుద్ధములో కౌరవులమీద యుపయోగింపక పోవుటలో గల మహా మానవ శీల లక్షణమును వ్యాఖ్యానించుట యే నాటకముగా చెప్పబడినది. ప్రయోగించుటకు సిద్ధముగా మారణాయుధములను చేతిలో పెట్టుకొన్న నేటి రాచరికపు రాక్షసత్వమునకు అట్టి యస్త్రము చేతిలో ఉండి కూడా యుపయోగించని యర్జునునియొక్క దేవత్వమునకు ఈ నాటకము అద్దము పట్టినదని నాటకకర్త సూత్రధారుని చేత చెప్పించినాడు.

పాశుపతాస్త్రమును అర్జునుడు చివరకు తన వంశాంకురమును కాపాడుకొనుటకు శ్రీకృష్ణునిచే ప్రేరేపింపబడియును ఉపయోగింపక నిగ్రహించుకొన్నాడు. మారణాస్త్రములను సంపాదింపవలయును కాని ఉపయోగింపరాదు, ఉండి ఉపయోగింపక నిగ్రహము చూపుటయే మహా మానవ శీల లక్షణము. అది అర్జునునియందు నిరుపింప బడినది. అందువలన ఇది గుప్త పాశుపతము. ప్రయోగింపబడక అది అర్జునునిచే రక్షింపబడినది.

శ్రీకృష్ణుని రాయబారము విఫలమైనదని తెలిసిన తరువాత ధర్మరాజాదులు కౌరవ పాండవ పక్షముల బల పరాక్రమములను

ములో మూడు వంతుల వరకు ఇంకెవరో వ్రాసినది. ఇక్కడ 72వ పుట మొదటిలో ముందటి పుటయని చివరి వాక్యమును మధ్యలో అందుకొని విశ్వనాథవ్రాత మొదలగుచున్నది. అయి 78వ పుటలోని బాలాకి వ్యదాలు కొసదాకు చున్నది. ఆ తరువాత నుండి 82వ పుటలో దశమాంకము సమాప్తమగు వరకు మరల మరొకరి వ్రాత. "ఇది దశమాంకము-సమాప్తము - ఇది మరల విశ్వనాథవారి హస్తాక్షరి. ఈ విధముగా ఈ వ్రాత ప్రతి కొంత ఆయన చేతివ్రాతయై మరి కొంత కాకుండా ఉన్నది.

ఇందలి ఇతివృత్తము భారత యుద్ధము. ఒక విధముగా నాయకుడు అర్జునుడని సూత్రధారుడు సూచించిన వాక్యమున్నది. పాశుపతాస్త్రమును అర్జునుడు యుద్ధములో కౌరవులమీద యుపయోగింపక పోవుటలో గల మహా మానవ శీల లక్షణమును వ్యాఖ్యానించుట యే నాటకముగా చెప్పబడినది. ప్రయోగించుటకు సిద్ధముగా మారణాయుధములను చేతిలో పెట్టుకొన్న నేటి రాచరికపు రాక్షసత్వమునకు అట్టి యస్త్రము చేతిలో ఉండి కూడా యుపయోగించని యర్జునునియొక్క దేవత్వమునకు ఈ నాటకము అద్దము పట్టినదని నాటకకర్త సూత్రధారుని చేత చెప్పించినాడు.

పాశుపతాస్త్రమును అర్జునుడు చివరకు తన వంశాంకురమును కాపాడుకొనుటకు శ్రీకృష్ణునిచే ప్రేరేపింపబడియును ఉపయోగింపక నిగ్రహించుకొన్నాడు. మారణాస్త్రములను సంపాదింపవలయును కాని ఉపయోగింపరాదు, ఉండి ఉపయోగింపక నిగ్రహము చూపుటయే మహా మానవ శీల లక్షణము. అది అర్జునునియందు నిరుపింపబడినది. అందువలన ఇది గుప్త పాశుపతము. ప్రయోగింపబడక అది అర్జునునిచే రక్షింపబడినది.

శ్రీకృష్ణుని రాయబారము విఫలమైనదని తెలిసిన తరువాత ధర్మరాజాదులు కౌరవ పాండవ పక్షముల బల పరాక్రమములను

శివుని దర్శించి పాశుపతమును తెచ్చుకొనుట - ఇది పంచమాంకము. పన్నెండు పుటలు.

సైంధవ వధ, దుర్యోధనుని మాటలకు ద్రోణుడు మనసు నొంది పాండవులంపిన విషమునానిపడుట, అశ్వత్థామ చచ్చినాడని భీముడు పెద్దగా ద్రోణునితో ననుట, ఆయన ధర్మరాజు నడుగుట, ధర్మరాజు ఏనుగు పేర దాని నవుననుట — ద్రోణుడు సమాధిగతు డగుట. ధృష్టద్యుమ్నుడు వాని శిరస్సును ఖండించుట, దుర్యోధను నుండి అశ్వత్థామ తండ్రి చావును విని కృద్ధుడై నారాయణాస్త్రమును ప్రయోగించుట, శ్రీకృష్ణుని సలహాపై అర్జునుడు వారుణమును ప్రతిగా ప్రయోగించుట, మూర్త్యర్చన కంటె లింగార్చన యధికమైనదన్న వ్యాసుని సందేశమును బాలాకి అశ్వత్థామకు చెప్పుట- తాను కృష్ణార్జునుల నేమియు చేయలేనని ఆయన భావించుటగా నున్న ఇది షష్ఠాంకము. పుటలు పది.

కర్ణుడు సేనాధిపతి యగుట. భీముడు దుశ్శాసనుని వధించుట కలసి సప్తమాంకము. ఏడు పుటలు.

అర్జునుడు కర్ణుని వధించుట అష్టమాంకము. ఎనిమిది పుటలు.

శల్యుడు సేనాపతి యగుట, మడుగున దాగిన దుర్యోధనుని వెలికి రప్పించుట కనవలసిన మాటలని వచ్చిన మీదటను అడుగ వలసిన మాటలడిగి భీమునితో గదా యుద్ధమునకు వానిని పాండవులు సిద్ధపరచుట, గదా యుద్ధమున భీముడు వానిని ఊరు భంగము చేసి పడగొట్టుట, అశ్వత్థామకు దుర్యోధనుడు సైన్యాధిపత్యము నభిషేకించుట, అపాండవమునకు అశ్వత్థామ ప్రతిన పూనుట- నవమాంకము. పదునొకండు పుటలు.

సౌప్తిక ప్రళయము, వ్యాసుడువచ్చి అస్త్రముల నుపసంహ

రింపవలసినదిగా చెప్పినను అశ్వత్థామ వినకపోవుట - "శ్రీకృష్ణుడు ఉత్తరాగర్భమును తాను రక్షింతునని ప్రతినచేసి, అశ్వత్థామను శపించుట, ఆయన తన శిరోమణిని భీమునకిచ్చి నిష్క్రమించుట, శ్రీ కృష్ణుడు సుదర్శనమును ప్రయోగించి ఉత్తరాగర్భస్థ శిశువును బ్రతికించి - రాజ్యమును యుధిష్ఠిరున కర్పించి విజయవంతముగా మొత్తము నాటకమును సమాప్తముచేసిన ఇది దశమాంకము ఎనిమిది పుటలు.

శివకేశవాభేద ప్రాతిపదికమీద నాటకము నడచుచున్నది. పౌరుషమును చూపించుచు దానికి వెన్నుబలముగా నుండి నడిపించుచున్న దైవమును ప్రదర్శించుట ఈ నాటకమునందలి శిల్ప లక్షణము. రాజనీతియందలి లౌకికము కథను ముందుకు త్రోసికొని పోవుచున్నది.

ఈ నాటకమున అలౌకిక విషయములు కృష్ణార్జునులు శివలోకములకు పోయి వచ్చుట, నవమాంకము మొదట జలాధి దేవత సుభద్ర రూపమున అర్జునునకు కన్పించుట ఇవి రెండే. భరద్వాజుడు విశ్వామిత్రుడు వచ్చుట అధికము.

ఇందు బాలాకి - అశ్వత్థామ - దుర్యోధనుడు మొదలయిన పాత్రలు సజీవములును సలక్షణములును అయి నాటకమునకు దీప్తిని కల్గించుచున్నవి.

దుర్యోధనుడు అను ఒక ఏకాంకికను సత్యనారాయణగారు 1923వ సంవత్సరమున శారద పత్రికలో ప్రచురించినదానినిగూడ ఈ సందర్భమున విచారించవలయును.

మరొక్క విషయము. ఈ నాటకమును ఆడించవలయునన్న ప్రయత్నముకూడా సత్యనారాయణగారు చేసినట్లున్నది. ఈ వ్రాత

ప్రతి చివర పుటలో - వ్రాత ఆయనది కాదు కానీ - పాత్రలు పాత్రధారుల ఉల్లేఖనమొకటున్నది.

అర్జునుడు - మల్లాది సూర్యనారాయణ
భీముడు - కోటేశ్వరరావు వల్లూరి
ధర్మరాజు - చిరంజీవిరావు
సహదేవుడు - ——
శ్రీ కృష్ణుడు - గూడూరు
బాలాకి - శంకరంగారు
అశ్వత్థామ - మంగళగిరి
దుర్యోధనుడు - పాతూరి
సుభద్ర - సత్యవతీదేవి
ఘటకుడు - కావూరి శ్రీరామమూర్తి
కౌబేరి - P. L. N. Sarma

భీష్ముడు - ద్రోణుడు - బందరు సత్యనారాయణ, శల్యుడు-దుశ్శాసనుడు అని వ్రాసి "ద్రోణుడు" నుండి "శల్యుడు" వరకు కొట్టివేయబడి యున్నది.

# విశ్వనాథ జీవిత చిత్రం

[జీవిత చిత్రమన్న ఈ భాగం విశ్వనాథ సత్యనారాయణ గారి జీవిత చిత్రమునూ, వాఙ్మయ జీవిత చిత్రమునూ, ఆయన కాప్తులూ, సమకాలికులూ, సన్నిహితులూ, అయిన సాహితీ బంధువులెల్లా చిత్రించారన్నది ఒకచోట ప్రక్కప్రక్కనే ప్రదర్శిస్తే ఆయన సాహితీ వ్యక్తిత్వమును గురించిన సహృదయుల అవగాహనకు దోహదకారిగా ఉంటుంది అన్న ఊహతో సమకూర్చబడింది.

ఇక్కడ పదునాల్గురు తెలుగు మేధావులూ, ఒక రష్యను భాషాశాస్త్రవేత్త విశ్వనాథ వాఙ్మయ జీవితములను తాము దర్శించిన విధముగా చిత్రించిన వాక్చిత్రములొక చోటికి సంపాదింపబడినవి.

ఈలాంటి వాక్చిత్రాలు విశ్వనాథను గురించినవి అసంఖ్యాకంగా ఉండటం చేత ఎన్నని ఒకచోటకు తేగలమని ఇన్నిమాత్రమే ఎన్నిక చేయటం జరిగింది.]

# నేను: మా అన్నగారు

## — విశ్వనాథ వేంకటేశ్వర్లు

[విశ్వనాథ వేంకటేశ్వర్లుగారసలు సత్యనారాయణగారి వాఙ్మయ జీవిత చరిత్రమును జాన్సను జీవితమును బాస్వెలు వ్రాసిన దానికంటెను సర్వలక్షణ లక్షితముగా వ్రాసి యుండుటకు తగిన స్థితిలో ఉండి వ్రాయుట కాయనకు వీలు కాలేదనగా ఈ భాషా సాహిత్యముల అదృష్టమట్లున్నదనవలయును. అంతా అయిపోయిన తరువాత ఆరాటపడినట్లు సత్యనారాయణగారు పోయిన తరువాత వెంకటేశ్వర్లుగారీ వరంగల్లుకు వచ్చి ఉన్నారు గనుక మేము ఆయన వెంట కాస్త మొండిగా పడ్డ మాట నిజమే. అలా పడకపోతే ఇదీ రాదు. అసలు లేనిదాని కంటె ఇది కొంత నయం కదా. పాప మాయన వయస్సు ఆయన ఆరోగ్యమూ రెండూ ఈ వ్రాత పనికి అంత అనుకూలము లైనవి కాకపోయిననూ అన్నగారి యందున్న భక్తిని మాయందున్న వాత్సల్యమునూ నిమిత్తోపాదన కారణములుగా కల్పించుకొని ఉభయ తారకముగా సత్యనారాయణగారిని గురించి తాము పలుకవలసిన రీతిలో పలికినందుకు చాల సంతోషముగా నున్నది.

వేంకటేశ్వర్లుగారు వ్రాసి ఇచ్చిన వ్రాత ప్రతిని సవరించినది లేదు కాని, డిక్టేటుచేసి ప్రెస్సు కాపీని సిద్ధము చేయుటలో పద వాక్య విన్యాసములందు అక్కడక్కడ కొద్దిపాటివే అయినను కొన్ని మార్పులు చోటుచేసికొన్నవి. వెంకటేశ్వర్లుగారు కేవలము తమ జ్ఞాపక శక్తిమీద ఆధారపడి ఇదంతయు వ్రాయవలసి వచ్చుటచేత

విషయ ప్రతిపాదనమున కాలక్రమమును తప్పకపోయినను తేదీలతో కచ్చితముగా కాలసూచనచేసి చేయుట పడలేదు. మన దృష్టిలో ముఖ్యాంశములుగా నున్నవి కొన్ని ఇందు చెప్పబడకపోయి యుండవచ్చును అట్లే చెప్పబడినవి కొన్ని మన దృష్టిలో అంత ముఖ్యాంశములు కాకపోవచ్చును. ఈస్థితి ఎవరు వ్రాసినను ఎంత జాగ్రత్తగా వ్రాసినను తప్పదు. వ్రాసినవి సత్యదూరములు కాకపోవుట ముఖ్యముగా ముఖ్యము. సత్యదూరములయిన వాటిని వేంకటేశ్వర్లుగారసలు స్పృశించలేదు. గానీ స్పృశించుటలో కొద్దిపాటి పాఠ భేదములు వచ్చినవి.[1] ఏ పాఠము సరియైనదన్న విషయ మది వేరు.

వేంకటేశ్వర్లుగారు వ్రాసిన వాటిలో కొన్నింటికి, ఆయన సూచనచేసి వదలిన వాటిలో కొన్నింటికి తెలిసినంతలో వివరణలు వ్రాసి చివరకు జ్ఞాపికానుబంధంగా చేర్చటం జరిగింది.

మొత్తంమీద యాభై అరవై సంవత్సరాల మీద సింహావలోకనంచేసి జ్ఞాపకమునకు తెచ్చుకొని సత్యనారాయణగారి వాఙ్మయ జీవితాధ్వరము నడచిన నడకలకు మూలములయిన, అనుకూల ప్రతికూలముగా దోహదముచేసిన, దేశకాల పరిస్థితుల స్వరూప

---

1 ఈసంచికలోనే ఉన్న "విశ్వనాథ ఆత్మకథలో ప్రథమాధ్యాయం" 39, 40 పేజీలుచూస్తే పాఠ భేదాలు కనబడగలవు. వెలినూతలకు వెన్నూతల. గునుపూడి వీరభద్రయ్యగారికి గుడిపూడి వీరభద్రయ్యగారు నాగవరప్పాడులో ఉండి వెలినూతలలో విద్యాభ్యాసము చేయుటకు వెలినూతలలోనే ఉండి వెలినూతలలోనే విద్యాభ్యాసము చేయుట. ఇత్యాది ఇవి అంతగా గణింపదగిన విరుద్ధ విషయాలు కావుగాని పాఠభేదములు మాత్రమవును.

స్వభావ రేఖా చిత్రమును ఇంత చక్కని సమన్వయ ధోరణిలో వ్రాయుటకు శ్రీ విశ్వనాథ వేంకటేశ్వర్లుగారు చేసిన కృషి బహుధా ప్రశంసార్థక వాక్యములకు యోగ్యముగానున్నది. —సంపాదకులు]

## 1. ఉపక్రమము

మా అన్నగారు అస్తమించారు. నేనూ, మృత్యువుకి జేనెడో బెత్తెడో యెడంగా వున్నాను. ఈ స్థితిలో నేను ఆయన్ని గురించి వ్రాయడంలో ఔచిత్యం యెంత ఉన్నదో నాకే తెలియడంలేదు. కానీ డా. కేతవరపు రామకోటిశాస్త్రీగారిది మొసలిపట్టు. అందుచేత వ్రాయక తప్పని సరియై వ్రాస్తున్నాను.

మా అన్నగార్కి గుడివాడలో గజారోహణోత్సవము జరిగినప్పుడు నేను పద్యాలు వ్రాశాను. అవి మంచి పద్యాలే. వాటి కాపీ నా యొద్దలేదు. శ్రీ గౌతమరావుగారు ఆ మధ్య పద్యాలు సంపాదించి నాకిచ్చారు. అవి కూడ పారేసుకున్నాను. అందులో "ధన్యంబయ్యెను మాకొలంబు బహుగాథా విశ్వనాథున్" యిత్యాదిగా పద్యము వ్రాశాను. ఇంతకీ ఆ పద్యాలు శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు చూసి "ఎబ్బే! అన్నగారికి సమ్మానము జరిగితే; తమ్ముడు పద్యాలు రాశాడూ!" అని మా తమ్ముడు రామమూర్తితో అన్నాడట. అప్పటి నుండి నేను ఆయన్ని గురించి ఏమీ వ్రాయడం మానుకున్నాను. అయినప్పటికీ ఆయనకు షష్టిపూర్తి జరిగినప్పుడు సప్తతివర్షోత్సవము జరిగినపుడు నేను వ్రాసిన పరాప్రాసాదము కృతియిచ్చినపుడు ఆయన మీద పద్యాలు వ్రాశాను. గద్యకృతులు మాత్రము ఏమీ వ్రాయలేదు అది ఇప్పుడు తప్పడంలేదు.

మరో విషయం. మా అన్నగారికి తన రామాయణంమీద నేనొక విమర్శ గ్రంథం వ్రాయాలని కోరిక ఉండేది. అదీ ఆయన

ఒకసారి వాచ్యం చేయకపోయినా అన్యాపదేశంగా అన్నాడు. కానీ, అప్పటి పరిస్థితులవల్ల నేను దాని కొగ్గలేదు.

చిట్ట చివరకు ఆయన పండెన్డవ రోజున ఇట్లాగే ఒకానొక రోజు అంతర్గతమైన బలాత్కారమువల్ల ఆయన మీద పద్యాలు వ్రాశాను. ఆపద్యాలు చూసి మాతమ్ముళ్లిద్దరూ[1] చాలా సమార్ద్రత పొందారు.

## 2. మా పూర్వీకులు

మా కూటస్థుడు ఘంటసాలపాలెం కాపురస్థుడు. అక్కడి కాయన ఏ ఊరినుండి వచ్చాడో తెలియదు. కాశీ నుండి వచ్చాడని ప్రతీతి. కాశీవిశ్వనాథుని వల్లనే మాకు విశ్వనాథవారని పేరు వచ్చిందనుకునేవారు. విశ్వనాథపల్లితో మాకు సంబంధంలేదు. నందమూరు కోవను స్థాపించినవాడు వేంకటనరసు అనే ఆయన. ఆయన తమ్ముడు కామన్న, విశ్వనాథపల్లి కాపురస్థుడుగ ఉండేవాడు. ఆయన నిస్సంతుగా పోయినట్లుగా కనబడుతుంది. పోతే, వేంకటనరసుగా కూటస్థుడుగా నున్న నందమూరి కోవ వృద్ధి పొందింది. వేంకటరాముడు అనే ఆయన కూటస్థుడైన 'ఆకివీడు' కోవకూడ బాగా వృద్ధి పొందింది. నందమూరు కోవకంటె ఆకివీడు కోవ చాలా పెద్దది. అదే సోమేశ్వరం, బొండాడ అనే గ్రామాలకు విస్తరించింది. అవి పశ్చిమ గోదావరిజిల్లా గ్రామాలు. నందమూరు కోవకు కూటస్థుడైన వేంకటనరసుగారు మాకు ఆరవ పురుషుడు. పురుషాంతరానికి సుమారు 50 సంవత్సరాలు కట్టుకుంటే ఇప్పటికి మూడు వందల సంవత్సరాల నుండి మావంశము నందమూరు నాశ్రయించియున్నది.

మా నాయనగారు శోభనాద్రిగారు. మా తాతగారు సుబ్బారాయుడుగారు. ఆయన తండ్రిగారు మరలా శోభనాద్రిగారు.

వీరు మాకు వసురుద్రాదిత్యులు. వారి భార్యలు పార్వతమ్మ, సర్వలక్ష్మమ్మ, మహాలక్ష్మమ్మగార్లు. వీ ర ం ద రి నీ గూ ర్చి మా అన్నగారు వరలక్ష్మి త్రిశతిలో వ్రాశారు. మా నాయన గారు ముగ్గురన్నదమ్ములు. మా నాయనగారు జ్యేష్ఠులు. వారి తమ్ములు వేంకటాద్రియుడుగారు, వేంకటరత్నంగారు. మా పెద్ద పిన తండ్రి వేంకటాద్రియుడు గారికిప్పుడు ఒక కొడుకు ఒక కూతురు మాత్రము శేషించి యున్నారు. చిన పినతండ్రి వేంకటరత్నంగారికి సోమశంకరశాస్త్రి అనే ఒక కుమారుడు మాత్రమే ఇప్పటికి ఉన్నాడు మా నాయనగారి సంతానములో నేను, మా రామమూర్తి మాత్రమే శేషించి యున్నాము.

మా అమ్మగారు పార్వతమ్మగారు. ఆమె ఇంగువవారి ఆడ పడుచు. మా తాతగారిపేరు ఇంగువ నర్సయ్యగారు. ఆయన తండ్రి అనగా మాకు మాతుఃపితామహుడు లక్ష్మీపతిగారు. ఆయన తండ్రి అంటే మాకు మాతుఃప్రపితామహుడు శ్రీ బ్రహ్మభూతక్షేత్రేశ్వర శర్మగారు. ఆయన తపోలక్షణాలు మాయందున్నవని నా విశ్వాసము.

మా తల్లిదండ్రులకు మేము ఎనమండుగురము పుట్టితిమి. మొదటి ఇద్దరు స్త్రీ సంతానము. మూడవవాడు మా సత్యనారాయణ గారు. నాల్గవ సంతానము మహాలక్ష్మమ్మగారు. ఆమె నాకు మా అన్నగారికి చెల్లెలు. నా తరువాత ఇద్దరు మగసంతానము పుట్టి నష్టమై నారు. వారి తరువాత మా రామమూర్తి పుట్టినాడు. అతడే కడసారి బిడ్డ. వాడు సౌమ్యనామ సం॥లో ఉత్తర ఫల్గుణి నక్షత్రములో పుట్టాడు. మాకు మేనత్తలు నలుగురు. అందు మొదటి ఆమె అచ్చమ్మగారు. ఆమె గొప్ప ఇల్లాలు. శీలవతి. ఆమె పేరే మా రెండవ అక్కగారికి పెట్టిరి. ఆమె గర్భవతియై పురిటిలో చని పోయెను. నాటినుండియు ఆమె మా ఇలువేలుపై వెలసినది. మా అన్నగారి జ్యేష్ఠ కుమారుడు అచ్యుతరాయలకు ఆమె పేరే పెట్టబడి

నది. రెండవ మూడవ మేనత్తలు మేము పుట్టక ముందే వితంతువు లైరి. రెండవ మేనత్త పెద్దవియ్యమ్మగారికి కొంత ఆస్తి ఉండెను దానితో ఆమె స్వతంత్రజీవనము గడుపుచుండెను. మూడవ మేనత్త కామమ్మగారు మా పినతండ్రిగారివద్ద నుండెడిది. మా పినతండ్రికి ఇరువురు భార్యలు. అందు రెండవ యామె కిరువురు కుమారులు ఒక కుమార్తె కలిగిరి. కుమార్తెయే పెద్దది. ఇరువురు కుమారులలో చిన్న వాడు పసితనమందే చనిపోయెను. పెద్దవాడు చి॥ సోమశంకరశాస్త్రి ఇప్పుడతడును డెబ్బదియవపడిలో పడినాడు. మంచి వ్యవహార జ్ఞానమేకాక జ్యోతిశ్శాస్త్రమునందును వేదాంత పురాణ విజ్ఞానమందును తగినంత పాండిత్యము కలవాడు.

మా కడసారి మేనత్త గుంటూరి వారి కోడలు. ఆమె నలుగురు కుమారులను ఒక్క కూతురును గన్నది. ఆ నలుగురిలో పెద్దవాడు సత్యనారాయణ. మా మూడవ అక్క మహాలక్ష్మమ్మగారాయన భార్య. గుంటూరి సుబ్బారావు వారి సంతానము. వారిది పెద్దపాడు. ఆ సంబంధమువల్లనే మా అన్నగారు చిన్నతనములో ఆయూర కొన్నాళ్ళు చదువుకొన్నారు.

మా పెద్ద మేనత్త అచ్చమ్మగారొక్క కుమారుని మాత్రమే కని కాలగతి చెందెను. ఆ కుమారుని పేరు సుబ్బారాయుడు. వారు అమ్మనమంచివారు. ఆయన తండ్రి శ్రీరాములుగారు. ఆయన ధనవంతుడు కాడు, శీలవంతుడునూ కాడు. అచ్చమ్మగారు చనిపోవగనే ఆ కుఱ్ఱవానిని ఆరవ నెలయందే మా నాయనగారు తెచ్చి పెంచిరి. చివరకు మా తండ్రులు మువ్వురును మూడు, రెండున్నర, ఏడున్నర ఎకరముల పొలమిచ్చి అప్పటికి జనించిన పెద్దపిల్ల మా అక్కగారు రాజ్యలక్ష్మీదేవిని భార్యగానిచ్చి ఒక సంసారినిగా నిలబెట్టిరి. ఆయనకు మగపిల్లవాడొకడు పుట్టిపోయెను. తర్వాత అయిదుగురు స్త్రీ సంతానము కలిగిరి. వారిలో పోయినవారు పోగా నిప్పుడు

ముగ్గురు మాత్రమున్నారు. ఒకతెకు తప్ప తక్కిన నలుగురికి సంతానము కలదు. ఆ మా పెద్దప్పగారు రాజ్యలక్ష్మీదేవి. సౌందర్య వతి. వివేకవతి. విద్యావతి. ఆమె మా నాయనగారి వల్ల అనేక విషయములు పౌరాణికములు, తాత్వికములు విని అవి యన్నియు తమ్మునకు చెప్పినది. ఆమె కెన్నో పాటలు వచ్చును. కుచ్చెలకథ మొదలగునవన్నియు ఆమె శ్రావ్యముగా గానము చేయుచుండ ఈ తమ్ముడు అనగా మా అన్నగారు చెవులు దోర పెట్టుకొని విను చుండెడివాడు.

మా రెండవ మూడవ మేనత్తలిరువురు నిస్సంతుగానే కాల ధర్మమునందిరి. నాల్గవ యామెను గూర్చి ఇది వరకే చెప్పియుంటిని.

మా పిన తండ్రులిరువురు—వారిలో పెద్ద వెంకట్రాయుడుగారు. చిన పిన తండ్రి వేంకటరత్నంగారు. వేంకటాయుడుగారికి పదునలుగురు సంతానము. వారిలో నిప్పుడు నిరువురు మాత్రమే ఉన్నారు. వేంకటరత్నంగారి సంతానము గూర్చి ఇది వరకే తెలియ బరచితిని.

మా తాతగారి యాస్తి అరువది నాలుగెకరములు. మా తాత లిరువురు. మా పితామహుడు సుబ్బారాయుడుగారు. ఆయన తమ్ముడు శివయ్యగారు. ఆ శివయ్యగారు చాల కాలం బ్రహ్మచారిగనే యుండిరి. తరువాత కొన్నాళ్ళకు పెద్ద తనం వచ్చిన తర్వాతనే హైదరాబాదు వెళ్లి ఒకామెను చేసుకొనివచ్చెను. వారిరువురు జీవించి యున్నంత వరకు ఆస్తియంతయు ఉమ్మడిగానే ఉండెను. ఎట్లైనను ఆస్తి నిర్వహణలోగాని పెంపకంలోగాని శివయ్యగారి పాలు తక్కువ శివయ్యగారికి సంతానము లేదు. సుబ్బారాయుడుగారికి ముగ్గురు కుమారులు. పెద్దవాడు తండ్రికి కావలయును. మూడవవాడు తల్లికి కావలయును. మధ్య వానిని శివయ్యగారు పెంపకమడిగెను.

‘ఇత్తునులే’యని సుబ్బారాయుడుగారనిరట. పెంపకము జరుగలేదు. తన్నిమిత్తమైన వ్రాతకోత లేమియు జరుగలేదు. ఇట్టి స్థితిలో సుబ్బారాయుడుగారు కాలముచేయగా మా తండ్రి శోభనాద్రిగారు వ్యవహారమంతయు నెత్తిన వేసికొని ఆస్తినంతయు చక్కదిద్దు చుండెను. శివయ్యగారు నాటికీ నేటికీ సాక్షిమాత్రుడే. అయినను పంపకముల మాట వచ్చునప్పటికి “చిన్నాయనా! పంపకములు ఎట్లా”నో అన్న శోభనాద్రిగారి ప్రశ్నకు, “నీకూ నాకు చెరిసగము రావలసినదే”యని శివయ్యగారు సమాధానము చెప్పిరి. శోభనాద్రిగారు పెద్దవాడు. తమ్ములు చిన్నవాండ్లు. పినతండ్రి మూలమున కొంపలో రవధి పుట్టుట శోభనాద్రిగారికిష్టం లేదు. మెదలకుండ మరొక ఆసామిని పిలవకుండ పిన తండ్రికి ఆస్తిలో సగము పంచి యిచ్చినాడు. దీనితో ఊరిలో శోభనాద్రిగారి పలుకుబడి పరువు ప్రతిష్టలు రెండింతలైనవి. కానీ, ఆస్తి తగ్గిపోయెను. అప్పుడాయన తమ్మునికి అనగా వేంకటరత్నంగారికి సగము పంచి పెట్టి తరువాత జమీందారులతో ఏదో దావాలో తాను గెలుచుకున్న పదునేను ఎకరముల భూమిలో తమ్మునికైదెకరములిచ్చి తాను పదెకరముల భూమినుంచుకొనెను. దానితో శోభనాద్రిగారి ఆస్తి ఇరువది ఆరు ఎకరములైనది. 1875 ప్రాంతముల పొలమంతయు మాగాణి యైనది. అప్పటినుండి మా కుటుంబం సుఖముగ జీవింపసాగెను.

శోభనాద్రిగారు సాక్షాత్తు శివుడు. దానికి తోడు భోళా శంకరుడు కూడ. మా తండ్రిగారని చెప్పడం కాదుగాని ఆయన ధీరత్వం, ఔదార్యం, పరోపకార పారీణత్వం ఆయన దయా సంపత్తి, త్యాగశక్తి అతిలోకమైనవి. ఆయనకు గూడవల్లి బ్రహ్మన్నగారు ఆప్తమిత్రము. బ్రహ్మన్నగారు రెండువందల యాభై ఎకరముల ఆసామి. కమ్మవారు. ఈ మిత్రులిరువురు కూడి చేసిన మహాకార్యములు వారి లీలలు నాకు తెలిసినంతమట్టుకే వ్రాయటానికి పెద్ద గ్రంథమౌతుంది. అది ప్రస్తుతం కాదుగదా.[2]

మా మాతాపితరుల పెండ్లి ఒక విచిత్రగాథ. వారిది దోస కాయల పెండ్లి. మా నాయనగారు ఒకనాడు మంచె మీద కూర్చుండి జొన్నచేను కాస్తున్నాడు. ఆ చేను మా ఊరి నుండి కాటూరిపోయే డొంకకు సమీపంలో ఉన్నది. మా మాతామహుడు ఇంగువ వెంకట నర్సయ్యగారు డొంక వెంబడి వెళుతున్నాడు. మధ్యాహ్నమైనది. గొంతెండి పోవుచున్నది. మా తాత మంచెమీద బ్రాహ్మణ కుర్ర వాడుండుట గమనించి "నాయనా, గొంతెండి పోతోంది, ఒక దోస కాయ ఇస్తావా?"యని ప్రశ్నించాడు. ఈయన "అయ్యో! అదేమి టండి చేలోకి రండి. మీ ఇష్టము వచ్చినన్ని కోసుకుందురుగాని" అని సమాధానమివ్వగా ఆయన "ఎక్కువక్కర లేదు బాబూ! ఒక కాయ చాలునని" చేలోకి వచ్చి ఒక కాయ తీసికొన్నాడు. ఇంతలో శోభనాద్రిగారు మంచెమీది నుండి దూకి చేలోకి దిగి దాదాపు అర్థ మడుగు దోసకాయలు కోసి ఆయన అంగవస్త్రములో మూట గట్టి "పట్టుకొని వెళ్ళండి" అని ఇచ్చాడు. మా ఊరికి కాటూరు కోసెడు దూరము. ఆ మధ్యాహ్నవేళ ఆ బ్రాహ్మణుడు అర్ధమడుగు దోస కాయల మూట ఇంటికి తీసుకు వెళ్ళి ఇంట్లో మూట దింపుతూనే, భార్యతో – అంటే మా అమ్మమ్మతో – ఆమె పేరు వెంకమ్మ – "ఒసేవ్! మన పార్వతికి సంబంధం కుదుర్చుకు వచ్చాను" అన్నాడుట ఈ భోగట్టా అంతా తెలిసినతర్వాత ఆవిడ "వాళ్లెక్కడ మనమెక్కడ, వాళ్ళు చిన్న జమిందారులు. మీ వెర్రికాని వాళ్లెక్కడ అంగీకరిస్తారనీ," ఆయన మాట త్రోసి పుచ్చిందట. అప్పటికైనా నరసయ్యగారాయత్నము మానలేదు. నందమూరు వచ్చి మా పిన తాత శివయ్యగారితో "మీ శోభనాద్రికి మా అమ్మాయి నిచ్చి పెళ్ళి చేద్దామని, చెప్పడానికి వచ్చానన్నాడట" ఆయన సరే నన్నాడుట. అన్నగారు ఊళ్ళో లేడు. లేకపోయినా ఆయనతో చెప్పకుండనే ఆ తమ్ముడు అన్న కొడుకు పెళ్ళికి అంగీకరించాడు. నరసయ్యగారు సంతోషించి వెళ్ళిపోయాడు. శివయ్యగారు పెళ్లి సరంజామా అంతా

ఏర్పాటు చేయించి, తాళ్ళు కొట్టించి, పందిళ్ళు పాకలు వేయించడం ప్రారంభించాడు. ఇంతలో అన్నగారు ఊరు నుండి వచ్చి ఈ పందిళ్లూ పాకలూ చూచి విస్తుపోయి "శివా! ఇదేమిటార్రి పందిళ్ళు వేయించావ్ దేనికీ" అంటే "పెద్దవాడి పెళ్ళి. కాటూరు నుండి ఇంగువ నర్సయ్యగారు పిల్లనిస్తామన్నారు, నేనొప్పుకున్నాను. పందిళ్ళు వేయిస్తున్నాను" అన్నాడట. ఆ అన్న మాఱుమాటాడ లేదు. తాను కూడ పెళ్ళి సంభారము సమకూర్చటం ప్రారంభించాడు. ఇందులో మరో అద్భుతం, ఆ పెళ్ళి కూతురికెన్నేండ్లు? మూడు. మూడేండ్లు, మా నాయనగారికప్పుడు పదునాలుగేండ్లట. ఆ నర్సయ్యగారు మళ్ళీ వచ్చి తాంబూలాల కోసం చెప్పిపోతే వీరు వెళ్ళి తాంబూలాలు పుచ్చుకువచ్చారు. మా తాతగారికి పండ్రెండు ఎకరముల పొలముండేది. కానీ మెట్ట. ఏమీ పండేది కాదు. కట్నకానుకలు ఏమీ లేవు. ఉభయ ఖర్చులు సుబ్బారాయుడుగారే పెట్టుకొని కుమారుని వివాహం జేగీయమానంగా చేసుకువచ్చాడు. పెళ్ళికూతురు ఊరేగింపులో పల్లకిలో పండుకొని నిద్రపోయింది. పెండ్లి కొడుకు తనకీ పసికందుతో పెండ్లమేమిటని కొంచెం గింజుకున్నాడట. కానీ పెద్దల ఆజ్ఞ. పెండ్లి సర్వలక్షణ లక్షితముగా జరిగిపోయింది.

## 3. మా అన్నయ్య పుట్టాడు

ఆ దంపతులకు మేము సంతానము. రాజ్యలక్ష్మమ్మగారికి సత్యనారాయణగారికి అయిదేండ్లు తేడా. సత్యనారాయణగారికి నాకూ అయిదేండ్లు తేడా. మా రామమూర్తికి నాకు ఏడేండ్లు తేడా. నాకు ఏడేండ్లు వచ్చేవరకు జరిగిన చరిత్ర అంతగా జ్ఞాపకంలేదు. మా నాయనమ్మగారి మృతి మాత్రం లీలగా జ్ఞాపకం ఉంది. ఆమె ఇందుపల్లిలో చనిపోయింది. అక్కడ సత్యనారాయణగారి చదువు కోసం కాపురం పెట్టారు. ఒకనాడు సాయంకాలం దేవుడి గుళ్లో ప్రదక్షిణాలు చేస్తూ ఉంటే ఆవిడకి నెత్తిమీద ఏదో కుట్టినట్లయింది.

మిన్నాగు కొట్టిందనుకున్నారు. ప్రాణం పోయింది. మానాయనగారు ఆమెను బండి మీద తీసుకొని వచ్చి నందమూరులో కర్మాంతరాలు చేశాడు.

మా దేవుడి ప్రతిష్ఠకూడా నాకు జ్ఞాపకమున్నది. నాకప్పటికి నాలుగేండ్లనుకుంటాను. మా తాత, అమ్మమ్మ గుడి విమానం మీద ఎక్కి శిఖర ప్రతిష్ఠ చేయడం నాకు జ్ఞాపకమున్నది. ధ్వజస్తంభము కోసం పెద్ద గొయ్యి తీసి అందులో జనమంతా డబ్బులు వేయడం అందరూ పట్టుకొని హరహరాయంటూ లేపడం నాకు జ్ఞాపకముంది.

ఇద్దరు ఆడపిల్లలు తర్వాత పుట్టడంవల్లగాని, బహుకాలంగా ఇంట్లో మగపిల్లవాడు లేకపోవడంవల్లగాని, మాఅన్నగారి పుట్టుకతో మా వాళ్లందరికీ బ్రహ్మానందం కలిగింది. ఇరువురు పినతండ్రులు. ఊళ్లో ఉన్న ఇరువురు మేనత్తలు. ఒక మేనమామ. ఊళ్లో ఉన్న పెద్దలు, పిన్నలు, స్నేహితులు అందరికీ మా అన్నగారు అల్లారు ముద్దుబిడ్డడైనాడు. రాజ్యలక్ష్మమ్మగారు ఖరనామ సం॥లో పుట్టినది. సత్యనారాయణగారు మన్మథలో పుట్టాడు. అయిదారేండ్లు తేడా. ఈ రోజుల్లో శోభనాద్రిగారు మగపిల్లడి కోసం తపించిపోయినాడు. ఎవరో సాలె పిల్లవాడిని తెచ్చి పొట్టమీద పండుకో బెట్టుకొనేవాడుట. మగపిల్లవాడంటే అంత ఆర్తి.

సత్యనారాయణగారు పుట్టాడు శోభనాద్రిగారు పొంగి పోయాడు. కృత్తికా నక్షత్రం, కన్యాలగ్నం, లగ్నంలో ముగ్గురు గ్రహములుచ్చలో నున్నారు మహా విద్యావంతుడు. మహోద్యోగి అవుతాడని కార్తాంతికులు చెప్పారు. తండ్రి పినతండ్రులు మేనత్తలు అశేష బంధుకోటి ఆనంద తరంగాలతో మునిగితేలారు. అంతకు ముందే అనగా ఒక ఏడాది ముందుగా మా పెద్ద పినతండ్రికి మగ శిశువు జన్మించాడు. ఆయన పేరు సుబ్బారాయుడే. వేంకట

సుబ్రహ్మణ్యశర్మ అని అనేవారు. ఆయన పెద్దవాడై అస్తమించాడు. ఆయనకు ఒక కుమార్తె గలదు.

నా చిన్నతనం నిజంగా మొదలెట్టింది నా ఏడవ ఏట. అప్పటి నుండి జరిగిన ఉదంతాలే నాకు కొద్దో గొప్పో జ్ఞాపకమున్నవి. అప్పటి వరకు అనగా ఆ ఏడేండ్లలో జరిగినవి, నాకేమీ జ్ఞాపకం లేవు. ఆ ముందు మాటలు నేను చెబుతున్నాననగా అవి సాక్ష్యధారాలవల్ల, వినికిడి మీద చెప్పే విషయాలే. సాధ్యమైనంతవరకు సత్యములైనవే ఇక్కడ వ్రాస్తున్నాను.

సత్యనారాయణగారు చిన్నతనంలో నాలుగుచోట్ల విద్యాభ్యాసం చేశాడు. 1. నందమూరు, 2. పెదపాడు, 3. ఇందుపల్లి, 4. వెలినూతల ఈ పల్లెటూర్లలో విద్యాభ్యాసము చేయవలసి వచ్చిన పరిస్థితులేమిటో నాకిప్పటికీ అర్థము కాలేదు. నందమూరులో విద్యాభ్యాసము చేయటం సహజమేకదా! బుర్రా సుబ్బయ్యగారని మానాయన మేనమామ కొడుకు ఒకాయన మా ఊళ్లో అంటే మా ఇంట్లోనే కాపురం పెట్టి మాఅన్నగారికి చదువు చెబుతూ ఉండేవాడు. ఆ మేనమామ కొడుకులు నలుగురో అయిదుగురో వారెప్పుడూ మా ఇంట్లోనే ఉండేవారు. మా ఇల్లొక సత్రం. నాలుగైదూళ్ల బంధువులూ స్నేహితులూ ఇక్కడ ఉండేవారు. ఆ చదువుకు ఎందుకో విచ్ఛిత్తి కలిగింది. తర్వాత ఇందుపల్లి చదువు సాగినట్లున్నది. ఇందుపల్లిలో మానాయనమ్మ చనిపోవడం జరిగింది కదా! తన్మూలమున అక్కడి చదువుకు అంతరాయం కలిగి ఉంటుంది. అక్కడ జయకృష్ణయ్యగారని (జె. కిష్టయ్య) ఒకాయన- కాటూరు నివాసి- బుర్రావారు- సత్యనారాయణగారికి గురుత్వము వహించాడు. తరువాత వెలినూతల చదువు, గునుపూడి వీరభద్రయ్యగారి శిష్యత్వము.

సుబ్రహ్మణ్యశర్మ అని అనేవారు. ఆయన పెద్దవాడై అస్తమించాడు. ఆయనకు ఒక కుమార్తె గలదు.

నా చిన్నతనం నిజంగా మొదలెట్టింది నా ఏడవ ఏట. అప్పటి నుండి జరిగిన ఉదంతాలే నాకు కొద్దో గొప్పో జ్ఞాపకమున్నవి. అప్పటి వరకు అనగా ఆ ఏడేండ్లలో జరిగినవి, నాకేమీ జ్ఞాపకం లేవు. ఆ ముందు మాటలు నేను చెబుతున్నాననగా అవి సాక్ష్యాధారాలవల్ల, వినికిడి మీద చెప్పే విషయాలే. సాధ్యమైనంతవరకు సత్యములైనవే ఇక్కడ వ్రాస్తున్నాను.

సత్యనారాయణగారు చిన్నతనంలో నాలుగుచోట్ల విద్యాభ్యాసం చేశాడు. 1. నందమూరు, 2. పెదపాడు, 3. ఇందుపల్లి, 4. వెలినూతల ఈ పల్లెటూర్లలో విద్యాభ్యాసము చేయవలసి వచ్చిన పరిస్థితులేమిటో నాకిప్పటికీ అర్థము కాలేదు. నందమూరులో విద్యాభ్యాసము చేయటం సహజమేకదా! బుర్రా సుబ్బయ్యగారని మానాయన మేనమామ కొడుకు ఒకాయన మా ఊళ్లో అంటే మా ఇంట్లోనే కాపురం పెట్టి మా అన్నగారికి చదువు చెబుతూ ఉండేవాడు. ఆ మేనమామ కొడుకులు నలుగురో అయిదుగురో వారెప్పుడూ మా ఇంట్లోనే ఉండేవారు. మా ఇల్లొక సత్రం. నాలుగైదూళ్ల బంధువులూ స్నేహితులూ ఇక్కడ ఉండేవారు. ఆ చదువుకు ఎందుకో విచ్ఛిత్తి కలిగింది. తర్వాత ఇందుపల్లి చదువు సాగినట్లున్నది. ఇందుపల్లిలో మానాయనమ్మ చనిపోవడం జరిగింది కదా! తన్మూలమున అక్కడి చదువుకు అంతరాయం కలిగి ఉంటుంది. అక్కడ జయకృష్ణయ్యగారని (జె. కిష్టయ్య) ఒకాయన— కాటూరు నివాసి— బుర్రావారు— సత్యనారాయణగారికి గురుత్వము వహించాడు. తరువాత వెలినూతల చదువు, గునుపూడి వీరభద్రయ్యగారి శిష్యత్వము.

కూడ దానికి దోహదం చేసినవి. వాడి మేనమామ సుబ్బయ్యగారికి 'పిచ్చాలు' అని ఒక కూతురుండేది. నాగవరప్పాటి చదువు నాటికి సత్యనారాయణగారికి పదిపన్నెండేళ్లకంటే ఎక్కువ వయస్సుండదు. ఆ పిచ్చాలు అంటె సత్యనారాయణగారికి ప్రాణం. కానీ, దురదృష్ట వశాత్తు ఆపిల్ల ఏదో జబ్బు వచ్చి స్వర్గస్తురాలైనది. ఆ పిచ్చాలు మీది ప్రేమ సత్యనారాయణగారికి వృద్ధాప్యం వచ్చిన తరువాత కూడా మఱపు రాలేదు.[4] ఆయన కవితా తపస్వి కావడానికి ఆయన మనస్సులో ఆజన్మ సిద్ధంగా ఉన్న ఈ ప్రేమసంస్కారమే కారణమని నేను విశ్వసిస్తాను.

నందమూరులో ఆయన చదువు అక్షరమాలా విజ్ఞానమాత్రమే అయి ఉంటుంది. ఇందుపల్లిలో కొంత కొనసాగింది కాని, నాయనమ్మ చావుతో అది మధ్యలో త్రుంచుకు పోయింది. గునుపూడి వీరభద్రయ్య గారు ఆనాటికే పూర్వపు మెట్రిక్యులేషను దాకా చదివిన మనిషి. సమర్థుడైన ఉపాధ్యాయుడు. శిష్యుని సామర్థ్య మెరిగి అతనిలోనున్న మేధాశక్తిని ఉద్దీపింప జేయగల సద్గురువు. ఆయన పోషణలో సత్య నారాయణగారి మేధ చక్కగా వికసించింది. పెదపాటి చదువులో పుట్టిన వికారాలేమి, వెలినూతల చదువులో రాలేదు. పెదపాటిలో సత్యనారాయణగారికొక తెలికలవాడు[5] విరోధి దొరికాడు. వాడు ఆయన పుస్తకాలన్నీ కావాలని కత్తిరించి ఆయన మీద మా అత్త య్యతో చాడీలు చెప్పేవాడు. ఈయన నోరులేనివాడు కావటంచేత దానికి తగిన ప్రతిక్రియ చేయలేకపోవడమేకాక తగిన సంజాయిషీ చెప్పుకోలేని స్థితికూడా ఉండేదిట.

వెలినూతలలో ఈయన చదువు అవిచ్ఛిన్నంగా సాగింది. వీర భద్రయ్యగారీయనకు ఇంగ్లీషు లెక్కలు మొదలైనవి బోధించటమే గాక ముందు ఈయన జీవితానికి తారకం కాబోయే సాహిత్యవిద్యలో గూడ ప్రవేశం కలుగజేశాడు. వెలినూతల వదలి పెట్టునప్పటికే సత్యనారాయణగారు ధారాళంగా పద్యం కట్టగలిగిన స్థితిలో ఉన్నాడు.

# 4. బందరులో మేము

అది 1908వ సంవత్సరము, ఆ ఏడాది మా కుటుంబం బందరు కాపురం పెట్టాము. నేనంతకు పూర్వము ఒక ఏడాది కాటూరులో మా మేనమామల ఇంట్లో ఉండి చదువుకుంటూ ఉండేవాడిని. అది ఒకటి రెండేండ్లు జరిగింది. 1908లో మా నాయనగారు కాటూరువచ్చి అన్నయ్యను బందరులో చదువుకు ప్రవేశపెడుతున్నానని చెప్పాడు. నేను గూడా బందరు వెళతానని మారాం చేశాను. ఎట్టకేలకు మా నాయన గారంగీకరించి బందరులో మేమిరువురం మా రామమూర్తి–పసిపిల్లవాడు–మా అమ్మగారూ–వీరితో కాపురం పెట్టాడు, తరువాత మా పెద్దమ్మ కొన్నాళ్లు మాతో ఉండేది, బందరు బచ్చుపేట దశిగ కృష్ణమూర్తిగారింట్లో కాపురం. ఆ ఇల్లు హిందూ హైస్కూలుకు చాలా సమీపం అ స్కూలు నాటినుండి చాలా పేర్గాంచిన పాఠశాల. ఈ కృష్ణమూర్తిగారు అందులో కాపీలమాస్టరు, రైటరుగూడాను. స్కూలులో చాలా పలుకుబడి కలవాడు. ఆయన అండగా ఉంటాడని మా నాయన ఆయన ఇంట్లో మమ్మలను దించి వెళ్ళిపోయినాడు. నేను నాల్గవ తరగతిలో ప్రవేశించాను. మా అన్నగారు ఒకటవ ఫారంలో ప్రవేశించాడు. మా ఇద్దరికీ రెండు క్లాసులు తేడా ఉండేది. నేను నాల్గవ తరగతి రెండేండ్లు చదివాను–ఇంగ్లీషు రాకపోవడంవల్ల. 1908లో సంవత్సరం పూర్తి అయిన తర్వాత వచ్చి చేరాం కాబట్టి ఒక్క ఏడాది చదువు నష్టమైంది.

సత్యనారాయణగారు అర్భకాకారి. కానీ, మంచి కనుముక్కు తీరు కలవాడుకదా! అన్ని సబ్జక్టులలోను మెరికలా ఉండేవాడు. శ్రావ్యంగా పద్యం చదివేవాడు. ఆ చిన్నతనంలో ఆయన మేధ మెరుపులా ప్రకాశించేది. అది చూచిన పెద్దలంతా ముక్కుమీద వ్రేలు వేసుకొని ఆశ్చర్యపోయేవారు. త్వరలోనే టీచర్లందరికీ ఇత డంటే ముద్దు ఏర్పడింది. మెట్రిక్యులేషన్ వరకు ఆయనే క్లాసుకి

మానిటరుగా ఉండేవారు. విద్యార్థులలో మంచి పలుకుబడి ఉండేది. ఫస్టుఫారంలో క్లాసుటీచరు ధర్మపురిగారు. రెండవఫారంలో కొలచన కృష్ణస్వామిగారు. వీరిరువురు సత్యనారాయణగారిని సొంత పిల్లడల్లె చూచుకునేవారు. మేము కాపురంఉన్న గృహపతి దశిగ కృష్ణమూర్తి గారికి మావాడి మీద కన్నుపడ్డది. ఆయన దగ్గర ఇతనికి ఈడైన ఆడపిల్ల ఉన్నది. ఆమెనిచ్చి పెళ్ళిచేయాలని సంకల్పించి మానాయన గారితో సంప్రదించారు. కానీ, సత్యనారాయణగారికి అప్పటికే అనగా బందరు రాకమునుపే పండ్రెండవ ఏటనే వివాహమైంది. ఆ మాట వినేటప్పటికి కృష్ణమూర్తిగారికి ఒళ్లమండి ఏదో సాకుపెట్టి ఇంట్లోంచి లేచి పొమ్మన్నాడు. సత్యనారాయణగారి ప్రథమ భార్య వరలక్ష్మమ్మగారు. చిరంజీవి అచ్యుతదేవరాయలు తల్లి. ఆమెతో వివాహంలో ఒక చమత్కారమైన కథ ఉన్నది. అది అప్రస్తుతము కాబట్టి ఇక్కడ వదిలేస్తున్నాను.[6]

న్యాయానికి 1914 సంవత్సరముదాకా సత్యనారాయణగారి సాహిత్య ప్రవేశగాథ బయటపడలేదు.

శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు హైస్కూలులో తెలుగు పండితులుగా ఉండేవారు. కవితా సమారాధకులైన విద్యార్థులుగా పింగళి లక్ష్మికాంతం, కాటూరి వేంకటేశ్వరరావు, విశ్వనాథసత్య నారాయణలు ఆయన వెంట తిరుగుతుండేవారు. ఈ పరిస్థితి 1912కు పూర్వం నుండీ ఉండేది. నాకు జ్ఞాపకం ఉన్నది మట్టుకు 1914 నుండిన్నీ – ఆ సంవత్సరంలోనే మా నాయనగారు కోపం వచ్చి మా అన్నగారు క్లాస్ పుస్తకాలు సరిగ్గా చదువడం లేదని ఆయనను చదువు మానుకొమ్మని పుస్తకాలన్నీ కట్టగట్టి పారవేసింది. అది 1914లోనే. అది గుంటూరి సీమ వెలువడిన సంవత్సరం.

శ్రీ వెంకటశాస్త్రిగారు భైరవ ప్రెసులో కాపురముండేవారు. వారి ఇంటి ముందు నుంచే మేం అన్నదమ్ములం రోజూ హోటలుకు

పోతూ ఉండే వాళ్ళం. వెంకటశాస్త్రిగారి భార్య మహాలక్ష్మమ్మగారు ఒకరోజున మేము హోటలుకుపోతూ ఉంటే మమ్మల్ని అడ్డంగొట్టి- ఆ ఇంట్లో మశూచికం ఉన్నది. అక్కడికి పోవద్దని - మా ఇద్దరికీ తాను స్వయంగా అన్నం పెట్టింది. అప్పటికే సత్యనారాయణగారు కొన్ని వేల పద్యాలు వ్రాసి చింపివేయటం జరిగింది. తదాది మా అన్నగారు కవితా తపస్వి అయినాడని చెప్పాలి.

సత్యనారాయణగారు మొదటనుండి స్నేహజీవి. స్నేహితులు లేకపోతే ఆయనకు క్షణం గడిచేది కాదు హైస్కూలులో చదువు తుండగా కొల్లా కోటయ్య, చల్లా సీతయ్య అని ఇద్దరు స్నేహిలుండే వారు. ఈయన శరీరానికి వారు రక్ష. వారి బుద్ధికి ఈయన రక్ష - అనగా వారికి అటెండెన్సు వేయడానికి, క్లాసులు ఎగగొట్టినా వచ్చి నారనటానికి ఈయన అండఉండేది. ముగ్గురూకలసి ఊరు వెంబడి చెడ తిరిగేవారు. ఈయన చదువనక్కరలేదుకదా! ఏక సంతగ్రాహి అగుటచేత క్లాసులో విన్నంత మాత్రం చేత ఈయనకు పాఠాలన్ని హృత్కవిలెగా వచ్చేవి. ఇంటికి రాగానే పుస్తకాలు ఇంట్లో పారేసి బజారుకు ఎగబడేవారు. అదొక పెద్ద గాథ.

ఇంతకీ శ్రీ వెంకటశాస్త్రిగారి ప్రభావంవల్లి సత్యనారాయణ గారికి నిత్య కవితానుసంధానం అలవాటైంది. నడుస్తున్నప్పుడు, కూర్చున్నప్పుడు, మాట్లాడేటప్పుడు ఎప్పుడూ పద్యములను భావిస్తూ ఉండేవాడు. అతని భావనా తాదాత్మ్యమును చూచి ఒకసారి బెల్లంకొండ రాఘవరావుగారు విస్తుపోయినాడు. ఆ కథ తరువాత చెబుతాను - విద్యార్థిగా ఉన్నప్పుడొక సంఘటన జరిగింది. నాకు సరిగ్గా జ్ఞాపకం లేదు- అంటే సంవత్సరము, తిథి అవన్నీ. బందరు కొప్పరపు కవులు వచ్చారు. నార్త్ వల్లూరు జమీందారిగారి భవనంలో వారు అవధానం చేస్తున్నారు. ఆ సభలో శ్రీ చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిలుగారు గూడ ఉన్నారు. అందులో సత్యనారాయణగారు బిందు

పూర్వక కకారముతో వృత్త్యనుప్రాసంగా పద్యము చెప్పమని ప్రశ్నించాడు. ఇది ఎవరి ప్రోద్బలం వల్లనూ చేసింది కాదు. ఆయన స్వకపోలకల్పనంగా చేసిన పనియే అది. కొప్పరపు వారిలో పెద్దాయన బిందుపూర్వక కకారము ప్రాసవేసి పద్యాన్ని నడిపించుకు పోతున్నాడు. సత్యనారాయణగారు లేచి అభ్యంతరం చెప్పి వృత్త్యను ప్రాసం కావాలన్నాడు. రవరవ ప్రారంభమైంది. అవధానములో వేయదగిన ప్రశ్న ఔనని, కాదని వాగ్వాదం చెలరేగింది. వెంకట శాస్త్రిగారు ఔనని కాదని చెప్పకుండా ఏవో నొక్కులు నొక్కు తున్నాడు. సభలో బీభత్సం జరుగుతుందని రాజాగారు సత్య నారాయణగారిని సభలో నుండి వెళ్లి పొమ్మన్నాడు. ఆయన సభ విడిచి వెళ్ళినాడు. ఆ విషయం తరువాత రెండు రోజుల వరకు మా స్కూలులో ప్రధాన చర్చా విషయమైంది. మాకప్పుడు వేమూరి రామశాస్త్రిగారు తెలుగు పండితులుగా ఉన్నారు. ఆయన బేతపూడి ప్రకాశంగారి స్థానే వచ్చారు. ఆయన ఆ పద్యాన్ని వృత్త్యను ప్రాసంగా వ్రాసి తరువాత స్కూలులో చదివి వినిపించారు.

1916లో సత్యనారాయణగారు కాలేజీలో ప్రవేశించాడు. మెట్రిక్యులేషను లో మార్కులు కొంచెం తక్కువ వచ్చినప్పటికి నోబుల్ కాలేజి ప్రిన్సిపాల్ పెన్నుదొర ఇంటర్ మిడియట్ లో సీటు ఇచ్చాడు. 1916;1917 సంవత్సరాలు ఇంటరుమిడియట్ చదువు. 1918;1919 సంవత్సరాలు బిఏ చదువు సాగింది.

ఈ సంవత్సరాల్లో మా దారిద్ర్యం కరాళస్వరూపం తాల్చింది. శోభనాద్రిగారు పూర్తిగా అప్పుల్లో మునిగి పోయినాడు. అప్పులు దాదాపు 12,000 రూపాయలదాకా తేలినవి - వడ్డీలుకాక. పొలమంతా పెద్దల్లుడికి అమ్మివేసి 12000 అప్పులు తీర్చమని చెప్పాడు. పొల మంతా తొమ్మిది ఎకరముల ఇరవై సెంట్లు- ఆయన స్వాధీనం చేసు కున్నాడు. బందరు దగ్గర నందమూరు అని కుగ్రామమున్నది.

ఆ ఊళ్ళో కొంత పొలం కొని వ్యవసాయం సాగించాడు. కాని అది ఏమీ పెద్ద లాభించలేదు. ఆయన ఇంచుమించుగా నిస్సహాయస్థితిలో ఉన్నాడు.

ఆ గడ్డు రోజుల్లో మేము కొన్నాళ్ళు రామలక్ష్మమ్మ హోటల్లో భోజనం చేస్తూ ఉండేవాళ్లం. ఆ హోటల్లోనే పింగళి లక్ష్మీకాంతం గారు ఉంటూ ఉండేవారు. రామలక్ష్మమ్మ ఒక విచిత్రమైన మనిషి. వీళ్ళందరినీ తన సంతానంగా చూచుకునేది. హోటలులో వీళ్ళు చేసే ఆగడాలకు అంతులేదు. కపిలేశ్వరపురం కరణం అగస్త్యరాజు రాఘవరావుకూడ ఆ హోటల్లోనే ఉండేవాడు. కొల్లిపర సూరయ్యా ఉండేవాడు. కొల్లిపర సూరయ్యా, అగస్త్యరాజు రాఘవరావు, కొడాలి ఆంజనేయులు, స్నేహంగా ఉండేవారు. వారు స్నేహితులుకారు. అదొక కుటుంబం. ఖర్చులన్నీ కొల్లిపర సూరయ్యగారు భరించేవాడు ఆనుభవం తక్కినవారిది. సత్యనారాయణగారి కాలేజి చదువంతా అలాగే గడిచింది.

పింగళి లక్ష్మీకాంతంగారితో ఈ కాలంలోనే స్నేహం ఏర్పడింది. లక్ష్మీకాంతంగారు వయస్సులోనూ తతిమ్మ విషయాల్లోనూ కూడ పెద్దవాడే. ఆయన ఇంటర్మీడియెట్ చదివి కొన్నాళ్లు కలెక్టర్ ఆఫీసులో పనిచేసి, తరువాత మళ్లీ కాలేజీలో ప్రవేశించి బి. ఏ. చదివి ప్యాసైనాడు. లక్ష్మీకాంతంగారికి, కాటూరి వేంకటేశ్వరరావు గారికి ఎప్పుడెట్లా కలిసిందో నాకు తెలియదు. బహుశః చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి శిష్యత్వము, కాలేజీ సహాధ్యాయిత్వము, వారిని కలిపి ఉండవచ్చు. వెంకటేశ్వరరావుగారిది కాటూరు. ఆ ఊరి కరణీకంవారిదే. చాలా పెద్ద సంసారం. వెంకటేశ్వరరావుగారి భాగమే 200 ఎకరాలదాకా ఉండేది. వెంకటేశ్వరరావు నిండుకుండ. పైకి కనబడేవాడుకాడు. గుప్తదాత. అతని స్నేహితులెందరో అతని ఖర్చుమీద జీవిస్తూ ఉండి ఉండడం నే నెరుగుదును. ఆయనది మా

మేనమామల ఊరు. మా కుటుంబాన్ని ఆయన పూర్తిగా ఎరుగును. 1942లో సత్యనారాయణగారికి గుడివాడలో గజారోహణోత్సవం జరిగినప్పుడు వెంకటేశ్వరరావు పద్యాలు వ్రాసి ఎంతో మెచ్చుకొన్నాడు. లక్ష్మీకాంతంగారికి సత్యనారాయణగారికీ ఆ రోజుల్లో జీవికాజీవిగా ఉండేది. లక్ష్మీకాంతంగారు కూడా మా కుటుంబంలో మనిషిగా మెలగేవాడు. ఒకసారి నందమూరు వచ్చి మా ఇంట్లో రెండు మూడు రోజులున్నాడు. మా నాన్నగారిని బాబాయని, మా అమ్మగారిని పిన్నీ అని పిలిచేవాడు. మేము బుట్టయ్యపేటలో కాపురమున్నపుడు మేమున్న జానకమ్మగారిల్లు ప్రక్కనే తాడిమళ్ల వెంకటరామయ్యగారిల్లు ఉండేది. లక్ష్మీకాంతంగారు ఆ ఇంట్లో కాపురం ఉండేవారు. ఒకరోజు నేను ఆయన ప్రక్కలో పండుకొని అలాగే నిద్రపోయాను కూడా.

ఆయనకు మా అన్నకూ కారణాంతరాలవల్ల వైమనస్యం కొంత పుట్టినమాట అసత్యంకాదు. అది ఎక్కువగా మధ్యవర్తుల మహిమయేయని నేను గట్టిగా చెప్పగలను. ఒకసారి వాళ్ళిద్దరు బందరు టౌనుహాలు వెనుక వసారాలో పండుకొని నిద్రపోయారు. ఆ రాత్రి లక్ష్మీకాంతంగారికి ఒక కల వచ్చింది. ఆ కలలో ఒక పెద్దదయ్యం ఆయన మీదికి వచ్చిపడ్డట్లు భ్రాంతి కలిగింది. ఆయన హడలిపోయి లేచి ప్రక్కనున్న మా అన్నను లేపి సంగతి చెప్పాడు. భూత నిర్వారణార్థం దేవీ స్తుతిగా ఇద్దరూ కలసి ఒక పద్యం వ్రాశారు. పద్యం నాకు జ్ఞాపకంలేదు కానీ, బిందుపూర్వక దకార ప్రాసకలది. చివరకు వచ్చునప్పటికి నాల్గవ పాదంలో దుర్గాశబ్దం ప్రయోగించాలని లక్ష్మీకాంతంగారి సంకల్పం. ప్రాస పడలేదు. అప్పుడు మా అన్న, "దుం దుర్గా జనయిత్రి" అని ప్రాసతో పూర్తిచేశాడు. లక్ష్మీకాంతం సత్యనారాయణగార్ల స్నేహం అల్లాంటిది.

లక్ష్మీకాంతంగారి తమ్ముడు వీరయ్య గూడా నాకు

స్నేహితుడు. వీళ్ళంతా రాయల్ కంపెనీలో సభ్యులు. రాయల్ కంపెనీ వాళ్ళు భారత నాటకాలు వేస్తూ ఉండేవారు. ముఖ్యంగా ఉద్యోగ విజయాలు వేస్తూ ఉండేవారు. మొదటిలో ఈ రెండు నాటకాలు కలిసి ఉండేవి. లక్ష్మీకాంతంగారు ధర్మరాజు, వారి అన్న నరసయ్య భీముడు వేషాలు కట్టేవారు. లక్ష్మీకాంతంగారు సంగీతం రాకపోయినా పద్యం చదవడం గంభీరంగా ఉండేది. ఆ రోజుల్లో పద్యం చదవడం ఒక పెద్ద కళగా ఉండేది. చెళ్లపిళ్లవారి పద్య పఠనం యావదాంధ్ర దేశాన్ని ముగ్ధుల్ని చేసేది. లక్ష్మీకాంతంగారు పద్య పఠనంలో మంచి కీర్తిని సంపాదించారు. ఆయన తరువాత సత్యనారాయణ పఠన వైఖరి పండితుల కళావేత్తల మెప్పును సంపాదించింది.

నేను 1924 మొదలు 1933 వరకు కృష్ణా పత్రికలో శ్రీ ముట్నూరి కృష్ణారావుగారి వద్ద సహాయ సంపాదకునిగా పని చేశాను. అప్పట్లో ఈ సంపాదకుడన్న మాటలేదు. గుమస్తా అన్న మాటే. ఆ రోజుల్లో ఢిల్లీలో ఎ.ఐ.సి.సి. మీటింగ్ జరిగితే పట్టాభి గారు దానికి వెళ్లి వచ్చారు. అవి సత్యాగ్రహం ముమ్మరంగా సాగుతూ ఉండే రోజులు. ఢిల్లీ నుండి తిరిగి వచ్చిన వారికి బందరు పౌరులు ఘనంగా స్వాగతం చెప్పారు. అది పదివేల మంది కూడిన సభ ఆ సభలో "కళ్యాణమే గాంధికిన్" అనే మకుటముతో నేను పద్యాలు వ్రాసి చదివాను. జనమంతా ఒడ్డిగిలి పోయినారు. అవి పద్య పఠనానికి ప్రాముఖ్యం ఉన్న రోజులని చెప్పడానికే ఈ సంఘటన ఇక్కడ ఉల్లేఖించాను.

పాండవ నాటకాలు వేస్తోంటే జనం ఒడ్డిగిలి పోయేవారు. మంజులూరి కృష్ణారావు ఆ నాటకాలకు సూత్రధారి, ఆయన పాండవ నాటకాలలో శ్రీకృష్ణ వేషం వేసేవాడు. ఆయనకు గొంతు లేదు. సంగీతం రాదు. కాని నాటక నిర్వహణ కళలో అంతవాడు నభూతో

క్షుకు విశ్వనాథ ప్రాజెక్టు అనే పేరు పెడతారనే పుకారు లేవడం జగద్విదితమైన విషయమే. కిన్నెరసాని మాట వచ్చినది కాబట్టి ప్రస్తుత కథాగమనము కొంత ఇవతలికి తెచ్చి ఈ విషయాలను ప్రస్తావించాను. వెనుకకుపోయి ప్రకృతాన్ని అనుసరిద్దాం.

1919 సంవత్సరములో నేను బందరులోలేను. ఈ మధ్యంలో జరిగిన ఉదంతాలకు నేను ప్రత్యక్షసాక్షినిగాను. సత్యనారాయణ గారు బి. ఏ. తప్పాడు. ఆయన ప్రతిభాజీవి కదా! పుస్తకాలు భట్టీయం వేయడం ఆయనకు చేతకానిపని. బి. ఏ. ప్రశ్న సమాధాన పత్రాలలో కొటేషన్స్ ఉంటే కాని మార్కులు పడేవికావు. అందుచేత బి. ఏ. నాలుగైదు చాన్సులు తప్పడం జరిగింది. కానీ ఈ తప్పడం ఆయనకొక విధంగా లాభమే అయింది. అందరూ బి. ఏ. పరీక్షలో రెండే షేక్స్పియర్ నాటకాలు చదివేవారు. ఆయన మూడుమార్లు పరీక్షలు పోవడంవల్ల మూడు రెండ్లు ఆరు షేక్స్పియర్ నాటకాలు క్షుణ్ణంగా చదవడానికి సావకాశం ఏర్పడింది. ఇంకా అనేక ఇంగ్లీషు పుస్తకాలు చదవడానికికూడా సావకాశం ఏర్పడింది. ఒక విచిత్రం. ఆయన తెలుగు సంస్కృతాలలో పండితుడని ప్రఖ్యాతిపొందాడు. తెలుగు సంస్కృతాలలో ఎంత లోతైన పాండిత్యముండేదో ఇంగ్లీషులోకూడా అంత లోతైన పాండిత్యముండేది.

ఇక్కడే మరొక విషయం. 1919 నుండి 22 వరకు నేను బందరులో లేను. నా పొట్ట పుచ్చుకొని ఏవేవో ఊర్లు తిరిగాను. అప్పట్లో మా అన్న మా వదినగారు అంటే పెద్ద వరలక్ష్మమ్మగారు బందరులో కాపురం పెట్టినారు. రామానాయుడు పేటలో గూడూరి వారి ఇల్లు అవి ఒకటుండేది. ఆ ఇంటి విశేషమేమిటంటే ఆఇంటి యజమాని క్రమాంత స్వాధ్యాయపరుడు. ఆయనకు ఇద్దరు కూతుళ్లు. ఆ కూతుళ్లిద్దరికి ఆయన క్రమాంతం చెప్పాడు. అ ఇంట్లో మా అన్న కాపురం. అప్పట్లో బందా కనకలింగేశ్వరరావు చిన్నపిల్లడు.

తరువాత మహానటుడుగ ప్రసిద్ధి పొందినారు. అతడు మా అన్నగారి వద్ద చదువుకొనెడి వాడు. అప్పటికింకా మా వాళ్ళకు బిడ్డలు పుట్ట లేదు. కనుక లింగేశ్వర్రావును అచ్చంగా కొడుకల్లే చూచుకునేవాళ్ళు. అతని జీవితాంతం దాకా కనకలింగేశ్వరరావు మా వరలక్ష్మమ్మ గారిని తల్లిగానే చూచేవారు.

అదే తంతు మా రామమూర్తిది గూడ. మా రామమూర్తి మా పెద్ద వదినగారిని ఎప్పుడూ తల్లియనే భావించేవాడు. నాకేవో వాళ్ల మీద కొన్ని రుసరుసలుండేవి కాని మా రామమూర్తికి మాత్రం పంచకోశాల్లో ఎక్కడ వెతికినా వాళ్ల మీద మాతాపితృ భావం తప్ప మరొక భావముండేది కాదు. మా అన్న రామాయణ పీఠికలో మా ఇద్దరినీ గురించి వ్రాశాడు. నన్ను గురించి వ్రాసిన దానిలో కొంత అతిశయోక్తి ఛాయ ఉన్నదని నా భయం. మా రామమూర్తిని గురించి వ్రాసినది మటుకు అక్షరాలా సత్యం.

నాకు తెలిసినంత వరకు ముఖ్యంగా మన సమకాలిక బ్రాహ్మణ సంఘంలో ఏ అన్నకూ ఏ తమ్ముడు చేసి ఉండనంత సేవ మా రామమూర్తి మా అన్నకు చేశాడు.

ఈ వ్యాసానికి, కాదు రచనకు "నేనూ మా అన్నగారూ" అని శీర్షిక పెట్టాను. నా అభిప్రాయం నివేదిస్తాను వినండి. నాకు మా అన్నగారికి ఉండే సంబంధాన్ని చెప్పాలని నా అభిప్రాయం. సంబంధం బాహ్యం, ఆంతరం అని రెండు విధాలుగదా! బాహ్యం ప్రధానం కాదు. ఆంతరం ప్రధానం. ఆంతరమైన ఆ సంబంధం తెలుపవలెనని నా ప్రయత్నం. ఆయనకు నాకు సోదర సంబంధం కంటే గురుశిష్య సంబంధం ఎక్కువగా ఉండేది.

నేను 1919లో స్కూలు చదువు మానేశాను. అప్పటికి నాకు వచ్చిన చదువు వృత్తప్రాయంగానే ఉండేది. ఏదో తెలుగులో నాకు

మంచి మార్కులే వచ్చేవి. 1919 నుండి పొట్ట కోసం పరసేవ చేయడమే జరిగింది. 1924 వరకు ఆ అయిదేండ్లు ఆ చదువుతో అట్లాగే కాలక్షేపం చేశాను. 1924లో కృష్ణా పత్రికలో చేరి గుమాస్తాగా, అనువాదకుడుగా, సహ సంపాదకుడుగా పని చేశాను. 9 ఏండ్లు అట్లా గడిచింది. శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు నన్ను రెండేండ్లు కమ్మచ్చున తీసినట్లుగ తీర్చిదిద్దాడు. ఇంటి దగ్గర సత్యనారాయణగారు వ్రాసినదల్లా నాకు వినిపించేవాడు. ఆయన సర్వ రచనకు నేను ప్రథమ శ్రోతను. నాకు బద్ధకంగా ఉన్నా విని తీరాల్సిందే. అంతేకాకుండా ఆయన చెప్పే విమర్శలన్నింటినీ ముందు నాకే వినిపించేవారు. తాను చదివే గ్రంథాలన్నీ నాచేత గూడా చదివించేవారు. హ్యూగో వ్రాసిన లామిరా బిలీ, త్రీ మస్కిటీర్స్, వెండెట్టా అనే టాల్‌స్టాయ్ నవలలు ఆయనతో పాటు నేను చదివాను. ఆయన సంస్కృత నాటకాలమీద విమర్శలు వ్రాసి భారతిలో ప్రకటించాడు.[8] అవన్నీ నేను ఇంటి దగ్గరే చదివాను. ఆయన చెబుతుండగా వేయి పడగలు, మా బాబు మున్నగు గ్రంథాలన్నీ వ్రాసి పెట్టాను. ఏదివ్రాసినా ఏదిచేసినా వానివల్ల పొందే సారస్వత లాభమంతా నేనూ పొందుతూ ఉండే వాణ్ణి. నిజానికి నేను చదివిన ప్రాచీన సాహిత్యం చాల తక్కువ. మొదట్లో తిరుపతి వేంకటకవుల సాహిత్యం, తరువాత సత్యనారాయణగారి సాహిత్యం చదువుకొని నేను పండితుడనయ్యాను-నేను పండితుడనైతే. ఇదీ నాకూ మా అన్నగారికీ ఉన్న సంబంధం. ఇప్పుడు తెలిసింది గదా! నేను సత్యనారాయణగారి కంటె ఎక్కువ పండితుడననుకొనే వారిది వట్టి భ్రాంతియని. ఇదిగాక మా అన్నగారితో వేరే మరో ఆంతరంగిక సంబంధం ఉండేది. అది తరువాత మనవి చేస్తాను.[9]

1919 నుండి 23 వరకు నేను బందరులో లేనని మనవి చేశాను గదా! రెండు గవర్నమెంటు ఉద్యోగాలు, ఒక ప్రైవేటు

ఉద్యోగముతో ఈ కాలము గడిచింది. ఈకాలములో బందరులో సత్యనారాయణగారు, కొడాలి ఆంజనేయులు, కొల్లిపర సూరయ్య, అగస్త్యరాజు రాఘవరావు వర్గంతో గడిపారు. వీరి సంబంధం ఇదివరకే వ్రాశాను. ఈ వర్గంలో నాయని సుబ్బారావును కూడా కలుపవచ్చు. ఆంధ్రప్రశస్తి, కిన్నెరసాని, నర్తనశాల, అంత రాత్మ ఈ రోజుల్లో రచింపబడినవి. అవి గాంధీగారి సత్యా గ్రహపు రోజులు. సత్యాంజనేయులు - సత్యనారాయణగారు, కొడాలి ఆంజనేయులుగారు- కలసి కవిత్వము చెప్పి కొన్నాళ్లైన తర్వాత విడిపోయిన కాలము. సత్యనారాయణ భారతి ఒక విస్పష్టమైన రూపం పొంది విజృంభించిన రోజులు. ఆంధ్ర పౌరుషము, జనముద్దయిన కావ్యంగా విలసిల్లింది. దీని ప్రతులు ఇప్పుడెవ్వరికి దొరకడంలేదు. నా రెండవ కుమారుడు కీ॥ శే॥ వేణు దీని వ్రాత కాపీని తన దగ్గర ఎప్పుడూ ఉంచుకునే వాడు. అది వానితోనే అస్తమించింది.

"గోదావరీ పావనోదార వాఃపూర మఖిల భారతము మాదన్న నాడు। తుంగభద్రాసముత్తుంగ రావముతోడ ఋగ్రతి కలుపునాడు....। అక్షరజ్ఞానమెరుగదో ఆంధ్రజాతి। విమల కృష్ణానదీసైకతములయందు। కోకిలల పాట పిచ్చుక గూండ్లు కట్టి। నెత్తమాదను పూర్ణిమా విశలయందు"

ఈ మొదలైన పద్యాలు అందులోనివే. సత్యనారాయణగారు కవిగా సుప్రతిష్ఠితుడైనాడు. ఈ కాలంలో ముఖ్యంగా పేర్కొన వలసినది "అవతార పరివర్తనం". అది తిలక్‌గారి గాథ. బందరులో అంతకు పూర్వమే బిపినచంద్రపాలుగారు వచ్చి ఉపన్యాసాలిచ్చి వెళ్లాడు ఆయన లాల్ బాల్ పాల్ త్రియంలోనివాడు10 యావద్భా రత విఖ్యాతుడైన రాజకీయ నాయకుడు. దేశం నాడులయందు క్రొత్తరక్తం ప్రవహించడం ప్రారంభించింది. ఆసేతు శీతాచలం

దాస్యశృంఖలాలను విరుగగొట్టి పారవేయాలని ఉద్రిక్తమైనది. బందరుకు బిపిన్ చంద్రపాలు వచ్చినప్పుడు సత్యనారాయణగారేవో దేశభక్తి పద్యాలను చిన్న పుస్తకంగా ప్రకటించి ఆ సభలో అమ్మించాడు. దానివెల రెండణాలన్నర. మా తమ్ముడు రామ మూర్తి చిన్న పిల్లడు. జనసమూహములో చొరబడిపోయి ఆ పుస్తకాన్ని అమ్మకు వచ్చేవాడు. సత్యనారాయణగారిని కవిగా ప్రతిష్ఠించిన గ్రంథం ఆంధ్రపౌరుషము. అది చాలా జనప్రీతిని సంపాదించిన గ్రంథం.

"అవతార పరివర్తనం" ఈ రోజుల్లో జండా ఎత్తిన రచన. అది కొడాలి ఆంజనేయులుగారి పేర రచింపబడినది. వ్రాతప్రతి దశ దానికి దాటలేదు. అది నాటకము. ఆ నాటకము వీళ్ల రెండు మూడు ఊళ్లల్లో ప్రదర్శించారు. పోలీసులదృష్టి వీళ్లమీదపడ్డది. పోలీసువేట ప్రారంభమైంది. నేను అవనిగడ్డలో తాలూకా ఆఫీసు గుమాస్తాగా ఉండగా కొడాలి ఆంజనేయులుగారు ఆ ఊళ్లోనే సబ్‌మేజిస్ట్రేటు ఆఫీసులో గుమాస్తాగా ఉండేవారు. నేనక్కడ ఉండగానే ఆయన ఉద్యోగంమానేసి సత్యాగ్రహంలో ప్రవేశించాడు. ఆనాటి గడబిడలో అవతార పరివర్తనాన్ని నిషిద్ధ గ్రంథంగా ప్రభుత్వం ప్రకటించింది. కొడాలి ఆంజనేయులుగారు తరువాత సత్యాగ్రహంచేసి జైలుకు వెళ్లారు కాని ఆ పట్టులో మాత్రం తప్పిపోయింది.

సత్యనారాయణగారు బి. ఏ. తప్పిన తరువాత నోబుల్ కళాశాలలో కొన్నాళ్లు ట్యూటర్‌గా పనిచేశారు. అప్పుడు శ్రీ కె. టి. రామారావుగారి పరిచయం లభించింది. వారికి శిష్యుడై కొంత వరకు కౌముది సంస్కృత గ్రంథాలు కొన్ని చదివాడు. శ్రీ కె. టి. రామారావుగారంటే తరువాత విమలానంద భారతీస్వామి అన్నమాట. ఆయన వేదాంత విజ్ఞానం నిరుపమానమైనది. సువిశితమైన

విమర్శతోగూడి అనుభవం ప్రధానంగా ఆయన వాదవైఖరి ఉండేది. ఉక్తి ప్రత్యుక్తులతోనే ఆయన వేదాంతబోధ జరుగుతూ ఉండేది. ఆయన సాహచర్యంతో సత్యనారాయణగారి మేధ పులుగడిగిన ముత్యమల్లే తయారైందని చెప్పవచ్చు. సత్యనారాయణగారు జీవితంలో పొందిన మహాకష్టాలన్నిటిని నిమ్మకు నీరెత్తినట్లుగా తామరాకు మీద నీటి చందంగా అనుభవించే మహాప్రజ్ఞను ప్రసాదించిన వారు శ్రీ విమలానంద భారతే. సత్యనారాయణగారి విద్యగురువుల్లో వీరిని తలమానికంగా భావించాలి.

కొల్లిపర సూరయ్యగారి వర్గంతో స్నేహం సాగుతూనే ఉంది. వారంతా తరువాత వేయిపడగల్లో పాత్రలైనారు. లోకంలో స్నేహం తీరు వేరు. సత్యనారాయణగారి స్నేహం తీరు వేరు. ఆయన స్నేహమంటే అది జీవితంతో ముడిపడటం. ఆ మనస్వీత, ఆ సమర్ధత- అవి సత్యనారాయణగారి ప్రత్యేక లక్షణాలు. ఆయన బ్రతుకంతా స్నేహితులతోనే గడిచిపోయినది. ఇది ఆయన బంధువులు కొందరికి ఈర్ష్యావిషయం గూడా అవుతూ ఉండేది.

నోబుల్ కాలేజీ ఉద్యోగం ఒకటి రెండు సంవత్సరాలే ఉంది. తరువాత కొన్నాళ్లు ఖాళీగా ఉండి నేషనల్ కాలేజీలో తెలుగు పండితుడుగా ప్రవేశించాడు. అంతకు ముందు దారిద్ర్య బాధ ముమ్మరమైంది ఈ కాలంలో నర్తనశాల, కిన్నెరసాని ,కోకిలమ్మ, పెళ్లి అచ్చువేసి దేశంలో ప్రచారం సాగించాడు. నాకు జ్ఞాపకం లేదు గాని ఇంకేదో పుస్తకమున్నది. మూడు పుస్తకాలు, నాలుగు రూపాయలకమ్మేవాడు. ఆ మూడో పుస్తకం ఆంధ్ర ప్రశస్తి అనుకుంటాను. వీటితో దేశమంతా తిరగడం జరిగింది. ఈ పర్యటనలో అనేక చిత్రవిచిత్రాలు జరిగినవి. కొన్ని పోట్లాటలు కొట్లాటలు కూడా సంభవించినవి. ఒకాయన ఎవరో "నేను నీ పుస్తకాలు కొనను" అన్నాడుట. నీవు కొని తీరాల్సిందే అని

సత్యనారాయణగారు ధారణ పట్టాడు. రెండు మూడు గంటలు ఒకరి బలాలు ఒకరు- వాగ్విపంగానే- పట్టి చూచుకున్నారు. చివరికా గృహస్థులొంగక తప్పలేదు. ఈ పర్యటనలోనే శ్రీ ఆచంట సాంఖ్యాయనశర్మగారి పరిచయం కలిగింది. ఆయన పరమ గంభీరుడు. సత్యనారాయణగారి సత్తాను నాలుగు గంటల సేపు పరీక్ష చేశాడు. సత్యనారాయణగారు తన పాండిత్యాన్నంతా ప్రదర్శించవలసి వచ్చింది. చిట్టచివరకు ఆ పండితుడు తనకు భగవద్గీతతోపాటు పారాయణ గ్రంధంగా ఉన్న ఆంధ్రప్రశస్తిని డ్రాయరు సొరుగులోంచి తీసి బయటపెట్టి ఈయనకు సన్మానం చేయించి పంపాడు. సత్యనారాయణగారి జీవితంలో ఇలాంటి చిత్ర సన్నివేశాలు అనేకం జరిగినవి. అవన్నీ రికార్డు చేయక పోవడంవల్ల చాలా మరుగున పడి పోయినవి. "బ్రహ్మమయ మూర్తిలో" శ్రీ తాడికొండ వారు ఇలాంటి సన్నివేశాలు చాలా మట్టుకు రికార్డు చేశారు. వారు చాలా అభినందనీయులు.

ఆకాలంలోనే కీ॥ శే॥ బసవరాజు అప్పారావు, సత్యనారాయణ పట్టిందల్లా బంగారం చేస్తాడు అన్నాడు. అయితే వింజమూరి భావనాచార్యులుగారి కుమారుడు రామాచార్యులుగారు (?) "He writes poetry with much foliage but less flowers" అని త్రివేణి పత్రికలో వ్రాశాడు. ఆ రోజుల్లో మా అన్నగారు నిత్యకవితా భావనలో తదేకతాన వృత్తి వహించి ఉండేవాడు. ఒకసారి బెల్లంకొండ రాఘవరావుగారి ఇంటికి పమిడిపాడు వెళ్లాడు. రాఘవరావుగారి భార్య శ్రీమతి కనకమ్మగారు కూడా కవయిత్రి. వాళ్ల సంతానం చిరంజీవి రామదాసు. అతను అభ్యుదయ నాటక రచయితగా పేరు పొందాడు. వారి ఇంట్లో సత్యనారాయణగారు స్నానం చేస్తున్నారు. కనకమ్మగారు విస్తళ్లలో వడ్డన చేసింది. ఈయన స్నానాల గది వదలిరాడు. అన్నం వంటకాలు చల్లారి పోతున్నవి. అప్పుడు రాఘవరావుగారు వెళ్లి

చూస్తే ఈయన ఆ తడి బట్టలతో గోడ వంక చూస్తూ తదేకతాన వృత్తితో ఆలోచిస్తున్నాడు. అప్పుడు హెచ్చరికచేసి ఈలోకంలోకి తెచ్చి భోజనం పెట్టారు. ఇట్లాంటి కథలు ఇంకా రెండు మూడున్నవి.

సత్యనారాయణగారి నేషనల్ కాలేజి ఉద్యోగం చిత్రకథ సమేతమైనది. ఆయన అక్కడ తెలుగు చెప్పేవాడు. నేను 1923లో బందరు తిరిగి చేరుకున్నాను. నేషనల్ కాలేజీని కోపల్లి హనుమంత రావుగారు స్థాపించాడు. పట్టాభిగారు, ముట్నూరి కృష్ణరావుగారు మున్నగువారు దాని పాలకవర్గంలో ఉండేవారు. మొదటిలో ఆ కళా శాల బ్రహ్మాండమైన పేరు గడించింది. దేశి కళలన్నింటికి ఆస్థానంగా ఉండేది. నేనెరిగిన నాటికి ఆ కళ కొంత వరకు తగ్గింది. చిల్లరిగె శ్రీనివాసరావుగారి తరువాత కోలవెన్ను రామకోటీశ్వర రావుగారు ప్రిన్సిపాలుగా వచ్చాడు. ఆయన రాకతో సత్యనారాయణ గారి పలుకుబడి హెచ్చింది. అడివి బాపిరాజు ఆ కళాశాలలో ప్రమోదకుమార ఛటర్జీ వద్ద కళాధ్యయనము ప్రారంభించాడు. దూడగడప నరసింహరావుగారు అక్కడ విద్యార్థి, శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు కూడ అక్కడ విద్యార్థిగా ఉండేవారు. మా తమ్ముడు రామమూర్తి అందు విద్యార్థిగా ఉండేవాడు. నేను 1924 సం॥ నుండి కృష్ణాపత్రికలో సహాయ సంపాదకుడుగా ప్రవేశించాను. మేము చాలా స్వతంత్రులమని ఊళ్ళో ప్రతీతి ఉండేది. మా అన్న దమ్ములు ముప్పురిని కర్త కర్మ క్రియా అని పిలిచేవారు. బందరులో 'హనుమద్విజయం' అనే నాటకం ఆడుతూ ఉండేవారు. భారత నాటకాలు రాక ముందు దానికి కొంచెం ప్రాపకం ఉండేది. దానికి కర్త పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రిగారు. ఆయన మంచివాడు. మా అన్నదమ్ములిద్దరిని రామలక్ష్మణులనేవాడు.

నేషనల్ కాలేజిది ఒక చిత్రకథ అన్నాను. కోలవెన్ను రామకోటీశ్వరరావుగారుమంచి ఇంగ్లీషుపండితుడు. బందరు ఇంగ్లీషు

భాషకు పోతుగడ్డగా ఉండేది. రఘుపతి వెంకటరత్నం నాయుడు గారు కొన్నాళ్ళు బందరులో ఉండి వెళ్ళారు. ఆయన తర్వాత వేమూరి రామకృష్ణరావు పంతులుగారు ఇంగ్లీషు భాషలో పేరు పొందాడు. ఆయన బందరువాడే. ఆయన తమ్ముడు వేమూరి నర్సింహారావు పంతులు డిప్యూటీ కలెక్టరు పని చేశారు. వారి తమ్ముడు రాంజీరావుగారు హరిజనులకు హైస్కూలు పెట్టి హరిజన సేవచేస్తూ ఉండేవారు. వీరంతా బ్రహ్మ సమాజానికి చెందిన వారు. ఊళ్లో క్రైస్తవ ప్రాబల్యం ఉండేది. బ్రాహ్మణులలో గూడ పలు మంది క్రైస్తవ మత పరోక్షాభిమానులుండేవారు. ముట్నూరి కృష్ణారావుగారు కొన్నాళ్ళు బిపిన్ చంద్రపాల్‌తో స్నేహం గట్టి బ్రహ్మన సమాజంలో ఉండి, తరువాత హిందూ మతాభిమానిగా పరిణ మించాడు. పట్టాభిగారి మీద వేంకటరత్నం నాయుడుగారి ప్రభావం ఉండేది. ఊళ్ళో దర్భావారి కుటుంబం ఉండేది. దర్భా రామశాస్త్రి గారో, ఆయన తండ్రియో ప్రత్యక్షంగా క్రైస్తవ మతము పుచ్చు కొన్నారు. రామశాస్త్రిగారి కుమారుడు నిత్యానందశాస్త్రిగారు ఎం.ఏ. ఆయన ఇంగ్లీషులో అందె వేసిన చేయి. ఆయన మా రామ మూర్తికి గురువు. క్రైస్తవ సంతానాన్ని కనడం ఇష్టం లేక బ్రహ్మచర్యాన్ని వహించాడని ప్రతీతి ఉండేది.

అది వరకు సత్యనారాయణగారు హిందూ శిశాలల వాతా వరణంలో పెరిగినవారు. వెంకటశాస్త్రిగారు ప్రకాశంగారు ఉపాధ్యా యులుగా ఉండేవారు. ఇంగ్లీషు మున్నగు విషయాలను బోధించే వారుకూడ. చక్కని బ్రాహ్మణ సంప్రదాయిన్నాపాటిస్తూ ఉండేవారు. హెడ్‌మాస్టర్ శ్రీ వెంపటి నరసింహంగారు, తరువాత వారి పదవి నాక్రమించిన సోమయాజులుగారు, సైన్సుమాస్టరుగా ఉండే శ్రీ నర సింహారావుగారు - వీరు విమలానంద భారతి అన్నగారు, పరమ శాంత స్వరూపి-వీరంతా పవిత్రమైన వైదిక మత సంప్రదాయాలను పాటిస్తూ ఉండేవారు. ఊళ్ళో హరి నాగభూషణంగారు పరమ

వైదిక భక్తాగ్రగణ్యులు. ఫిడేలు వాద్యంలో బ్రహ్మ. లాయర్. బి.ఏ.బి.యల్. చదివినవారు. ఆయన ప్రతి సంవత్సరము త్యాగరాజ బ్రహ్మోత్సవాలు చేసేవారు. చల్లా సుబ్బయ్యగారు సీతారామయ్యగారు గుర్రిడ్డి ఆచార్యులవారు– వారి పేరు తెలియదు. వారణాసి ఘంటయ్య సోదరులు, అశ్వధాటి రామమూర్తి మొదలైన మహా విద్వాంసులు ఆ ఉత్సవాలలో పాల్గొంటూ ఉండేవారు. ఆ ఉత్సవాలు గొడుగుపేటలో నాగభూషణంగారి ఇంట్లో జరుగుతూ ఉండేవి. ఆ అయిదు రోజులు మేమూ అక్కడే కాపురం. నాగభూషణంగారికి మా అన్నగారికి చాలా సాన్నిహిత్యం ఉండేది. ఇదిగాక బచ్చుపేటలో సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రిలవారుండేవారు. ఆయన గొప్ప సంస్కృత విద్వాంసుడు. పరమ వైదికుడు. ఆయన అయిదారు వందల మందికి సంగీత విద్య చెప్పాడని ప్రతీతి. పరాసుపేటలో మరొక నాయుడుగారుండేవారు. ఆయనగూడా పెద్ద సంగీత విద్వాంసుడు. బందరు ఆ రోజుల్లో పెద్ద సంగీత తీర్థంగా ఉండేది.

సత్యనారాయణగారు ఆ రోజుల్లో పరిమి నరసింహశాస్త్రిల గారి వద్ద బ్రహ్మసూత్ర భాష్యం చతుస్సూత్రి వరకు పూర్తిచేశాడు. శ్రీ కంభంపాటి రామమూర్తి శాస్త్రిలగారి వద్ద సిద్ధాంత కౌముది తిజంతము చదివాడు. శ్రీ విమలానంద భారతి ఆయనకు యావజ్జీవితము గురువుగా ఉండిపోయారు. ఆయనతో ఎడతెగని సంబంధం శాశ్వతంగా ఉండిపోయింది. ఇదంతా ఎందుకంటే సత్యనారాయణ గారి హృదయంలో హత్తుకున్న సనాతన ధర్మదీక్ష విజృంభణానికి దోహదములైన వాతావరణ పరిసరములను అభివర్ణించటానికే.

మా తండ్రిగారి సంప్రదాయ జీవితముతోపాటు ఆయన దైవభక్తి, జపతపశ్శీలము, ధర్మవేదాంత పాటవము, కవితాదీక్ష, పురాణ విజ్ఞానము మొదలైనవన్నీ సత్యనారాయణగారియందు బీజ

ప్రాయంగా ఉండి అనుగుణ కాలానికి అంకురితత్వ పల్లవితత్వ పుష్పితత్వ దశలు పొందినవి. మా నాయనగారు నిత్యరామ మంత్రో పాసకుడు. చిన్నతనంలో తన వెన్నునబుట్టిన ఒక తెల్లని మచ్చ పోగొట్టుకోవాలని మండలం రోజులు సూర్య నమస్కారములుచేసి ఆ వ్యాధిని పోగొట్టుకున్నాడు. ఆయన చరమదశలో అజపా గాయత్రి మంత్రోపాసన చేయడం నేనెరుగుదును.

మా అన్నగారి మామగారు అనగా పెద్దవరలక్ష్మమ్మగారి తండ్రి కూచిభట్ల సీతారామశాస్త్రులుగారు క్రమాంత స్వాధ్యాయ పరుడు. ఆయన కుమారుడు అయోధ్య రామావధానులుగూడ క్రమాంత స్వాధ్యాయ పరుడు. వారిరువురు నిర్దుష్టమైన స్వాధ్యాయ ప్రవీణతకు పేరుపొందినవారు.

సత్యనారాయణగారు నేషనల్ కాలేజీలో ప్రవేశించడానికి ఈ సంస్కారములన్ని ఆయనలో ప్రబుద్ధములుగా ఉన్నవి. వీరి గురువుల్లో శిష్టా నరసింహశాస్త్రులుగారి నొక్కరిని చెప్పాలి. ఆయన దగ్గర సత్యనారాయణగారు కొన్నాళ్ళు అలంకార గ్రంథం ఏదో చదివాడు. నేషనల్ కాలేజీలో ఉన్న బ్రహ్మసమాజం ఆవరణ ఆయనకు సరిపడలేదు. అయితే స్నేహశీలి కావడం చేత బాపిరాజుతో ప్రాణస్నేహం ఏర్పడ్డది. ప్రమోద కుమార ఛటర్జీ శిల్పవిద్యా వైభవం ఈయన్ని బాగా ఆకర్షించింది. అదివరకే ఈయన అజంతా ఎల్లోరా శిల్పాలు చూశాడు. పర్లాకిమిడివైపుకు పోయినపుడు ముఖలింగం, కోణార్క, భువనేశ్వరం మొ॥ చూచి వచ్చాడు. మహాబలేశ్వరం చూచి వచ్చాడు. ఓరుగంటి శిల్పకళా ఖండాలు, రామప్పగుడి మొదలైనవి చూచి వచ్చాడు. ప్రమోద ఛటర్జి త్రిశూల చిత్రాన్ని చిత్రించినపుడు "నాకు రాజ్యం ఉంటే నీకారాజ్యాన్ని ఇచ్చి ఉండేవాడను" అని ఈయన ఒక పద్యం వ్రాశాడు. ప్రమోదకుమార ఛటర్జి కళాశాలను వదలిపోవునపుడు

"మీరు రాజ్యం పోగొట్టుకోనక్కరలేదు. ఈ త్రిశూలం మీకు బహుమానంగా ఇస్తున్నానని" ఆయన మా అన్నగారికి ఇచ్చి పోయినాడు. అది మా ఇంట్లో ఉండేది. చివరకు బెజవాడ కాపురంలో ఆది మాయమైపోయింది.11 మా అన్నగారు త్రిశూలం నాటకం వ్రాసి ఆ నాటకానికి ఆ త్రిశూలాన్ని ముఖచిత్రంగా వేశాడు, ఆ నాటకం శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారికి అంకితం చేయబడింది.

సత్యనారాయణగారు కోలవెన్ను రామకోటీశ్వరరావు కలిసి, తెలుగులో జయంతి, ఇంగ్లీషులో త్రివేణి పత్రికలు స్థాపించి సాహిత్య ప్రచారం చేశారు. ఒక ఏడాదిపాటు పర్లాకిమిడి నుండి మద్రాసు వరకు ప్రచారంచేసి ధనసంపాదనచేసి పత్రికలు రెండింటిని జయప్రదంగా నిర్వహించారు. సత్యనారాయగారి రచనా శక్తియేకాక పత్రికా నిర్వహణ శక్తికూడ బహుముఖాల విజృంభించింది.

ఆ రోజుల్లో బందరులో శారద పత్రిక పుట్టింది. అది భారతికి ముందు పుట్టిన మాస పత్రిక. కౌతా శ్రీరామశాస్త్రిగారు దానికి సంపాదకులు. ఆయన కుమారుడు రామమోహనరావు చిత్రకళా ప్రవీణుడైనాడు. ఆ పత్రికలో సత్యనారాయణగారు అంతరాత్మ నవల ప్రచురించేవాడని నాకు గుర్తు. అందులో ఒక స్త్రీ వ్యక్తిని వర్ణిస్తూ మా అక్కగారి సుగుణ గణాలన్నీ దాని యందు ప్రతిబింబింపచేశాడు. ధన్య కైలాసమూ ఆనాటిదే. ఆంధ్ర ప్రశస్తి, నర్తనశాల, కిన్నెరసాని ప్రకటితములైన తరువాత అవి వెనుకబడి పోయినవి.

నేను 1924లో కృష్ణాపత్రికలో ప్రవేశించాను. మొదటిలో రెండు సంవత్సరాలు కృష్ణారావుగారు నన్ను తీర్చిదిద్దాడు. కాని తరువాత కొంత స్వేచ్ఛ దొరికింది. 1933 దాక ఆఉద్యోగంలోనే

ఉన్నాను. అప్పుడు మాకు బందరు బచ్చుపేటలో స్వంత ఇల్లు ఉండేది. అది బ్రిహ్మయ్యలింగంగారి ఇల్లు. శ్రీ చెళ్లపిళ్ల వెంకట శాస్త్రిగారికి పూర్వం బ్రిహ్మయ్యలింగంగారు హిందూహైస్కూలులో పండితులుగా ఉండేవారు. ఆయన సంప్రిదాయ సిద్ధంగా గురుముఖంగా చదివిన గొప్ప పండితుడివి నైష్ఠికుడని పేరుగాంచినవాడు. ఆయన ఇల్లు కాలక్రిమేణ నేను కొన్నాను.

ఆ కాలములో మాకు మిత్రికోటి ఉండేది. వారు మాఇంటికి అనుదినం వచ్చి సాహిత్య గోష్ఠి జరుపుతూ ఉండేవారు. ఎస్.ఎమ్. ఎల్.ఎన్. దాసు, అడవి రాఘవరావు వారిలో ముఖ్యంగా చెప్పదగిన వారు. దాసుకు మా అన్నగారి మీద భక్తి ఎక్కువ. అతడు కవిత్వం చెప్పేవాడు. కాని అతడు కవిగా ప్రికాశింపలేకపోయినాడు. ఇన్సూరెన్సు ఏజెంటుగా జీవితం గడిపివేశాడు. అడివి రాఘవరావు చాలా మేధావి. నా దగ్గర చదువుకొవి ఆ రోజుల్లో ఉండే మద్రాస్ బి. విద్వాన్ పరీక్షలు ప్యాసై రెండేండ్లు మాత్రిమే తెలుగు పండితుడి ఉద్యోగం చేసి పరలోకం పొందిన అల్పాయుష్కుడతడు, పండితుడు గాక ముందు రౌడీగా తిరుగుతూ ఉండేవాడు.

ఆ కాలంలో సత్యనారాయణగారు సాహితీ సమితిలో సభ్యుడయినాడు. "ఏలో" అను శీర్షికతో పద్యాలు వ్రాసి సమితికి పంపించాడు. అది ఆయన భావకవిత్వ ప్రథమ రచన. అంతకు పూర్వమే నాయని సుబ్బారావుతో సన్నిహిత స్నేహమేర్పడినది. సాహితీ సమితి ప్రివేశం నాటికి ఎంకిపాటలకర్త నండూరి సుబ్బారావుతో సన్నిహితత్వమేర్పడ్డది. వీరు ముగ్గురూ ఒక్కసారిగా సమితిలో ప్రివేశించడం ఒక్కసారిగా బహిర్గమించడం జరిగింది. సమితి వారికీ, వీరికీ కవితా స్వరూప స్వభావ లక్షణాలలో తేడా వచ్చింది. సత్యనారాయణగారు దాన్ని భరించలేక పోయినారు.

వారి వీరి సంప్రదాయాల్లో కూడా తేడా వచ్చింది. సత్యనారాయణ గారు వికారిలో పుట్టాడన్నారు శివశంకరశాస్త్రిగారు. అది తప్పు. ఆయన మన్మథలో పుట్టాడు. శివశంకరశాస్త్రిగారికి సత్యనారాయణ గారిలోవి మన్మథత్వము తెలియదు. వికారితనమే తెలిసింది. వారికి వీరికి కొన్ని వాగ్వాదాలు కూడా నడచినవి. నర్తనశాలలో "ఓరి దుష్ట" అని ప్రయోగించాడు సత్యనారాయణ. అది తప్పు అన్నారు సమితి వారు. కాదూ అవి ప్రయోగం చూపించాం. వేనరాజు నాటకంలో తెల్లని తుమ్మెదలుంటాయని సత్యనారాయణ గారు వ్రాశారు. అసంభవమన్నారు సమితివారు. ఉంటాయీ అవి భావ ప్రకాశం అనే వైద్య గ్రంథంలో ప్రయోగం చూపించాం. చివరకు సమితి సభ్యత్వం సమాప్తి పొందింది.

అంతకు ముందు కాలంలో సత్యనారాయణగారు అనార్కలి వ్రాసి సమితికి పంపించాడు. దానిలోవి కల్పన భావ విన్యాస వైఖరి, రచనా చాతుర్యం మహోన్నతంగా ఉన్నాయని శ్రీ శివ శంకరశాస్త్రిగారు ఉత్తరం వ్రాశాడు. నర్తనశాల అంతకు ముందు వ్రాసిందే. దానిలోని భరతవాక్యం నేను వ్రాసినది, ఈ విష యం విశ్వనాథ వాఙ్మయ సూచికలో ఉల్లేఖించారు. సత్యనారాయణ గారు స్వతంత్రుడు. ఆయన శరీర త్రియమునందు సర్వ స్వతం త్రుడు. ఇంకొకరి పొడ ఆయనకు గిట్టేదికాదు, ఈ వాక్యానికి వ్యంగ్యార్థం మట్టుకే పరమార్థంగా గ్రహించాలి. అందుచేత సత్యాంజనేయుల జంట విడిపోయినారు. ఒకప్పుడు నేనుకూడా ఆయనతో కలసి వ్రాద్దామనుకున్నాను. అదేమీ ఆయన సాగనివ్వ లేదు. చివరకు ఉత్తరకాండ అయినా నేను వ్రాస్తానయ్యా అన్నాను. కావలిస్తే నీవు వేరే వ్రాసుకో, కల్పవృక్షంలో కలపటానికి మాత్రం వీలులేదని కచ్చితంగా చెప్పివేశాడు. ఆ విధంగా ఆయనతో కలసి రచనచేసే యోగం నాకు పట్టలేదు. కాని ఆయన రచనల్లో కొంతభాగం నాది లేకపోలేదు. ఆయన

వ్రాసిన భాషా వాచకములలో కొంత నాది ఉన్నది. ఆయనా నేనూ కలసి ఏవో చారిత్రిక భౌగోళిక గ్రంథాలు వ్రాశాము. అందులో కొంత నా రచన ఉన్నది.

అయితే మే మిద్దరం కలసి చేసిన పనిమట్టుకు ఒకటి ఉన్నది అవి నండూరి సుబ్బారావుగారితో కొత్తగా స్నేహమైన రోజులు. ఆయనకు మేము అండగా ఉంటామని మాట ఇచ్చాం. ఆయన ఎంకి పాటలమీద శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిలుగారు జండా ఎత్తారు. ఏదో ఒక పాటలో "కులుకు సూపెడతాది నా ఎంకి" అని ఉన్నది. దాని వెనుక ఉన్న ఇంకో ముక్కగూడా తీసుకొని ఇది గ్రామ్య శృంగార మని, అనౌచిత్యమని ఆ కవిసార్వభౌముడన్నాడు. దానికి నేను కృష్ణా పత్రికలో సమాధానం వ్రాశాను"....నాతోడ మన్మథ నటనమాడె" అని పోతన్నగారు వ్రాసిన దానికంటే గూడ అనౌచిత్యమా అని ప్రశ్నించాను. ఆ వాదం పెరిగింది. వారి వ్యాసం రాగానే దాని కిందనే అడ్డుగీట్లుకొట్టి సమాధానం వ్రాసి ప్రచురించే వాళ్ళం. ఇట్లా నాలుగైదు వారాలు జరిగింది. చివరకావాదంలో శ్రీ చెళ్లపిళ్ళవారు కలుగజేసుకున్నారు. ఆయన వ్యాసం వచ్చేటప్పటికి మేము ఉపసంహ రించుకున్నాం. అంతకు పూర్వము వ్యాసము రాగానే ఇంటికి తీసుక వెళ్ళి మేమిద్దరం సంప్రదించుకొని సమాధానాలు తయారుచేసే వాళ్ళం ఎక్కువ భాగం మా అన్నగారిదే రచన ఉండేది. పేరు మాత్రంనాది. ఆ కథ అట్లా నడిచింది.

1927లో మా నాయనగారు స్వర్గస్థులైనారు. నా ప్రథమభార్య కూడా ఆ ఏడాదే పోయింది. నేను ఇరువురు కుమారులతో మిగిలి పోయాను. నా కృష్ణాపత్రిక ఉద్యోగం సాగుతూనే ఉంది. నా కొడు కులు మొదట్లో వాళ్ళ అమ్మమ్మగారి దగ్గరనే ఉంటూ ఉండేవారు.

1928-29 సం॥ ప్రాంతములో మా అన్నగారు ఎం. ఏ. పరీ క్షకు కట్టారు. ఏవో గ్రంధాలన్నీ చదువుకొని పరీక్షకు వెళ్లాడు.

తీరా పరీక్ష వచ్చేటప్పటికి సాహిత్య విమర్శ పరీక్షాపత్రంలో అను మానం వేసింది. ఆముక్తమాల్యద నాధారం చేసికొని విశిష్టాద్వైతం ఎట్లా సమర్ధింపబడిందో వ్రాయమని ప్రశ్న. దానికి తగినట్టుగా ఈయన పరిజ్ఞానం సాధించుకుపోలేదు. కాని ఇదివరకు సంపాదించిన విషయ పరిజ్ఞానంతో తన ప్రతిభనాశ్రయించుకొని సమాధానం వ్రాసి వచ్చాడు. వచ్చి, విషయం నాతో చెప్పి పరీక్ష పోతుందని భయపడ టం ప్రారంభించాడు. నాకు నవ్వు వచ్చింది. ఆయన సమర్థత నాకు తెలిసినదే. పర్వాలేదని నేను చెప్పినా వినలేదు. ఆ చివరకు ఫలితాలు తెలిసి సెకండ్ క్లాస్ వచ్చిందనేదాక ఆయనకు మనస్శాంతి పడ లేదు. ఆయన మనస్సొక్కొక్కప్పుడు అంత తంద్రాణత పొందేది. ఆ తందాణత షష్ఠి పూర్తి అయిన తర్వాతగాని పూర్తిగా తగ్గలేదు.

నేషనల్ కాలేజీలో కొన్ని చిత్ర కథలు నడచిన తరువాత ఆ ఉద్యోగం మానేశాడు. అందువల్ల ఎం. ఏ. ప్యాసయిన తరువాత కొన్నాళ్లు ఆయన ఖాళీగా ఉన్నాడు. ఆ రోజుల్లో పామరాజు కేశవ రావుతో స్నేహం ఏర్పడింది. ఆయన లాయరు. తెనాలి నాజరు పేటలో ఉండేవాడు. ఆయన అన్నగారు వైద్యుడు. కేశవరావుగారికి సత్యనారాయణగారికి గాఢమైన అనురాగబంధము ఉండేది. వారిద్దరు క్లాసుమేట్స్ అనుకుంటాను.

శ్రీ వారణాసి శ్రీనివాసరావుగారికి సత్యనారాయణ కవిత్వం మీద మంచి అభిమానం ఉండేది. వారు దంపతులిద్దరూ సత్యనారా యణగారి మీద చాలా అభిమానం వెళ్ళబోసేవారు. ఆ రోజుల్లో వార ణాసి శ్రీనివాసరావుగారు బందరు హిందూ కళాశాలకు ప్రిన్సిపాల్ అయినారు. వెంటనే సత్యనారాయణగారిని పిల్చి లెక్చరర్ ఉద్యోగం ఇచ్చాడు. మా అన్న ఊళ్లోలేదు. తెనాలిలో ఉన్నాడు. శ్రీనివాసరావు గారు మా ఇంటికి కబురు చేశాడు. నేను ఉత్తరం వ్రాస్తే మా అన్న గారు వచ్చి ఆ ఉద్యోగంలో ప్రవేశించాడు. అప్పుడే శ్రీ దివాకర్ల

వెంకటావధానిగారు విద్యార్థిగా మా ఇంట్లో ఉండి చదువుకొన్నది. ఆ కాలంలోనే మా అన్న మా బాబు నవల వ్రాసినది. ఒకసారి ఆ నవల గురించి మాట్లాడుకుంటూ ఉంటే దాని గురించి నీకేమీ తెలుసునా అని మా అన్న నన్నడిగాడు. దానికి నేనిలా సమాధానం చెప్పాను. "నవలలో ప్రధాన కథానాయకుడికి తండ్రితనం పాముల వాడిలోను, తల్లితనం రంగమ్మలోనూ నిబంధించితివి. అది ఆ నవల లోని గొప్పతనం" అని. ఆయన తల ఊపి ఊరుకున్నారు. అదివరకు నా విమర్శన జ్ఞానంమీద ఆయనకు ప్రత్యయం ఉండేదికాదు. నాటి నుండి నేను దేనిమీద ఏ విమర్శ చెప్పినా అంగీకారపూర్వమైన మౌనము వహించేవాడు.

నేను కృష్ణాపత్రికలో ఉంటినని చెప్పితిని గదా! కొన్నాళ్ళ తర్వాత రసమంజరి అనే పేరుతో ఒక పేజీ పద్యాలు అందులో ప్రచురిస్తూ ఉండే వాళ్ళం. అందులో కవికొండల వెంకటరావు, నోరి నరిసింహశాస్త్రి, వేదుల సత్యనారాయణశాస్త్రి మొదలైన నవకవుల రచనలు ప్రచురించేవాళ్ళం. అందులో మా అన్నగారి రచనలుకూడ బహుళంగా ప్రచురించే వాళ్లం. ఆయన రచనలకు చుట్టూ బార్డరు కట్టి వేయడం జరుగుతూ ఉండేది. ఇలా రెండు మూడు సంవత్సరాలు జరిగింది. కాని తరువాత ఏ కారణం వల్లనో సత్యనారాయణగారి పద్యాలను పదేపదే ప్రచురించడానికి కృష్ణరావుగారు అంగీకారం ప్రకటించలేదు. వాచా చెప్పకపోయినా వ్యంగ్యంగా ఆ విషయాన్ని ప్రకటించారు. అంతటితో ఆ ప్రకటన నేను మానుకున్నాను. ఆ రోజుల్లో మా అన్న "లేయంకన్ విదురించు టేమిటిర లేలే చిట్టి నా తండ్రి కృష్ణా యన్నాయి కళిందజా పులిన దేశక్రీడ నార్ధంబ యప్డె యేగెన్, మరి నీవు గూడ చనవా" ఈ మొదలైన కృష్ణప్రబోధమనే పద్యాలు వ్రాశాడు. దాన్ని చూసి కృష్ణరావుగారు మెచ్చుకున్నారు. ఇలాంటి వాత్సల్య రసమంటే మా కిష్టం. ఇవి మేం మెచ్చుకొంటాం అని ఆయన అన్నారు.

అప్పుడు బందరులో యువకవుల్లో సత్యనారాయణగారికి ప్రతిపక్షముండేది. ఆ ప్రతిపక్షంలో యిరువురు విశ్వబ్రాహ్మణ సోదరులు ఉండేవారు. వారిపేర్లు నాకు జ్ఞాపకం లేవు. పెద్దాయన పేరు సోమనాథం అనుకుంటాను. ఇద్దరూ గ్రాజ్యుయేటులు. ఇంగ్లీషులో పండితులమని ఆత్మ ప్రత్యయం కలవారు. మొదటిలో శారద పత్రికలో పనిచేస్తు తరువాత మద్రాసువెళ్లి సినిమా రచ యితగా పేరుపొందిన పింగళి నాగేంద్రరావు ఆ ప్రతిపక్షంలో ఒకడు. మరొకడు మల్లాది నరసింహశాస్త్రి, వీళ్ళకు తోడు పట్టాభిగారి అల్లుడు తల్లా ప్రగడ రామారావు అని ఒకాయన ఉండే వారు. వీళ్ళంతా కృష్ణాపత్రిక ముట్నూరి కృష్ణారావుగారి దర్బారులో హాజరవుతూ ఉండేవారు. సాహిత్య విమర్శలు, వేదాంత చర్చలూ, తత్వవిచారములూ రాజకీయ గోష్ఠులు, బారంబాటగా జరుగుతూ ఉండేవి. కృష్ణారావుగారు వారానికొకసారి సంపాదకీయ వ్యాసం వ్రాయాలి. ఆయన ఈ వారం రోజులు తన ఇష్టవిషయాన్ని గూర్చి వీళ్ళందరితో ఇంకా కొందరు పెద్దలతో గూడాను చర్చించి సారం తీసి తన సంపాదకీయాన్ని వారం ఆఖరుకి వ్రాసేవాడు. అది సర్వజన మోహనంగా ఉండేది. ఈ దర్బారులలో కొన్నాళ్ళు కాటూరి వేంకటేశ్వరరావుగూడా పాల్గొనేవాడు.

ఒకనాడొక కథ జరిగింది. సత్యనారాయణగారు దర్బారులో శ్రీకృష్ణదేవుని నిర్వేదం అనే ఖండిక వినిపిస్తున్నాడు. నేనది ఇదివరకు ఇంటిదగ్గర విన్నదే. మళ్లీ వింటున్నాను. మనస్సు ఏకాగ్రత పొంది ఉంది. ఇంతలో కాటూరి వెంకటేశ్వరరావు నన్ను ఎందుకో పిల్చాడు. నాకు వినపడలేదు. రెండోసారి పిల్చాడుట. నేను వినిపించుకోలేదు. మూడోసారి పిలిచాడు, తలత్రిప్పి చూచాను. ఆయన చదువుతోంటే అంత పరవశమేమిటి నీకు అని కోప్పడ్డాడు నన్ను. ఇది నాకూ మా అన్నగారికీ ఉండే సంబంధం. దీనిని పురస్కరించుకొనియే ఆయన పన్నెండవ రోజున వాక్త

# 5. గుంటూరులో మా అన్న

ఈ సమయంలో ముఖ్యస్నేహితుడు శ్రీ కొడాలి సుబ్బారావు ఇతడు అప్పటి జీవిత శైఖరినే మార్చినవాడు. సత్యనారాయణగారి ఆనాటి జీవిత ఖండంలో కొడాలి సుబ్బారావుకి ప్రధానమైనపాత్ర ఉన్నది. తక్కిన స్నేహితులు వేరు ఆయన వేరు. ఆయన సత్యనారాయణగారికి అంగరక్షకుడుగా తయారైనాడు. పైగా జీవిత విధానాన్నే కొంత మళ్లించాడు.

బందరు కాలేజీలో వారణాసి శ్రీనివాసరావుగారు వెళ్లిపోయినాడు. ఎవరో మరో ప్రిన్సిపాలు రానున్నాడు. ఈ మధ్యలో సుబ్బారావుగారు సత్యనారాయణగారు కలిసికట్టుగా గుంటూరు ఏ. సి. కాలేజీలో ఉద్యోగాలు సంపాదించారు. గుంటూరులో ఉన్న రెండేళ్లు కూడా సత్యనారాయణగారికి స్వర్గనరకములు రెండూ దర్శనమయినవి. అక్కడ చెప్పదగిన అంశములు రెండుమూడున్నవి. నాకూ మా అన్నకూ ఎడబంధమైనది. మా వదినగారు మంచాన పడ్డది. ఆ వ్యాధి క్రమంగా ఆమె మృతికి దారి తీసింది. నేను స్వంతంగా ఉభయభాషాప్రవీణ పరీక్షలకు కట్టాను. 1932 మార్చి ఏప్రిల్‌లో ప్రిలిమినరీ పరీక్ష. దాని కోసం చదవటానికి ముఖ్యంగా కాదంబరి చెప్పించుకునేందుకు ఆయన యొద్దకు వెళ్ళాను. అప్పుడు మా వదిన గారు బాగానే ఉంది. మాఅన్నగారు నాకు కాదంబరి పాఠం చెబుతూ 'నీకు చాలా సంస్కృతం వచ్చురా' అన్నాడు. ఎందుకన్నాడో!

మా వదినగారు ఆ సంవత్సరం (1932)లో పోయింది. ఆవిడ పోయినది మంచి నక్షత్రంకాదు. శవాన్ని ద్వారాన తీయడానికి గృహస్థులు ఒప్పుకోలేదు. తక్కిన వాళ్ళెవళ్లూ సాహసం చేయలేక పోయినారు. కొడాలి సుబ్బారావు ఒక్కడూ పాడెను ఒంటరిగా లేవనెత్తి ఆరడుగుల ప్రాకారాన్ని దాటించి శవదహనం చేయించాడు.

నేనూ మా అమ్మగారూ ఆ మర్నాటికిగాని అక్కడికి వెళ్ళలేక పోయాం. అప్పటి మా అన్న దుఃఖాన్ని ఎవరమూ పట్టలేకపోయినాము.

కొలది రోజులలోనే కొడాలి సుబ్బారావుకూడా దివంగతుడైనాడు అతడు జ్యోతిష్యం బాగా తెలిసినవాడు. దశాంతర్దశలన్నీ లెక్కగట్టి జాతకం తన మృతిదినం దాకావేసి క్రింద ఎర్రసిరాతో అడ్డగీటు పెట్టుకొని సరిగా ఆనాడే ప్రాణం వదిలాడు. సుబ్బారావు కొడుకు ఇప్పుడు డాక్టరు. మా అన్న ఆ కుటుంబానికి చేతనయినంతలో బాగా సాయంచేశాడు. ఈ కాలంలో గాఢమైన స్నేహాలకు వారిరువురి స్నేహం ఒక ఉదాహరణగా చెప్పవచ్చు.

మా అన్నగారు గుంటూరులో శ్రీమాంతాచార్య కళ్యాణానంద భారతీస్వామివారి శుశ్రూష చేశాడు. వారియొద్ద ఛాంధోగ్యోపనిషత్తు పాఠం చెప్పించుకున్నాడు. మాంతాచార్యులవారు శ్రీవిద్యలోనిధులు ప్రామాణిక పురుషులు. వారికిన్నీ వామాచార సంప్రదాయం వారికిన్నీ హోరాహోరిగా వాదప్రతివాదాలు జరిగినవి. మాంతాచార్యుల వారు ఉభయ వేదాంత ప్రవర్తకులు కావడమేకాక ఆంగ్ల విద్యయందు గూడా నిష్ణాతులు. వారికి అపారమైన శిష్యసంపద ఉన్నది. మా అన్నగారు వారిని సౌందర్యలహరి పాఠం చెప్పమంటే శాక్తదీక్ష తీసుకుంటే చెబుతామన్నారుట. ఎందుచేతనో ఈయన కప్పుడా ఉత్సాహం కలుగలేదు. దీక్ష పొందనైతే లేదు కాని మా అన్నగారు శాక్తం విషయంలో దీక్షితుని వలెనే ప్రవర్తించేవాడు. గ్రంథ రచనాదికం చేసేవాడు. భ్రమరవాసినీ మొదలైన నవలల్లో ఆయన రచనా స్వాతంత్ర్యం ఆశ్చర్యకరంగా ఉంటుంది.

## 6. మళ్ళీ బందరూ—వేయి పడగలూ

ఇంతలో గుంటూరులో మా అన్నగారి ఉద్యోగమే పోయింది. మిషనరీ కాలేజి కావడంవల్ల ఆయన హిందూ మతాభిమానాన్ని

భరించలేక పాలకులు ఆయనను కాలేజినుండి పంపించేసారు. ఆయన మళ్ళీ నిరుద్యోగియై బందరు చేరుకున్నాడు. 1933 రావడంతో కార ణాంతరాలవల్ల నా కృష్ణాపత్రిక ఉద్యోగంకూడా పుటుక్కుమన్నది. ఇద్దరమూ నిరుద్యోగులమైనాము. ఆ నిరుద్యోగం మమ్మలను ఐదేండ్లు వదలకుండా ఉన్నది.

అయితే, హఠాత్తుగా ఆంధ్రా యూనివర్సిటీ ఒక ప్రకటన చేసింది. వేయి పేజీల నవల వ్రాస్తే వేయి రూపాయల బహుమతి ఇస్తాము అని. మా అన్నగారు దానికి సిద్ధమయినాడు. అప్పట్లో ఆయన తెనాలి బందరు మధ్య తిరుగుతూ ఉండేవాడు. వేయిపడగలు నవల మొదలు పెట్టడం తెనాలిలోనే జరిగింది. వేయి పుటలు వ్రాయాలి. రెండు వందల యాభై పుటలు మాత్రమే తెనాలిలో పూర్తయ్యింది. కాలం సమీపించి యూనివర్సిటీ పెట్టిన గడువు దరి దాపుల కొస్తున్నది. నెల దినాలకంటే ఎక్కువలేదు. ఏరా! ఈ నెల రోజుల్లో పుస్తకం పంపించాలి. ఎట్లా? అన్నాడు. చెప్పు రాద్దాం అన్నాను. రోజుకు మూడు సళ్ళు భోజనాత్పూర్వము, భోజనాత్ప రం, విద్రాంతం, పద్దెనిమిది దినాల్లో 750 పేజీలు పూర్తిచేశాము. మిత్రకోటి అంతా నిజంగా ఆశ్చర్యపడ్డారు. ఏదో ఆవేశం పూనినట్టు చెప్పాడు, మంచి వయస్సులో ఉన్నాను కాబట్టి నేనూ తట్టుకొని వ్రాశాను. ఆ వక్కణంలో యూనివర్సిటీ పండితులు ఒక్క స్ఖాలి త్యాన్ని చూపించారు బ్రతిమాలుకొని-ఉండరాదు-బతిమాలుకొని- అని వ్రాయాలి అన్నారు, అంతే మరొక స్ఖాలిత్యం లేదు.

కానీ, వేయిపడగలకి బహుమతి రాలేదు. అడవి బాపిరాజు వ్రాసిన నారాయణరావుకు వేయిపడగలకి బహుమతి చెరిసగం చేశారు. పదల్లా పదిహేను వందలు చేసి చెరిసగంగా రు. 750/- ఏడువందల యాభై రూపాయలు ఇచ్చారు. కడుపు కాలినమ్మకి గంజే

పానకం. అంతే, శానా అనుకొని మా అన్నగారు ఆ ఏడువందల యాభైతో అప్పులు దీర్చుకొని బయటపడ్డాడు.

బందరు ఉప్పొంగి పోయింది. మన వాళ్ళంతా కలిసి టౌను హాలులో సన్మానసభ ఏర్పాటు చేశారు. సన్మానసభలో మా అన్నగారు తన సారస్వత జీవితాన్నంతా సనాతన ధర్మోద్ధరణకు వినియోగిస్తానని ప్రతిజ్ఞ చేశాడు.

శ్రీ పుచ్చా రామకృష్ణయ్యగారు ఆయన హిందూ హైస్కూలులో ఇంగ్లీషు టీచరు. బి.ఏ.ఎల్.టి. మా అన్నగారికి కవిసమ్రాట్బిరుదాన్ని ఇవ్వవలెనని ప్రతిపాదించాడు. నాలుగైదువేల సాహిత్యాభిమానులున్న సభంతా ఏకగ్రీవంగా అంగీకరించింది. సమ్రాట్బిరుద ప్రతిపాదకులు భావరాజు నరసింహారావుగారని, విశ్వనాథ వాఙ్మయ సూచికలో ఉన్నది. అది ప్రమాదాపతితము.

"సుబ్రహ్మణ్యము సుందరంబునగు నీ శుద్ధోక్తి రత్నాళిదా
నబ్రంబంది సహస్ర శీర్షములపై హత్తించి .... పె
ల్లబ్రాసింబలె పొంగిపోయెను గదన్నా స్వామి విశ్వేశుడా
సుబ్రహ్మణ్యుడు నిన్ను నోము నెవరెచ్చో నేమియన్నన్ సరే."

ఇది నేను గుడివాడ గజారోహణోత్సవ సందర్భమున చదివిన పద్యం. మా అన్న నిజంగా సాహిత్యాకాశంలో వేయిపడగలతో విజృంభించాడు. త్రిశూలం, వేనరాజు, చెలియలికట్ట, వీరవల్లడు, వరలక్ష్మి త్రిశతి మొదలైన గ్రంథాలు ఈకాలం నాటివి. నిరుద్యోగంగా ఉన్న ఐదేండ్లు కేవలం కవితా బలం మీదనే సంసారాన్ని నెట్టుకొచ్చాడు మా అన్న. పెద్ద సంసారం. భార్యా వియోగం జరిగింది. శశిదూత నాటి సంభోగ శృంగారం, వరలక్ష్మి త్రిశతిలో శోకశాంత రసాలలోనికి పర్యవసించింది. తరువాత ఎన్నాళ్ళకో

కవిరాజు మహనీయమైన గ్రంథం వ్రాసి లోకోపకారం చేశారని నొచ్చుకుంటూ వ్రాశాడు.

జేబుదొంగలు కూడా నేనే వ్రాసిపెట్టాను. పితృపితామహ లక్షణాలు పిల్లలయందు ప్రతిబింబించడమే జరుగుతుంది. ఆజన్మ సిద్ధములైన దుర్లక్షణాలు, విద్యాది సంస్కారములచేత జీవిలో సుంకుదేరుతవేగాని స్వరూప నాశనం కాబోవని జేబు దొంగలు నవలలో సిద్ధాంతీకరించాడు. మా అన్న ఎప్పుడూ నిష్ప్రయోజన మైన రచన చేయలేదు. ఏదో ఒక తత్వార్ధాన్నిగాని జీవలక్షణాన్ని గాని ఆధారంగా బెట్టియే రచన చేశాడు. చేస్తాడు. ఆ కీలకం తెలిసికోలేని వారికి అది వట్టి రచనగా మాత్రమే కనబడుతుంది. త్రిశూలం నాటకంలో బసవడివి కాలచర్యల నాశనంచేయమని బిజ్జలుడి చేత ప్రార్థింపచేస్తాడు. సామాన్య మహిమల ప్రదర్శనం చేత లోకోపకారం ఏమీలేదని వాదింప చేస్తాడు. సద్యఃపర నిర్వృతితో పాటు లోక సంగ్రహాన్ని ప్రతిపాదించడం ఆయనకు వెన్నతో పెట్టిన విద్య. ఇలా బహు విషయ ప్రతిపాదకములైన బహు కావ్యములతో ఆయన లోకాన్ని ముంచెత్తాడు. లోకం ఆయన్ని గౌరవించింది. జాతీయ కవిగా స్వీకరించింది.

ఈ రోజుల్లో మా అన్న వీరవల్లడు అనే నవల వ్రాసి భారతిలో ప్రచురించాడు. అది మాపూర్వీకుల కథ. అనూచానంగా మా ఇంట్లో చెప్పుకుంటూ ఉండే కథ. మేము బ్రాహ్మణులమైనా మొదటి నుండీ రైతులం. మన్ను పిసికి జీవించే వాళ్ళమని మా నాయనగారు అంటూ ఉండేవారు. ఆకథలు వ్రాసి మా అన్న గారు చిరంజీవి గొట్టిపాటి బాలకృష్ణకు అంకితం చేశాడు. ఆ బాలకృష్ణ సత్యనారాయణ దగ్గర చదువుకుంటూ సొంత బిడ్డల్లే ఉండేవాడు. కాలానికి గిట్టక అతడివి కాస్తా ఎత్తుకుపోయింది. ఈ వార్త నందమూరులో ఉండగా తెలిసింది. మాఅన్న దుఃఖం

పట్టలేక పందిట్లోపడి దొర్లిదొర్లి ఏడ్చాడు. ఆయనను అట్టి దుఃఖ పరవశ స్థితిలో రెండు సార్లే చూచాను నేను. ఒకటి బాలకృష్ణ పోయినపుడు, రెండవది గుంటూరులో మా పెద్ద వదినగారు పోయినపుడు, అంత ఆర్ద్రమైన చిత్తవృత్తి ఆయనది.

ఈ అయిదేండ్ల వ్యవధిలోనే అంటే 1933 మొదలు 38లోగా ఆయన రెండవ వివాహం చేసుకున్నాడు. ఆయనను విద్యావతులైన ఇరువురు యువతులు కామించారు. వారు తెనాలి వారని గుర్తు. కాని, తనకు ఇరువురు ఆడపిల్లలు, ఒక మగపిల్లవాడు - తన నెత్తిపై బరువు చాలా ఉంది - వీరందరినీ దిగనాడి, సంప్రదాయ విచ్ఛిత్తి చేయడం ఇష్టంలేక, ఆ వివాహ సంబంధాలను నిరాకరించాడు. తనకేమీ అర్థలాభం రానీ, తానుచూచి అందచందాలు నిర్ణయించుకోనవి ఒక సంబంధం చేసికొన్నాడు. అదియే ఆయనకు నూరేండ్ల పంటయైనది. మరలా కడుపెడు పిల్లలు కలిగారు. అదృష్టమనగా మా రెండవ వదినగారిదే అదృష్టం. ఆమె అడుగు పెట్టిన నాటి నుండి మా అన్నగారు పట్టినది బంగారం అయినది. ఆయన సంసారం క్రమక్రమంగా త్రివిక్రమావతారంగా వృద్ధి పొందింది. కాటూరి వేంకటేశ్వరరావుకూడా ఆ పెళ్లికి వచ్చాడు. మా అన్నగారి పరమ వైరాగ్యం స్థిత ప్రజ్ఞత్వం ఆ పెళ్లిలో బహుధా ఋజువైంది. చాలా మందికి ఆ విషయం తెలియలేదు. అది ఏమి చిత్రమోకాని నిరుద్యోగిగా ఉన్న ఆ అయిదేండ్లు సంసారానికి ఏ లోటు రాకుండా నడుపుక వచ్చాడు. నేనూ నిరుద్యోగినే. భారమంతా ఆయన భుజస్కంధాల మీదనే ఉండేది.

## 7. శ్రీమద్రామాయణ కల్పవృక్షము

శ్రీమద్రామాయణ కల్పవృక్షం ఈ కాలంలోనే అంకురించింది సనాతన ధర్మ రక్షార్థమై ప్రతిజ్ఞ పూనిన సత్యనారాయణ ఆత్మనిత్య మనే ఢంకా మ్రోగించి శ్రీ మద్రామాయణ కల్పవృక్షానికి అంకు

రార్పణ చేశాడు. ఈ అంకురార్పణం ఎక్కడ ఎప్పుడు చేశాడో నాకు గుర్తు చాలదు. న్యాయానికి దీనికి అంకురార్పణ జరిగి చాలా రోజులైంది. అసురలక్ష్మీ సాంత్వనము మొదలైన ఖండికలయందే దీనికి ప్రారంభం చేశాడు. దూతవాక్యంలో "రఘునాయక క్రోధ రంజితాక్షి ప్రోడిఁగదలాడిపోయి లంకా పురంబు అబ్ధి గర్భంబున అణగారి పోవునో" అని హనుమంతుడి చేత గర్జింపచేశాడు. అప్పట్లో ఆ పద్యాలన్నీ రామాయణంలో నిక్షిప్తములు చేద్దామను కున్నాడు. కానీ అది జరుగలేదు. ఎందుచేత? సమాధానం చెబుతాను వినండి.

సత్యనారాయణ రామమంత్రోపాసకుడు. హనుమన్మంత్రో పాసకుడు. ఆయన ఎన్ని కోట్ల రామమంత్రం చేశాడో నేను చెప్ప లేను. హనుమన్మంత్రం ఎన్ని కోట్లు చేశాడో నాకు తెలియదు. ఆయన యజ్ఞశీలి. "యజ్ఞానాం జప యజ్ఞోఽస్మి" అని భగవంతుడన్నాడుగదా! నిత్యము ఆ శ్రీరామ హనుమజ్జపయజ్ఞ పరాయణుడై యుండేవాడు. ఎప్పుడు ఆ దేహం యజ్ఞమయంగా ఉండేది. ఆ ప్రేరణలేనిదే ఎప్పుడూ ఒక్క పాదమైన వ్రాసేవాడుకాదు. అందుచేతనే దాని అంకురార్పణదశ చివరకు నాకుగూడా తెలియకుండా పోయింది. తరు వాత వినిపించేవాడు. అది వేరే సంగతి. తక్కిన వ్యవహారంమాట ఎట్లా ఉన్నా రామాయణ రచనా సమయంలో మట్టుకు యజ్ఞదీక్షితుడై ఉండేవాడు. దీనికొక నిదర్శనం చూపిస్తాను కిష్కింధ సుందరలకో- సుందరాయుద్ధ కాండలకో చాలా వ్యవధి ఉన్నది. అది ఎంత వ్యవధి అనగా ఆయన రామాయణం వ్రాయడం మానుకున్నాడేమో యనుకునే టంత వ్యవధి. కాని, శ్రీరామచంద్రుని అనుగ్రహంవల్ల ఆ వ్యవధి దాటిపోయింది. కల్పవృక్షము పూర్తి అయింది. రామాయణము మరల వ్రాయుము అని అమ్మ ఆజ్ఞ ఇచ్చిందని నాతో ఒకసారి అన్నాడు. యజ్ఞఫల స్వరూపిణి అయిన శారదాదేవి నిత్యమూ ఆయన వెంట రక్షాచక్ర స్వరూపిణియై తిరుగుతూ ఉండేది. ఈవిడను మా ధూళిపాల

శ్రీరామమూర్తి గారు చూచాడు. వరంగల్లులో ఒకసారి మా ఇంట్లో అనుష్ఠానం చేసుకుంటూ నాపూజా మందిరంలోనుండి వెలువడిన తల్లి హాస్యానికి తనను బెదిరిస్తే ఆయన నవ్వుకొని ఇట్లా జరిగిందిరా అని నాతో చెప్పాడు.

జీవుడి వేదనయని ఒక అనాలంకారిక సమయాన్ని సత్యనారాయణ సృష్టించాడు. ధూళిపాల శ్రీరామమూర్తిగారు తమ భాగవతానుశీలనంలో దానికొక ఆలంకారిక రూపాన్ని ప్రతిష్ఠించడానికి సఫలమైన యత్నం చేశారు. జీవుడి అవిద్యావరణ ఆనందమయకోశాన్ని ఆవరించి ఉంటుంది. సదసత్తులు సర్వత్రా ప్రత్యక్షములై ఉంటవి కదా! అవిద్యావరణతోపాటు అహమస్మితోపాటు అహంబ్రహ్మఽస్మి అనే బ్రహ్మస్పందం గూడ ఉంటుంది. అహమస్మి అనునది జీవ స్పందం. అహంబ్రహ్మఽస్మి అనునది బ్రహ్మస్పందం. ఇవి ఒకదానికొకటి ప్రతియోగిత్వాన్ని పొంది ఉంటవి. అహం బ్రహ్మఽస్మి అనే బ్రహస్పదంయొక్క ఆక్రోశమే జీవుడి వేదన. ఆ జీవుడి వేదనయే పురుషుణ్ణి మహాకవిని చేస్తుంది. దానితోనే మా అన్న కవిబ్రహ్మ అయినాడు. ఇది ఇప్పటికి చాలిన నిర్వచనం. దీన్ని గురించి చాలా వ్రాయవలసి ఉంది. ఇంతకూ చెప్పవచ్చిన దేమిటంటే మా అన్న ఆ నిరుద్యోగంగా ఉన్న అయిదేండ్ల కాలంలో ఈ బ్రహ్మస్పందాన్ని పొందాడు. దానికి శశిదూతం, వరలక్ష్మి త్రిశతి నిమిత్త కారణాలైనవి. ప్రథమ స్పందన ప్రరోచకాలైనవి. వేయిపడగలు వట్టి సూచిక దానికి. ఆగ్రంథముల యందలి సంభోగ కరుణ విప్రలంభ శృంగార స్థాయిలు మనోముకురంలో ప్రతిఫలించి బ్రహ్మస్పంద ప్రతిబింబాన్ని జాగరితంచేసి శ్రీమద్రామాయణ కల్పవృక్షాన్ని అవతరింప చేసినవి.

"వ్రాసిన రామచంద్రు కథ వ్రాసితి వంచని పించుకో, వృథా
యాసము గాక కట్టుకథ లైహికమా పరమా యటంచుఁదాఁ
జేసిన తండ్రి యాజ్ఞయును.... .... .... ...." ఇత్యాది రామాయణ

పీఠికాస్థమైన పద్యంలోని తండ్రి యాజ్ఞ 1915లోనే వచ్చినది. అప్పుడు నేను 5వ ఫారం చదువుచుంటిని. మా అన్న కాలేజీలో ప్రవేశించాడు. బుట్టయ్యపేటలో జానకమ్మగారి ఇంటిలో కాపురం ఉంటిమి. మా అన్న ఏవో పద్యాలు వ్రాసి మా నాయనగారికి వినిపించాడు, ఆయన అప్పుడు 'వ్రాస్తే రామాయణం వ్రాయాలోయ్- ఇవన్నీ బూటకం పద్యాలు - వ్రాసి లాభమేమిటి' అన్నాడు. ఆ పద్యమునందలి తండ్రి యాజ్ఞ అది. ఇంతకూ శ్రీమద్రామాయణ కల్పవృక్షరచనకు నిమిత్తోపాదానోభయ కారణాలు జీవుని వేదనయే యైన పూర్వోక్తాలైన కరుణ విప్రలంభ శృంగార స్థాయిలు నిమిత్తాలై తండ్రియాజ్ఞ ఉపాదాన కారణమై వెలసింది అని చెప్పాలి.

ఇక్కడ మరియొక ప్రశ్న ఉన్నది. శోభనాద్రిగారు శివ భక్తుడు గదా! రామాయణ రచనకై ఆజ్ఞ ఏమిటి అని ప్రశ్న రావచ్చును. దీనికి తేలికగానే సమాధాన మీయవచ్చునుగాని అసలు వస్తు స్వరూపాన్ని నివేదిస్తాను. శోభనాద్రిగారు శివపూజాపరుడు- పార్థివ లింగార్చన నైష్ఠికుడు నిజమే. కాని ఆయన హృదయం ఎప్పుడూ రామరసపాయియై రసిస్తూ ఉండేది. రాముడూ కృష్ణుడూ వారి కథలూ ఇంత ఎందుకు భారత భాగవతాలలోని పాత్రలందరూ ఆయన ప్రాణానికి స్వబంధుకోటిగా భావనాసిద్ధి కలుగుతూ ఉండేది- అలమతివిస్తరేణ - ఆ తండ్రిచేసిన తపస్సు ఆ కొడుకులో అట్లా సిద్ధించింది. శ్రీ మద్రామాయణ కల్పవృక్షము ఆవిర్భవించింది.

1935 ప్రాంతాల ప్రారంభం చేయబడిన కల్పవృక్షము 1960 వరకు పూర్తి కాలేదు.[13] దాదాపు పాతిక ఏండ్లు పట్టింది. సత్యనారాయణ శతాధిక గ్రంథాలు వ్రాశాడు - వ్రాయలేదు - ఆయనకు జ్ఞానపీఠ బహుమతి వచ్చింది - రాలేదు: ఆత్మవస్తు వివర్తమైన కల్పవృక్షం ఆంధ్రులకు దక్కింది. మా కదిచాలు. సత్యనారాయణ 15 ఏండ్లు తర్వాత మిగఇదవి అడియాస పొందే

ప్రతిపక్షి ఏమౌతాడో తెలియదుకాని, కల్పవృక్షం మటుకు ఆంధ్ర దేశంలో స్థిరంగా ఉంటుంది.

ఆత్మవస్తువివర్తమైన వాచోవిస్తరాన్ని "మంచు", వాదాలు ఏమీ చేయలేకపోయినవి. గురు లఘు వాదం లఘుత్వాన్ని పొందింది. తొలిగా పుట్టిన సామిధేని వాదం సమిధలపాలైంది. సర్వప్రమాణాతీతమైన పరమాత్మ స్వరూపమైన శ్రీమద్రామాయణ కల్పవృక్షం జగజ్జేగీయమానంగా వెలుగుతోంది.

## 8. బెజవాడలో కాపురం

1938లో సత్యనారాయణగారు బెజవాడ కళాశాలలో ఉద్యోగం స్వీకరించాడు. నేను 1939లో తెనాలి ఉద్యోగానికి పోయితిని. బందరు కాపురం నామమాత్రంగా ఉండేది. తమ్ముడు నాతోనే ఉండేవాడు. అది ఒక సంవత్సరంపాటే. తరువాత మళ్ళీ కొంత కాలం బెజవాడలో సమిష్టి కాపురం నడిచింది. రెండుమూడేండ్ల కంటె ఎక్కువ నడువలేదనుకుంటాను 1942లో గుడివాడలో గజా రోహణోత్సవం జరిగింది. కోట పద్మనాభంగారు బాగా తోడ్పడ్డారు. నేను పద్యాలు వ్రాసి చదివాను.

అంతకుముందు 1940లో నవ్యసాహిత్య పరిషద్వార్షిక సభకు మా అన్న అధ్యక్షత వహించాడు. అప్పుడు ఆయన ఇచ్చిన అధ్యక్షోపన్యాసము నుండి విమర్శ గ్రంథాలు పుట్టుకొచ్చాయి.14 చలం శ్రీశ్రీలను కూడా కూడగట్టుకొని వచ్చి, నవ్యాంధ్ర సాహిత్యానికి ఒక సమగ్ర స్వరూపాన్ని ప్రతిపాదించాడు. లోకం మెచ్చింది. ఆయన దగ్గర ఒక లక్షణం ఉండేది. అది చాలా మంది నమ్మలేదు. కాని, అది నేనెరుగుదును. కవితా విషయాల్లో ఎవ్వరినీ కాదనేవాడు కాదు. రెండవసారి జయంతి నడిపినరోజులలో

గురజాడవారిని అకవి అని ఎందుకన్నావని నేను ప్రశ్నించాను. అది నేనన్నమాట కాదని ఆయన స్పష్టంగా చెప్పాడు. ఈ సంభాషణ ఏ సందర్భాన వచ్చిందో నాకిప్పుడు జ్ఞాపకంలేదు.

మా అన్నకు షష్టిపూర్తి జరిగింది గుడివాడలో. దానికి నేనూ పద్యాలు వ్రాసి చదివాను. అప్పటికి మా సంసారాలు భిన్నములైనవి. ఎవరి బ్రతుకు వారిదైంది. అంటే నాకు 40 ఏండ్లు వచ్చే దాకా కలసి ఉన్నాం. అందాక ఉమ్మడి కుటుంబం నడిచింది.

మా అన్నగారు వ్రాసినన్ని కావ్యాలు వ్రాశాడు. వ్రాసినన్ని కావ్యాలు వదిలేశాడని చెప్పాలి.

మొట్టమొదటిలో కిన్నరసానితోపాటు రథంతరీ యనే పాట వ్రాద్దామనుకున్నాడు. "రథంతరీ! రథంతరీ! నాట్యంబాడవె రథంతరీ! అనే మకుటంతో ఒక పాట వ్రాస్తానన్నాడు. అది వ్రాయనేలేదు.

'మాస్వామి'లో చివర ఒక పద్యమున్నది.

"ఈకించిత్కృతి ఎట్టులైన మఱి ఏమీలేదు లేవయ్య వే
ధా కాపర్ద శిఖాధునీ! స్వనితగాథా! విశ్వనాథా! భవ
చ్ఛ్రీ కంఠాభరణంబు చెప్పెదను రాజీవంబులో తేనియల్
...................................." ఇత్యాది పద్యములోని శ్రీకంఠాభరణము అను కావ్యమును ఆయన వ్రాయనేలేదు, షష్టిపూర్తికి పూర్వమో, అనంతరమో నేనాయనతో శ్రీకంఠాభరణము వ్రాయకూడదా అంటిని, వ్రాయాలిరా అది సామాన్యమైన పనికాదు. జైమినీభారతంలో సురధుని కపాలమును కుమారస్వామి సంపాదించి శివకపాలమాలలో సంఘటింప చేసిన కథ ఉన్నది కదా[15] దానితో పాటు నూటయెనిమిది కథలను కల్పించి శివకపాలమాలను పూర్తి చేయవలసి ఉన్నది. నాన్న కథను కూడా అందులో నొకదానిని చేసి ఆయన కపాలాన్ని గూడా. అందులో గుచ్చినట్లుగా వ్రాయాలని

ఉన్నది" అని అన్నాడు. నేనాయన భావనా పారమేష్ఠ్యమునకు అబ్బురపడి ఊరుకుంటిని. మేధ పరాశక్తి యొక్క వివర్త స్వరూపము ఆవిధ వాక్స్వరూపము పొందటానికి మహనీయమైన సుకృతఫలం కావలసి ఉంటుంది.

మా అన్న గుంటూరిలో శ్రీమాంతాచార్యులవారి యొద్ద ఛాందోగ్యోపనిషత్తు చదువుకొన్న తరువాత ఛందోగులు అను పేరుతో ఒక నవలను వ్రాస్తానని నాతో చెప్పాడు. అది కావ్యరూపము పొందలేదు.

ఆయన మేధయొక్క వైశిష్ట్యాన్ని గురించి ఎంతైనా చెప్ప వచ్చు. "వ్యాససమాసైకరూప హరిహరనాథా!" అన్నాడు తిక్కన్న గారు. అది సృష్టి ప్రళయాలను గురించిన మాట. ఆ సమాసాన్ని సాహిత్యానికి అన్వయింప చేయవచ్చు. విషయమును విస్తరించుట, విషయమును సంగ్రహము చేసి చెప్పుట రెండింటిలోను ఆయన కాయనయే సాటి. ఈ యంశాన్ని సోదాహరణంగా చెప్పాలంటే ఆయన కావ్యములను నవలలను సర్వంకషంగా అవలోకనము చేయవలసి ఉంటుంది.

నిజానికి వేయిపడగలు ఒక్క నవలకాదు. రెండు మూడు నవలల సంపుటి. దానిని తేలికగానే విభాగం చేయవచ్చును. అందులో సమకాలిక చరిత్ర నుండి కేవల కవి కల్పితాల వరకు పేనబడి యున్నవి.

సమకాలికులైన పురుషుల నుండి కవి ప్రౌఢ భావనా సంజాత మూర్తియైన పసిరిక వరకు కలసిపోయి ఉన్నారు. ఆయన కల్పనా శక్తి విగూర్చి వేరే గ్రంధమే వ్రాయవలసి ఉంటుంది. వ్యాస సమాసైక రూపత్వమంటే ఇదే.

ఊచయుద్ధం ఒకటి ఆయన కృతులలో దొరకడంలేదని

విశ్వనాథ వాఙ్మయ సూచికలో ఉన్నది. అది వ్రాసిన కదా దొరక డానికి; ఊచయుద్ధం పల్నాటి వీరులైన అలరాజు పోలిరాజుల యుద్ధం. నవరాల గోడిగను గూర్చిన పద్యాలలో అది కొంత వరకు వర్ణింపబడ్డది. దాన్ని వేరే కావ్యంగా వ్రాద్దామనుకున్నాడు. అది జరుగలేదు.

బెజవాడ కాపురంపెట్టిన నాటి నుండి, క్రొత్త మిత్రవర్గం సమకూడింది. ఆగిరిపల్లి వాస్తవ్యులైన సూరి శోభనాద్రిసోదరులు, చతుర్వేదుల రామనరసింహం, లక్ష్మీనరసింహం సోదరులు, వకీలు కృష్ణమూర్తిగారు మా అన్నకు మిత్రులైనారు. ఇందులో చతుర్వే దుల లక్ష్మీనరసింహం ఆయన విద్యార్థి. ఈ మిత్రవర్గమంతా సత్యనారాయణగారి కవితా సరస్వతికి జోహారులర్పించేవారు. వీరంతా కలసి ఒక అచ్చాఫీసు ప్రారంభించారు. సత్యనారాయణగారి గ్రంథాలన్నీ అచ్చువేసి ప్రచురింతామని ఒక జాయంటు కంపినీ లాంటిది స్థాపించుకున్నారు. ఆ కంపెనీ తరపుననే అచ్చాఫీసు కొన్నారు. అందులో నేనూ మా మేనల్లుడు గుంటూరు సుబ్బారావూ పనిచేస్తూ ఉండేవాళ్ళం. చివరకది జాయంటుతనం పోయి సత్య నారాయణగారి స్వంత ఆస్తి అయింది.

ఈ రోజుల్లోనే నేనూ ఆయన కలిసి బ్రహ్మశ్రీ కుప్పా లక్ష్మావధానులగారి వద్ద వేదాభ్యాసం చేశాము. నేను మధ్యలో మానుకొన్నాను గాని ఆయన పట్టుదలతో నమకచమకాలే కాక మూడో అష్టం అంశాలు పూర్తి చేశాడు. వ్యావహారికములయిన ఇబ్బందుల వల్ల అది తర్వాత సాగలేదు.

బెజవాడ కాపురం పెట్టిన తరువాతనే మేమిద్దరమూ కలిసి బొంబాయి వెళ్ళి వచ్చాము. బొంబాయిలో ఆంధ్రసభవారు ఆయన్ని పిలిచి సన్మానం చేశారు. అప్పుడు నా పెద్ద కొడుకు చిరంజీవి

కృష్ణదేవరాయలు ఔరంగాబాదులో మిలిటరీ అకౌంట్స్ శాఖలో పనిచేస్తూ ఉండేవాడు. మేమిద్దరం ఔరంగాబాదు మీదుగా వెళ్లాం. బొంబాయిలో ఆయనకు మంచి సన్మానం జరిగింది.

ఈ కాలమందే మా అన్న శ్రీమద్రామాయణ కల్పవృక్షానికి పీఠికాపద్యాలు వ్రాశాడు. ఆ పద్యాల్లో నన్ను గురించిన పండిత కీర్తనీయుడని ప్రారంభమైన పద్యమొకటున్నది. అది మొదట అట్లా వ్రాయబడలేదు. "పండిత రాజమౌళి" అని ప్రారంభం చేశాడు. నేను హడలి పోయినాను. ఆయన కవితావేశంలో వ్రాసిన మాట అది. బతిమాలి బతిమాలి 'పండిత కీర్తనీయుడని' దిద్దించుకొనునప్పటికి నాకు తలప్రాణం తోకకు వచ్చింది.

శ్రీపాదవారు కల్పవృక్షం మీద అకారణంగా ఆగ్రహించి దేశబంధు పత్రికలో ఏదో వ్రాయడం చెళ్లపిళ్లవారు కల్పించుకొని శిష్యుణ్ణి సర్వతోభద్రంగా సమర్థించడం ఈకాలంలోనే జరిగింది.

## 9. వరంగల్లు – కరీంనగరం

నేను ఉపాధ్యాయవృత్తిని చేపట్టి వెళ్ళిపోయినాను. 1951 నుండి 61 వరకు వరంగల్లులో ఉపాధ్యాయుడనై యుంటిని. మా అన్న కరీంనగర్ ప్రిన్సిపాల్‌గా వచ్చాడు. అక్కడ జరిగిన సన్మాన సభలో నేను పాల్గొన్నాను. శ్రీ పి. వి. నరసింహారావు గారు దానిలో పాల్గొన్నారు. ఆ సన్మానము శ్రీ గౌతమరావు పర్యవేక్షణలో జరిగింది. 1960 ప్రాంతాల నేను "కాళిందీ పరిణయం" అనే గ్రంథం వ్రాశాను. దానికి పీఠిక వ్రాయడానికి మనిషి దొరకలేదు. మా అన్ననే పీఠిక వ్రాయమన్నాను. ఆయన వరంగల్లు వచ్చి ఆ నా కావ్యం ఆమూలాగ్రంగా విన్నాడు. నేను చదువుతూ ఉంటే మధ్యలో పండుకొన్నవాడల్లా లేచి "ఏమి ప్రయో

జనంరా! రాయలు లేడాయె. ఇలాంటి కావ్యాలను ఇప్పుడాదరించే వాళ్లు ఎవరు!" అని ఆక్రోశించాడు. ఆ కావ్యంలో

"నేను యౌధిష్ఠిరంబైన నిభృత తేజ
మనుజుఁడని గారవించు పృథాత్మజుండ
శమను తేజంబు మనకు నాచార్యకంబు
ధర్మసంతతి వారమే తల్లి మనము"

అని అర్జునుడన్న పద్యం చదువగానే "ఎంత గొప్ప పద్యం వ్రాశావురా!" అన్నాడు.

తరువాత నేను వరంగల్లు ఉద్యోగము వదలి బెజవాడ చేరుకొన్న తరువాత సొంతగా ప్రింటింగ్ ప్రెస్ పెట్టుకొని రెండేండ్లు కాలక్షేపం చేశాను. అప్పుడు శ్రీమద్రామాయణ కల్ప వృక్షం యుద్ధకాండ నేనే స్వయంగా అచ్చువేశాను. ఇప్పుడింకా నిలువలోనున్న కూర్పు నేను అచ్చువేసినదే.

వరంగల్లులో ఉన్నప్పుడు నా 'కాళిందీ పరిణయానికి' పీఠిక వ్రాసి ఇచ్చాడంటిని కదా! అప్పుడు చిన్న మనుమరాలు శోభ చనిపోయిన రోజులు. ఆ విషయాన్ని అట్లా ఉంచి నాకు పీఠిక వ్రాసి ఇచ్చాడు. ఈ మనిషి ఏమవుతున్నాడని నాకనుమానం వేసింది. వైరాగ్య బోధోపరతులు మోక్షహేతువులని పంచదశీ ప్రకరణం చెబుతోంది. ఉపరతి ఉద్బుద్ధమౌతోందని నేను భావించాను.

సప్తతి వర్ష మహోత్సవము బెజవాడలో ఆయన స్వంత ఇంట్లోనే జరిగింది. బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షత వహించారు. నేను పద్యాలు చదివి నాభక్తిని వెల్లడించుకొన్నాను. ఆ సభలో అందరూ బాగా మేకప్ చేసుక కూర్చున్నారు. నేను

మట్టుకు చొక్కా గూడా లేకుండా మడి బట్టతోనే ఉండి ఆ పద్యాలు చదివాను. మా వసుంధర మా పెద్ద బాబాయ్ ఎప్పుడూ నిత్య సన్యాసియే అంది.

అంతకు ముందే ఎప్పుడో గుడివాడలో షష్టిపూర్తి సభ జరిగింది. ఆ సభలో నేనూ ఉన్నాను. కాటూరి వారి వ్యంగ్య రచన కల్పవృక్షాభిమానులందరికీ కష్టాన్నే కలుగజేసింది. నాకూ ఒకప్పుడు కష్టం వేసింది. అంతకంటె సభా నిర్వాహకులు చేసిన రచన మీద నాకు మరీ వెగటు వేసింది. కానీ మా అన్న విమ్మకు నీరెత్తినట్లు విశ్వామిత్ర ప్రయుక్తమైన అస్త్ర కోటినంతా దిగమ్రింగిన వశిష్ఠ బ్రహ్మ దండమువలె స్వాత్మానంద మూర్తియై ఆ సభలో వచ్చిన ధనాన్నంతా ఆ ఊరి కళాశాలకు ఇచ్చివేసి నిరామయుడై బయటికి వచ్చాడు.

ఇక్కడ నేనొక్క ముక్క చెప్పాలి. మానాయనగారు గొప్ప దాత. కట్టుగుడ్డకు టికానాలేని పరిస్థితులలో కూడా తాను కట్టిన గుడ్డ తీసి పరాయివాడికి దానంచేసిన రంతిదేవుడాయన. మాఅన్న ఆలాటి తండ్రికి తగిన కొడుకు. ఇంట్లో ఇబ్బంది పడుతూన్న రోజుల్లో జీతమంతా స్నేహితుల క్రింద ఖర్చుపెట్టి వట్టిచేతులతో ఇంటికి వచ్చిన రోజులు లెక్కబెడితే తక్కువేమీ కావు. మా అన్న ఎంత సంపాదించాడో అంతకు మించి దానం చేశాడు.

అంతేకాదు, ఆయన తనను లేమిదశలో ఆదుకొన్న వారి ఋణాలన్నీ చప్పగా తీర్చి ఈ లోకాన్ని వదిలాడు. మొదటిలో కొల్లిపర సూరయ్యగారు విద్యార్థి దశలో చాలా సాయంచేశాడు. చివరి దశలో మా అన్నగారు కపిలేశ్వరపురం వెళ్ళి సూరయ్యగారుండగానే వారి సంతానానికి తలా వేయి రూపాయలు ఇచ్చి వచ్చాడు. అప్పుడు నేను కూడా వెంటనే ఉన్నాను.

ఆలాగే జెల్లంకొండ రాఘవరావుగారు మా అన్నగారికి సాయంచేసిన వారిలో ఒకరు. మా అన్నగారు రాఘవరావుగారి ఋణం రెండు మూడింతలు తీర్చి ఉంటాడు. ఆ విషయం నేను పూర్తిగా ఎరుగుదును.

నందమూరు దేవాలయాన్ని ముప్పైవేలు పెట్టి బాగు చేయించి ధ్వజ స్తంభ ప్రతిష్ఠ చేయించాడు. మూడు రోజులు ఉత్సవము చేశాడు. ఒక విధంగా ఆ గుడిమీద అంత ఖర్చు పెట్టటం నాకే ఇష్టంలేకపోయింది. ఢిల్లీలో జ్ఞానపీఠం ఎవార్డు వచ్చినపుడు ఆయన సభ్యుల కిచ్చిన వాగ్దానానికి భంగం లేకుండా అంత సొమ్ము ఖర్చు పెట్టి ఆపని చేసి కృతార్థుడైనాడు.

నేను, 'పరాప్రాసాదము' అన్న కావ్యం వ్రాశాను. అది అపూర్వమైన గ్రంథం. మంత్రశాస్త్ర మాతృక కలిగింది. దాన్ని మా అన్నకు అంకితం చేశాను. అమెరికా నుంచి ఎవరో వచ్చి మా అన్న రచనలు కొన్ని రికార్డు చేసుకపోతుంటే ఆయన ఈ నా అంకితము పద్యాలుగూడా రికార్డు చేయించి అమెరికా పంపించాడు.

## 10. శాంతి పౌష్టికోత్సవానికి

కరీంనగర్ ప్రిన్సిపాల్ గిరీ నుండి సత్యనారాయణగారు మావాడు కాకుండా పోయినాడు. ఆ ఆత్మలో ఏదో మార్పు ఏదో అంతర్దృష్టి, ఏదో ఆత్మవత్త్వము ద్యోతకమవుతూ వచ్చినవి. ఈ అంతర్ముఖ లక్షణాలు నేను గమనిస్తూనే వచ్చాను. ఒకసారి ఇంటికి వెళితే ఏదో అశాంతిగా ఉందిరా అన్నాడు. అయితే పంచాక్షరి చేయమన్నాను. ఎంత చెయ్యాలిరా అంటే కోటి చెయ్యాలన్నాను. అంతే- ఏదో మంచిరోజు చూచుకొని పంచాక్షరి ప్రారంభించి సంవత్సరన్నర తిరగక ముందు కోటిపంచాక్షరీ పూర్తి చేశాడు. అప్పుడు పూర్తి

అయిందిరా-తరువాత ఏం చెయ్యమంటావంటే శాంత్యర్థము మరొక యాభై వేలు చేయమన్నాను. అయిదారు నెలల్లో అదికూడా పూర్తి చేశాడు. నేను వెళితే పూర్తి చేశానన్నాడు. ఎవరో గంధర్వుడు ఈ ఉపాధిలో ప్రవేశించి ఉన్నాడేమో అనుకున్నాను.

అంతకుముందే ఆ అలవాటుండేది. కరీంనగరం నాటినుండి అది వృద్ధి పొందింది. నిత్య యోగాభ్యాసం, నిత్యజపం బాగా అభ్యాసమై పోయినవి. ఆయన కావాలని మంత్రించిన విభూతి ఇస్తే ఎంత రోగమైన ఎంత ఆపదైనా వెనుకాడేది.

మరో విషయం ఆయన వాక్శుద్ధి గొప్పది. మాట అన్నాడంటే అది జరిగితీరాల్సిందే. ఒకసారి ఆయన వద్దన్నపని చేసి నేను పెద్ద దెబ్బతిన్నాను.

సరే. ఆయన పొందిన సన్మానాలన్నీ గబగబా వచ్చేశాయి. సెంట్రల్ అకాడమీవారి బహుమతి నుండి జ్ఞానపీఠంవారి అవార్డు దాకా అన్నీ పొందాడు.

"అంతతోన్నగ్ం రాద్ధం అంతతోన్నేన రాధ్యతే"

అని తైత్తిరీయం చెబుతోంది. పిల్లల అదృష్టాన్ని బట్టి అవన్నీ జరిగాయనుకోండి. ఒకసారి నేను వాళ్ళ ఇంటికి వెళ్లాను. గేటు దగ్గర నుండి లోపలిదాకా వెళ్ళడానికి రెండుమూడు నిమిషాలు పట్టింది. "ఏరా! అయిపోయిందా? ఆ వేగమంతా పోయిందేమిరా?" అన్నాడు. పోయిందన్నాను. అలా ఒక నిమిషము రెప్పవాల్చకుండా నావంక చూచి ఊరుకున్నాడు.

"తమ్మిరేడ లక్ష్మిఉండనో పృథాతనయుండనో తమ్మిచూలికిన్
గొమ్మలు దిద్దు నీకు నెదగూర్చిన తమ్మిడ వెండికొండరా
కొమ్మకుఁబుట్టెఁబూవు జతకూర్చెనొకండిటఁ దల్లి యడ్గులన్
సమ్మతి శంభుశీర్షగత చాంద్రమసంబగు రేఖ నీవునై."

ఇది పరాప్రసాదము అంకిత పద్యము. మా రామమూర్తి నా విషయం మరచిపోయినావన్నాడు. వాడు నాలో లీనమై యున్నాడు.

మా అన్నకు చివరిదశలో సంగీతం మీదికి మనసుమళ్లింది. చిరంజీవి జొన్నవిత్తుల సుబ్బారావు నిత్యమూ వచ్చి మా పాపనికి పాఠం చెబుతూ మా అన్నకు సంగీతం వినిపిస్తూ వచ్చాడు. ఆయన త్రిశూలం నాటకంలో వ్రాసిన శివగిరి విభో అనే పాటను స్వరపరచి బ్రహ్మాండంగా పాడటం ప్రారంభించాడు. ఇల్లంతా సంగీతమయం అయింది.

మోగ్రియు తుమ్మెదనాదు నారాయణరావుగారి సంగీతంలో లీనమైనాడు. చిన్నతనంలో హరినాగభూషణంగారి వాయులీనంలో లీనమైనాడు. ఆనాటి నుండి సంగీతం ఆయన్ని వెన్నాడుతూనే ఉంది. పూర్ణసరస్వతీ స్వరూపుడైన ఆయన ఆత్మలో సంగీతం మ్రోగడం సహజమేననిపిస్తూ ఉండేది. "ఏతత్సామ గాయన్నాస్తే హా ఉహ హాఉ హాఉ — " అని తైత్తిరీయం.

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు, చెఱుకుపల్లి జమదగ్ని శర్మగారు, కేతవరపు రామకోటిశాస్త్రి గారు, మల్లంపల్లి శరభయ్య గారు భావరాజు నరసింహారావుగారు, ధూళిపాల శ్రీరామమూర్తి గారు వీళ్ళంతా కలిసి మా అన్న 82వ జన్మదినోత్సవ సందర్భంగా 1976 సెప్టెంబరు 14, 15 తేదీలలో విజయవాడలోని ఆయన స్వగృహం లోనే సహస్ర చంద్రదర్శన శాంతి పౌష్టికోత్సవము జరిపించారు. ఆనాడు శ్రీ రామలింగేశ్వరరావుగారు మా అన్నగారికి శ్రీశృంగేరీ మఠాధిపతుల నుండి ఆశీరక్షతలు తెప్పించి ఆ క్రతువును పరమ వైదికంగా నిర్వహించారు.

జీవుడు అగ్నీషోమమూర్తి. అగ్నియందు సూర్యాగ్ని

కూడా అంతర్నిహితమైహి ఉంటుంది. సోమాగ్ని కళలు చాంద్రి మాసతిథులుగా పరిణమిస్తవి. సహస్రి చంద్రి దర్శనమనగా సహస్రిమైన చాంద్రికళల ఆవిష్కరణమని నేను వ్యాఖ్యానము చేసికొంటున్నాను. సత్యనారాయణోపాధిగతుడైన జీవుడు అగ్నిషోమాత్మకుడగుటచే ఆతనియందావిష్కృతములయిన చంద్రి కళలు సహస్రిము ఆనాడు పూజితములయినవని నేను భావించు చున్నాను.

వేదము నందు శతమితి శతం శత మనంతం భవతి అను వాక్యమున్నది. జీవునకు 125 సంవత్సరాలు పూర్ణాయుర్దాయము- ఇది జ్యోతిశ్శాస్త్రము చెప్పిన లెక్క. అమ్మవారు సోమాత్మక. సోముని కళలు వేయి నిండిన వాడు అచ్చముగా తల్లిపోలిక బిడ్డ. అందును తన కవిత్వమును దర్శనాత్మకంగా తీర్చిదిద్దిన మా అన్న అచ్చముగా అమ్మవారికి నచ్చిన బిడ్డ.

కానీ- ఆనాడు అవభృథ స్నానం అయి ఆర్ద్రి వస్త్రదానం చేసి చేతులు జోడించి నిలబడ్డ మా అన్న అన్ని కళలూ దించుకొన్న వేనరాజు నాటకంలోని అంగరాజల్లే కానవచ్చాడు. సత్యనారాయణ సామాన్య కవిమాత్రిడు కాడంటివికదా! వేనరాజు అవైదికరాజు అనగా అతని యందు రాజ కళలు ప్రితిబింబింప లేదు. రాజ కళలనగా చంద్రికళలు, సూర్యకళలు కూడా. అవి అతని యందు ప్రితిబింబించలేదు. నా విష్ణుః పృథివీపతిః అని ఉన్నది గదా! నాస్తికుడైన వేనుని యందు సూర్య చంద్రి కళలు సాక్షాత్కరించలేదు. తరువాత ఆ కథలో స్త్రీ పుమాత్మకముగా ఉన్న పృథువునందు ఆ సూర్య చంద్రి కళలు సంక్రిమించినవి. అప్పుడు తండ్రియైన అంగరాజు తన కళలన్నీ దించుకొని సరకు దించుకొన్న పడవ వలె తేలికపడ్డాడు. ఇట్టి తత్త్వార్థ పూరితంగా మా అన్న నాటకాది నిర్మాణం చేసేవాడు.

అట్టి దార్శనికుడైన కవికి మా మిత్రులంతా సహస్ర చంద్ర దర్శనోత్సవం చేయడం ఎంతైనా ఉచితముగా ఉన్నది.

అప్పుడు నేను పద్యాలు వ్రాద్దామనుకొన్నాను. కానీ ఎందుకో— నోరు పెగల లేదు.

మా అన్న కవిమాత్రుడు కాడు. కవితను దర్శన స్థాయికి అందజేసిన మహానుభావుడు. ఆయనతో సమానుడు ఒక్కడే ఉన్నాడు. ఆయన భవభూతి.

మా అన్నగారు పూర్ణ పురుషుడు.

పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ మదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే

ఓం తత్సత్

ఓం శాంతిః శాంతిః శాంతిః

# జ్ఞాపికానుబంధము

1. ఒకరు రామమూర్తిగారూ, రెండవ ఆయన సోమ శంకరశాస్త్రి, విశ్వనాథ వెంకటరత్నంగారి కుమారుడు. విశ్వనాథవారికి వెంకటరత్నంగారు పిన తండ్రి.

2. శోభనాద్రిగారూ బ్రహ్మన్నగారూ ఇద్దరూ నందమూరులో ఒక శివాలయాన్నీ మరొకరు విష్ణ్వాలయాన్ని ఒకరినొకరు ప్రోత్సాహపరచుకొనుచూ నిర్మించారు.

అన్నపూర్ణా సహిత కాశీ విశ్వేశ్వరాలయ మొకటి. రుక్మిణీ సత్యభామా సహిత సంతాన వేణుగోపాలస్వామి ఆలయం ఇంకొకటి. ఈ బ్రహ్మన్నగారు ఘంటసాల దగ్గర కొత్తపల్లిలో విశ్వేశ్వరాలయ మొకటి గూడా కట్టించిన మనీషి.

3. ఈయన విశ్వనాథ శోభనాద్రిగారి తమ్ముడు వెంకటరత్నంగారి కుమారుడు. సోమశంకరశాస్త్రిగారికి ఏడెనిమిది సంవత్సరాల వయస్సుకే తల్లిదండ్రులు గతించటం చేత శోభనాద్రిగారి భార్యే మరిది కుమారునిలా పెంచింది.

4. ఆ వయస్సులో వాళ్ళిద్దరూ కలిసి మెలిసి ఉంటటం-ఆడుకోవటం మొదలయిన విధంగా చాలా మంచి స్నేహితులుగా ఉండేవారు.

5. తెలికల - గానుగ నుండి నూనెతీయు కులమువాడు.

6. శ్రీమతి వరలక్ష్మమ్మగారు సత్యనారాయణగారి పెదపినతండ్రి వెంకటాద్రియుడుగారి బావమరది కూతురు. వెంకట్రాయుడుగారి కుమారుడు సుబ్రహ్మణ్య శర్మగారికి ఆమె వరుస.

మరొక సంబంధం వెంకటాద్రియుడుగారి కుమారునకు శోభనాద్రి గారు నిశ్చయం చేశారు వెంకటాద్రియుడుగారి బావమరది వచ్చి శోభనాద్రిగారి మీద పడి కళ్లనీళ్ల పర్యంతం అయితే అప్పుడు నా కుమారునకు నీ కూతురును చేసుకుంటాను అని శోభనాద్రిగారు అభయమిచ్చి ఆమెను సత్యనారాయణగారికిచ్చి పెండ్లి చేశారు. ఈ పెండ్లి చాలా వైభవంగా జరిగింది. శోభనాద్రిగారు ఉభయ ఖర్చులూ పెట్టి కొల్లూరుకు బండ్లమీద తర్లిపోయి అక్కడున్న మూడు వందల బ్రాహ్మణ కుటుంబాలకు గడప చీరెలు పెట్టి కొడుకు పెండ్లిచేసుకొని వచ్చారు.

7. కిన్నెరసాని సత్యనారాయణగారి కవితా శైలికి ప్రతీక. ఏపాదానికాపాదం పూర్తి అయి చదువుటకు తేలికగా ఉండి ఏ పద్యానికా పద్యం స్వయం సంపూర్ణంగా ఉండే రచనా విశేషం చెళ్ళపిళ్ళ వారిది. పింగళి లక్ష్మీకాంతం ప్రభృతులు ఆ శైలీ విశేషమునందు బద్ధాదరులయి యుండిరి. సత్యనారాయణ గారు ఆ త్రోవకు పోక నన్నయ, తిక్కన్న, తెనాలి రామకృష్ణుడు రాయలు మొదలయిన ప్రాచీనాంధ్ర కవులను కవితా గురువులుగా స్వీకరించి పద్యములోని అవయవ వాక్యములన్నింటిని గుదిగ్రుచ్చి మహావాక్యముగా సమర్థించు మహా రచనా విశేషమును పునః ఆవిష్కరించిరి. అది కిన్నెరసాని ఈ విషయికమైన ఆ రోజులలో జరిగెడు వాద ప్రతి వాదములకు సమాధానముగా కిన్నెరసాని అను కావ్య ఖండిక వ్రాయబడినది.

8. సత్యనారాయణగారు మురారి అనర్ఘరాఘవ నాటకం మీదా, దిఙ్నాగుని కుందమాల నాటకంమీద విమర్శలు వ్రాసి 1932-34 ప్రాంతంలో ప్రకటించారు.

9. ఆంతరంగిక సంబంధం అంటే సత్యనారాయణగారు కవి-వెంకటేశ్వర్లుగారు భ్రాతృద్రుడు. ఇది జీవితాంతమింతే. ఇదిగాక మరియు సత్యనారాయణగారికి కుటుంబ జీవితములోని ఎవరి

ముందూ బయటపెట్టని పరమరహస్యాలు వెంకటేశ్వర్లు గారితో చెప్పుకొని తృప్తిపడే లక్షణమొకటి ఉండేది.

10. లాల్ — లాలా లజపతిరాయ్
బాల్ — బాలగంగాధరతిలక్
పాల్ — బిపిన్‌చంద్రపాల్

11. ప్రమోద కుమార ఛటర్జీగారి త్రిశూలము భారతి పత్రిక–ఈశ్వర, పుష్యమాసము - సంచికలో ముద్రింపబడింది. బహుశః బ్లాకు చేయించటానికి ఇయ్యబడిన మూలచిత్రం తిరిగి వచ్చి యుండదు.

12. వక్రరేఖ కథ ముని మాణిక్యం నరసింహారావు గారిదే. మొదట ఆయన యాభై పేజీలలో వ్రాశారు. దానిని యూనివర్సిటీ టెక్స్టు బుక్కుగా విశ్వనాథ వారు తిరుగ వ్రాశారు. అలా వ్రాయటంలో అది పెరిగింది. అందుకు కృతజ్ఞత చెప్పటమే లాగని మథనపడి చివరకు పరిష్కరణ కర్తగా సత్యనారాయణగారి పేరును అచ్చు వేయటానికి ఆయన చేతనే ప్రస్తావన వ్రాయించ టానికి నిశ్చయించుకొన్నానని, ముని మాణిక్యం వారు చెప్పినారు. ఇతరులకు సహాయ పడటంలో సత్యనారాయణగారెంత వరకు పోతారో చూడటానికి తమ వక్రరేఖ నవల చూస్తే తెలుస్తుందని నరసింహారావుగారన్నారు. తమ కసలు బందరులో ఉద్యోగ మిప్పించింది సత్యనారాయణగారేనట. వక్రరేఖ 1931 నాటిది.

13. శ్రీమద్రామాయణ కల్పవృక్ష రచన 1934 సంవత్సరంలో మొదలై 1962వ సంవత్సరంలో సమాప్తమైనది. ఇది యొక సమాచారము.

14. నవ్యసాహిత్యాన్ని గూర్చి చారిత్రకంగా అవలోడనం చేసి.........దాని లక్షణాలేవో పరిమితి ఎంతో ఏక్రమ పరిణా

మాలను పొందిందో మొదలయిన విషయాలను యథాశక్తిగా చర్చించి తచ్చరిత్రకు ఒక నిర్దుష్టమైన ఆకారాన్ని ఇచ్చింది. మొదటి మాట విశ్వనాథ బెజవాడ పరిషదధ్యక్షోపన్యాసం. చాలా కాలం నుంచి ఏతచ్చరిత్ర రాయాలని నాకుంటె, ఈ ఆసక్తిని పురికొల్పి ఈ ఉపన్యాసం నాచేత ఈ గ్రంధం వ్రాయించింది" అని శ్రీ కురుగంటి సీతారామయ్యగారు తమ నవ్యాంధ్ర సాహిత్య వీథులు ప్రథమ ముద్రణ పీఠికలో (4-5-1942) వ్రాశారు.

15. ఈ 'సురధుని' కథను గూర్చి విచారించవలసి యున్నది.

---

# నేనూ - విశ్వనాథ

—శ్రీ కొడాలి ఆంజనేయులు

మా బాబాయి శ్రీ విశ్వనాథ శోభనాద్రిగారు నెలదాత. ఆయన పెద్ద కుమారుడే మన విశ్వనాథ సత్యనారాయణ. శోభనాద్రి గారి దాతృత్వ మాయనను ఆర్థికములయిన చిక్కులలోకి దింపింది. సత్యనారాయణ చదువు కోసం ఆయన బందరులో కాపురం పెట్టారు. ఆ రోజులలోనే సత్యనారాయణకు నాకూ మిత్రిత్వ మేర్పడింది. మొట్టమొదట మేమిద్దరం ఎలా కలిశామో, ఎలా మాకు స్నేహ మేర్పడిందో ఇప్పుడేమీ జ్ఞాపకంలేదు. శోభనాద్రిగారికీ, మానాన్న గారికీ కూడా మిత్రిత్వం చిరకాలం క్రిందట నుండీ ఉన్నట్లు మాకు వారిద్దరిద్వారా తరువాత తెలిసింది. అందువలన మా ఇరువురి సఖ్యం మా నాన్నగార్లకు కూడా ముచ్చటగా ఉండేది. సత్యనారా యణ మా యింటికి కొడాలి వచ్చినా, నేను నందమూరు వెళ్లినా మా అన్నదమ్ములు అక్కచెల్లెండ్రు అంతా చాలా సరదాగా వుండే వాళ్ళు. సత్యనారాయణ ఇంటర్మీడియేటు చదువుతూన్నప్పుడు శోభనాద్రిగారు డబ్బు లేక చాలా యిబ్బందులు పడుతూన్నట్లు కనపడేది. కాని ఆయనలో యెన్నడూ దైన్యం కనిపించలేదు. "మన సత్యం చాలా గొప్పవాడవుతాడు; మంచి కీర్తి గడిస్తాడు; వాడిది గొప్ప జాతకం" అని మాబాబాయి నాతో అంటుండేవారు. నేను కూడా సత్యనారాయణ గొప్పవాడవుతాడనుకొనేవాణ్ని. కాని నిజం నిజం చెప్పవద్దూ, ఇంత గొప్పవాడవుతా డకోలేదు. బహుళ గ్రంథకర్త అవుతాడనీ, విశ్వవిద్యాలయ బహుమతులు పొందుతాడనీ, కవి సమ్రాట్టు, కళాప్రపూర్ణుడు అవుతాడనీ, ఆధునికాంధ్ర కవులలో

అగ్రేసరుడుగా అఖిలభారత ప్రఖ్యాతి పొందుతాడనీ మాత్రం నేననుకోలేదు. అయితే అదేమి చిత్రమో కాని సత్యనారాయణ మాత్రం చిన్నప్పటి నుంచీ తాను గొప్పవాడననే అనుకొంటూండే వాడు. అతని ఆత్మవిశ్వాసం అచంచలం. శతావధాని బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు బందరు హిందూ హైస్కూలులో ఆంధ్రోపాధ్యాయులుగా వున్నరోజులవి. తిరుపతి వేంకటేశ్వరులకు కొప్పరపు కవులకూ వాద ప్రతివాదములు చెలరేగుతుండిన కాలంలో శ్రీ వేంకటశాస్త్రులవారు క్లాసులో తమ గుంటూరు సీమ నుండి పద్యాలు చదివి వినిపిస్తూండేవారు. బందరు హిందూ హైస్కూలులో ఆయన క్లాసులో చదివిన విద్యార్థులకు చాలామందికి కవిత్వం వ్రాయవలయుననే కోరిక హెచ్చుగా వుండేది. పద్యాలు వ్రాయడం, చదవడం మరిగి పరీక్షలు తప్పినవాళ్ళు చాలా మంది వున్నారప్పుడు. మాకు కూడా ఆ కాలంలోనే పద్యాలు వ్రాయడం ఒక వ్యసనంగా పరిణమించింది. ఉదయం, సాయంకాలం బందరు ఎడ్ల మీదకు పోయి పద్యాలు ఆలోచించేవాళ్లం. అన్నం తింటూ ఆగిపోయి పద్యం ఆలోచిస్తుంటే మా తల్లులు. మీకు పిచ్చెత్తు తుందల్లే వుందిరా అని కోపపడేవాళ్ళు. బహుశా ఆ రోజులలోనే నేమో శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు బందరును గూర్చి "ఎక్కడ జూచినం గవులె" అని ఒక పద్యం చెప్పారట! మహాకవి మాట అబద్ధమవుతుందా! నేటికీ ఆ మాట బందరు విషయంలో మరొక అర్థంలో కూడా అక్షరాలా నిజంగా పరిణమించింది.

ఈ పద్యాలు వ్రాసే అలవాటు మాకొకప్పుడు అనుకోని చిక్కులు తెచ్చి పెడుతూండేది. మా హైస్కూలులో పరిమి నరసింహశాస్త్రులుగారు సంస్కృత పండితులుగా వుండేవారు. ఆయన పొట్టిగా కొంచెం లావుగా వుండేవారు. ఆయనను కొంత మంది కొంటె పిల్లలు కూష్మాండమనే వారు. ఆయన మీద కూష్మాండమనే శీర్షికతో ఎవరో కొన్ని పద్యాలు వ్రాసినట్లు ఆనాటి

మా హెడ్మాస్టరు శ్రీ వెంపటి లక్ష్మీనరసింహంగారికి తెలిసింది. హైస్కూలులో పద్యాలు వ్రాయడం అలవాటున్నవారి నందరినీ ఒక్కొక్కరినే పిలిచి, ఈ పద్యాలెవరు వ్రాశారో చెప్పకపోతే, మీకు ప్రహారణాలు తప్పవని బెదిరించారు. నరసింహంగారంటే మా అందరికీ హడలు. నిజానికీ నాకూ, సత్యనారాయణకూ ఆ సంగతి అప్పటికేమీ తెలియదు. తరువాత చాలా కాలానికి ఆ పద్యాలు వ్రాసిన అతడు మా మిత్రులలో ఒకడేననీ, ఆయన ద్రోణావఝ్ఝల సాంబశివరావనీ తెలిసింది. ఈ సాంబశివరావు దురదృష్టవశాత్తూ చిన్నతనంలోనే చనిపోయినాడు.

ఈ సాంబశివరావు పేరుతో పాటు మా విద్యార్థి దశలో మమ్ములను అవ్యాజంగా ప్రేమించిన మరొక పెద్ద మనిషి పేరు జ్ఞాపకం వస్తూన్నది. ఆయన శ్రీ కా. వెంకటరామయ్యగారు. 'కా' అంటే బహుశా కానుకొలను కావచ్చునేమో. ఆయనకొక పుస్తకాల షాపు వుండేది. అందులో మా పాఠ్యపుస్తకాలే కాక, తెలుగులోని ప్రాచీన గ్రంథాలన్నీ వుండేవి. "అబ్బాయిలూ! ఇందులో మీయిష్టం వచ్చిన పుస్తకాలు తీసుకొని, మీరు చదువుకొని మళ్ళీ వాటిని వాటి స్థలంలో పెడుతూండండి!" అని ఆయన మాకు శాశ్వతంగా ఒక వుత్తరు విచ్చేశారు. నేనూ, సత్యనారాయణ, ద్రోణావఝ్ఝల సాంబశివరావు, శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు, విన్నకోట వెంకటరత్నం మొదలగు మిత్రులందరం సాయంకాలాల లోనూ, ఆదివారాలలోనూ మా తీరిక సమయాలలో ఆషాపుకు పోయి ధర్మగ్రంథాలయంలో వలె తెలుగు పుస్తకాలు చదువుకొంటూండే వాళ్ళం. మాకు కావలసిన పుస్తకాలక్కడే కొనుక్కొనే వాళ్ళం; తోడివిద్యార్థులను కూడా అక్కడే కొనమని ప్రోత్సహిస్తూండే వాళ్ళం. అప్పుడు శ్రీ వేమూరి రాంజీరావుగారికి కూడా ఒక పుస్తకాల షాపుండేది. దానిని రాంజీషాపు అనే వాళ్ళం. ఆయన చాలాకాలం 'దీనబంధు' పత్రికను నడిపేవారు. మహాత్మాగాంధీగారి

అస్పృశ్యతా నివారణోద్యమమునకు చాలా పూర్వమునుండీ ఆయన అస్పృశ్యతా నివారణకు పాటుపడిన పుణ్యపురుషుడు. నేడు బందరు లోని గవర్నమెంటు హైస్కూలు ఆయన నిరంతర కృషి ఫలితమే. ఆనాటి మా హిందూ హైస్కూలు అధికారులకు రాంజీరావుగారి మీద అభిమానం. అందువలన "ఎక్సరుసైజు పుస్తకాలన్నీయూని ఫారంలో ఉండాలి. అందుయా రాంజీషాపులో కొనుక్కోండి" అని విద్యార్థులకొక సర్క్యులరు జారీ చేయబడింది. కొందఱం కా. వేంకటరామయ్యగారి షాపులో కొనేవాళ్ళం. కొందఱుపాధ్యా యులు ఆ ఎక్సర్‌సైజు పుస్తకాలను నిరాకరించేవారు. ఒక రోజు తెల్లవారే సరికి, బందరులో జవారుపేట చౌరస్తా నుండి హిందూ హైస్కూలు గేటు వరకు "నీది రాంజీపుస్తకమా! నూటికి నూరు మార్కులు - నీది వెంకటరామయ్య పుస్తకమా! అయితే సున్నకు సున్నా!" అని గోడలనిండా రంగురంగుల కాగితాలు కనిపించినయి. పైగా ఈ విషయం కృష్ణా పత్రికా వార్తలలో పెద్ద అక్షరాలలో ప్రచురింపబడింది. ఈ పని వెంకటరామయ్య షాపుకు వెళ్ళి చదువుకొనేవాళ్ళదేనని ఉపాధ్యాయుల అనుమానం. అప్పటి నుండి వారు మామీద ఒక కన్నువేసేవుండేవారు. ఇదికూడా ద్రోణావఝ్ఝుల సాంబశివరావు పనేనని మాకు కొంత కాలానికి తెలిసింది.

## దయ్యాలమేడ కాపురం

బందరు గొడుగు పేటలో ఒక చిన్నమేడ వుంది. దానిని అందరు దయ్యాలమేడ అనేవారు. పైన ఒక హాలు, క్రింద ఒక వంటగదీ వసారా మాత్రముండేవి. దయ్యాల భయంతో దానిలో వుండడానికెవ్వరూ ఇష్టపడేవారుకారు. అందువల్ల అది నేను చౌకగా ఐదు రూపాయల అద్దెకు తీసుకొన్నాను. నేనప్పుడు బందరు రెవిన్యూ డివిజనల్ ఆఫీసులో కొత్తగా ఉద్యోగంలో చేరాను. మా అమ్మమ్మ

నాకు వండి పెడుతూండేది. పైన సత్యనారాయణ, కొల్లిపర సూరయ్య అగస్త్యరాజు రాఘవరావు మొదలగు మిత్రులు చేరేవారు. వీరంతా ఆనాటికింకా నోబిలు కళాశాల విద్యార్థులని జ్ఞాపకం. సత్యనారాయణకు అప్పటికే నాటకాలపిచ్చి చాలా వుండేది. పాండవ నాటకాలకు ప్రతి దానికీ హాజరయ్యేవాళ్లం. మాలో ఎవరి దగ్గరి డబ్బుంటే వాళ్ళ డబ్బు పెట్టి టికెట్లు కొనడం అలవాటు. బుట్టయ్యపేట హాలలో నాట కాలకు రాత్రి పండ్రెండు గంటలకు గేట్లు తెరిచి అందరినీ లోప లికి పోనిచ్చేవారు. డబ్బులు లేనప్పుడు మేమలా పోతూండేవాళ్ళం. నాటకాలకు, పాండవోద్యోగ విజయాలలో శ్రీ పింగళి లక్ష్మికాంతం గారు ధర్మరాజు వారి అన్నగారు నరసయ్యగారు భీముడు. మంజు లూరి కృష్ణారావుగారు కృష్ణుడు. రాఘవాచార్యులుగారు అర్జునుడు వేసే వారు. లక్ష్మికాంతంగారి ధర్మరాజు, కృష్ణారావుగారి కృష్ణుడు చాలా బాగుండేవారు. ఇప్పటికీ మహాభారతం ఉద్యోగపర్వం చదువుతూన్నా, పాండవోద్యోగాలు నాటకాలు చదువుతున్నా లక్ష్మికాంతంగారి ధర్మరాజు, మంజులూరి కృష్ణారావుగారి కృష్ణుడు కళ్లకు కట్టినట్లు కనబడు తూంటారు. సత్యనారాయణ, యేనాటకంలో యే పాత్రధారుడు బాగా అభినయించినా "ఆ వేషం నాకు వేయాలని ఉందోయి" అని ఉవ్విళ్ళూరేవాడు. ఎన్నోసార్లు స్థానంవారి 'యశోద' వేషం తనకు వేయాలని కోరిక వుందనేవాడు. కాని ఎప్పుడూ యే నాటకంలోనూ అతను వేషం వేసినట్లు నాకు తెలియదు. సత్యనారా యణ గొప్పవాడైన పిమ్మట వ్రాసిన కొన్ని రేడియో నాటకాలలో మాత్రం అతని గొంతు వినబడింది. సత్యనారాయణకు నాటకంలో వేషంవేసే ముచ్చట ఎప్పటికయినా తీరితే బాగుండును.

ఆ దయ్యాలమేడలో కాపురముండే రోజులలోనే బందరుకు కార్లేకార్పు సర్కసు వచ్చింది. అది రెండు మూడు వారాలు బందరులో ఆడింది. ఆ సర్కసు చూచేటందుకు, నేను సత్యనారాయణ, కొల్లిపర సూరయ్య మొదలగు మిత్రులు ప్రతిరాత్రి వెళ్లేవాళ్లం. రోజూ ఒక

మోస్తరు ఆట అయినప్పటికీ ఏనుగులు, చివరిదశలో వస్తూండేవి. అవి వచ్చేటప్పటికి మాకందరికీ తప్పకుండా నిద్రవచ్చేది. అవి ఏమిచేస్తయ్యో చూడాలనే పట్టుదలతో ప్రతిరాత్రి వెళ్లేవాళ్లం. ప్రతి సారీ అంతే జరిగేది. చివరకు ఏనుగులుచేసే పనులను మేము చూడలేకపోయినాము. అయితే ఒక్కపని మాత్రం జరిగింది. రాత్రింబవళ్లు ఆమేడ ఎప్పుడూ పద్యాలతో పాటలతో సందడిగా వుండేది. మామూలాన దయ్యాలు పారిపోయినయ్యనుకొన్నారు. ఇరుగు పొరుగువారు. ఇప్పుడామేడలో సంపన్న గృహస్థులు సలక్షణంగా కాపురం చేస్తున్నారు.

## బందరు రామన్నపేటలో:

మేము చదువుకొనే రోజుల్లో కొన్నాళ్ళు మేము బందరు రామన్నపేటలో, చిట్టూరి రామారావుగారి అరుగులమీది రెండు కొట్లలో అద్దెకుండేవాళ్ళం. ఎప్పుడూ పద్యాలూ పాటలూ పాడు కొంటూంటే 'అబ్బాయిలూ చదువుకోకుండా యేమిటా కూని రాగాలనేది రామారావుగారి తల్లి. ఎప్పుడూ చదవాలటండీ! కాసేపు చదివితే చాలదూ? అని సత్యనారాయణ ధీమాగా జవాబు చెబితే ఆవిడ సంతృప్తిపడి వూరుకొనేది. ఆ రోజులలో మా వుదయపు టిఫిన్ పుణుకులు. బహుశా అవి మా బందరులో తప్ప ఇంకెక్కడా లేవేమో, ఇవి చాలా రుచిగా వుంటాయి. శ్రీ ముట్నూరి కృష్ణా రావుగారు కూడా తమ దర్బారులో కవులకూ అప్పుడప్పుడూ ఈ పుణుకుల పార్టీ యిస్తూండే వారంటే వాటి రుచిని గురించి ప్రత్యేకం చెప్పవలసిన అవసరం లేదు. ఒక కోమటాయన ప్రతిరోజూ మా కొట్టు దగ్గరకు వచ్చి వతనుగా అవి ఇచ్చి పోతూండేవాడు.

## రామలక్ష్మమ్మ హోటలు:

అప్పటికి అరవ హోటళ్ళింకా రాలేదు. కొందరు ఆడవాళ్లు

వితంతువులుగా వుండేవాళ్లు హోటళ్లు పెడుతూండేవాళ్లు. మేము రామలక్ష్మమ్మ హోటలులో కొన్నాళ్ళున్నాము. విశ్వనాథ సత్యనారాయణ. కొల్లిపర సూరయ్య, అగస్త్యరాజు రాఘవరావని మరొక మిత్రుడూ, నేనూ ఆ హోటలులో వుండేవాళ్ళం. పింగళి లక్ష్మీకాంతంగారు కూడా వున్నట్లు జ్ఞాపకం. కవుల ప్రసంగం వచ్చినప్పుడామె ఎంతో ఉత్సాహంగా వింటూండేది. 'మా పుట్టినింటివారు చేమకూరవారే; చేమకూర వేంకటకవి మావాడే నాయనా? అని మావంక చూచి సగర్వంగా చెప్పుకొనేది. ఆమెకు చీట్లపేక చాలా యిష్టం. మాలో అగస్త్యరాజు రాఘవరావు శని ఆదివారాలలో ఆమెతో చీట్లపేకాడి బుద్ధిపూర్వకంగా ఓడిపోతూండేవాడు. ఆ అభిమానంకొద్దీ అతని భోజనం విషయంలో ప్రత్యేక శ్రద్ధ చూపుతూండేది ఆమె.

ఆమె చాలా సమయస్ఫూర్తిగల మనిషి. "దోసకాయ పచ్చడి చేదుగా ఉందమ్మా" అని ఎవరైనా ఒకరంటే "కాకతగులుతూన్నదేమో నెయ్యి వేసుకోబోకు నాయనా" అనేది నలుగురూ అదే మాటంటే, ఆదోసకాయలు తెచ్చిన మనిషిని నాలుగుతిట్టి "డబ్బుకు డబ్బూ పోయె బిడ్డలకు సుఖమూ లేకపోయె" అని ఒక్కమాటతో అందఱినీ సముదాయించేసేది! దాదాపు ఇప్పటికి పదేండ్ల క్రిందటి వఱకూ ఆమె గుడివాడలో హోటలు పెట్టుకొని ఉంది. మాలో ఎవ్వరు కనిపించినా అందఱినీ పేరుపేరునా అడిగి తన హోటలులో తిన్నవాళ్ళు చాలా గొప్పవాళ్ళయినారని గర్వపడుతూండేది.

మా పేర్లు మా పద్యాలూ అచ్చులో పడాలనే కోరిక బాగా వుండేదప్పుడు. అందులో కృష్ణాపత్రికలో మా పద్యాలు పడితే ధన్యులమయినట్లే అనుకొనేవాళ్ళం. ఒక రోజున కృష్ణాపత్రికకు వెళ్ళి కృష్ణారావుగారికి మా పద్యాలు ఇచ్చాం. వాటిలో శృంగారం ఉందని జ్ఞాపకం. కృష్ణారావుగారు వాటిని చూచి తల అడ్డంగా

తిప్పి మాట్లాడకుండా మా పద్యాలు మాకిచ్చేశారు. అంతటితో నేను చల్లపడ్డాను. కొంచెం దూరం నడిచి. 'కృష్ణారావుగారు మన పద్యాలు కోరి తెప్పించుకొని కృష్ణా పత్రికలో వేసేటట్లు చేస్తాను చూడు' అన్నాడు సత్యనారాయణ. తరువాత సరిగా అలాగే జరిగింది.

## అసహాయోద్యమము – 'అవతారపరివర్తనము':

తిలక్‌గారు స్వర్గస్థులై గాంధీగారు అసహాయోద్యమం ప్రారంభించిన కాలంలో, అదే కథా వస్తువుగా తీసుకొని 'అవతార పరివర్తనమనే' నాటకం వ్రాశాం మేమిరువురం. ఆ నాటకానికి పేరు పెట్టింది సత్యనారాయణే. ఈ నాటకమాడించడానికి 1907లో శ్రీ హరిసర్వోత్తమరావుగారితోపాటు కారాగారశిక్ష ననుభవించిన బోడి నారాయణరావుగారు పూనుకొన్నారు. ఆయనకు శ్రీకోపల్లె చిన కృష్ణారావుగారు తోడయి ఒక చిన్న నాటకసమాజాన్ని కొంత మంది యువకులతో యేర్పాటు చేశారు. అందులో గాంధీ పాత్రధారి శ్రీ కాశీపట్నపు రాజు. ఈయన బందరులో సుప్రసిద్ధ లాయరు శ్రీ కాశీపట్నపు నరసింహ్మమూర్తిగారి సోదరుడు. ఈ నాటకం తెనాలి, బాపట్ల, చీరాల మొదలగు స్థలాలలో ఆడిన పిమ్మట గుంటూరు జిల్లా మేజస్ట్రేటు డ్రెమెటిక్ పర్ఫార్మెన్సెస్ యాక్టు (Dramatic Performances Act) క్రింద ఈనాటకం జిల్లా మేజస్ట్రేటు వుత్తర్వులు లేనిది ఆడకూడదని నాటకకళాశాలవారికీ, మానేజరు శ్రీ కోపల్లె చిన కృష్ణారావుగారికీ నోటీసులు జారీచేశారు. తరువాత ఆ నాటకం బందరులో ఆడడానికి ప్రయత్నం చేస్తే కృష్ణాజిల్లా మేజిస్ట్రేటు గొడుగుపేట నాటక శాలాధికారులపైన కూడా అటువంటి నోటీసు జారీచేశాడు. అప్పుడు మామిత్రుడు, శ్రీ చిత్రపు ఆదినారాయణ, కృష్ణాజిల్లా మేజిస్ట్రేటు దగ్గర కాన్ఫిడెన్షల్ గుమాస్తాగా వుండి, నేమా సత్యనారాయణ ఆ నాటకం వ్రాసినట్లు సి. ఐ. డి.

రిపోర్టులు జిల్లా మేజస్ట్రేటుకు వచ్చినట్లు మాకు సమాచారం అంద చేశాడు. సత్యనారాయణ నోబిల్ కాలేజీలో ఉద్యోగం చేస్తున్నాడు. సత్యనారాయణ డబ్బులేక సంసారపుచిక్కులలో వున్నాడు. ఈ నాట కంలో అతని జోక్యం వుందని ప్రభుత్వానికి గట్టిగా తెలిస్తే అతని ఉద్యోగానికి ముప్పం రావచ్చుననుకొని, తెనాలిలో నాటకం ముగించ గానే బోడి నారాయణరావుగారు లేచి ఈనాటకం వ్రాసింది అవనిగడ్డలో ప్రభుత్వోద్యోగమునకు రాజీనామా యిచ్చిన కొడాలి ఆంజనేయులు గారని ప్రకటన చేశాడు. తరువాతి రిపోర్టులలో 'సత్యాంజనేయులంటే అవనిగడ్డలో ఉద్యోగానికి రాజీనామా యిచ్చిన కొడాలి ఆంజనేయులు తప్ప మరెవ్వరూ కాదని వ్రాశారట సి. ఐ. డి. వారు. అది కూడా మామిత్రుడు చిత్రపు ఆదినారాయణగారి ద్వారానే తెలిసింది. అనాట కం అచ్చుకాకుండానే ప్రభుత్వంవారు దానిని నిషేధించారు. డ్రమెటిక్ పర్ఫార్మెన్సెస్ ఆక్టు అప్పుడు అమలులోకి రావడానికి మేమే మొదటి కారణం అని తెలిసింది. అప్పటినుండీ మేము దూరం దూరంగావుంటూ వచ్చాం. తెనుగ భాష చేసుకొన్న పుణ్యంవలన అప్పుడతనికి ఆ సంసారపు చిక్కులు మెసలడానికి వీలులేకుండా వచ్చినవి. లేకుంటే బ్రిటిష్ ప్రభుత్వంపైన ఆతనికిగల కసికి, 'అసిలేనిసేన బడిపోయే' వాడో, అసివున్న సేన బడి పోయేవాడో............

# మా సత్యనారాయణ

—శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు

........మా ఇద్దరి ఊళ్ళకు పొలిమేరే అడ్డం. ఆయన మేనమామది మా వూరు. కమ్మవారివలె మేము ఆయన మాతామహుడు మా పితామహుడు ఒకరి నళ్ళం ఒకరు పిల్చుకుంటూ ఎంతో ప్రీతిగా ఉండేవాళ్ళం. మే మిద్దరం బందరులో ఒక స్కూల్లో చదువుకున్నాం. ఒక ఇంట్లోనే నవ వధువులతో చెరొక భాగంలో కాపురమున్నాం. మా పార్వతమ్మ పిన్ని చచ్చి స్వర్గాన ఉన్నది. ఆమెకు నేను కనిపించి నప్పుడల్లా పంచప్రాణాలు లేచి వచ్చేవి. ఆ వెట్టి బాగుల ఇల్లాలు తన కొడుకు మహోన్నతి నెరుగక నేనేమో చాలా అధికుణ్ణనుకొనేది. సత్యనారాయణ నన్నేదైనా సరాగ మాడితే తన పుట్టింటి మమత్వం కొద్దీ ఆమె నన్ను పూసుకు చక్కా వచ్చేది. శోభనాద్రిబాబుగారికి కూడా నాయం దెంతో ప్రీతి, గౌరవము కూడాను. నేనేమో గొప్ప కవిననుకొని...."వేంకటేశ్వరరావు! మా వాడేదో పద్యాలు గిలుకుతున్నాడు, నువ్వెప్పుడన్నా చూచేవా! ఏమైనాపనికి వస్తవేమో" అనేవారు. నా కిటువంటి చిర బంధువైన సత్యనారాయణ గొప్పతనము అంతో ఇంతో కవినైన నాకుగాక ఇంకా ఎవరికి తెలుస్తుంది చెప్పండి!

"మన తెలుగు కవులలో అనన్య ప్రతిభాశాలురు ముగ్గురున్నారు. నాచన సోమన, కృష్ణరాయలు, రామకృష్ణుడు, ఈ ముగ్గురినీ కాచి వడగడితే అయిన వాడు సత్యనారాయణ. నాచన సోముడంటే సామాన్యుడుగాడు. నవీన గుణసనాథుడై శ్రీనాథుడు

పోతన వంటి వారికి గురుపదమైనాడు. శ్రీనాథాదుల రీతి కవితకు ఆవేశానికి ఉద్దండ లీలకూ సోమన పెట్టినదేభిక్ష. సత్యనారాయణ అనగా మళ్లా సోమన్నంతటివాడు. ఇక రెండవవాడు రాయలు మాత్రము సామాన్యుడా? ఆ సాహితీ సమరాంగణ సార్వభౌముడు భావయిత్రిశక్తి అలౌకికమైనది. మా సత్యనారాయణ భావయిత్రిశక్తి ముందు రాయలది గూడ తీసికట్టేనంటాను. మహాకవులనిపించుకునే వారు, పదివిధాల భావించే విషయాన్ని సత్యనారాయణ నూరు విధాల భావించగలడు. ఇక రామకృష్ణుని పద్ధతే వేరు. ఆ పదాల నాతడట్లా పోహళించే వరకూ, అవి అలా ఒక దావితో నొకటి అతుకుతవని మనకు తెలియదు ఇక సత్యనారాయణ కూర్పు అంతకంటే విలక్షణంగా ఆశ్చర్యకరంగా ఉంటుంది. ఇంక కావ్య నిర్మాణ వైవిధ్యమంటారా? సత్యనారాయణలో ఉన్నంతగా ఆ ముగ్గురిని కలిపినా ఉండదు. శతకం దగ్గరనుంచి, ఉదాహరణాల దగ్గరనుంచి పద్యాలు, పాటలు, ద్విపదలు, కావ్యాలు, నాటకాలు, ఇతిహాసాలు, ఒకటేమిటి? అతను త్రొక్కని మార్గమే లేదు. అన్నిటిలోనూ అతని గడుసు తనము కొట్టవచ్చినట్లు కనిపిస్తూనే ఉంటుంది. కావ్యరచన మంటే అతనికి గోలీలాట వంటిదేమో ననిపిస్తుంది. అతను ఏకైక దిన ప్రబంధ రచయిత. వస్తువును తిర్పుటలో గూడ అతని దృష్టి వేరు. పనితన మంటారా? పెద్దబాడిత దగ్గర నుంచి చిన్న పోగరు వరకూ అతను చేపట్టగలడు. ఇలా కోకొల్లలుగా రచించిన కావ్య ప్రపంచమలా ఉండగా అతని గద్యరచన చూస్తే పట్టపగ్గాలు లేవు. ఆ నవలలు .. ఇతిహాసాలు, పురాణాలు, కావ్యాలుగాని, వట్టి నవలలు గావు. ఒక్క ఏకవీర చాలు. అతని కావ్య నిర్మాణనైపుణికి. ఒక ఒక్క వేయిపడగలు చాలు అతని పురాణ నిర్మాణ కౌశలానికి. అతని

గానీ, అపశ్రుతిగానీ, సర్వం ఎలా ఈశ్వరమయమో - అలాగా సర్వజ్ఞుడైన కవియొక్క సర్వతోభద్రమైన భావనకు వెలిగావలసిన పదార్థమేమీలేదు - కవి సమర్థుడై ఉండాలేగాని.

సత్యనారాయణగారి పట్ల ఆ నిశ్చయం అందుకనే ఆయనను నేను "అందుగల డిందులేదని సందేహము వలదు, చక్రిసర్వోప గతుం"దని ముక్తకంఠంతో పాడిన ప్రహ్లాదుడిలా ఈ సారస్వత జగత్తులో మన్నిస్తాను.

ఈయనగారి కవిత్వంలో గాంభీర్యము, జీవము, మధురిమ రసపుష్టి ఉన్నవి.

ఒకచో భావకవిగా, ఒకచో ప్రౌఢాతిప్రౌఢ కవిగా, ఒకచో క్రొత్తపాతల మేలుకలయిక క్రొమ్మెఱుంగులు చిమ్ముతూ, మరొకచో విమర్శకుడుగా, వేరొకచోట ఉపన్యాసకుడుగా - యింకొకచో కథా రచయితగా ఒకవైపున Novelist గా - ఇన్ని విధముల సారస్వత రంగము మీద ఇన్ని వేషములలో ఇంత నిశ్చలత్వంతో నటించేవారు చాల తక్కువగ మన మెరిగి ఉంటాము. నాటకాంతంగా సాహిత్య మును మనవారు పేర్కొన్నారు. ఇప్పటి ఆంధ్రనాటకములలో చెప్పదగిన నాటకము లేమూడు నాల్గింటిలోనో - ఈయన వేనరాజు మొదలైన నాటకములకు తొలితాంబూలం ఇవ్వక తప్పదు ఈ మహా కవి - దురదృష్ట - దుఃఖమయ - దరిద్రజీవితములను చూచినపుడల్లా నిలువున నీరైపోతాడు. ప్రసన్న భావసాంద్రమైన తన కవిత్వపు బిగువుల్లో ఆ మంద భాగ్యపు బ్రతుకులను చిత్రించుకొని మనసార దుఃఖిస్తాడు. జీవితంలో అన్ని అనుభవములూ ఈయన పరిశీలన క్రింద అణిగి ఉండి - ప్రతి రచనలో నుంచీ తొంగి తొంగి చూచి నవ్విపోతూ ఉంటవి. ధన్యజీవి సత్యనారాయణగారు.

ఒకరిద్దరెవరైనా సత్యనారాయణగారి కవిత్వమును గురించి

అన్యథా భావించే వాళ్లుంటే వుందురుగాక; లోకోభిన్నరుచిః అనికదా పెద్దలు సెలవిచ్చారు. ఇలాగని - ఆ మహాప్రవాహ సజీవ జీవనంలో - దాని నరికట్టటానికి చేతులనిండా మట్టితెచ్చి వేసినా - దానికి అభ్యంతరం కలగదు. ఇతోధిక వేగంతో - పొంగెత్తి మధుర నృత్యం చేస్తూ దివ్యస్వప్న విహారంచేస్తూ సాగిపోతూనే ఉంటుంది - అనంత సాగరాభిముఖంగా.

ఈయనగారి రామాయణ మహాకావ్యం ఆంధ్ర భాషకు కొంగ్రొత్తకై పేత. బంగారం మాత్రం ఆదికవిగారిదే. మూస సత్యనారాయణగారిది.

ఇక ఇంత మహాకవి వెనుక ఉన్న ఆ వ్యక్తిని గురించి కొంత చెప్తాను. మీరందరూ బందరులో ఆయన ననేకసార్లు అనేక చోట్ల దర్శించి ఉంటారు. పొడుగుగ - సన్నగ చామన చాయగ వుంటాడు గదా!

ఐనా నాకున్న స్నేహం మీకంటె ఆయన్ని ఎక్కువగా రూపించి చెప్పగలదు.

1923 లో నేనాంధ్ర జాతీయ కళాశాలలో చిత్రలేఖనం అభ్యసించటానికి వచ్చేముందే ఈయనను నేను పత్రికల ద్వారా ఎరుగుదును.

సత్యనారాయణగారు జ్ఞాన పిపాసి.

ఎడతెగకుండా సర్వ విధములయిన విజ్ఞాన సంపాదనకు ఈయనకు మనసు అధీనమై ఉంటుంది. అయా శాస్త్రములలో పండితుడు కావాలనే ఉద్దేశం చేత ప్రేరితుడై కాదాయన ఇట్లా చేయటం. ఆయనలో ఉండే నిరంతర విజ్ఞాన పిపాస - తరిగిపోని ఉత్సాహంవల్ల. అందుకనే ఆయన కావ్యములు ఒక మహా భావనా

జగత్తును మనయెదుట ప్రపంచింప జేస్తవి. రాబోయే 'వేయి పడగల'లో ఆయన ఎంత జ్ఞాన సంపత్తి గలవాడో మనం చూడగలము.

ఒకప్పుడనారోగ్యంగా ఉండినా క్రమంగా యోగాభ్యాసంలో పరిపూర్ణారోగ్యం సంపాదించాడు. కనుకనే రోజుకొక పట్టణంలో కాలక్షేపం చేస్తున్నా మొక్కవోవ లేదాయన శరీరపటిమ. నిష్కల్మషమైన స్నేహంతో సర్వ కాలాలూ నిండి ఉంటాడు. కల్ల కపటాలు లేని సహృదయుడు. ఒకప్పుడు కోపం వచ్చినా స్నేహానికది అడ్డు తగలదు. బలవత్తరమైన ప్రకృతిగలవాడు - (strong nature) దీపం పెద్దదైతే పెద్దనీడ ఉంటుంది. గ్రుడ్డి దీపాలకుండే నీడా గుడ్డిదే. కోపముగలవాడే ప్రేమించగలడు. కోపమెరుగని వానికి ప్రేమ అంటే తెలియదు.

జీవితం అనేక విధాల బాధాకరంగానే ఆయన్ని అంటి పెట్టుకుని ఉన్నా జంకలేదు. అధైర్యపడనూ లేదు. ఒకటే కార్యదీక్షతో అతి బలమయిన ధిషణతో పూర్వపు శ్రీనాథాదులలాగా కవిగా బ్రతుకుతున్నారు. 'ఆంధ్రప్రశస్తి'లో పూర్వాంధ్ర ధరాధినాయక కథామంజూషికా రత్నగాథలను తలచి తలచి రాళ్ళు కరిగేటట్టు వాపోయాడు. దిశలు ప్రతిధ్వనించేటట్టు శౌర్యోత్సాహాలతో గర్జించాడు. తాను 'ఆంధ్రవిరోధి కంఠదళన ప్రారంభ సంరంభ మేచు' ఆ దినాలలో తెలుగు జోదులలో-మటి తోడి సైనికుడై పోరాడినాడట. బొను-విజం-బది ఆయన పూర్వజన్మల సంస్మృతితో అన్నమాట.

ఈయన సనాతనుడని అందరూ అనుకుంటారు. బహుశః పిలకజుట్టు చూచేమో? అయినా అలాగే అంటాడు. దీనికి కారణమేయనది విప్లవప్రకృతి కాదు. సహజ పరిణామాన్ని ఎదుర్కొనే ప్రతినివిష్ట మూర్ఖుడు మాత్రంకాదు. కాఫీ హోటళ్లకు మాతో రానే వస్తాడు-కాని సంధ్యా వందనాది బ్రాహ్మణాచారం మానలేదు. అలా

అని ఏ మద్రాసుకో వెళ్ళి ఆచారం అక్కడలేదని ఉపవాసమూ చెయ్యడు. సనాతనుడనని చెప్పుకుంటూ డంతే: కవిత్వంలో ఉండే అన్ని పంథాలనూ ఆదరిస్తాడు-మన్నిస్తాడు-క్రొత్త ఒక వింత పాత ఒకరోతా అని పాతదానిని నిరసించడు. కొత్తదానిని తేలిక చెయ్యడు. రెండింటా తనది అందెవేసిన చెయ్యి. పాతమీదనే క్రొత్త నిలిచి ఉన్న మాట మరవలేడు. మరచిన సహించలేడు.

అద్వైతి. వేదాంతం చదివి మరచిపోవటం కాదీయనవంతు. ఆచరణలోకి, నిత్యజీవితంలోకి క్రమంగా అవతరింప జేసికోవటము; అరమరలులేని విచార విశ్వాసము. విచారణతో సత్యాసత్యనిర్ణయం చేసికుంటాడు, విశ్వేశ్వర శతకం ఆయన భగవంతునకు వేసిన పుష్పహారాల్లో ఒకటి. సౌశీల్యం అంటే ఆర్ష సంప్రదాయం అంటే పవిత్రత అంటే భగవంతుడంటే - పులకరాలు పొందుతాడు. ఆయనది కవిభావన మాత్రం కాదు. దానికి మించినది.

ఛటర్జీవేసిన కైలాస శిఖరచిత్రం చూచి సమ్మోహితుడైనాడు అదిచూచి ఛటర్జీగారా చిత్ర మీయనకే బహూకరించారు నిరవధికమైన సౌందర్యపిపాస కనుకనే భద్రాచలందారిలో కిన్నెరసానిని చూసి విమోహితుడై పోయినాడు. కిన్నెరసాని ప్రవాహంలాగు నురుగులు గ్రక్కుతూ నవ్వుతూ-విలపిస్తూ-గతించిపోయిన తన మధుర ప్రణయ స్మృతిలో మైమరచిపోతూ-విశ్వప్రవృత్తిలో తన దీననాదంలో క్షణానికి-ప్రకృతికే లాలిత్యము దిద్దుతూ ఆయనను లేతమనసు-గంభీర భావన-తియ్యని గొంతు కార్యస్వరూపం పొందింది. హృదయముగల ప్రతి ఆంధ్రుని కరుణ బాష్పాభిషేకమూ పొందుతూ ఉన్నది. కిన్నెరసాని చిరు కెరటాలలో కెరటముగా, నురుగుల్లో నురుగుగా-పొంగుల్లో పొంగుతూ పొంగుగా-మలపుల్లో మలపుగా-ఆమె కంఠ మాధుర్యపు తియ్యదనముగా ఇప్పటికీ ఆ మాటలు అక్కడనే నిలిచి పోయి ఉన్నవి. గోదావరీ హృదయము నుండి - తెలుగు మాగాణి

అంతా సస్యపూర్ణంగా-తెలుగు జీవితమంతా వికసిత మందారవృక్షంలా మార్చివేస్తూ ఉంది.

క్రమమైన శిక్షణము లేకపోయినా - ఉన్న తాళరాగ జ్ఞానము స్వానుభూత విషయము మాత్రమే అయినా - జీవం ఉట్టిపడేటట్లు - మధుర కంఠంతో వెల్లి విరిసిపోయేటట్లు గాంధర్వం వెదజల్లుతాడు.

అతడు ఆటకాయితనం కలిగిన పిల్లవాడు. 'పిల్లలలా ప్రవర్తింపగలిగినవారే సత్యమును సందర్శింపగలరు. వారిని శోక మంటదు.' అని గాంధీజీ వాక్రుచ్చారు. మాసత్యనారాయణగారట్టి వారే.

సంగీత సాహిత్య నృత్యశిల్ప చిత్రలేఖనాది ఉత్తమకళలన్నీ ఏకమూర్తిత్వము పొందిన మహాకళ నాటకకళ, భాష జీవభాష అయి వుండాలి. అంటే నాటకంలోని భాష అంతా పాత్రల ద్వారా గదా వ్యక్తీకరింపబడుతుంది. అలాంటప్పుడు ఎవరికన్నీ గ్రాహ్యంగాని మారుమూలల భాషపెడితే రసమునకు అపశ్రుతి దోషం సంభ విస్తుంది. అలా అని ప్రకృతిని సరిగా అనుకరించినా దోషమే. ఎందుచేతనంటే ఒకరి ప్రకృతిని అనుకరించటం అసాధ్యం. అది తన స్వరూపమూ కాదు. కేవలం పద్యాలు పాటలలో నుండే కవిత్వమయితే సంపూర్ణ రసమూర్తిత్వం తప్ప యింకొకటి అవసరం లేదు. నాటకంలో ఒక ప్రపంచం సృష్టి అవుతుంది. ఆ ప్రపం చానికి తగిన మానవులుంటారు. కనుక నాటకంలో కవి వివిధ పాత్రోచితమైనట్టిన్నీ కళా స్వరూపమైనట్టిన్నీ భాషను సృష్టింప వలసి ఉన్నది.

సత్యనారాయణగారు నాలుగు మహానాటకాలను సృష్టించారు. రెండు ఏకాంక నాటకాలను రచించారు. ఈ ఆరూకూడా ఉత్తమ శ్రేణిలోనికి చెందినవే, నర్తనశాల, వేనరాజు-ఈరెండూ పౌరాణిక

గాథల నాటకాలు. త్రిశూలము చారిత్రాత్మకమైన మహాభక్త జీవితము. అనార్కలి చారిత్రాత్మకమైన ప్రణయ విషాదగాథ. ఏకాంక నాటకాల్లో సౌప్తిక ప్రళయము పౌరాణికము. ధన్యకైలాసము కేవల కల్పిత స్వరూపమైన విచిత్రగాథ.

నర్తనశాలయందు వస్తువు కీచకవధ వృత్తాంతము అయినా సత్యనారాయణగారు మహాభారతగాథ యావత్తూ వెనకనే ధ్వనిగా గోచరింపజేశారు. కీచకవధకే కాదు మహాభారతానికే నర్తనశాల ఆయువు పట్టయినది. మాయజూదముకాదు, రాజసూయముకాదు. అరణ్యవాసముకాదు. ఉత్తర దక్షిణ గోగ్రహణములు కావు, కురుక్షేత్ర యుద్ధముకాదు, అశ్వమేధముకాదు, మహాప్రస్థానముకాదు-విరాటపర్వంలోని కీచకవధ వృత్తాంతము పాండవ చరిత్రానికి ఇరుసును చేశారు. నర్తనశాల అను పేరులోనే పాండవచరిత్ర అనే మహానృత్యాన్ని గోచరింపజేశారు సత్యనారాయణగారు. భారతానికి కథానాయకుడు పాండవ మధ్యముడు, పుష్టి భీముడు, ధర్మము ధర్మరాజు. అంగములు కవలలు. వీరైదుగురికి ఆశయ స్వరూపిణి అయినది ద్రౌపది. వేషములు మార్చి అజ్ఞాతవాసంలో నాటకమాడారు. వారాడిన మహానాటకానికి వ్యంజకము నర్తనశాల. ఆ నర్తనశాలలో మూలవిరాట్టు భారత కథానాయకుడైన బృహన్నల. ఆ నర్తనశాలలో సంహార రౌద్ర తాండవము సల్పినది భీమసేనుడైన వలలుడు.

నాటకానికి అసలు కథానాయకుడు కీచకుడు. అతడు సామాన్యుడు గాడు. భీమునికన్న బలవంతుడైనా, దుష్టవర్తనచేత బలహీనుడయ్యాడు. అతడు fallen angel.

వలలుడు:- (స్వ) ఓహో! వీడు మిక్కిలి పౌరుషశాలివలెనున్నాడు. నేను పురుషుడనని తెలిసినంతనే వీడు పొంగిపోయినాడు. ఇంతలో వీనిచేయి మహాకఠినమై పోయినది.

అతనిలోని దోషాలే అతనిని నాశనం చేసినవి. ఆ నాశనానికి కారకులు భగవదంశ సంభూతులైన పాండవులు. ఈ నాటకం అన్ని సొగసులు తీర్చికొన్న సౌందర్యరాశి. కథ మొలిచినట్లు చిత్రించారు. ఆ వృక్షానికి అందమైన ఆకులు భాష, పాత్రలు కొమ్మలు, కవిత్వము పుష్పాలు, ధ్వని సౌరభము.

సైరంధ్రి:—

కడిమి పూచినదొ లేక చిగిర్చినదొ యంచు
తొంగి చూచినది విద్యుల్లతాంగి
ఎదురుగా నరుదెంచు భృంగమ్మునకు స్వాగ
తమ్ము పాడినది మందార సుమము
పతిసంగమార్థమ్ము పరువులెత్తినది శై
లాగ్రి విస్రస్త వినిర్ఝరాబ్జ నేత్రి
సిగ్గు చెందినది పచ్చికబయళ్ళను పేరి
పులకలందిన యట్టి పుడమి పడతి

నవ జలదమాలసేయు గానంబులకును
నవ మయూరాంగనలు సల్పు నాట్యములకు
భారతశాస్త్ర దేశికమౌళి పాఠశాల
వోలె చూడ ముచ్చటయయ్యెపో వనంబు.

ఎక్కడో పురాణంలో ఉన్న చిన్నగాథను ఆధారం చేసికొని వేనరాజునాటకం సృష్టించారు సత్యనారాయణగారు. ఈ నాటకాన్ని గురించి కొందరి మిత్రుల అభిప్రాయం ఇది నర్తనశాలతో సరిపోదని నాకున్నూ ఇందులో కొన్ని దోషాలు ఉన్నట్లు ప్రథమంలో తోచిన మాట నిజమే. కథలో కదలిక తక్కువ. వందుల మరణశిక్షలు వాచ్య స్వరూపములయినవి. కథానాయిక ఆరు అంకాల వరకు దర్శనమివ్వదు. ఇవి నాకు మొదటతోచిన దోషాలు. ఒక మిత్రుడు

భాష కఠినం అన్నాడు. కాని ప్రథమ సందర్శన మౌగ్ధ్యము వీడినతర్వాత యివి దోషాలుకావుగదా! ఈనాటకముయొక్క ఉత్తమ స్థితికి కారణమైన విశిష్టత్వం వీనిలోనే వుందని తోచింది.

మనము సాధారణముగా అనుకునే కదలిక movement అనగా కథా పోషకత్వానికి భిన్నమైనట్టిన్నీ, అంతకన్న భాసమాన మైనట్టిన్నీ movement యిందులో వుంది. ఈ విషయంలో నాకు న్యూథియేటర్సువారి చండీదాసు జ్ఞాపకం వస్తుంది. ప్రభాతవారి అమరజ్యోతి కథయొక్క movement తో పోల్చిచూస్తే చండీదాసు కథలో movement యేమీ లేనట్టుంది. కాని చండీదాసులోని movement ఆత్మపరమైనది. అమరజ్యోతిలోని movement హృదయ పరమైనది.

వేనరాజులోని movement ఆత్మపరమైనది. పురాణగాథను పూర్తిగా మార్చివేశారు సత్యనారాయణగారు. తండ్రిని తరిమివేసి రాజ్యాన్ని బలాత్కారంగా స్వీకరించి భగవంతునిపై ఆర్యధర్మానిపై కత్తిగట్టి విలక్షణమైన నూతనశకాన్ని ప్రారంభించ దలచుకున్నాడు వేనుడు. అది అతని reason. అతని emotion. కాని అతనికి తెలియకుండానే అతని ఆత్మ తన్ను పైకి రాకుండాచేసే ఈ రెండు అదుపులను భేదించుకుని రావడానికి ప్రయత్నంచేస్తూ ఉన్నది. అట్లా రాకుండా చెయ్యడముయొక్క ప్రయత్నమే వందులకు మరణాజ్ఞ.

Movement అంటే నవీనచంద్, విఠల్‌కు మల్లే పిస్తోలు, కత్తులు, కటారీలు పుచ్చుకుని అయిదంతస్తుల మేడపైకి. రెండువేల అడుగుల అఖాతంలోకి దూకటంకాదు. వేనరాజులోని ఆవేదన (conflict) అతనికి పృథువుకు జరిగిన సంభాషణలో ధ్వనిస్తూ వున్నది.

వేనుడు:- పృథూ! పృథూ! తల్లీ ఏమి నిద్దురయే.
పృథువు:- ఎందుకు వేనా ?

వేనుడు:- నన్నన్నాయని పిలిచెద నంటివికదా! అన్నాయనుము.

పృధువు:- అన్నా! నన్నెందుకు నిద్ర లేపితివి!

వేనుడు:- తల్లీ! ఈ అంతఃపురము చూడుము. ఈ నాల్గు నాళ్ళుగా లేని సౌందర్యము దీని కెక్కడనుండి వచ్చినది.

పృధువు:- నీ వింతసేపు వీణ వాయించుచుంటివా?

వేనుడు:- అవును.

పృధువు:- అన్నా! నీవు వాయించినపుడు నీయాత్మలో దేవతలు నిలుచున్నారు. ఆపాదమస్తకము నీవొక దివ్యపురుషుడ వగుచున్నావు.

ఆర్యధర్మ స్వరూపుడైన గౌతముడు, మానవధర్మ స్వరూపుడైన అంగరాజు, దైవ ధర్మస్వరూపుడైన పృధువు వేనరాజుకు సన్నిహితులు. వేనరాజు ఎదుట ఎప్పుడూ ఉన్నారు. వేనరాజు ఒక్కొక్కవిధంగా వారిని ప్రేమిస్తున్నాడు.

వేనుడు:- తమ్ముడా (గౌతముని) నీవు వచ్చితివని ఈ సౌధము యొక్క నూత్నశోభయే చెప్పినది. నీవులేని పగళ్లు నాకు గడచుచున్నను, రాత్రులు గడచుటలేదు. అందుచే నీ తరువాతి నెచ్చెలియైన వీణవద్దకు పోయితిని.

వేనుడు:- నీకు నిద్రకన్నుల వెంట కారుచున్నది. నీపని కన్నులు మూసుకొనుచున్నది. చంద్రుని జూడుము. చెంగావి రంగువేసిన సన్నని గుడ్డ పేలికవలె నెంత మిగిలి యున్నాడో? నీకు నిద్ర వచ్చుచున్నచో నా యొడిలో బండుకొనుము. పండిన సంపంగి రెక్కలవలె నీ ఱెప్పలు కనీనికల మీదికి వ్రాలుచున్నవి.

ఈ నాటకంలో కథానాయిక యెవరు? ముద్రారాక్షసంలా నాయికలేని నాటకమా? ఈ నాటకానికి భూదేవియే నాయిక. కాని

యీ నాటకంలోని వైచిత్ర్యం కథానాయకుడు నాయికను గ్రహించక కథానాయకుని పొడిలియున్న దైవధర్మ స్వరూపుడైన పృథువును స్వీకరిస్తాడు. వేనరాజు సరియైన భూపతికాదు. అందువల్ల భూదేవి అతనిని పాణి గ్రహణం చెయ్యలేదు.

ఇప్పుడు లోకాన్ని దహించివేసే రాజ్యకాంక్షా పిశాచము, శాంతికోసం ధర్మంకోసం అల్లాడే ప్రజలయొక్క ఆవేదన సత్య నారాయణగారి హృదయాన్ని కలచి ఆయన కళాసృష్టత్వాన్ని పులకరింపజేసి యీ ఉత్తమ కావ్యాన్ని ఉద్భవింపజేసింది. అట్టి ఉత్తమాశయ భూయిష్టమైన యీ కావ్యము తత్తుల్యమైన భాషనే కలిగి ఉన్నది. సాధారణ నాటకము వలె దర్శింపదలచుకున్నవారికి ఈ కావ్యమందలి భాష జటిల మనిపించవచ్చుగదా!

నాటక స్వరూపమైన గాఢ నిషాదగీతిక అనార్కలీ. మధుర మైన లిరికల్ నాటకము. ఈ నాటకమంతా ఒక పెద్ద త్యాగరాయ కృతి. కరుణరసముయొక్క పరమావధిని చూరగొన్నది. బెదరిన లేడి చూపులు. నిర్జన ప్రదేశాన మందగమనాలలో చలించు సెల యేరు. చెరువులో ఒంటిగానున్న తామరపువ్వు ఈ నాటకము.

సలీము:- ప్రణయినీ నీవే నేను - నేనే నీవు.
అనార్కలీ:- ఈ వెన్నెలలో నన్నీచోటికి తఱుముకొని వచ్చినవి.

కోకిల:- ఈ రసాల కిసాల యే తరాహారంబు
తా రుచించదు మాకు తరుణ కంఠములకు
గొంతుకోయగ నిమ్మ కుహూస్వనానంద
రావమ్మ మధు నిర రమువోలె పాఱదో....

కవి :- కనులు మూసిహైమలతేక్షు ఖండ కోటి
బద్ధ మధుకరీ జ్యాశర భ్రమణమెంత
కనులు తెఱచి హోమాగ్ని శిఖాప్రచుంబి
గగన తరు శేఖరమ్ముల గాలజూతు,

సలీము :- నీకన్న నాకు ఎక్కువ ప్రియమైన వస్తువు,
నీ యీ అలినీల మనోహరములైన కనులు
సాక్షిగా చెప్పుచున్నాను - లేదు. ధర్మముచేత
నిన్ను నాయందు మరింత దృఢబద్ధనుగా జేసికొన్నాను.

ధన్యకైలాసం భక్తి రసపూరితం, సౌప్తిక ప్రళయం వీర రసపూరితము. ఒకటి పూలచెట్టు, రెండవది వటవృక్షం, అధర్మము లోన ధర్మము అశ్వత్థామ. కార్చిచ్చుయొక్క శిఖ అశ్వత్థామ.

త్రిశూల నాటకము షేక్స్పియరు నాటకాలను సంస్మరింప జేస్తుంది. బసవ పురాణంలోని ఆ ద్విపద మాధుర్యమంతా పోగులు పెట్టినారు సత్యనారాయణగారు. నాటకానికి మొదటినుంచి చివరిదాకా ఒక మహారాగం విస్తరించి ఉన్నది. ఛటర్జీగారి త్రిశూల చిత్రములోని హిమస్నిగ్ధత ఆకాశనిర్మల నీలత; కైలాసముయొక్క శిఖరము ప్రత్యక్షమవుతాయి. కైలాసగిరి శిఖరాగ్రము నుండి విశ్వమావరించే త్రిశూలముయొక్క పవిత్ర ప్రజ్వలనము సత్య నారాయణగారి త్రిశూల నాటకమునందు సందర్శిస్తున్నాము. ఈ నాటకము యొక్క వెనుక వెనుకనే బసవని కాళ్ళ గజ్జెలు ఘల్లు ఘల్లున వినిపిస్తుంటవి.

## రామాయణము

సత్యనారాయణగారు రచించే రామాయణము మహాకావ్య ముగా పరిణమిస్తున్నది. వెనకటి రామాయణాలకున్నూ ఈ రామాయణానికీన్నీ ఎంతో భేదం వున్నది. కథా రచనలోనే క్రొత్తపంథా త్రొక్కినారు. సూచనమాత్రంగా వాల్మీకి వదలిన ఘట్టాలను రసవత్తరాలైన కావ్యాలుగా చేస్తున్నారు. పద్ధతియు వెనుకటి పురాణపద్ధతి కాదు. ఒక new orientation ఒక నూతన విధానపు శిల్పరచన వెన్నెలలో కాయిస్తున్నారు. విశ్వామిత్రుని

తపస్సు, మేనకావిశ్వామిత్రుల ప్రణయగాథ ఎంతో రసవంతముగా వర్ణించబడినవి.

దేశభక్తి కవిత్వములో గంగాఝరియై ప్రవహించినది.

ఆంధ్ర వీరభటాళి కాత్మ శౌర్యంబుల
యందు శాణోపలంబైన యదియు

ఈ నిఖిలాంధ్ర రాజ్యరమ కేలిక కాదువు దీపకర్ణి సం
తానముగాగ నిన్గొలుచు ధాత్రి జనావళి ప్రాక్సముద్రమం
దానిన నీరు పశ్చిమ మహాంబుధి ద్రావుము కృష్ణనీరు గం
గానది జేర్పు మాంధ్రపతి కంఠ లసన్నవహారమోయనన్.

తెనుగుపొలాల తీవిగడిదేరిన బంటుల కాలిదుమ్ము న
ల్లని పెనుభూతమై గగన లంబినియై పెనుగాలిరేగి

వేంగిరాజుల పాద పవిత్ర చిహ్న
గర్వితమ్మైన యీభూమి ఖండమందు
నశ్రువులు జార్తు జీవచ్ఛవాంధ్రజనులు.

ఇమ్మగ కాకుళమ్ము మొద లీ
వటకుంగల యాంధ్ర పూర్వరా
జ్యమ్ముల పేరుచెప్పిన హృదంతర
మేలొ చలించిపోవు నా
ర్ద్రమ్మగు చిత్తవృత్తుల పురాభవ
నిర్ణయమేని ఎన్ని జ
న్మమ్ములు గాక నీ తనువునన్
ప్రవహించునొ యాంధ్ర రక్తముల్.

ఇచట నాగావళీ ప్రచుర వర్షాంభస్త
రంగముల్ వంశధారాజలములు

తరగెత్తిన మహేంద్రి తనయా సుధాంశు
లోకరీతిగా పొంగి యుబికిపోయి
గౌతమి కృష్ణవేణి తరంగములు తా
రాధ్వమ్ము నందు నైక్యము భజించి
గుండ్లకమ్మ జలాల గుబురులో గుబురులై
పెన్నా తరంగముల్ పెరిగిపోయి

తెలుగు నదులెల్ల పొంగెత్తి ప్రళయవారి
కెరలిపడి తెనుగు నేల ముగించనిమ్ము
నేటితో నస్వతంత్రితా నియతమైన
యీ బ్రిదుకు దెల్గువారు భరింపలేరు.

హిమకరు దొట్టి పూరు భరతీశ
కురుప్రభు పాండు భూపతుల్
క్రిమమున వంశకర్త లనగా
మహి నొప్పిన యస్మదీయ వం
శమున బ్రసిద్ధులై విమల
సద్గుణ శోభితులైన పాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు
వినంగ నభీష్ట మెంతయున్.

శృంగారవీధిలో స్నానసుందరి, కుపితబాలనము తప్ప తక్కిన వన్నీ కలిపి ఒక శృంగార కావ్యమే అయ్యేది. రాధ నాయిక. కృష్ణుడు నాయకుడు. రాధాకృష్ణుల శృంగారగాథ విచిత్రిలైన వివిధ రీతుల పరిసరించి దెసల సంటినది. మధురభావ భక్తిలో దాస్యసఖ్య వాత్సల్య భావములను పరిసరించి శృంగార వీధిని ఆంధ్రిభాషకు ఈవలా ఆవలా అంటుకుని ఉండే ఇంద్రిచాపము చేసినది. రాధాదేవి దివ్యమాతయై శ్రీకృష్ణుని తనకన్న శిశువు క్రింద భావించి 'ఇదిగో వెన్నపాలు పెరుగు తాగి బూరటిల్లిన బుగ్గలలో ఈ తడవ మా దొడ్డి

వాకిలికేసి తొంగిచూశావా చివురాకుల వంటి నీబుగ్గలు నాచేతులుతాకి కందిపోతయ్యేమోనోయిః చెపుతున్నానుగాః'

'నాకిపుడింత సిగ్గునగు నాధుని యాతలికాలు నొచ్చునో నాక'-

రాధ అన్నిరకముల నాయిక అయినది. ఆ మహాదేవి శ్రీ సత్యనారాయణగారి హృదయమునందు ఆవహించి ఆయననే రాధనుగా చేసినది.

ఒకసారి నాలోన నూహించి యేమియో.
స్త్రీవోలె సిగ్గు పొందెదను నేను.

ఆభక్తి తన్మయత్వంలో ఆయన భావాంతరాల శ్రీకృష్ణదేవ శిశుమూర్తి సాక్షాత్కరించినపుడు.

ఈః దృఙ్మార్గములన్ నిరాకృతులు కావే
సాకృతుల్ కావు కా
దేదో నల్లదనాలలో మెఱుఁగు
లై హేలాచల ద్రేఖలై
ప్రోదింగట్టిడు మొల్కయై
త్రిజగతీ పుణ్యంబు సాకారమై
నాదేహంబతివేల కంపము కడున్
నమ్రత్వముం బొందెడున్.

వీఁడెవఁడో కుమారకుఁడు వేదపుఁ
గ్రొంజివురుల్ ఫలించి యే
పోడిమిలేని నాహృదయమున్
దనవైపునకా కృషించు చు
న్నాడు శిరస్తటీ చలిత
నవ్యమయూర విలాసబర్హ స
మ్మాడభిరామ చూడుడు సరాగ
విలోచన మందహాసుడున్.

సత్యనారాయణగారి మహా కవిత్వాన్ని దూర దూర మాత్రం గానే మీకు చూపించగలిగాను. సౌందర్యశైవాలినియైన కిన్నెర సాని పాటలు నాలుగు ఉదాహరించి యీ వ్యాసం ముగిస్తున్నాను.

ఇప్పుడె గదె నా కౌగిట
కప్పితి నీ శోకమూర్తి
అప్పుడె విలువున నీరై
ఎప్పుడు ప్రవహించితివే – ఓహో కిన్నెరసానీ!

—కిన్నెర పుట్టుక.

ఈవు రసాకృతి వగుటను
ఈ వైఖరి ప్రవహించితి
నేను శిలా హృదయుండను
పూనుదునె ధునీ వైఖరి – ఓహో! —కిన్నెరపుట్టుక.

చేతులారా తాను
చేసుకున్నానని
యింతికిన్నెరసాని యేడ్చినా యేడ్పులూ
సుదతి కిన్నెరసాని చూపినా దుఃఖమూ
అవికూడ జలములై ఆమెలో కలిసినై. —కిన్నెర నడకలు.

పువుకన్నెలా జగా
రవ నవ్వులా వేల్పు
కవ చివ్వలా కిన్నె
రటు లూగి యిటులూగి
చిటులు కురటాలలో పెటులు కెరటాలలో
జవ్వజవ్వన నూనెనే – తెలిమల్లె
పువ్వురువ్వులు పోయెనే– —కిన్నెర నృత్యము.

(1938 జులై 23 శనివారము కృష్ణాపత్రిక సంచికలో పూర్తి యైనది.)

# శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు

-శ్రీ జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి

జయవీరుడుగా నిలబడిన కవియోధుడు బ్రహ్మశ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు. తానుగా వరించి ఏర్పరుచుకున్న కవితాయోగ సమాధినుంచి ఏ ఒక్క క్షణమూ దిగజారని తీవ్రసాధకుడు. తన సాధన ద్వారా కలిగిన సిద్ధిని అనుక్షణమూ పరిశీలించుకుంటూ అనుక్షణమూ సంపన్నుడు అయిన వాడు కాని, మరొకటీ మరొకటీ కాదు. ఈ ఒక్క విషయం చాలు, ఆయన, మహాకవిత్వ దీక్షావిధి నిర్వహణకు. ఈశ్వర సాన్నిధ్యమును ఏ మార్గాన అయినా చేరుకోవచ్చు. కవిత్వం యోగం వంటిది. అందుకనే, యోగులతో పాటు కవులనూ ఈశ్వర శబ్దంతో కలిపి, కవీశ్వరులు అని వ్యవహరిస్తారు. చిత్తశుద్ధి తోటి దశాబ్దులకు దశాబ్దులు కవితా తపస్సు చేసిన కవీశ్వరులు సత్యనారాయణగారు. ఈ నిష్ఠ మామూలుగా లభించేది కాదు కొంచెం పరిశీలించుకుందాం, సత్యనారాయణగారి సమకాల పరిస్థితుల్ని దివాకర్ల తిరుపతిశాస్త్రి గారూ, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారూ కలిసి, తిరుపతి వేంకటేశ్వర కవులై కవితా తపస్సు ప్రారంభించారు. వారు తిప్ర సాధకులు. తమ సిద్ధిని తమ శిష్యులసిద్ధినీ కన్నులారా కాంచిన అదృష్టజాతకులు వీరు. అందులో, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు మరీని.

## ఇతర కవుల స్థితి

రాయప్రోలు సుబ్బారావుగారు తరువాత కొత్త మార్గం తొక్క

కంఠం మోగించాడు. ఆచార్య పీఠం అలంకరించాడు. కవిత్వం ద్వారా ఋషిత్వాన్ని అందుకోవాలని చేసిన వీరి తపస్సు, జాతిని ఉత్తేజపరచగలిగింది అంతే.

అబ్బూరి రామకృష్ణరావుగారు, గంభీరమైన హృదయమూ వాణీ కలిగికూడా, ఒకటి రెండు గ్రంథాలతో, మొహం మొత్తినట్లు అయి ఆగారు.

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు విలక్షణుడై ఆచార్య పీఠం అధిష్ఠించి కూడా, "భోగమూ బద్ధకమూ ఎక్కువై కృషి తక్కువై" వీలయినంతగా కవితా తపస్సును విస్మరిస్తున్నారు. నాయని సుబ్బారావుగారి కంఠం ఏనాడో వినపడడం తగ్గించింది. నండూరి సుబ్బారావుగారు అంత సున్నితంగా శృంగారాన్ని పలికించినవారు. వేదుల సత్యనారాయణశాస్త్రిగారి వంటి హృదయ కవి, సంస్కారి, మౌనం వహిస్తున్నారు. ఎంచేతనో. అగాధమై నిండారబారు అఖండ గోదావరిలాగు, ఆగోదావరి వరదలలాగు వచ్చే కవితా స్రవంతిని, ఒక రాజకీయ పార్టీకి 'మెగఫోన్'గా చేసుకుని, కవిత్వపు జలలు ఇగిరిపోతూంటే, తనను తాను అనుకరించుకుంటూ తిట్టుకవిత్వంలోకి దిగాడు శ్రీశ్రీ.

కథలను, సర్వాంగీణంగా తీర్చిదిద్దిన వారైన చింతాదీక్షితులు గారూ, గుడిపాటి వెంకటచలంగారూ కవిత్వం కంటె ఉన్నతమైన ధ్యానాన్ని అందుకుని ఈశ్వరభక్తులు అయినారు.

గొప్ప సంస్కారులూ, మహాపండితులూ అయిన వేలూరి శివరామశాస్త్రిగారు అంతర్ముఖులు అయినారు.

తనతోటి సహయాత్రికులు, 'బహుశాఖాహ్యనంతాశ్చ బుద్ధయో' అన్నట్లుగా జారిపోతున్నా మారిపోతున్నా ముక్తిమార్గంలో

నడిపించే కవితా తపోనిష్ఠలో విశ్వనాథ సత్యనారాయణగారు నిలబడ గలిగారు అంటే సామాన్యమైన విషయం కాదు.

## కవితాత్మ

కవిగా నిలబడడం మాటలతోటి పనికాదు. కవితాత్మ మహా జ్వాల. ప్రతి క్షణమూ హృదయాన్ని కాలుస్తూంటుంది. ఆ వేడికి నిబ్బరించుకోడం కష్టం. రంగులో నీడలో మాటలో, వెలుగులో ఆమోదంలో, ప్రమోదంలో ఆవేదనలో, ఆలోచనలో అనుక్షణమూ ఉక్కిరిబిక్కిరి చేసి, ఎక్కడున్నామో ఎటుపోతున్నామో అన్నైనా తెలీనీకుండా వేధిస్తుంది. సౌందర్య సాగరం కెరటాలు ఉక్కిరి బిక్కిరి చేస్తూంటై. ఇంత హాలాహలమూ తానుగా భరించి తన సాధనను యోగివలె మౌనంగాకాక పది మందిలోనూ కలిసి తిరుగుతూ సుఖదుఃఖాలు ఎక్కువగా తాను కల్పించుకున్నవే అయినా సరే అనుభవిస్తూ కవితా తపస్సు చేస్తాడు నిజమైన కవి.

చూచేది అనుభవించేది సర్వే సర్వత్రా ఈశ్వరుణ్ణి. చెప్పేదీ, వ్రాసేదీ ఈశ్వరుణ్ణి. కాని సర్వాబద్ధాలలో కలిపి సత్యం చెప్పాడు కవి.

నేలలో, గాలిలో, నిప్పులో, నీరులో, ఆకాశంలో, వెన్నెట్లో, చీకట్లో, నక్షత్రాల మినుకుమినుకుల్లో రంగులలో మాటలలో, మాట లతో పాటు చేష్టలలో అసలు హృదయంలో ఉండే సౌందర్యాన్ని చూచి అనుభవించి ఆ అనుభవాగ్నులను తన జాతికి అందించడం అతని ధర్మం. మిగిలిన కథ, పాత్రలు శిల్పం అంతా ప్రమిదవంటి దైతే, ఆ ప్రమిదను ఆశ్రయించుకుని వెలిగేదీపం సౌందర్యం. ఆ దీపంకోసం ఈ ప్రమిదను గూడా గట్టిదగా చూచుకుంటాం. అంతే గాని, దీపంమాట విస్మరించి ప్రమిదలనే అలంకరిస్తూ కూచోటం సాహిత్యంఅంటేసమ్యక్‌దృష్టి లేకపోవడమే. సాహిత్యం చదివినవారు అర్ద్రతలో కరుణామయులై, సౌందర్యాన్ని అనుభవించి, సంఘంలోనూ

సర్వేశ్వరుని ముందూ యోగ్యులయి మెలగాలి. అందుకే కవీశ్వరుని అవసరం జాతికి.

విశ్వనాథ సత్యనారాయణగారు, ఏమీ వొరగబెట్టారూ అంటే? దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి వాక్యాలు ఇవి:

"రాయప్రోలు తొలి కావ్యాలలో మధురంగా వినబడిన పూర్వాంధ్ర గాథలు మరీ గాఢోజ్జ్వలంగా విశ్వనాథ 'ఆంధ్ర పౌరుషము', 'ఆంధ్రప్రశస్తి' మొదలైన కావ్యాలలో ప్రత్యక్షమౌతాయి. ఇతని ధోరణిలోనే కొడాలి సుబ్బారావు తీవ్రావేశంతో 'హంపీ క్షేత్రము' వ్రాశాడు. తుమ్మల సీతారామమూర్తి చౌదరి నిర్దుష్టమధురమైన 'రాష్ట్ర గానము' మొదలయిన కావ్యాలలోనూ, ఆంధ్రిలో కొన్ని అమితంగా ఆకర్షించిన జాషువా కవి కావ్యాలలోనూ జారిన దేశగౌరవము చక్కదిద్దవలెనన్న ప్రబోధవేగము బాగా స్ఫురిస్తుంది. ఆత్మపరంగా 'గిరికుమారుని ప్రేమగీతాలు' మొదలయిన కావ్యాలు విశ్వనాథ వ్రాశాడు: 'కిన్నెరసాని పాట; 'కోకిలమ్మ పెళ్లి' 'అనార్కలీ' నాటకంలో కొన్ని పద్యాలు ఇవన్నీ ఇతని గేయకావ్యాలు (Lyrics). 'ఆంధ్ర ప్రశస్తి'లో 'మాధవవర్మ' వంటి కథాకావ్యాలు [Narrative Poems] ఉన్నాయి. 'ఋతుసంహారం' వంటి వస్తుపరమైన కావ్యం వ్రాశాడు. ఇతను శతకం వ్రాశాడు; ఉదాహరణం వ్రాశాడు. ఇప్పుడు 'రామాయణ కల్పవృక్షం' అనే మహాకావ్యం వ్రాస్తున్నాడు. ఇతనిది 'గాఢ ప్రతిభ'-మహాకావ్య 'ఘట్టోల్లంఘన పటిష్ఠ' మయినది. ఇతనిలో తెనుగుతనం ఎక్కువ; సాహసమూ విజిగీషా అమితం. ఎట్టి వస్తువునైనా కావ్యవస్తువుగా తీసుకుందుకు జంకడు; ఎట్టి మాటనయినా కావ్యభాషలో పొదగడానికి వెనుదీయడు.

## అవిశ్రాంతి సృష్టి

కల్పనదీక్ష ఏకాగ్రత దానితో సమృద్ధి-ఈ గుణాలు కలిగి

అవిశ్రాంతంగా కావ్యసృష్టి చేయిస్తాడు ఇతను. హైందవ జాతీయో ద్యమం ఇతని కావ్యాలలో ఉజ్జ్వలంగా సాక్షాత్కరిస్తుంది. తరతరాల హైందవ విజ్ఞాన సంస్కృతులను నేటి ఆంధ్రలోకంలో పునఃప్రతిష్ఠ చేయాలనే ప్రయోజన మర్థించి ఇతను కావ్యరచన కావిస్తున్నట్లు కనబడుతుంది." (భారతీ రజతోత్సవ సంచిక).

విశ్వనాథ సత్యనారాయణగారు చేసిన కృషిని గురించి దేవుల పల్లి కృష్ణశాస్త్రిగారి మాటలవల్ల తేటతెల్లం అవుతుంది. ఏకవిని గురించి అయినా ఆలోచించేప్పుడు, వ్యాకరణ దోషాలు ఎన్ని ఉన్నాయి? యతులు ఎన్నిసార్లు తప్పిపోయాయి అని చూడడం నాకు చాతకానిపని. పైగా నాదృష్టిలో అవి బహుస్వల్పాలు. అప్రధానాలు కాళిదాసు అంతవాడు, అవైనేమాంహింకర మష్టమూర్తిః అని వ్రాస్తే భట్టోజీ దీక్షితులు, సిద్ధాంతకౌముదిలో' అత్రావైహీతి వృద్ధిరసాధురేవ' అని తప్పుపట్టాడు. అభిజ్ఞాన శకుంతలంలోని-

"గాహంతాం మహిషానిపానసలిలం శృంగైర్ముహుఃతాడి తం ఛాయాబద్ధ కదంబకం మృగకులం రోమంధమభ్యస్యతాం" అనే శ్లోకంలో కావ్య ప్రకాశికాకారుడు మమ్మటభట్టు, ప్రక్రమభంగం దోషం చూపించాడు. ఇవి దోషాలుకావు అనిగాని, కాళిదాసుది తప్పే అనిగాని నేను అనడంలేదు. కాళిదాసు కవితాత్మముందు ఆ సౌందర్య మహారాజ్యాల ముందు యివి ఏపాటివి? వీటిని లెక్కిస్తామా? అను కుంటాను. అట్లాగే విశ్వనాథ సత్యనారాయణగారు-వైకల్పిక రూపాలు వాడతాడు. అనీ, ఉపోత్ప్రేమల్ని వేస్తాడు అనీ-

'నీధమ్మిల్ల జటాగ్ర భాగములపై నీరాజనం బెత్తనీ' అని వ్రాశాడు. ధమ్మిల్లం ఏమిటీ? జటాగ్రభాగం ఏమిటీ? అనీ చూచు కుంటూ నాలిక కొరుకోడం నా చాతగాని పని. అంతేకాదు. ఎన్ని ఉపమానాలు వాడాడు? ఎన్ని ఉత్ప్రేక్షలు వాడాడు? ఎన్ని అర్థాంతర

న్యాసాలు? ఎన్ని కావ్యలింగాలు? ఎన్ని విదర్శనలు? ఎన్ని ప్రతి వస్తూపమలు? అవి లెక్కించడం గూడా నా తలకు మించినపనే. స్వర్గీయులు సోదరులు చిలుకూరి నారాయణరావుగారు నేడు వుంటే అట్టి మహామహులు ఇట్టి పనికి తగినవారు.

## ఉన్నత లక్ష్యం

ఏలక్ష్యంతో, కవితాయాత్ర ప్రారంభించారు? ఆ లక్ష్యశుద్ధి ఎంతదాకా నిలిచింది? ఆలక్ష్యం ఎంత ఉన్నతం?అనే నాయావ అంతా. ఈ అలంకారాలతో, ఎక్కడికి బారచాస్తున్నాడు? ఎంత ఆవరిస్తున్నాడూ? అనే చూచుకోడం నాకు చాతనైన పని. ఏం చెప్పాడు? ఎట్లా చెప్పాడు? అనే నాకు తహతహ. విశ్వనాధ సత్యనారాయణగారికి. జగద్గురు శ్రీ శంకరులందూ, భారతీ సంస్కృతి యందూ, భారతీయ సంస్కృతికి విరుద్ధంగా తెలుగుల సంస్కృతి యందూ పరమ ప్రామాణ్యం. ఆ దృష్టితోనే ఆయన దర్శిస్తాడు. అదే కావ్యరూపేణా సంతరిస్తాడు! అది జాతికి బలం కలిగించేదేగాని. మరోటీ మరోటీకాదు.

## మనిషి

విశ్వనాధ సత్యనారాయణగారు ఖరాఖండీ మనిషి. అయన్ను అర్థం చేసుకోడానికి, ఆయన చిన్ననాట జరిగినది, కొడాలి ఆంజనేయులుగారు చెప్పింది ఇక్కడ వ్రాస్తాను.

విశ్వనాధ సత్యనారాయణగారూ, కొడాలి ఆంజనేయులుగారూ జంటకవులు. అంతేకాదు, సత్యనారాయణగారి తండ్రి, ఆంజనేయులు గారి తండ్రీ స్నేహితులు. సత్యనారాయణగారూ, ఆంజనేయులుగారూ 'సత్యాంజనేయులు' అనే పేరుతో కవిత్వం వ్రాశారు. ఇద్దరూ సాహితీ సమితి సభ్యులు అయినారుగూడాను. సత్యనారాయణగారూ ఆంజనేయులుగారూ కలిసి నడిచి ప్రయాణం చేస్తున్నారు. ఇద్దరూ

ప్రాణ స్నేహితులు. జంటకవులు. మాట్లాడుకోవడంలో శ్రీనాధుడి ప్రసక్తి వచ్చింది.

"శ్రీనాధుడు ఓ గొప్పేమిటిపోదూ" అన్నారు సత్యనారాయణ గారు.

ఆంజనేయులుగారికి అది నచ్చలేదు. మాటా మాటా జరుగుతోంది. శ్రీ నాధునివైపు ఆంజనేయులుగారూ, ఆయన చెప్పింది ప్రత్యాఖ్యానంచేస్తూ సత్యనారాయణగారూనూ. కొడాలి ఆంజనేయులు గారికి కోపం వచ్చింది. చాచి, ఫెళ్లున లెంపకాయ కొట్టారు, సత్యనారాయణగార్ని. సత్యనారాయణగారు అదిరిపోయారు. ఆ దెబ్బకు కంట నీరూ, నిప్పులూ వస్తున్నయ్. వెంటనే స్థిమితపడ్డారు.

"ఆంజనేయులూ! నువ్వు కాబట్టి సరిపోయింది, బతికి పోయావ్!!" అన్నారు సత్యనారాయణగారు. ఇద్దరూ మౌనంగానే నడుస్తున్నారు. వాగు అడ్డం వచ్చింది. ఈ ఆంజనేయులుగారు ఆ వాగు దాటలేరు. సత్యనారాయణగారు, ఆంజనేయులుగారిని ఎత్తుకుని బిడ్డను అక్కున చేర్చుకున్నట్లుగా, ఆ వాగును దాటారు. అంతే.

స్నేహితులంటే ప్రాణం పెట్టగలిగినవాడు ఆయన. మనుష్యులయందు, మనుష్య హృదయాలమీదా అమోఘమైన విశ్వాసం, సాంప్రదాయికమైన ఆచార వ్యవహారాల మీద ముఖ్యంగా భారతీయ సంస్కృతిమీద, అచంచలమైన తాత్పర్యం కలవాడాయన. కనుకనే, ఎవరు ఏమాత్రం వైదొలగినా, కరవొస్తాడు. కవిగా "నా మాతృభాష నానా దుష్ట భాషల ఔద్ధత్యమును తల నవధరిస్తోందో" అని వాపోతాడు. వాపోయేటట్టు తన పఠితలను చేస్తాడు. తూగరు కన్నెల చుక్క కన్నెలు తొంగిచూడడమూ, వేదకాలపు నాటి ముత్తయిదువలూ అవీ మనకు చూపిస్తాడు. సత్యనారాయణగారి సృష్టి ఇంద్రజాలంలో నిలిచిపోయి, అదే లోకంగా అవుతాం మనం.

మరొక్క విషయం. 'అనార్కలీ' అనే సత్యనారాయణగారి నాటికలో ఎప్పుడూ ఈ విషయం నన్ను చకితుణ్ని చేస్తుంది.

"నాసాంతే కృతదృష్టి రవ్యవహిత భ్రూః వ్యాఘ్రచర్మాసనే ।
విష్టామర్దిత బాహ్యవస్తు విషయా యాబ్రిహ్మ రంధ్రోద్గతా ।
తేజోభిః ఛృళ మైందవైః ప్రచలితైః వ్యోమ్ని స్థితే వాంశుభిః ।
సర్గస్థిత్యవతా రహేతురవతాత్ శైవార్ధ సీమంతినీ."

ఇది అనార్కలీలో నాంది. ఈ నాంది వ్రాయడం ఒక్క విశ్వనాథ సత్యనారాయణకే చాతనైంది. "అనార్కలీ"లో సలీమును యోగిగా వ్యాఖ్యానించాడు సత్యనారాయణగారు. అతనిలోని సుకుమార భావములను చిలుకలుగా, కోకిలలుగా, విభావ సామాగ్రిద్వారా చెప్పించాడు. ఇదంతా గొప్ప సృష్టి ఇదేదీ చాలదన్నట్లుగా ఆ నాంది:

నాయకుణ్ణి ఎప్పుడు యోగిగా తీర్చిదిద్దాడో, అప్పుడే ముక్తి కాంత అవసరము కలిగింది. మోక్ష ప్రదాత్రి పార్వతి. కనుకనే తురక నాటకం అనేది ఏ కోశాన లేదుగనకనే శైవార్ధ సీమంతిని రక్షించాలి అని నాంది వ్రాసుకున్నాడు ఆయన. మరో మాటగూడా వ్రాయవిదే ఆగలేను. అనార్కలీలోదే మరో పద్యం.

శైవాంశంబని చెప్పనాః దశ
దశ శిరస్సంత్రాస చండాకృతిన్,
శ్రీ వాయూద్భవు డందునా
అనిలు శాసించెన్ మహాయోగియై
పోవో కేసరి కోతికూనవన నా
ముక్తేంద్రియభ్రాంతు, నన్నావే
శించిన రామచంద్ర పదపద్మా
ధీన చేతస్కుడివిన్

సత్యనారాయణగారు వ్రాస్తున్నది అనార్కలీ. అనార్కలీ నాయకుడు సలీం, జహాంగీర్. స్థూలంగా చూస్తే - రసాభాసం. బానిసను, చక్రవర్తి కుమారుడు ప్రేమించకూడదు అన్న ఉదాత్త భావం తప్ప మరొకటి కనిపించదు. మిగిలినది అంతా వ్యర్థకరమే కథలో. ఇక్కడ కవి ప్రతిభ, విశ్వనాథ సత్యనారాయణగారి అంతర్దృష్టి జన్మలను భేదించుకుని పోయింది.

జ్ఞానుల దయవల్ల కొందరి కొందరి జన్మలు తెలిసినై. నమ్మడం కష్టం కావచ్చు. కాని, ఆ జ్ఞానులు అహంకారాన్ని పడగొట్టి దగ్ధం చేసికున్నవారు. మనకుండే పరిమితులూ, రాగ ద్వేషాలూ ఏ మాత్రమూ లేనివారు. జ్ఞానుల వాణిని నేను నమ్మాను. నేను నమ్మిందే వ్రాస్తున్నాను.

జహాంగీర్ ఎవరో కాదు. మన పురాణాలలోని హనుమంతుడే. అక్బర్ ఎవరో కాదు. రామాయణ నాయకుడు శ్రీరాముడు, విష్ణువే. ఇది తెలిశాక సత్యనారాయణగారి పద్యం ఎంత గొప్పగా వెలుగు తుందో మరి!

## 'దేశికుడు'

విశ్వనాథ సత్యనారాయణగారు ఉత్తమ దేశికుడుగా రాణ కెక్కాడు. ఆవిష్టుడై (ఆయనకు ఆవేశం కలుగనిదెప్పుడు?) ఆయన పాఠాలు చెప్పుచుండగా ఆయన పాదాల సన్నిధిని కూర్చుని పాఠం చదువుకొన్నవాళ్ళదే అదృష్టము. జన్మజన్మాలకు మరుపురాదు.

విశ్వనాథ సత్యనారాయణగారు ఉత్తమోత్తములగు గురువు లకు శిష్యుడయినాడు. చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికి, శ్రీవిమలానంద భారతీ స్వాముల [కె. టి. రామారావుగారు] వారికి, జగద్గురు శ్రీ

కల్యాణానంద భారతీ మహాంతాచార్య స్వాములవారికి విశ్వనాథ సత్యనారాయణ శిష్యుడు. మళ్ళీ గురుమూర్తి అయినాడు.

భాష, భాషలో సొగసులు, శిల్పం, శిల్పంలో చమత్కారాలు హృదయభాండారంలోని మణులు. ఇలా ఎన్నెన్నో రత్నాలను శిష్యులకు యిచ్చాడు. అసలు ఇంతకూ గురువుచేసేది అంతే. గురువు, మనసొమ్మును మనకు ఇస్తాడు. కాని ఆ ట్రిప్టీ ఇవ్వనిదే మన సొమ్మైనా సరే మనకు రాదు. విశ్వనాథ సత్యనారాయణగారు ఉత్తమ గురువుగా శిష్యుల హృదయ నీరాజనాన్ని సర్వదా సర్వథా అనుభవిస్తూనే ఉన్నాడు. కాని చాలదు. గురూత్తముడు కావాలి.

భాషద్వారా ఈశ్వరుని చెప్పేదిమారి, నేరుగా ఈశ్వరునే చెప్పాలి. ఆజానుజ్జ్వల బాహువు, కాషాయరమ్య వల్కల హుతాశన శిఖా సంపిహితాశ్వత్థ సామిధేని, సత్యనారాయణ భారతి వ్యాఘ్రాజినంమీద కూర్చునేది ఎప్పుడో!

విశ్వనాథ భారతి పాదుకలను కన్నులకు అద్దుకుని-

"భోగమాత్ర సామ్యలింగాచ్చ. అనావృత్తి శ్శబ్దాదనావృత్తి శ్శబ్దాత్" అర్థం చెప్పించుకుని ప్రస్థానత్రయ శాంతిచేసే అదృష్టం ఎవరికో, ఎవరికో! ఎప్పుడో, ఎప్పుడో!! గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు చ్ఛిన్నసంశయాః!! ఈఅదృష్టం ఎవరికో, ఎప్పుడో!

## ఒక్క మనవి

కవిగా, కవీశ్వరుడుగా, పండితుడుగా విశ్వనాథసత్యనారాయణగారు అమోఘమూ అనితర సాధ్యమూ అయిన పనిచేశారు. ఇంకా

చేస్తున్నారు. చేస్తారు. ఆ మహాకవి చెప్పింది చదివి, మననం చేసి, లాభంపొందడం, ఆనందించడం ఆయనకు నిజమైన గౌరవం. ఆ పండితుడు చేసిన కృషిలో ఏ కొంతైనా చెయ్యడం ఆయన పట్ల గౌరవాన్ని భక్తి ప్రపత్తులనూ చూపించడం, ఆయన్ను మార్గదర్శిగా వరించడం ఆయనకు అఖండమైన సన్మానం. అంతేకాని, ఏ 'కవి మహాధ్యక్ష' అనో 'సాహిత్య మహాధ్యక్ష' అనో బిరుదం యిచ్చి ఆయన్ను మిత్రులూ శత్రులుగా గూడా న్యూనతపరచ వద్దని ప్రార్థిస్తున్నాను. ఎందుకంటే ఆయనకు బిరుదేమిటి? అసందర్భం. రేపు ఆయన పేరే, "విశ్వనాథ సత్యనారాయణ" అన్నదే బిరుదం కాబోతోంది!! అది అంతే.

[ ఆంధ్రపత్రిక — జనవరి 14, 1956 ]



# శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు

— మల్లాది రామకృష్ణశాస్త్రి

"ఈ కవితా విశ్వానికి అంతా నిన్ను నాథుణ్ణిగా చేసాను. సరే కాదూ...." అని ఆదిమూర్తి ఆ పసికందును లాలించి ఉంటాడు.... సత్యమే.... సవిత్రృమండల మధ్యవర్తిలాగా.... ఆ దీవన బలాన.... సాక్షాత్కరించి ఉంటాడు: శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు....నవీనులందరిలో....నిజంగా అన్వర్థాభిధానులు

కవికి వచ్చే పేరు ప్రతిష్ఠలన్నీ, చాలా చిన్నతనంలోనే సంపాదించుకున్నారు శ్రీ సత్యనారాయణగారు. అప్పటి ఆయన కవిత్వం.... నవనాగరిక విలాసాలలపడని ఆ "ముగ్ధమోహన కళ్యాణమూర్తి" అందర్నీ పరవశుల్ని చేసేసింది.... అలాంటి చక్కని కవి.... అంత చక్కగా.... "పచ్చితేనియల కాలవలను ప్రవహింపజేసే" ఆ మనీషి.... పద్యాలు వ్రాయుచున్నమాట "లోకవార్త" అయిపోవడంలో ఆశ్చర్యమేమున్నది. కాని అందరికీ తెలిసిన చాలా కాలానికి, కవి ఆ సంగతి తనకూ తెలుసునని పద్యరూపాన ప్రచురించినా.... ఆ రచన మునుముందు సంకల్పించి రచించబోయే మహాకావ్యాలకి మంగళాచరణ రూపాన వున్నది. తిరస్కారము ఆ కవిత్వ లక్షణాల్లో ఒకటి కనుక విశేషమేమిలేదు. అందులో శ్రీ సత్యనారాయణగారి వంటి కవి చెప్పుకొన్నా ఆ ప్రగల్భోక్తుల్లో దూషకతా బీజం లేదని, సహృదయము అనుకునేందుకు అట్టే అవకాశం కనబడటంలేదు. బహుశః సంస్కారారంభమందు శైశవానంతరమూ వదలకుండా వున్న చాపల్యమే స్వోత్కర్షకూ

"కళ్ళ అద్దాల తత్వవేత్తలొక కొందరి"ని గురించి అసంబద్ధ కథా ప్రసంగానికి పురికొల్పింది. అయినా అది మన్నించ తగినది.

చాలా వరకు వాచ్యానతిశాయి వ్యంగ్యబహుళమైనా చక్కని ఆఖ్యాయిక "ఏకవీర" కథ, కల్పనలు.... అన్నీ చాలా క్రొత్తగా ఈనాటికి కనబడుతుంటాయి. వచనంలో వ్రాయాలని అనుకున్నా, అడుగడుగుకీ ఆ ఛందోమూర్తి గమనామతోధం కలగజేయడంచేత భాషకు అలసగమన మలవడకపోయినా మోయలేని తెలుగుతనాన్ని విధిలేక భరిస్తున్నది. అంత కవిత్వాన్ని వీలయినంతవరకూ తేట తెనుగున కూర్చాలని ప్రయత్నించడం కవికి కూడని పని. అయినా శ్రీ సత్యనారాయణగారు ఆ విషయంలోను జయం పొందినారు. "నవలా రచయితగా"గా ఆయన గొప్పతనాన్ని కనిపెట్టవలెనంటే తెలుగులో వుండే గొప్ప నవలల్లో ఒకటి చదవాలంటే "ఏకవీర" మనసుకెక్కుతుంది. ఆ రసాభినివేశంలో ఆ రసావేశంలో "అంతరాత్మను" మరచిపోనివెవ్వరు?

"కిన్నెరసాని పాటలు" తెలుగుభాషలో అమూల్యాలంకారాలు. అన్ని విధాల అంత ఉత్తమంగా వున్న ఆ పాటలతో పోల్చిచూసుకో దగ్గవి ఇటీవలి వాళ్ళు రచించినవి ఏవీలేవు. ఆ సామర్థ్యముకూడా చాలా అరుదు. శ్రీ సత్యనారాయణగారు గీతికా రూపాన తమలో వున్న సంగీతాన్ని భాషావకుంఠనంతో బయటకురానిచ్చారు. సరస్వతీ కలభాషిణీత్వం సార్థకమే కాకుండా కచ్ఛపి వినాదం కూడా తోడొన గూడినట్లుగా వుంటుంది. శ్రీ సత్యనారాయణగారి పాటలు విన్నప్పు డల్లాను సంగీతం తొణికిపోతూంటుంది. మేంఖ కవి కావ్యంలో రసంలాగా "లేత బుర్రలు కొక్కిరిస్తే" అతగాళ్ళతో నేమనే దిలాసాతో "తాత తాతలనాటి కథలూ త్రివ్విపోస్తాన"నే కవి మొదట సంకల్పించాడు - "తొగరు కన్నుల చుక్క కన్నెలు" తొంగి చూస్తే ఎంతబాగుంటుందో-ఆ చక్కదనాన్ని ముందుచూసి అంతచక్కగానూ

చెప్పగలిగాడు - "చిలుకరాజు పెండ్లి" చాలా బాగానే జరిగింది. గిరికుమారుడు ప్రేమగీతాలు అల్లడం మానివేసిన చాలాకాలానికి కాని, ఆ పెండ్లిలో తీరని ముచ్చట కిన్నెరసాని ప్రణయగాధలో ఆ కోరిక సఫలమైంది. ఓహో కిన్నెరసాని! ఓహో కిన్నెరసాని! అని ఆలివశాత్ముడు కిన్నెర మగడు పేర్కొని ఆక్రోశించడం నిజంగా, భరించలేనంత బాగా వున్నది. ఇక ఆ పాటలన్నీ ఓహో! ఎంత బాగుంటాయి.

బంగారానికి పరిమళంకన్న కవికి పాండిత్యం అబ్బటం చాలా సులభం-భావగత అర్థ ప్రచురణా సౌలభ్యం కలుగజేసేది భాష-కాని భాష యిముడ్చుకోలేని భావాలున్న కవికి ఎప్పుడూ చిక్కు ఉండనే వున్నది - 'అనార్కలి' అభినయం కోసం వ్రాసినదికాదు అయినా మురారి మొదలయిన వాళ్ళ నాటకాలకి వున్న ప్రాశస్త్యం చెప్పడానికి కూడా ఆ మాదిరి వాటితో చేర్చడానికి సందేహించాలిసి వస్తూంది- శ్రీ సత్యనారాయణగారు నాటక రూపాన వెలయించిన ఆ మహోన్నత భావాలు ఆ భాషలో ఎవరికి అర్థం ఓ పట్టున కావడం కష్టం. అనార్కలిలో నాయికా నాయకులు మిగతా వాళ్ళందరూ కూడా నైరోబీ ప్రాంతీయ జులూ, యోధుల చమత్కారాలతో ఆ అలంకారాలతో మాట్లాడుతారు. ఒకరిమాట ఒకరికి తెలిసినా వాళ్ళేం మాట్లాడుకుంటు న్నారో కథ ఎలా జరుగుతుందో అది ఆదుర్దా పడేవాళ్ళకు ఏమీ గోచరించదు. మొత్తము మీద భావ కవిత్వాన్ని మించిన భావ కవిత్వం రూపకమంతా నిండిపోయింది కనుక 'సానబదీరిన జాతిరత్నము కావడానికి ప్రయత్నించి ఆగిపోయింది - 'అనార్కలి'.

కీచక సంహారంతో కీర్తి తెచ్చుకున్నది 'నర్తనశాల' శ్రీ సత్యనారాయణగారు నాటక కవిగాకూడా గొప్ప గౌరవం తెచ్చుకోగల రని నర్తనశాల నిదర్శన మవుతూంది. భాసకృతులతో సమానంగా ఆదరించడానికి వీలులేక పోయినా భారత కధమీద ఆధారపడివున్న

తెలుగు నాటకాల్లో అత్యున్నత స్థానం ఆక్రమిస్తూన్నది. 'నర్తన శాల'లో ద్రౌపది వ్యాసకల్పనకు మెరుగు. పాంచాలిని, ఆ వీరరసో ద్రేకురాలిని అంత బాగా ఇంతవరకూ తెలుగులో ఏ నాటక కవీ చూపించలేకపోయినాడు. పారుపల్లి వంటి ఉత్తమ నటుడు ఆ భూమి కను ధరించి అభినయించగా చూసినప్పుడే శ్రీ సత్యనారాయణగారి కల్పనలో వుండే గొప్పతనం అర్థమవుతుంది. 'నర్తనశాల'లో శ్రీ సత్యనారాయణగారి పాండిత్యానికి అనేక తావుల నిదర్శనాలున్నవి. ఔచిత్యానికీ ఆయనకున్న భాషాభినివేశానికీ తార్కాణం. సుధేష్ణకు శిరోవేదన శమించడం కోసం సైరంధ్రి ఎత్తుకున్న 'స్ఫారీభవత్' అనే మనోహర రచన, చదివిన తరువాత ప్రదర్శించగా చూడటం ఎన్నడో అని ఉవ్విళ్లూరించే నాటకం నర్తనశాల.

కాని 'వేనరాజు' శ్రీ సత్యనారాయణగారి నాటకాల్లోకల్లా మొదటిదిగా ఎన్నుతున్నారు – నాటక కవిచక్రవర్తుల సరసను చేర్చ దగిన అర్హతా, ఇబ్సెన్ మొదలైన మహామహులతో సమంగా గౌర వించతగిన యోగ్యతా శ్రీ సత్యనారాయణగారికికూడా లభించే అవ కాశమున్నదని వారి నాటకాలు సాక్ష్యమిస్తున్నాయి అని కొందరి అభిప్రాయములు.

'ఆంధ్రప్రశస్తి' నీ ఆంధ్ర పౌరుషాన్ని ఆంధ్రుల కోసం ఆంధ్రాన్ని చాలా వరకూ కప్పివేస్తున్న సంస్కృత నిబంధనలతో మొదట జయగీతికా రూపాన గానం చేసింది శ్రీ సత్యనారాయణగారు రససిద్ధి అయిన తరువాత కూడా తేట తెనుగున మనోహరమైన క్రమాన మహోన్నత భావాల్ని కూర్చగలిగిన ప్రజ్ఞ అలవడిన తరు వాత కూడా గీర్వాణి మీద ఆదరాతిశయాన సంస్కృత జటిలంగా కృతులు రచియించడం మానివేయడం మంచిది. సత్యనారాయణ గారి ఇటీవలి రచనల్లో తెలుగుతేనేలసోనలు' జడివారు తుంటాయి. కవిత్వంలోకి తీసుకువచ్చిన 'ఉప బృంహణ విధానానికి' అయనే

ఏకచ్ఛత్రాధిపత్యం వహిస్తున్నాడు ఋనాటికినీ. కాని, ఆ అనుభ
వహ్నిం పాఠ్యం మరచిపోయి, ఆయన నిజమైన తెలుగు ఆలోచనలలో
"ఏ ఎత్తుసంజెలో నెలమి పల్లవరాజ రమణులు కాళ్ళ పారాణి విడిరో"
అని ఊహించుకుని కవిత్వరూపాన ఆనందించినప్పుడు అందరూ
కూడా సమానంగా సంతోషించ వచ్చును.

శ్రీరామచంద్ర మహాకవి చెప్పినట్లు రసాల పల్లవాభిషేవణోల్లి
సత్కషాయ కోకిలాంగనా రవేందిరా సహోదరిగా ప్రకాశించే
యోగ్యత శ్రీ సత్యనారాయణగారి భారతికున్నది ఈ సదవకాశమైనా
ఉండటంచేత.

కవిగానూ వీర కవిగానూ పత్రికా వ్యాపార నిర్వహణ ధురీ
ణుడుగా మా శ్రీసత్యనారాయణగారు చేయుచున్న భాషాసేవ చాలా
ప్రశంసనీయమే అనవచ్చును-కాదూ?

శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రిగారు 10-12-1932న వ్రాసిన
ఈ వ్యాసాన్ని శ్రీ వుప్పులూరి కాళిదాసుగారు తమ 1967 దీపావళి
ఆనందవాణికి అనుబంధముగా ప్రచురించిన శ్రీ మల్లాది సాహిత్య
సంచికలో ముద్రించారు. ఇది పునర్ముద్రణము.



# మహా ప్రతిభుడు

—డాక్టర్ గిడుగు సీతాపతి

కవి సమ్రాట్ కళా ప్రపూర్ణ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి పేరు చెప్పగానే నా మనస్సులో శబలీకృతభావాలు కలుగుతూ వుంటవి.

తానీంద్రియాణి సకలాని తదేవనామ
సా బుద్ధి రప్రతిహతా వచనం తదేవ
అర్థోష్మణా విరహితః పురుషః సఏవ
త్వన్యః క్షణేన భవతీతి విచిత్రమేతత్.
అనే శ్లోకం జ్ఞప్తికి వస్తూ ఉంటుంది.

వీరితోడి పరిచయం నాకు సుమారు నలభై యేండ్లక్రిందటనే కలిగింది, పట్టుమని పది దినములయినా వీరితో కలిసి నేనెన్నడూ ఎక్కడా నివసించకపోయినా పెక్కుసార్లు వీరిని కలుసుకోవడం ముచ్చటించడం జరిగింది. అందువలన స్థాలీపులాకన్యాయంగానైనా వీరి ప్రతిభ, వీరి శీలము, సద్గుణములు, లోపాలు నేను గ్రహించ గలిగినాను. లోపాలుకూడానా? అంటారేమో? ఏం? వీరూ మానవ మాత్రులే. లోపాలు లేని వారెవరు? "ఉర్విజనులకెల్ల నుండుఁదప్పు" లన్నాడు వేమన. అంతేకాక, లోపాలని నేననుకొంటూ వున్నవి. సుగుణాలే అని కొందరనవచ్చు. అయితే నాకు సంతోషమే. అదికాక పరిశీలనలోనో నా అభిప్రాయంలోనో లోపం కావచ్చు ననుకొంటాను.

ఆంధ్రచరిత్ర పరిశోధకమండలివారు ఇప్పుడు రాజమహేంద్ర

వరంలో పుట్టిననాటినుండిన్ని శ్రీ రాళ్ళబండి సుబ్బారావుగారిపేర నంకితమైయున్న సంస్థా ప్రతిష్ఠాపక వర్గమువారు పర్లాకిమిడికి 20 మైళ్ల దూరాన వంశధారా నదీ తీరమందుగల ముఖలింగ క్షేత్రమందు నలభై యేండ్ల క్రింద ఒక చారిత్రిక మహాసభ సమావేశపరచారు. అది పర్లాకిమిడి మహారాజావారి ఆతిథ్యం క్రింద మూడు దినాలు జరిగింది. వసతి భోజన సభాసమావేశాది కార్యక్రమాల భారమంతా నా కప్పగించడం వలన నాటి ముచ్చట్లు నాకు జ్ఞప్తి యందున్నవి. ఒక నాటి రాత్రి భోజనానంతరం అయిన తర్వాత కావ్యపఠన కాలక్షేపం చేదామన్న కోరిక కొందరికి కలిగింది. అప్పుడక్కడ నున్నవారిలో కవులని పేరుపొందిన వారిలో ఇద్దరే ముఖ్యులుగా కనబడ్డారు. వీరున్ను, త్రిపురాన సూర్యప్రసాదరావుగారున్ను, అంతేకాక కాంతిగల దీపాలు లేని లోపంవలన గ్రంథం చూచి చదవడానికి వీలులేని అవస్థ వచ్చి పడినది. అందుచేత, గ్రంథాపేక్షలేక స్మృతి పథమందు తమ పద్యములున్నవారే ఈ కావ్యపఠనం చేయవలసి వచ్చినది. వీరిద్దరూ అప్పటికే నూర్లకొలదిగా పద్యములు రచించినవారు; ఇద్దరూ సమానమైన ధారణ గలవారు. అందుచేత వీరిద్దరే ఆ కావ్యపఠనం కావించినవారయినారు. వేడుకతోనే పోటీగా వీరు తమపద్యాలు చదవడం ఒకరు తమ పద్యం చదవడం పూర్తికాగానే వెంటనే ఒక నిమిషమయినా ఆగకుండా రెండవవారు తమ పద్యం చదవడానికి మొదలుపెట్టేవారు. ఇది శ్రోతలకు బ్రహ్మానందం కలిగించింది. రాత్రి 10 గంటల నుండి వేకువజాము 5 గంటలవరకూ ఈ వినోద కాలక్షేపం జరిగింది. మధ్యమధ్య కాఫీ, టీ, మంచినీళ్ళు త్రాగడానికి కాస్త విరామం ఉండకపోలేదు. రానురాను చదివిన పద్యం చదవకూడదు గనుక తమ స్మృతిలో ఉన్న పద్యాలన్నీ అయిపోతే ఓడిపోవలసి వస్తుందేమో అన్న భయం చేత కాబోలు ఇద్దరూ తమ పద్యాలు రాగాలతో పాడడం మొదలుపెట్టారు. ఇద్దరూ పాడగలవారే. ఇద్దరి కంఠం శ్రావ్యమయినదే. అప్పుడొక ముచ్చట జరిగింది. సత్యనారా

యణగారు తమ పద్యంలో ఒకచోట "చిఱునగెన్" అని ప్రయోగించారు, అది అపప్రయోగమని ప్రసాదరావుగారు ఆక్షేపించారు. "ఏం? ఎందుచేత?" అన్నారు విశ్వనాథ సత్యనారాయణగారు. "లాక్షణిక ప్రసిద్ధమా?" అన్నారు ప్రసాదరావుగారు. ఏ వ్యాకరణంలో ఇది లక్షణ విరుద్ధమని ఏ లాక్షణికుం డన్నాడో చెప్పండి "అన్నారు సత్యనారాయణగారు." ఇది లక్షణ సమ్మతమే అని మీరు ప్రమాణము చూపగలరా?" అన్నారు ప్రసాదరావుగారు. ఇక్కడ రహస్య విషయం ఏమంటే-ఈ ఇద్దరిలో ఎవరూ వ్యాకరణం శ్రద్ధతో చదువుకొన్నవారుకారు. అందుచేత ఈ ప్రయోగం దుష్టమన్నవారు మీరు కనుక ఇందులో గల దోషము సప్రమాణంగా నిరూపించవలసిన భారం మీరు వహించాలి. దుష్టమని మీరు నిరూపిస్తే అందుకు సమాధానం నేను ఇవ్వవలసి ఉంటుందన్నారు సత్యనారాయణగారు. "పోనీండి; ప్రయోగమూలం వ్యాకరణం అన్నారు గనుక మీ ప్రయోగమునకు ఆధారంకాగల కవి ప్రయోగమున్నదా?" అన్నారు ప్రసాదరావుగారు. "మీరు నేను కవులము కామా? మన ప్రయోగాలే వ్యాకరణాల కాధారమవుతవి. "సతాంహి సందేహపదేషువస్తుషుప్రమాణమంతః కరణ ప్రవృత్తయః" అన్నాడు కాళిదాసు సరే; దానికేం? ప్రస్తుత మనుసరామ "అని ఒకపద్యం అందుకొని చిఱునవ్వుతో చదువుతున్నానా?" అంటూ రాగవరుసను చదివినారు. దానితో అయిదు నిమిషాలు వాదనవలన కలిగిన తామస వాతావరణం విచ్చిపోయి ఆనందవికాసం కలిగింది. మరి కొంతసేపటికి "4 గంటలు కావచ్చింది ఇకను పడుకొందాం రెండుగంటల సేపయినా నిద్ర లేకపోతే రేపేమి పని చేయగల" మన్నారు శ్రోతలలో చాలామంది.

ఆ మరునాడు విశ్వనాథ సత్యనారాయణగారి మాటలలో అహంభావ లక్షణమున్నదని కొందరూ, వికార లక్షణమున్నదని కొందరూ, గుసగుస లాడినారు. నేను మాత్రం వారు ప్రదర్శించినది ఆత్మ ప్రత్యయ లక్షణ మన్నాను. "మూఢః పరప్రత్యయనేయ

బుద్ధిః" అనే వాక్యం వినిపించాను. కొందరు నాతో ఏకీభవించారు. కాని, ఇటీవల సత్యనారాయణగారి ఆత్మప్రత్యయ లక్షణము 'అతి'గా పరిణమించింది. "ఇదేమి? వీరి సమ్మాననసంచికకు వ్యాసం వ్రాస్తూ వీరిని విమర్శించడానికి పూనుకొన్నావు?" అని కొందరనవచ్చును. దానికి నా సమాధానము మనవి చేస్తున్నాను. లోకంలో ఎందరులేరు? వారినందరినీ విమర్శించడానికి పూనుకొంటానా? సత్యనారాయణగారి లోను వారి రచనలోను ఒక ప్రత్యేకత ఒక ఘనత ఉండడంవల్లనే వారు విమర్శకు పాత్రులయినారు. వారిలో ఎవరెన్ని లోపాలు చూపించినా "వెలయంగ నశ్వమేధంబులు, 'అనేపద్యంలో' సత్యము వలనన ములుసూపు గౌరవంబున బేర్మిన్" అన్నట్లు వీరి సద్గుణములు, వీరి ఘనత, కవిసామ్రాట్ కళాప్రపూర్ణ ఇత్యాది కీర్తి చిహ్నములకుగల అర్హత ఎక్కువగా తూగగలవు. కనుక వీరి స్వభావంలో గల లోపాలు చూపించినంత మాత్రాన - కలిగితే మేలు కలుగవచ్చునేమో కాని కీడు కలుగదు.

ఈ వ్యాసంలో మొదటనే ఎత్తిచూపిన "తానీంద్రియాణి-" అనే శ్లోకంలోగల ప్రధానలక్షణం వీరిపట్ల పూర్తిగానే అన్వయిస్తుంది. రెండేండ్ల క్రిందట వీరు కృష్ణాపత్రికలో ప్రకటించిన "విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు" అనే వ్యాసావళి చదువుతూ ఉంటే వీరిట్టి వ్రాతలకు దిగబడ్డారేమి? అనిపించింది. దేశభక్తి మాతృభాషాభిమానం ఎంత ఎక్కువగా ప్రదర్శించినా "నదోషాయ భవతి" అని సమర్థించుకో గలము. మాతృభాషా సాహిత్యముల ఘనత ఇతర భాషలను సాహిత్యములను నిరసించడమువలన ఎక్కువ కాదుకదా? వీరు ఆంగ్లభాషలోగల నవలలు నేడున్ను ఎక్కువగానే చదువుతూ ఉంటారని విన్నాను. ఇట్టి నవలలు చదివేకదా వీరు తమ నవలలు రచించి బహుమతులుకూడా పొందగలిగినారు. ఆంగ్లభాషాభిమానంగల వారిని ఎందుకు నిరసిస్తారో బోధపడదు. షేక్స్పియరు మహాకవి అంటే వీరు సహించలేకుండా ఉన్నారు. షేక్స్పియరు మనకంటె గొప్ప

వాడు కాదన్నారని తిరుపతిలో జరిగిన సభల వార్తల తెలియజేసిన వార్తాపత్రికలలో ప్రకటిత మయినది. తాము వ్యవహారిక భాషలో తెలుగురచన సాగిస్తూ వ్యావహారిక భాషలో గ్రంథరచన సాగించడం వలన తెలుగుభాష క్షీణిస్తున్నదని వీరన్నట్లుగా కూడ ప్రకటితమయినది. ఈ వార్త వాస్తవంకాదని ఎవరయినా తెలియజేస్తే నేను చాలా సంతోషిస్తాను.

వీరి స్వభావంలో ఒక లోపం కొందరు చూపిస్తారు. వారు చూపించేది నిజమేకాని, అది లోపంకాదు సద్గుణమే అంటాను. మనసులో తమకు కలిగిన అభిప్రాయము ముక్కుకు సూటిగా వీరు వ్యక్త పరుస్తారు. మనసులో ఒకమాట పైకి మరియొకమాట చెప్పరు వీరికి లౌక్యం అంటే కపటం తెలియదు. మా తండ్రిగారికీ ఈ గుణముండేది. ఇతరులేమనుకొంటారో ఎంత బాధపడతారో అనే చింత వీరిద్దరిలో ఎవరికీలేదు. ఈ గుణం నాకు లేకపోయిన నేను మెచ్చుకొంటాను. కాని దీనివలన వీరికే ఒకప్పుడు బాధకలుగుతుందని చెప్పగలను. కొంతకాలం క్రిందట విజయవాడ రేడియో ప్రసంగాలలో ఒకసారి సత్యనారాయణగారు పాత్రికేయుల వలన తెలుగుభాష చెడిపోతున్నదన్నారు. వీరి ప్రసంగం ఒక పెద్ద తీవ్రమయిన సంక్షోభాన్ని కలిగించింది. అల్పులచేతను వీరిని దూషింపజేయడం కూడా జరిగింది. ఇంత జరిగినా సత్యనారాయణగారు లోలోపల ఏమైన బాధపడ్డారో లేదో కాని – పైకి మాత్రం కొస్తయినా చలించలేదు. వీరు వాస్తవంగా ధీరులని మెచ్చుకొన్నాను.

ఒకొక్కప్పుడు వీరు 'మురారేస్తృతీయః పంథా' అన్నట్లు మాటలాడుతారు. పద్యం చదవగానే విన్నవారికి సులువుగా బోధపడేటట్లుండాలంటే ఎందుకు సులువుగా బోధపడాలి? క్లిష్టంగా రచితమైతే అది తెలుసుకోగల శక్తి వినేవారు అలవరచుకోవాలంటారు. వీరి రచనలు భిన్నమార్గాలలో సాగినవి. ఒకే కావ్యంలోగల పద్యాలేకాదు ఒకే పద్యంలో ఉన్న చరణాలు కూడా ఎగుడు దిగుడు నడకలో

ఉంటవి. కొన్ని ద్రాక్షాపాకంలోను, కదళీపాకంలోను కొన్ని నారికేళ పాకంలోను, మరికొన్ని పాషాణపాకంలోను రచితములయినవి. ఇది వీరి ప్రత్యేకత.

వీరి రచనలలో ఎవరెన్ని లోపాలు చూపించినా వీరి ప్రతిభ అన్ని రచనలలోను కనబడుతూనే ఉంటుంది. గ్రంథ బాహుళ్యమును బట్టి రచయిత ఘనత ఉండదన్నమాట నిజమే అయినా రచనలో కవికిగల బహుముఖచతురతను, సంస్కృతిని పాండిత్యమును తెలుసుకోగలము. పద్యకావ్యములు మాత్రమేకాదు. నవల, నాటకము, కథ మొదలయిన సాహిత్య శాఖలన్నిటను వీరు రచనసాగించి కృతకృత్యులైనారు. వాస్తవంగా కవిసమ్రాట్, కళాప్రవీణ బిరుదులకు సన్మానాలు పొందుటకు అర్హత సంపాదించుకొన్నారు. వీరి పేరు, వీరి రచనలు–అన్నీ కాకపోయినా కొన్ని అయినా చిరస్థాయిగా ఉండగలవు. వీరి రచనలలో ఎక్కువ ప్రఖ్యాతి పొందినది వీరి రామాయణ కల్పవృక్షము, దీనికి కేంద్ర సాహిత్య అకాడమీవారు బహుమతి ఈయవలసి యుండెను. కాని, వారు పెట్టుకొన్న నియమాల నతిక్రమించుట వలన ఈయలేదు. అయితేనేమి? దీని మూలంగా వీరి మధ్యాక్కరలు ఫలించి వీరికి తృప్తి కలిగించినవి. ఈ రామాయణ కల్పవృక్షమువంటి మహాకావ్యము మరొక్కటి మహాభారత కామధేనువనే పేరున వీరు రచింతురుగాక! అందుకు తగిన ఆయురారోగ్య భాగ్యభోగ్యములు వీరికి భగవంతుడు అనుగ్రహించునుగాక!

సత్యనారాయణగారి గురించి మరొక్క విషయం తెలియజేసి నా వ్యాసం పూర్తి చేస్తున్నాను. వీరు అశ్రితజన పక్షపాతం చూపిస్తారు. ఇది యొక దోషమైతే ఈ దోషం భగవంతునికి కూడా ఆరోపించవలసి వస్తుంది. లోగడ తమకు అపకారంచేసి తమ్ము నిందించినవారే అయినా తమ్ము ఆశ్రయించితేచాలు; వీరు వారిచర్యను మరచి, మరపురానిదైతే క్షమించి వారికి ఉపకారంచేసే ఉదారులు కాగలరు.

# గ్రంథం చదవడమెట్లా?

-శ్రీ చింతా దీక్షితులు

కొందరు మాట్లాడుతుంటే మనం ఉపన్యాసకులతో ఐక్యం అయిపోతాం. ఆయనతోపాటు నవ్వుతాం, మునుగుతాం, తేల్తాం. మనకేమీ తెలియదు.

విశ్వనాథ సత్యనారాయణగారు మాట్లాడుతుంటే అట్లాగాదు. ముక్కుకు తాడుపోసి లాక్కొని వెడుతున్నట్లుంటుంది. ఆయన చెప్తుంటే వినటమే మన వంతల్లా. అంతే, నోరెత్తటానికి వీలుకాదు.

ఆయన ఆముదం తాగమంటే గటుక్కున తాగాలిసిందే!

అట్లా ఆయన మాట్లాడుతున్నంతసేపూ మనలను బావిసలను చేస్తాడు.

అరకకు కట్టి దున్నిస్తాడు, జట్కాకు కట్టి తోల్తాడు.

తోలుబొమ్మలు లాగు ఆడిస్తాడు.

మనకు తెలుసు ఆయన అట్లా చేస్తున్నాడని, అందుకని మధ్య మధ్య తిరగబడి అడుగుతుంటాం, 'ఏం? ఎందుకు అట్లా చెయ్యాలో' అని. ఇది కారణం కాబట్టీ.... నీవు అలా ప్రవర్తించావు గనుకా.... అని సత్యనారాయణగారు మనలను నోరెత్తకుండా జవాబు చెపుతుంటారు. ఆ ఉపన్యాసం ఇచ్చినంతసేపూ మనపై ఆయన సర్వాధికారం చలాయిస్తాడు. అది ఆయన ఉపన్యాస ధోరణి.

సత్యనారాయణగారిలెక్చరు విన్నమీదట నా మనస్సులో అతుక్కున్న భావాలను నా సొంతమాటల్లో, నా సొంతధోరణిలో చెప్పుతున్నానేకాని ఇది దానికి సరియైన రిపోర్టు మాత్రం కాదని ముందే మనవి చేస్తున్నాను.

పుస్తకం చదవడం ఎట్లా గన్నాడు.

పడుకొని తమలపాకుల బీడ నములుతూ, సిగరెట్టు పీలుస్తూ ఖులాసాగా అన్నాను నాలోనేను.

కాదు.... ........

పుస్తకం ఎందుకు చదవాలో చెప్పు?

ఆనందం కోసం.

ఆనందం ఎల్లాగ వస్తుంది?

చదివేది అర్థమైతే ఆనందం కల్గుతుంది.

ముందు మాటలకైన అర్థం తెలియాలా?

తెలియాలె.

ఐతే, ఇరువై ఏండ్ల ఇంగ్లీషుచదువు వెలగబెట్టావుగదా! నీకు అన్ని మాటలూ తెలుస్తున్నాయా డిక్షనరీ చూడకుండా? లేదు. తెలుగులో నీవు ఏమి నేర్చుకున్నావు? ఏం చదివావవి? మాటల అర్థం కోసం ఎప్పుడైన ప్రయత్నించావా? కాబట్టి తెలుగు పుస్తకం అర్థం కావాలంటే ముందు పాండిత్యం సంపాదించు. సామాన్య పాండిత్యం కాదుసుమా!

తిక్కన కాలంనాటి పదాలైనా, అంతకు పూర్వము ఉన్న కవులనాటి పదాలైనా ఉపయోగిస్తాము. మేము కవులము. మాకు

అబ్సొల్యూట్ పదాలంటూ లేవు. పదాలకు బూజు పడుతుందా! పదాలకు చావులేదు. అక్షరానికి అమరత్వం ఉంది. పదాలకు జడత్వం వచ్చి ఉపయోగం లేకపోతే అవి శబ్ద రత్నాకరంలో ఎందు కుంటాయి? మేము ఏ పదాన్ని అయినా సరే ఉపయోగించి తీరుతాం. నీవు చచ్చినట్లు వాని అర్థం తెలుసుకోవాలె అన్నాడు సత్యనారాయణగారు.

శబ్దాలు అనంతం. అనేక పర్యాయ పదాలుంటాయి. పర్యాయ పదాలన్నీ ఒక్కటే అర్థాన్ని బోధించవు. ఒక్కొక్క శబ్దంవల్ల భాసించేటటువంటి అర్థచ్ఛాయలన్నీ గ్రహించాలె.

ఒక్కరీతి-ఒక్కపాకం అయితేనే మేము చదువుతాము తక్కి నవి మేము చదవము అంటే అలంకార గ్రంథాలు చెప్పే రీతులూ, పాకాలూ, ఏమైపోవాలె. ఆ చెప్పిన వాళ్ళేమైనా వెర్రిముండావాళ్లా! కాబట్టి అవన్నీ నీవు చచ్చినట్లు తెలుసుకోవాలె.

తేలిక పాకంలో చెపితే మట్టుకూ బిరుసుపాకంలో చెప్పిన అందాలు రావటంలేదా!........వస్తున్నాయి. ఆయన అమ్మ కడుపు చల్లగా ఆయనే ఒప్పుకొన్నాడు. కానీ........ఆ తేలిక పాకంలో పదబంధనచే కవులు ఆ గుణాలని సాధిస్తున్నారట. అయితే తమరు మట్టుకు ఆ పదబంధమేదో చేసి మాకు తేలికగా అర్థమయే లాగు వ్రాయకూడదూ అని అనుకున్నాం మేము. ఉహూఁ-ఆయన అట్లా సాధించరట. కంఠానికి ఉరిపోసే తీరుతారట ఆయన. ఆ ఉక్కిరి బిక్కిరికి తట్టుకుంటేనే నీకు గ్రంథం చదవటానికి అధికారం ఉంది అన్నాడు.

ఇంత ఎందుకూ?

సమాసఘటనా పదబంధ ప్రయోజన, అర్థస్ఫూర్తి భావవ్యక్తి పాకసౌష్ఠవములూ, రీతి విశేష శయ్యా సంపదలూ, ఉపమాతి

శయోక్తి ఉత్ప్రేక్ష అర్థాంతరన్యాస కావ్యలింగ ప్రతీపరూపకాద్యలంకారములు. అభిధా లక్షణ వ్యంజనాది శబ్ద శక్తులూ, పంచసంధులూ, కారికలూ, విగ్రహాలూ, ప్రత్యక్షబాహాట పాంచాలశయ్యలూ, వైదర్భిగౌడీ పాంచాలి రీతులూ, నారికేళద్రాక్షకదళీ పాషాణాది పాకాలూ, బహువ్రీహి తత్పురుష మధ్యమ పదలోపి ద్వంద్వాది సమాసాలూ. తెలిసికొంటేనేగాని ఏ పుస్తకం చదవటానికైనా అర్హత లేదట. ఇంకోమాట ఒత్తు అక్షరాలుగల మాటలన్నీ ఒక జాబితాగా వ్రాసికొని కంఠతా పట్టమన్నాడు. ఇందులో పది తక్కువైనా నీ చదువు వృథా! వృథా!! నీకు ఆనందం లేదు.

అదీకాక కవియొక్క భావాలన్నీ అధమం భావనాశక్తిద్వారానైనా అనుభవింపగలిగి ఉండాలె నీవు. దానికి నీకు సంస్కారం ఉండాలె.

అని ఇట్లా చెప్పారు. ఆయన చెప్పింది నిజం–నిజం–నిజం.

అంత పాండిత్యం సంపాదించి అల్లాగ చదవటం నేర్వగలిగి ఉండటానికి ఈ జన్మమూ, పైజన్మలో సగమున్నూ కావాలె – నా అంచనా ప్రకారం. అయితే ఆయన చెప్పింది మాత్రం నిజం. చదివితే పుస్తకం అట్లాగే చదవాలె.

కాని ఆ పద్ధతిలో చదవటం నేర్చుకోవటం మన చేత కాదనిపించింది. గుండె బ్రద్దలై పోయింది. ఆయన ఉపన్యాసం కొంతంటా విని, ఇక జన్మలో పుస్తకం అంటూ ముట్టుకోగూడదని ఒట్టెట్టుకొన్నాను.

అట్లా పుస్తకం చదవడానికి మీరెవరైనా ప్రయత్నం చేస్తారా! దుంపతెగుతుంది. చెపుతున్నా వినండి. ప్రయత్నం చెయ్యటం ఎందుకు, తెల్లమొగం వేయట మెందుకూ? ఊరుకుంటే పోతుంది. ఇక పుస్తకం అంటూ ముట్టుకోను నామట్టుకు నేను. క్లాసు పుస్తకాలు తప్ప. తరువాత మీ ఇష్టం—.

# నా కాప్తుడు విశ్వనాథ

-కోలవెన్ను రామకోటీశ్వరరావు

[బందరు హిందూ హైస్కూలులో ఫస్టుఫారములో చేరే నాటికి విశ్వనాథకు పదమూడేండ్లు. అది 1908 వ సంవత్సరము. కోలవెన్ను రామకోటీశ్వరరావు ఆ సంవత్సరమే మెట్రిక్యులేషను పరీక్షప్యాసయి ఇంటరుమీడియటు క్లాసులో చేరటానికి 1909 లో బందరు వచ్చినప్పటి నుండీ ఇద్దరికీ స్నేహం. చదువులో ఉన్నంత తేడా వారిద్దరికీ వయస్సులోలేదు. నిజానికి సత్యనారాయణగారే రామకోటీశ్వరరావు గారి కంటె పదినెలల పదునెనిమిది రోజులు పెద్ద.

బందరు ఆంధ్ర జాతీయ కళాశాలలో (1923-27) నాలుగు సంవత్సరాల పాటు ఆ మిత్రులిద్దరును ఆంగ్ల ఆంధ్ర సాహిత్యాచార్యులుగా కలసి పని చేసినారు. 1927 తరువాత త్రివేణి - జయంతి అనే ఆంగ్ల ఆంధ్ర భాషా పత్రికలను ప్రారంభించి జాతీయోద్యమ కార్యక్రమములో భాగస్వాములై నడిపించారు.

కోలవెన్ను రామకోటీశ్వరరావుగారికినీ, విశ్వనాథ సత్యనారాయణగారికిని ఉన్న మైత్రిని పురస్కరించుకొని - సత్యనారాయణగారిని గురించి రామకోటేశ్వరరావుగారి అంతర్యమెలా ఉన్నదియు తెలియుటకు ఆయన తమ "జీవితానుభవాలు" అన్న పుస్తకము 1 లో విశ్వనాథను ప్రసక్తికి తెచ్చి చెప్పి వ్రాయించిన వాక్యాలు ఇక్కడ ఉటంకింపబడుచున్నవి.]

---

1 'కోలవెన్నువారి జీవితానుభవాలు' అన్నపుస్తకమును సంపాదించి ప్రచురించినది డా॥ అక్కిరాజు రమాపతిరావు.

మా కాటూరి వేంకటేశ్వరరావుగారూ, అడవి బాపిరాజుగారూ, విశ్వనాధ సత్యనారాయణగారూ, నండూరి, బసవరాజూ, మల్లంపల్లి అందరూ నాకు ఆప్తులూ సన్నిహితులూ అయినప్పటికీ నేను వాళ్లను కానీ, వాళ్లు నన్ను కానీ నువ్వు అని మన్నించుకోవటం దాకా మా సాన్నిహిత్యం పెరగలేదు. ఇట్టే పరిచయమైన కొద్ది రోజులకే వాళ్లు వొకరినొకరు నువ్వు అని మన్నించుకొనే వారు. (13-14).

1923వ సంవత్సరం జులై నెలలో బందరు వచ్చి జాతీయ కళాశాలలో అధ్యాపకుణ్ణిగా చేరాను.... జాతీయ కళాశాలలో పని చేసిన నాలుగు సంవత్సరాలూ నా జీవితం సంతోషపూర్ణంగా గడిచి పోయింది.... కాలేజీ తరగతుల స్థాయిలో చరిత్ర రాజనీతి, అర్థ శాస్త్రం నేను విద్యార్థులకు బోధించే వాణ్ణి. అక్కడ బోధన తెలుగులో జరిగేది, అయితే ఇంగ్లీషు గ్రంథాలూ లెస్సగా చదివే వారు విద్యార్థులు. విద్యార్థులలో జ్ఞాన తృష్ణను ఉన్నత ప్రమాణా లను నెలకొల్పడానికి అధ్యాపకవర్గం కృషిచేసేవారు....జాతీయ కళాశాలలో ప్రమోదకుమార్ ఛటర్జీ చిత్రలేఖనం తరగతులు నిర్వ హించేవారు. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు తెలుగు చెప్పే వారు. ఆరోజుల్లోనే విశ్వనాథవారు ఆంధ్ర ప్రశస్తి, నర్తనశాల, గిరికుమారుని ప్రేమగీతాలూ మొదలయిన కావ్యాలు రచిస్తూవచ్చారు, (37-38)

ఆ రోజుల్లో విశ్వనాథవారితో నాకు చాలా సన్నిహితమైన మైత్రి వుండేది. విశ్వనాథవారు ఏ రచన చేసినా ముందుగా నాకూ బాపిరాజుగారికీ చదివి వినిపించేవారు. ఆ రోజుల్లో మాకిది పరిపాటి అయిపోంది. ఆంధ్ర ప్రశస్తి, కిన్నెరసాని పాటలు, ఏకవీర మేమిట్లా వారు వినిపించగా ఆ రోజుల్లో విన్నాము. నర్తనశాలకూడా ఆ రోజుల్లోనే విశ్వనాథ రచించారు. విశ్వనాథ

మహాకవి అవుతాడనీ, ఆంధ్రదేశం ఆయన్ను ఆకాశానికెత్తుతుందనీ మాకు ఆయన రచనలు విన్నప్పుడు అనిపించేది. ఆ రచనల్లో సౌందర్యానికీ, వారి ప్రతిభా సంపదకూ ముగ్ధులమై పోతూ వుండే వాళ్ళం........ఆ రోజుల్లోనే విశ్వనాథ నర్తనశాలను తెనాలి కంపెనీ వారు మినర్వా హాలులో ప్రదర్శించారు. విశ్వనాథ, బాపిరాజు, నేనూ ముట్నూరి కృష్ణారావుగారూ, పురాణం సూరిశాస్త్రిగారూ అంతా కలసి దర్శించాం. ఆనాటి నాటక ప్రదర్శన మమ్మల్ని తన్మయుల్ని గావించింది. ఆవాళ మాధవపెద్ది వెంకటామయ్యగారు కీచక పాత్రను ధరించారు. పారుపల్లి సుబ్బారావుగారు ద్రౌపది పాత్రను ధరించారు. నర్తనశాల రచనా ప్రమాణాలను బట్టి చూచినా, ప్రదర్శన యోగ్యతను బట్టి చూచినా, ఉత్తమశ్రేణికి చెందిన నాటక మైనా ఎందువల్లనో నాటకరంగస్థలం మీద తరువాత తరువాత అంత ఎక్కువగా రాణించలేదు. (39-40)

జాతీయ కళాశాలలో సాహిత్యోపన్యాసాలు నిర్వహించటమే గాక ఇతర ప్రదేశాలలో సాహిత్య సమావేశాలు జరిగితే మేమంతా పాల్గొంటూ వుండేవాళ్ళం. 1935వ సంవత్సరంలో నూజివీడులో నండూరి సుబ్బారావుగారు సాహిత్యసభ నొకదాన్ని ఏర్పాటు చేశారు. విశ్వనాథ, బాపిరాజు, నేనూ, బెల్లంకొండ రాఘవరావుగారూ ఆ సభలో పాల్గొన్నాం. ఆ సభకు వేదం వెంకటాయశాస్త్రి గారు అధ్యక్షులు. నండూరి ఎంకి పాటలను అద్భుతంగా పాడేవాడు. ఆ సభలో వేంకటాయశాస్త్రిగారు ఎంకి పాటలను ప్రశంసిం చారు. ఇంకో సారి భీమవరంలో బాపిరాజు సాహిత్య సమావేశం ఏర్పాటు చేశారు. దానిలో మేమంతా పాల్గొన్నాం. తరచు బెల్లం కొండ రాఘవరావుగారి గ్రామం మా నరసరావుపేట దగ్గరే వున్న పమిడిపాడు వెళ్ళి మేమంతా మూడు నాలుగు రోజులుండి కులాసాగా సాహిత్య గోష్ఠులతో కాలక్షేపం చేసేవాళ్ళం. విశ్వనాథ తమ పద్యాలే

గాక ఇతరమిత్రుల పద్యాలుకూడా శ్రావ్యంగా, ఉత్తేజితులమయ్యేట్లు చదివి వినిపించేవారు.

....1925వ సంవత్సరం గూడూరులో నాయనిసుబ్బారావుగారి వివాహం జరిగింది. ఈ వివాహానికి నోరి నరసింహశాస్త్రి, శివశంకర స్వామి, నండూరి సుబ్బారావు, విశ్వనాథ, బాపిరాజు, నేనూ హాజరైనాము. (41-42)

మద్రాసు నుంచి పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు అచ్చు వేశేవారు జయంతిని. ఈ పత్రికకు విశ్వనాథ, నేను ప్రధాన సంపాదకులుగా వుండేవాళ్ళము. ఈ పత్రికను గూర్చి ఆసక్తి కలిగించేందుకు విశ్వనాథ నేనూ కలిసి మద్రాసు, బరంపురం, పర్లాకిమిడి, విజయనగరం మొదలయిన ప్రాంతాలు పర్యటించాము. సాహితీ పరులందరినీ కలిసి వారి సహాయాన్ని అర్థించాము. ఉత్తమ రచనలు అందమైన రూపురేఖలూ ఉండే పత్రికగా నడపాలని మా ఆశయం....బాపిరాజు, కృష్ణశాస్త్రిగారలందరు జయంతిని అభిమానించారు. రచనలు పెలయించారు. అయితే ద్విమాస పత్రికగా ఒక సంవత్సరం మాత్రమే జయంతిని నడపగలిగాము. జయంతిలో కిన్నెరసాని పాటలు, ఆంధ్ర ప్రశస్తిలో కొన్ని ఘట్టాలూ వచ్చాయి. (43-44)

# విశ్వనాథను గూర్చి నోరి వారు

—నోరి నరసింహశాస్త్రి

సాహితీ సమితిలో విశ్వనాథ బందరు గ్రూపులోవాడు. కొడాలి ఆంజనేయులు, నాయని సుబ్బారావు, కొల్లిపర సూరయ్య, శ్రీనివాస శిరోమణి వీళ్ళంతా బందరుగ్రూపు. ఈ బందరు గ్రూపు సాహితీ సమితిలో చేరిన తరువాత ఆ బలం చూచుకొనే బెజవాడలో "సాహితి" పత్రిక శారదాభండార్ ప్రెస్‌లో అచ్చువేయటం మొదలు అయింది. అప్పట్లో విశ్వనాథ కొడాలి ఆంజనేయులు జంటకవులు. సత్యాంజనేయ కవులు అన్న పేరున వ్రాసేవాళ్లు.

సాహితీ సమితిలో చేరేటప్పటికే విశ్వనాథకు వ్యక్తిత్వం ఏర్పడ్డదని చెప్పవచ్చు. బందరులో పింగళి లక్ష్మీకాంతంగారు విశ్వనాథను బాగా అణచిపెట్టారు. అందువల్లనే అప్పటికి బందరు దాటి ఆయన పేరు బాగా వ్యాపించలేదు. 1924 డిసెంబరులో సాహితీ సమితి సమావేశం తెనాలిలో జరిగింది. అప్పుడు శ్రీనివాస శిరోమణి సమితికి శివశంకరస్వామి ఆజీవ అధ్యక్షుడుగా ఉండాలని ప్రతిపాదించాడు. అందుకు విశ్వనాథ గ్రూపు నేనూ వ్యతిరేకించాం

ఇంకొకరిని తనతో సమానంగా చూచుకొనేలక్షణం విశ్వనాథలో లేదు. ఆయన ఇతరులను కేవలం తనను మెచ్చుకోటానికి పుట్టిన వారుగానే చూస్తాడు.

---

[4-2-72న హైదర్‌గూడా సికింద్రాబాదులో శ్రీ నోరి నరసింహశాస్త్రిగారితో ఇంటర్‌వ్యూ-చేసినది డా॥ సుప్రసన్నాచార్యులు]

విశ్వనాథ తన నర్తనశాల వ్రాతప్రతిని త్రిపురారి భట్ల వీర రాఘవస్వామిగారికి చూడమని ఇచ్చాడు.

"గాలిపటము" అన్న శీర్షికతో పద్యాలు వేదుల వ్రాసినవి విశ్వనాథను గూర్చేనని శ్రీనివాస శిరోమణి చెప్పాడు. అందుకు సమాధానంగా విశ్వనాథకూడా ఏవో వ్రాశాడు.

1925లో విశ్వనాథ, నాయని, నండూరి కొడాలి ఆంజనేయులు సాహితి సమితికి రాజీనామా చేసారు.

సాహితీ సమితిలో చేరి శివశంకరస్వామివారికి సన్నిహితుడైనందువల్ల విశ్వనాథ తన కవిత్వ రచనకు సంస్కృత మర్యాదలను అలవడ చేసికొన్నాడు. అసలు విశ్వనాథది తెలుగుపోకడ. విశ్వనాథ మీద తిక్కన, నాచనసోముడు, కృష్ణదేవరాయలు, రామకృష్ణుడు ఈ నలుగురిలోనూ ఉన్న దోషాల ప్రభావం ఎక్కువగా వడ్డది. పాశ్చాత్య ప్రభావంకూడా అలాగే ఆయనమీద ఎక్కువగా ఉన్నది. ఆయనకు వివరీతంగా చదివే అలవాటున్నది. సినిమాను చూడటం కూడా అంతే.

విశ్వనాథ మొదటి నుండి దారిద్ర్యాన్ని అనుభవించాడు. అయినా అహాన్ని చంపుకొని బ్రతకలేదు. ఇంతపేచీ వస్తే A. C. కాలేజీ ఉద్యోగాన్ని గుంటూరులో వదిలేశాడు.

బెల్లంకొండ రాఘవరావుగారు విశ్వనాథకు బాగా డబ్బిచ్చి ఆదుకుంటూ ఉండేవాడు. విశ్వనాథ అంటే ఆయనకు చాలా ఇష్టం.

విశ్వనాథ గొప్ప రచనలలో అనార్కలి ఒకటిఅని నాఉద్దేశ్యం.

వేయిపడగలకు బహుమతి వచ్చినప్పుడు స్వామి శివశంకరుల అధ్యక్షతన సభ జరిగింది.

కృష్ణాపత్రికలో విశ్వనాథ వ్రాసిన పద్యాలు "ఓయి రసహీన" అని ఆరంభింపబడ్డవి శివశంకరులను గురించి వ్రాసినవే అని అంటారు. విశ్వనాథ వర్గం వాళ్ళు స్వామివారి కవిత్వానికి "రాళ్ల కర్ర కవిత్వము" అని పేరు పెట్టారు.

విశ్వనాథ పెళ్ళిళ్లకు పద్యాలువ్రాసి బట్టలు పెట్టించుకునేవాడు. అది తిరుపతి వేంకటకవుల సంభావనా మనస్తత్వం. కొన్నికొన్ని చాలా బాగా వ్రాశాడు. మరచిపోవటానికి వీలులేనట్లుగా వ్రాశాడు. తెలుగు వాఙ్మయం విశ్వనాథ లేకుండాలేదు. ఆయన్ను విస్మరించదు.

విశ్వనాథకు తాను చేసే రచన సుందరంగాను, సుకుమారంగానూ ఉండాలని పట్టులేదు. ఆ పట్టు కృష్ణశాస్త్రికి ఎక్కువ. రచన మీద దృష్టి లేకుండా విశ్వనాథ మహోన్నత శిఖరాలకు భావనాబలం చేత ఎగబ్రాకినాడు. అందువల్ల విశ్వనాథ నిలబడతాడు. గుండె లోతులను కదలించే కవిత్వం విశ్వనాథ వ్రాయగలడు.

నారాయణరావు నవలకూ వేయిపడగలకూ పోలికేమిటి? ఎన్ని లోపాలున్నా నిస్సందేహంగా వేయిపడగలు గొప్ప రచన.

రామాయణ కల్పవృక్షంలో బాలకాండలో కొంత భాగం చదివాను. ఆ చదివినంతలో అసలు గ్రంథంకంటె ఖండాంత పద్యాలు బాగున్నాయి. ఆయన శివభక్తి మనలను గాఢంగా కదిలిస్తుంది. రామాయణాన్ని ఆయన బహిర్ముఖుడై వ్రాసినాడనే చెప్పాలి. అంతర్ముఖుడు కాలేదు.

దైనందిన ప్రవృత్తిలో ఆయన చాలా వరకు ఉదాత్తంగానే ప్రవర్తిస్తాడు. ఒక్కొక్కప్పుడు మరీ చౌకబారుగా వుంటుంది ప్రవృత్తి.

సాహితీసమితి రోజులు అయిపోయ్యాక ఆయనకు నేనెప్పుడూ సన్నిహితంగా లేను.

# విశ్వనాథను గురించి....!

—రాయప్రోలు

1922 జులైలో అనుకుంటాను నేను ఉస్మానియాలో చేరింది. అంత వరకు విశ్వనాథ సత్యనారాయణ నాకు తెలియదు. ఆయన పుస్తకాల్లో నేను మొదట చదివింది కిన్నెరసాని పాటలు కావచ్చు. అదే మొదటి కవిత నేను చదివింది అతనిది.

అతను మంచి ధైర్య సాహసాలు కలవాడు.

వేయి పడగలు చాలా గొప్ప గ్రంథం. నవల అవునా కాదా అది నాకు తెలియదు. ఒకప్పుడు ఢిల్లీ సాహిత్య అకాడమీ పక్షాన వేయి పడగలు హిందీలోకి అనువదించాలని పెట్టాను. అదప్పుడు కొందరు పడనివ్వారు కాదు. ఆ కారణాల వల్ల లోకానికి ఏమిటి ప్రయోజనం? నా అభిప్రాయం అది గొప్పదని చెప్పానుగా. వేయి పడగలులో అభినవ భావాలెన్నో ఉన్నాయి. విశ్వనాథ క్రొత్త విషయాలను ఎన్నింటినో అందులో వర్ణించాడు. తెలుగు దేశం - తెలుగు భాష - ఆ పుస్తకం నిండా ఉన్నాయి. అది నేను పూర్తిగా చదివాను. చదివానో లేదో - ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి అని మాత్రం నాకు తెలిసింది.

గురజాడవారు వ్యావహారిక భాషను వాడకంలో పెట్టారు నిజమే కానీ, అయన నవ్య కవిత వ్రాసినవాడు మాత్రం కాదు.

---

[ఇంటర్వ్యూ 1977 జనవరి 29 చేసినది కేతవరపు రామకోటిశాస్త్రి]

నవ్య కవిత్వానికి నేనే మొదలు. ఎందుకంటే నాకు మోడళ్ళు లేవు అనుకరించటానికి. అన్నీ నేను భావించి కల్పించినవే. వాళ్ళు నా కంటే గొప్పవాళ్లయినా సత్యనారాయణ, కృష్ణశాస్త్రి వీళ్ళందరికీ ఇన్స్పిరేషనూ, మోడలూ నేననే చెప్పగలను.

విశ్వనాథ సత్యనారాయణను గురించి గిడుగు సీతాపతి ఏమి చెప్పినాడో చూడండి. ఎందుకంటే గిడుగు సీతాపతి ఆత్మ సాక్షిగా పొయ్యేవాడు కాని తప్పుగా లోకాన్ని మెప్పించాలని అనుకునేవాడు కాడు. అతని అభిప్రాయాలు నిజంగా అతనివే. ఆయన నిజాయితీ కలవాడండీ.

తెలుగు దేశంలో ఋతువులు రావటమంటే ఏమిటో పోవట మంటే ఏమిటో విశ్వనాథ సత్యనారాయణ చూచి అనుభవించి చక్కగా ఆలోచించి తన్మయుడై వ్రాశాడా ఋతు కావ్యం. చాలా గొప్పగా వ్రాశాడు. అది ఒరిజినాలిటీ. కాళిదాసు ఉజ్జయినీ ప్రాంతంలో ఋతువులు మారితే కనిపించే ప్రకృతిని ఆయన వర్ణించాడు. అందులో కొన్ని మన తెలుగు దేశంలో కూడా ఉంటాయి. ఋతు ధర్మం స్థూలంగా అన్ని దేశాల్లో ఒకటిగా ఉన్నా ఆయా దేశాల్లో సూక్ష్మమైన విషయాల్లో ఋతు ధర్మం విలక్షణంగా ఉంటుంది. ఆ విలక్షణ లక్షణం తెలియటానికి వ్యుత్పత్తి చాలదు. ప్రతిభ కావాలి. అనువాద ప్రతిభ కాదు. క్రియేటివ్ ప్రతిభ కావాలి. సత్యనారాయణ అంత ప్రతిభావంతంగా వ్రాశాడు. ఆ రోజుల్లో మాకందరికీ దేశభాషాభిమానాలు గట్టిగా ఉండేవి.

అతనికీ నాకూ అంత సన్నిహిత స్నేహమూ లేదూ – ఓహో అంటే ఓహో గానే ఉండేవాళ్ళం. నేనంటే అతనికి గౌరవం ఉన్నది. నాకతని మీద ప్రేమ లేదా మరి: కాస్త దూర దూరంగా ఉండేవాళ్లం అంతే. అతనికి అతని శక్తి తెలుసు. ఇతరుల శక్తీ తెలుసు. మనిషి కాస్త పెడసరం. మళ్లీ మంచివాడే. అదొక రకం.

అవును మా యిద్దర్నీ గురించి సీతారామయ్యగారు ఆధునికాంధ్ర సాహిత్యానికి సూర్యచంద్రులనో ఏదో అన్నాడు. అది నిజమే. నేను కవిత్వమొక్కటే పెట్టుకొన్నాను. అతను అన్ని సాహిత్య ప్రక్రియల్లోనూ తాను ఉన్నానన్నాడు. నేను కవిత్వంలో తెచ్చిన నవ్యతను అందుకొని మొత్తం తెలుగు సాహిత్యంలో దాన్ని నింపేశాడు విశ్వనాథ సత్యనారాయణ. నవ్యత లేకుంటే మేము ఆ కాలంలో వ్రాసే వాళ్ళం కాదు.

రామాయణం అంతా అతను వ్రాశాడు కాని నేను పూర్తిగా చూడలేదు. ఇప్పుడసలు చదవలేను. అతను చదివినప్పుడెక్కడన్నా విన్నానేమో. చాలా స్వతంత్రించి వ్రాశాడనిపిస్తుంది. నేను సుందర కాండను తెలుగులో కూడా పారాయణ యోగ్యంగా ఉండాలని వ్రాశాను.



అవును మా యిద్దర్నీ గురించి సీతారామయ్యగారు ఆధునికాంధ్ర సాహిత్యానికి సూర్యచంద్రులనో ఏదో అన్నాడు. అది నిజమే. నేను కవిత్వమొక్కటే పెట్టుకొన్నాను. అతను అన్ని సాహిత్య ప్రక్రియల్లోనూ తాను ఉన్నానన్నాడు. నేను కవిత్వంలో తెచ్చిన నవ్యతను అందుకొని మొత్తం తెలుగు సాహిత్యంలో దాన్ని నింపేశాడు విశ్వనాథ సత్యనారాయణ. నవ్యత లేకుంటే మేము ఆ కాలంలో వ్రాసే వాళ్ళం కాదు.

రామాయణం అంతా అతను వ్రాశాడు కానీ నేను పూర్తిగా చూడలేదు. ఇప్పుడసలు చదవలేను. అతను చదివినప్పుడెక్కడన్నా విన్నానేమో. చాలా స్వతంత్రించి వ్రాశాడనిపిస్తుంది. నేను సుందర కాండను తెలుగులో కూడా పారాయణ యోగ్యంగా ఉండాలని వ్రాశాను.



విదారకాలైనట్టీ; సంపూర్ణమైనట్టీ, అనిర్వాచ్యమైనట్టీ ఆనందాన్ని కలగజేసై. కృష్ణార్పణంలో అస్థికలు కలుపునప్పుడు ఉత్పన్న మైన భావాలు చదివేటప్పుడు నేనానందంతో అశ్రులురాల్చానని చెప్పటం కేవల సత్యకథనం. సూక్ష్మవిషయాల యొక్క అంగాంగీ భావముతో కూడిన ఆ వర్ణనము నిరుపమానము. ఎటువంటి స్వల్ప విషయాన్నీ భాషాచిత్రాలు కల్పించి పాఠకుడి మనశ్చక్షుస్సులకు గోచరమయ్యేటట్టు చెయ్యడములో పరమావధిని పొందినైయని చెప్పడములో యేమీ అతిశయోక్తి లేదు. గౌరీ పూజలో స్త్రీవ్యక్తి ప్రకృతిమాతలో లీనమైన ఘట్టము చదివితే సాక్షాత్కైలాస వాసినియైన పార్వతీరూపము అలౌకికమై సర్వ ప్రపంచవ్యాప్తమైన హృదయానికి ఒక విధమైన పవిత్రానందాన్ని చేకూరుస్తుంది.

గౌరు అనే ప్రయోగమక్కడ బంగారములో రత్నము పొదిగినట్టు తోస్తుంది. అందులో హృదయ నిగూఢ ప్రేమ, పవిత్రత మాతృత్వము స్పష్టమౌతున్నవి. ఒక కవి భార్యా వియోగము భాషా కుమారులందరికీ ఆనంద హేతువు కావడము సహజమే. ఈయనకీ భార్యావియోగమయ్యే కాలములో కొంత నిరుత్సాహమూ, నిరాశా, ఆవరించినట్టు తత్కాలములో వ్రాసిన ఆకాంక్ష మొదలయిన ఖండకావ్యాలవల్ల కనబడుతుంది. కానీ మళ్లీ దానినించీ మృతి నుంచి జన్మలేచినట్లు సహజమైన చిత్తశాంతి చేకూర్చుకొని ఉత్సాహాన్ని పొందడము ఆంధ్రసాహిత్యముయొక్క, భాష యొక్క భాగ్యమనే చెప్పవలె. దుర్వ్యారివలె తాత్కాలిక ముగా పతనాన్ని పొందకుండా ఉండడంలోనే ఉన్నదీయనయొక్క విశిష్టత. అదే కవికి పరీక్షాకాలము.3

అటువంటి దుఃఖములో నించే సుఖము కలిగితే ఆయన ప్రకృతిని జయించాడన్నమాట. అదివరకు ఆకాశదీపం - విశ్వా

విదారకాలైనట్టి; సంపూర్ణమైనట్టి, అనిర్వాచ్యమైనట్టి ఆనందాన్ని కలగజేసై. కృష్ణార్పణంలో అస్థికలు కలియునప్పుడు ఉత్పన్నమైన భావాలు చదివేటప్పుడు నేనానందంతో అశ్రులురాల్చానని చెప్పటం కేవల సత్యకధనం. సూక్ష్మవిషయాల యొక్క అంగాంగీ భావముతో కూడిన ఆ వర్ణనము నిరుపమానము. ఎటువంటి స్వల్ప విషయాన్నీ భాషాచిత్రాలు కల్పించి పాఠకుడి మనశ్చక్షుస్సులకు గోచరమయ్యేటట్టు చెయ్యడములో పరమావధిని పొందినైయని చెప్పడములో యేమీ అతిశయోక్తిలేదు. గౌరీ పూజలో స్త్రీవ్యక్తి ప్రకృతిమాతలో లీనమైన ఘట్టము చదివితే సాక్షాత్కైలాస వాసినియైన పార్వతీరూపము అలౌకికమై సర్వ ప్రపంచవ్యాప్తమైన హృదయానికి ఒక విధమైన పవిత్రానందాన్ని చేకూరుస్తుంది.

గౌరు అనే ప్రయోగమక్కడ బంగారములో రత్నము పొదిగినట్టు తోస్తుంది. అందులో హృదయ నిగూఢ ప్రేమ, పవిత్రత మాతృత్వము స్పష్టమౌతున్నవి. ఒక కవి భార్యా వియోగము భాషా కుమారులందరికీ ఆనంద హేతువు కావడము సహజమే. ఈయనకీ భార్యావియోగమయ్యే కాలములో కొంత నిరుత్సాహమూ, నిరాశా, ఆవరించినట్టు తత్కాలములో వ్రాసిన ఆకాంక్ష మొదలయిన ఖండకావ్యాలవల్ల కనబడుతుంది. కానీ మళ్లీ దానినించీ మృతి నుంచి జన్మలేచినట్లు సహజమైన చిత్తశాంతి చేకూర్చుకొని ఉత్సాహాన్ని పొందడము ఆంధ్రసాహిత్యముయొక్క, భాష యొక్క భాగ్యమనే చెప్పవలె. దుర్వారివలె తాత్కాలికముగా పతనాన్ని పొందకుండా ఉండడంలోనే ఉన్నదీయనయొక్క నిశిష్టత. అదే కవికి పరీక్షాకాలము.3

అటువంటి దుఃఖములో నించే సుఖము కలిగితే ఆయన ప్రకృతిని జయించాడన్నమాట. అదివరకు ఆకాశదీపం – విశ్వా

సామగ్రి సేకరింపబడి ఉంది. కొందరు ఏదో తమ తోచినట్లు చరిత్రను రాయ సాహసించారు. నవ్య సాహిత్యాన్ని గూర్చి చారిత్రకంగా అవలోకనం చేసిన స్థలాలు లేవు. దాని లక్షణాలేవో, పరిణతి ఎంతో యే క్రమ పరిణామాలను పొందిందో మొదలయిన విషయాలను యథాశక్తి చర్చించి తచ్చరిత్రకు ఒక నిర్దుష్టమైన ఆకారాన్నిచ్చింది. మొదటిమాటు విశ్వనాథ బెజవాడ పరిషదధ్యక్షోపన్యాసం8. చాలాకాలం నుంచీ, యేతచ్చరిత్ర రాయాలని నాకు వుండె. ఈ ఆసక్తిని పురికొల్పి ఆ ఉపన్యాసం నాచేత ఈ గ్రంథం రాయించింది. తద్వ్యాసానికీ తద్రచయితకూ నా ధన్యవాదాలు.

---

1. కవి సమ్రాట్టనున్న ప్రచారము కవిరాజకు లేదు. నవ్యాంధ్ర సాహిత్య వీథులు (II భా. 375-76)

2. 1922-24 సాహితిలో వచ్చిన 'నాపాట'లో ఉన్నవి రెండు గీత పద్యాలు. అవి భ్రష్టయోగి అన్న ఖండకావ్యము 9వ పుటలో గలవు. (నసావీ III 434)

3. నసావీ III 496-500 ఆకాంక్ష - (1932 మార్చి భారతి) కేదారగౌళ 12వ పుటలో గలదు, ఆకాశ దీపము (1931 ఫిబ్రవరి భారతి) భ్రష్టయోగి 12వ పుటలో కలదు. 'విశ్వామిత్రుడు- మేనక' (1932 జనవరి భారతి) కేదారగౌళ 105వ పుటలో గలదు.

4. ఇందుకు సూచన వేయిపడగలు 36 అధ్యాయము చివర నున్నది. "అరుంధతి (చిన్న) తలయెత్తి యతని వంక జూచెను. చూచుచున్న యామె కన్నులలో నతనికి బరిచితమై యతని యాత్మను స్వర్గవీథులలో నడిపించిన యొక జ్యోతిస్సు తోచెను. ఆమె నేను మరల నిట్లు వచ్చితిని. నన్ను గుర్తుపట్టలేదా

సామగ్రి సేకరింపబడి ఉంది. కొందరు ఏదో తమ తోచినట్లు చరిత్రను రాయ సాహసించారు. నవ్య సాహిత్యాన్ని గూర్చి చారిత్రకంగా అవలోకనం చేసిన స్థలాలు లేవు. దాని లక్షణాలేవో, పరిణతి ఎంతో యే క్రమ పరిణామాలను పొందిందో మొదలయిన విషయాలను యథాశక్తి చర్చించి తచ్చరిత్రకు ఒక నిర్దుష్టమైన ఆకారాన్నిచ్చింది. మొదటిమాటు విశ్వనాథ బెజవాడ పరిషదధ్యక్షోపన్యాసం8. చాలాకాలం నుంచీ, యేతచ్చరిత్ర రాయాలని నాకు వుండె. ఈ ఆసక్తిని పురికొల్పి ఆ ఉపన్యాసం నాచేత ఈ గ్రంథం రాయించింది. తద్వ్యాసానికీ తద్రచయితకూ నా ధన్యవాదాలు.

---

1. కవి సమ్రాట్టుకున్న ప్రచారము కవిరాజుకు లేదు. నవ్యాంధ్ర సాహిత్య వీధులు (II భా. 375-76)

2. 1922-24 సాహితిలో వచ్చిన 'నాపాట'లో ఉన్నవి రెండు గీత పద్యాలు. అవి భ్రష్టయోగి అన్న ఖండకావ్యము 9వ పుటలో గలవు. (నసావీ III 434)

3. నసావీ III 496-500 ఆకాంక్ష - (1932 మార్చి భారతి) కేదారగౌళ 12వ పుటలో గలదు, ఆకాశ దీపము (1931 ఫిబ్రవరి భారతి) భ్రష్టయోగి 1[illegible]వ పుటలో కలదు. 'విశ్వామిత్రుడు- మేనక' (1932 జనవరి భారతి) కేదారగౌళ 10[illegible]వ పుటలో గలదు.

4. ఇందుకు సూచన వేయిపడగలు 36 అధ్యాయము చివర నున్నది. "అరుంధతి (చిన్న) తలయెత్తి యతని వంక జూచెను. చూచుచున్న యామె కన్నులలో నతనికి బరిచితమై యతని యాత్మను స్వర్గవీధులలో నడిపించిన యొక జ్యోతిస్సు తోచెను. ఆమె నేను మరల నిట్లు వచ్చితిని. నన్ను గుర్తుపట్టలేదా

# కవ్యుద్ధ విశ్వనాథ

-శ్రీశ్రీ

'నీదు మార్గాన నీయంత నేతలేడు' అన్నాడు విశ్వనాథగురించి జలసూత్రం. అంత హాస్యప్రియుడుకూడా విశ్వనాథను పేరడీచేస్తూ భక్తిప్రపత్తులే ప్రదర్శించాడు. 'కవ్యుద్ధ' శబ్దం రుక్మిణీనాథశాస్త్రి వాడినదే. (కవిశ్రేష్ఠుడు అని దాని అర్థం)

కించిత్తిక్త కషాయషాడబరస క్షేపాతిరే కాతివా
క్సంచార ప్రచ యావకాశములతో కవ్యుద్ధ!.... ....

అంటూ విశ్వనాథ ధోరణిలోనే రాశాడు.

చాలా కాలం క్రిందట 'వీణ' పత్రిక కవితా విభాగానికి గౌరవ సంపాదకుడుగా పనిచేస్తూ, నేను 'విశ్వనాథ సత్యనారాయణగారి పద్యాలు మహాబలిపురపు రాతి గోపురాలు' అని ఉగ్గడించాను. నేను చిన్నతనంలో కలంపట్టిన కొత్తరోజుల్లో నన్ను బాగా ఆకర్షించిన ఇద్దరు కవులలో విశ్వనాథవారొకరు. (రెండవకవి కృష్ణశాస్త్రిగారు) ఆ రోజుల్లో నేను సాహితీసమితి సభ్యుణ్ణయి వుంటె బాగుండునని ఎంతో ఉబలాటపడేవాణ్ణి. కాని విశ్వనాథ సత్యనారాయణగారు సమితి నుంచి తప్పుకున్నారని తెలుసుకున్నాక నా ఉద్దేశాన్ని విరమించు కున్నాను. విశ్వనాథతోబాటు నాయని సుబ్బారావుగారుకూడా తప్పు

---

'స్వాతి' మాసపత్రిక నవం. 76 సంచికలో విశ్వనాథను గూర్చి శ్రీశ్రీ వ్రాసిందిది. పు. 10, 12.

కున్నారు. సభాపతి శివశంకరశాస్త్రిగారి నిరంకుశత్వానికీ, వేదుల చిలిపితనానికీ వ్యతిరేకంగా ఇద్దరూ ఈపని చేశారు. విశ్వనాథ వేదులమీద 'ముషితబుద్ధి' అనే శీర్షికతో ఘాటయిన పద్యాలు రాశారు.

నిన్న మొన్న ప్రపంచ మహాసభల సందర్భములో నాకూ విశ్వనాథవారికీ మధ్య కొంత వాదోపవాదం సాగినా మేమొకరి నొకరం నిందించుకో లేదన్న విషయం గమనార్హం. నేనంటే సత్యనారాయణ గారికి వాత్సల్యం. వారంటె నాకు గౌరవభావం. అటువంటప్పుడు పరస్పరం దూషించుకోవడం అనే ప్రసక్తే లేదు.

ఎన్నో విషయాలలో వారికీ నాకూ చుక్కెదురు. అయినా భారతీయ భాషలన్నిటిలోనూ ఒక్క తెలుగులోనే గొప్ప కవిత్వం ఉందనడంలో ఇద్దరమూ ఏకభవిస్తాం.

విశ్వనాథ మృతిపట్ల నేనెక్కడా బహిరంగంగా సంతాప ప్రకటన చెయ్యలేదు. కాని అంతర్గతంగా ఒక ఆత్మీయుని్ని కోల్పోయి నట్లు బాధపడుతున్నాను. 'ప్రజాతంత్ర' పత్రికలో ధారావాహికంగా ప్రచురిస్తున్న నా 'అనంతం'లో ఈ విషయం కొద్దిగా పేర్కొన్నాను అంతకు మించి నేనేమీ చెయ్యలేదు. నా దుఃఖం నాలోనే దిగమింగు కున్నాను. కాని ఒకటి మాత్రం నిజం. నాకు కులం అనీ, మతం అనీ పట్టింపు లేపీలేకపోయినా, ఈనాడు మరోకవి కులగురువు మాయ మయినాడని వాపోతున్నాను.

గతాన్ని స్మరించి విశ్వసిస్తాడు విశ్వనాథ
ఆగతాన్ని వరించి విశ్వసిస్తాడు శ్రీశ్రీ
"గతకాలమె మేలు వచ్చుకాలము కంటెన్" అనుకుంటారు విశ్వనాథ
"మంచి గతమున కొంచెమేనోయ్" అనమంటాడు శ్రీశ్రీ.

ఇవాళకాదు 9-6-73లో విశ్వనాథమీద ఇలా రాసాను. అప్పటికీ ఇప్పటికీ ఇదే నా నివాళి.

మాటలాడే వెన్నెముక
పాటపాడే సుషుమ్న

విన్నాటి నన్నయ్యభట్టు
ఈనాటి కవి సమ్రాట్టు

గోదావరి పలకరింత
కృష్ణానది పులకరింత

కొండవీటి పొగమబ్బు
తెలుగువాళ్ళ గోల్డునిబ్బు

అకారాదిక్షకారాంతం
ఆసేతుమిహికావంతం

అతగాడు తెలుగువాడి ఆస్తి
అనవరతం తెలుగునాటి ప్రశస్తి

ఛందస్సులేని ఈ ద్విపద
సత్యానికి నా ఉపద.

(27-10-76)



# మహత్తర సాహిత్య శిల్పి

-జడ్. పెత్రునిచేవా,
( యమ్. యస్. సి. భాషాశాస్త్రం )

సమకాలీన తెలుగు సాహిత్యం పెంపుకు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ యిచ్చిన తోడ్పాటు గొప్పది. వార్ధక్యం వచ్చి నప్పటికీ 60 నవలలను, కథలను, 12 కవితా సంపుటాలను రచించిన ఆయన, కొన్ని దశాబ్దాల క్రిందట ఎంతటి ఉత్సాహంతో, ఎంత ప్రీతిభావంతంగా పనిచేస్తూ వచ్చారో ఇప్పుడూ అట్లాగే పని చేస్తున్నారు. 30వ దశకం మధ్యలోనే శ్రీ విశ్వనాథ గొప్ప రచయితగా గుర్తింపు పొందారు. అప్పటికే తమ ఉత్తమ నవలలు కావ్యాలలో కొన్నింటిని ఆయన రచించారు.

తెలుగు సాహిత్యాధ్యయనాన్ని మొదలుపెట్టిన సోవియట్ భారతీయ విద్యాధ్యయన వేత్తలు, సహజంగా ప్రముఖాంధ్ర సాహితీ వేత్తలలో ఒకరైన వీరిని గురించి తెలిసికొనడం జరిగింది.

కాల్పనిక రీతికి చెందిన తెలుగు కవితలలో వీరి "కిన్నెరసాని పాటలు" ఉపేక్షించరానివి. సత్యనారాయణగారి ఈ కావ్యం - అందులోని క్రొత్తదనం, జానపద సాహిత్యానికి దానికి ఉన్న ఆ సాన్నిహిత్యం నిగూఢమైన ఆ కవితామయ భావన మా మనస్సులలో నాటుకొని పోయాయి.

---

సోవియట్ భూమి. (సంపుటి 26, సంచిక 9.) మే. 1975. పుట 31. నుండి పునర్ముద్రితము.

త్వరలోనే సోవియట్ పాఠకులకు ఈ "కిన్నెరసాని పాటలు" రష్యన్‌లో లభ్యంకాబోతున్నవి. ఈ కావ్యనాయకి దుఃఖగాధ సోవియట్ పాఠకులను కదిలించి వేస్తుందంటే అబ్బుర మేమీ కాదు. భావకవిత్వపు చింతనాత్మక, స్తబ్దతా ధోరణినుంచి ఇది కట్లుతెంచుకొన డానికి హేతువైన ప్రధానపాత్ర కిన్నెర. సోవియట్ భారతీయ విద్యాధ్యయన వేత్తలు ఈ నాయకి, ఇట్లాగే పాత సాంప్రదాయా లను, అభిప్రాయాలను, జడత్వాన్ని సవాలుచేసిన గురజాడ అప్పారావుగారి పూర్ణమ్మ పరిణామంగా పరిగణిస్తున్నారు.

సత్యనారాయణగారి ఈ కావ్యం తెలుగు కవితలో గురజాడ అప్పారావుగారు ప్రవేశపెట్టిన నూతన ప్రజాతంత్ర జానపద కవితారీతికి చాల దగ్గరగా ఉన్నది. ఆ సాహిత్యం ఇందులో పలు విధాలుగా, ముఖ్యంగా ఆ మహత్తర నాయికలిద్దరిలోని సారూప్య తగా మూర్తి మంత మయింది.

దురదృష్టవశాత్తూ సోవియట్ పాఠకులకు ఇంకా సత్యనారా యణగారి వచన కృతులు రష్యన్‌లోకి అనువదితమై పరిచయం కావడం జరుగలేదు. అద్యతన భవిష్యత్తులోనే ఈ పరిస్థితిని చక్కదిద్దుకుంటామన్నది తథ్యం.

ఇప్పుడు వీరి నవల "చెలియలి కట్ట" రష్యన్‌లోకి అనువాద మవుతున్నది. సోవియట్ సాహిత్య విమర్శకులు ఆ కథానాయిక రత్నావళిని టాల్‌స్టాయ్ "అన్నా కరెనినా" తో పోలుస్తున్నారు. ఆ "భారతీయ అన్నా కరెనినా"ను పరిచయం చేసికొనడం సోవియట్ పాఠకులకు ఎంతో ఆసక్తిదాయకంగా ఉంటుందికూడా.

వీరి కొన్ని కథలు కూడా రష్యన్‌లోకి అనువాదమవు తున్నాయి,

త్వరలోనే సోవియట్ పాఠకులకు ఈ "కిన్నెరసాని పాటలు" రష్యన్‌లో లభ్యంకాబోతున్నవి. ఈ కావ్యనాయకి దుఃఖగాథ సోవియట్ పాఠకులను కదిలించి వేస్తుందంటే అబ్బుర మేమీ కాదు. భావకవిత్వపు చింతనాత్మక, స్థబ్ధతా ధోరణినుంచి ఇది కట్లుతెంచుకొన డానికి హేతువైన ప్రధానపాత్ర కిన్నెర. సోవియట్ భారతీయ విద్యాధ్యయన వేత్తలు ఈ నాయకి, ఇట్లాగే పాత సాంప్రదాయా లను, అభిప్రాయాలను, జడత్వాన్ని సవాలుచేసిన గురజాడ అప్పారావుగారి పూర్ణమ్మ పరిణామంగా పరిగణిస్తున్నారు.

సత్యనారాయణగారి ఈ కావ్యం తెలుగు కవితలో గురజాడ అప్పారావుగారు ప్రవేశపెట్టిన నూతన ప్రజాతంత్ర జానపద కవితారీతికి చాల దగ్గరగా ఉన్నది. ఆ సాహిత్యం ఇందులో పలు విధాలుగా, ముఖ్యంగా ఆ మహత్తర నాయికలిద్దరిలోని సారూప్య తగా మూర్తి మంత మయింది.

దురదృష్టవశాత్తూ సోవియట్ పాఠకులకు ఇంకా సత్యనారా యణగారి వచన కృతులు రష్యన్‌లోకి అనువదితమై పరిచయం కావడం జరుగలేదు. అద్యతన భవిష్యత్తులోనే ఈ పరిస్థితిని చక్కదిద్దుకుంటామన్నది తథ్యం.

ఇప్పుడు వీరి నవల "చెలియలి కట్ట" రష్యన్‌లోకి అనువాద మవుతున్నది. సోవియట్ సాహిత్య విమర్శకులు ఆ కథానాయిక రత్నావళిని టాల్‌స్టాయ్ "అన్నా కరెనినా" తో పోలుస్తున్నారు. ఆ "భారతీయ అన్నా కరెనినా"ను పరిచయం చేసికొనడం సోవియట్ పాఠకులకు ఎంతో ఆసక్తిదాయకంగా ఉంటుందికూడా.

వీరి కొన్ని కథలు కూడా రష్యన్‌లోకి అనువాదమవు తున్నాయి,

చాలా కాలం క్రిందటే సత్యనారాయణగారి పేరు ప్రతిష్ఠలు ఆంధ్రదేశాన్ని దాటి ఇతర ప్రాంతాలకు పరివ్యాప్తమైనవన్నది లోకవిదితమే. 1962లో వారికి సాహిత్య అకాడమీ బహుమానం లభించింది. శ్రీ విశ్వనాథ పద్మభూషణ బిరుదాంకితులు కూడా.

పలు బిరుదులు, జాతీయ బహుమానం స్వీకృతులూ అయిన సత్యనారాయణగారికున్న ప్రఖ్యాతి గొప్పది. ఆయన పలు రచనలు భారతీయ, విదేశభాషలలోకి అనువదితమైనవి. ఇంకా ఆయన బహుకాలం ఫలప్రదంగా కృషి చేయవలసినదెంతో ఉన్నదన్న విశ్వాసంతో మేము, వారు దీర్ఘాయుష్మంతులై సాహిత్య జీవితంలో ఘనతర విజయాలను సాధించాలని ఆకాంక్షిస్తున్నాము.



# నేటి కవులలో విశ్వనాథ మొదటివాడు

—దేవులపల్లి కృష్ణశాస్త్రి

విశ్వనాథను అన్నా అంటాను. మీరేమీ అనుకోవద్దు. నాతో కలసి వాళ్లు నల్గురు అన్నదమ్ములు. ఆయన కీర్తి మాది. నేటి కవులలో విశ్వనాథ మొదటివాడు. సమగ్ర ప్రతిభాశాలి. మహావ్యక్తున్నాడు. గీతిక నుండి మహా కావ్యం వరకు వ్రాశాడు. ఇన్ని విధాల ఎవ్వరూ వ్రాయలేదు. ఆయా విభాగాలలో ఎవరయినా ఏమయినా వ్రాయవచ్చు. ఉన్నతంగా వ్రాయవచ్చు. కానీ ఇట్లా వ్రాయలేరు. ఏమి వ్రాసినా ఒప్పించుతాడు. నిరంకుశంగా గొప్ప దృష్టితో వ్రాస్తాడు. నా మతం నా సంప్రదాయమంటాడు. నేనంటానుగదా, ఇవి మీ మనస్సుకున్నాయిగానీ మీ హృదయానికి కవితాత్మకును లేవంటాను. ఈ లోకాన్ని చూస్తే ఈయినకు అసంతృప్తి. ఏదో నవ నిర్మాణం చేయాలని ఆయన కూడా కోరుతున్నాడు. లోకాన్ని ముందుకు నడిపిస్తున్నాడనే నేనంటాను. అన్ని మార్గాలలోను ఆయన బాటసారి. చాతీవిరిచి ముందుకుపోయే చొరవ ఆయనలో వుంది. మున్ముందు ఆంధ్రదేశం విశ్వనాథను సన్మానిస్తుంది![1]

---

1. NOBLE COLLEGE MAGAZINE, Vol. X No. I.

# విశ్వనాథ మహాకవి

—పింగళి లక్ష్మీకాంతం

సత్యనారాయణ చాలా గొప్ప ప్రతిభావంతుడు. మహాకవి. పూర్వకవుల ప్రక్క నిలువదగ్గవాడు. నేను కవిని అనేటటువంటి గర్వం నాకు లేదు. నేను కవిత్వాన్ని ప్రధానంగా పెట్టుకొని సాగలేదు. దానికి కారణాలు వేరే ఉన్నాయి. అవి ఇక్కడ చెప్పడం అప్రస్తుతం. సత్యనారాయణ ఎంత గొప్ప కవి అయినా నాకు చాలా దగ్గరవాడు. దీనికి కారణం మా బందరు స్నేహం. బందరు వాతావరణం ఇంకో ప్రదేశానికి లేదు. మేము మొన్న బందరు నుండి వచ్చేటప్పుడు ఇద్దరం కలసి 3 గంటల ప్రయాణం చేస్తూ ఆ చిన్ననాటి కథలు చాలా ఆప్యాయంగా చెప్పుకొన్నాం. సత్యనారాయణకు అన్నలేడు. నేను అతనికి అన్నను. అతను నన్నెంత గౌరవిస్తాడో అతనికి అన్న ఉన్నా అంత గౌరవించడు. నాకు తమ్ముళ్లున్నారు. ఉన్నా వాళ్లకంటే కూడా సత్యనారాయణను ఎక్కువ ప్రేమిస్తాను. అతనికి సన్మానం చేస్తున్నారంటే చాలా సంతోషంగా ఉంది. అతను చిరాయువై వర్థిల్లాలని కోరుతున్నాను.[1]

---

1. NOBLE COLLEGE MAGAZINE. Vol. X No. I.

# చిరంజీవి విశ్వనాథ సత్యనారాయణ

—చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి

నా మార్గంబును గాదు శిష్యుఁడయినన్

నా తాత ముత్తాతలం

దే మార్గంబును గాదు వానిదెదియో?

యీ మార్గ మట్లౌటచే

సామాన్యుండన రాదు వాని, కవితా

సమ్రాజ్ఞియా హేతువై

యీ మచ్ఛిష్యుని తావరించినది

నేనెంతే ముదంబందెదన్.